# భవిష్య మహాపురాణము

రచయిత:

శ్రీ విద్వాన్ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు

వ్యాసవాఙ్మయసమితి - విజయవాడ.



పబ్లిషర్సు:

వెంకట్రామ అండ్ కో.,

మద్రాసు — విజయవాడ

1954

శ్రీ చంద్రమౌళీశ్వరాయనమః

## శ్రీ ముఖము

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకర భగవత్పాద
ప్రతిష్ఠిత శ్రీ కాంచీ కామకోటి పీఠాధిప జగద్గురు
శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపాదైః అస్మదత్యంత ప్రియశిష్య
ప్రక్కిలంక గ్రామాభిజన కల్లూరి వేంకటసుబ్రహ్మణ్యదీక్షితవిదుషే
సర్వాభీష్ట సిద్ధ్యై క్రియతే నారాయణ స్మృతిః.

ఇచట తిరుక్కరుకావూర్ అను మాధవీ వనక్షేత్రంలో శ్రీస్వామి పూజా బ్రాహ్మణసంతర్పణాది సత్కారముల నొనర్చుచు అద్వైతానంద భరితులై యున్నారం.

అష్టాదశమహాపురాణములయందు సారమై సర్వజనులును అతి సులభముగా పరాపేక్ష లేకుండా పురాణార్థముల నెఱిగి కృతార్థులగు రీతిని క్షేత్రమహిమ, తీర్థమహిమ, చరితములు, ఆచారము, ధర్మము, భగవత్ స్తుతి, యోగము ఇత్యాది ప్రధానాంశములను బోధించు ముఖ్య కథాభాగములను సంగ్రహించి, సులలితపదప్రయోగములచే రసనీయమగు ఆంధ్రభాషా వచనరూపమయిన గ్రంథమును తాము రచించి ప్రచురింప బూనియుండు అంశము విదితమై చాలా సంతసించుచున్నాము. ఇట్టి లోకోపకారమునందు ప్రవర్తించియుండు భగవద్భక్తశిరోమణి యగు తాము యీలాటి సత్ప్రవృత్తి గలవారై శ్రీ చంద్రమౌళీశ్వర పూర్ణకృపాపాత్రులై శ్రేయఃపరంపరను బొందగలరు.

ముకాము : తిరుక్కరుకావూర్.

ఇతి నారాయణస్మృతిః
పార్థివ ఆశ్వయుజ శు ౫ బుధవారం

# ప్రశంస

ఆదర మొప్ప వ్యాసుని దయామృతవర్షము తెల్గుసీమ నా
నాదిశలందు నందుకొన, నాకృషికిం దగు దోహదమ్ముగా
మోదముతోడ ముద్రణకుఁ బూని, యొనర్చెను వ్యాసపూజ ని
య్యాదరవంశరత్నము కృతీశు ననుగ్రహ పాత్రమయ్యెడున్.

వ్యాసపవిత్రభారతి పదాబ్జములన్ మకరందధార ను
ల్లాసముతోఁ బడెందు లవిలంబముగా రుచిచూచి మాతృభా
షాసరణిన్ మహాజనవశంవదముం బొనరించునట్టి నా
తో సరిగా శ్రమంపడు బుధున్ మన వెంకటరాయు నెన్నెదన్.

విహిత మాముష్మిక మ
వ్యాహతి సరిపాలు కొందమని నాతో, దా
సోఽహమని వ్యాసభారతి
కీహంగును గూర్చు సుకృతి నీతని నెంతున్.

ఆచంద్రార్కము వ్యాసవాణి యిది యి
య్యాంధ్రావనిం బొల్చు న
ట్లాచంద్రార్కము నీదరాన్వయుల దీ
వ్యద్భోగ భాగ్యాయు రు
తోఁచైశ్వర్యము చంద్రశేఖరయతీం
ద్ర ప్రాభవాశీర్వచ
శ్రీచర్యన్ బొలుపూని, నాకృతికిఁ బూ
ర్తిన్ గీర్తి చేకూర్చుతన్.

పెక్కిలంక
మకాం: విజయవాడ.

కల్లూరి వెంకట సుబ్రహ్మణ్యదీక్షితులు.

# విషయసూచిక


## ౧ బ్రాహ్మపర్వము.

ప్రారంభము 1-6
సూర్యప్రశంస 7
సూర్య స్తవము 10
సాంబునిచరిత్ర 11

## ౨ మధ్యమపర్వము

### ప్రథమభాగము

బ్రాహ్మణగురుప్రశంస 38
మాతృ నమస్కారము 41
బ్రాహ్మణ గురువందనము 42
ఇతిహాసపురాణముల మహిమ 48
అంకమాహాత్మ్యము 52
అంతర్వేది బహిర్వేది విమర్శనము 58
ఆరామ ప్రతిష్ఠ
ఎఱువులు-సామాన్యదోహదములు 62
విశేషదోహదములు 63
యజ్ఞభేదమునుబట్టి యగ్ని భేదము 64
హోమద్రవ్యముల ప్రమాణము 65

### రెండవ భాగము

శిల్పులకు వేతనాదినిర్ణయము 70
కలశస్థాపన విషయము 75
మాన నిరూపణము 76

### మూడవ భాగము

ఆరామప్రతిష్ఠాది విశేషము 77
అనుబంధము-పదముల అర్థవివరణము 78

## 3 ప్రతిసర్గపర్వము

### ప్రథమఖండము

కృతయుగాది రాజవంశావళి 81
ప్రద్యోతునిమ్లేచ్ఛయజ్ఞ వృత్తాంతము 92
కశ్యపకథ - అగ్నివంశ చరిత్ర 98
విక్రమాదిత్యుఁడు 109

### ద్వితీయఖండము

బేతాళుఁడు విక్రమాదిత్యునకు కథలు చెప్పుట 109
1 వజ్రముకుటునికథ
2 మధుమతికథ 115
3 రూపసేనునికథ 118
4 చంద్రవతి కథ 120
5 మహాదేవి కథ 125
6 కామాంగికథ 128
7 త్రిలోకసుందరికథ 130
8 చిరందేవునికథ 131
9 కామాలస కథ 133
10 గుణశేఖరునికథ 135
(వైదిక ధర్మప్రశంస)
11 బుద్ధిప్రకాశునికథ 138
12 హరిస్వామికథ 140
13 వాశరుఁడను వానరునికథ —హరిమహిమ 142
14 మూలదేవునికథ 144
15 జీమూతవాహనునికథ 148
16 దేవశర్మకథ 151

17 గుణాకరునికథ 153
18 మోహినీ కుమారునికథ 155
19 ధ్యాపసేనునికథ 158
20 సువర్ణునికథ 159
21 విష్ణుస్వామి కుమారునికథ 161
22 భేతాళుని పూర్వవృత్తాంతము 162
విక్రమాదిత్యుని నిర్యాణము 166
సత్యనారాయణ వ్రతకథ 167
చంద్రగుప్తుఁడు 168
మానస తీర్థప్రశంస 169
పాణిని కృతశివస్తుతి 170
బోపదేవుఁడు - భాగవత ప్రశంస 171
దేవీమహిమ 172
పతంజలి చరిత్ర 173

## తృతీయఖండము

(చతుర్యుగఖండము)

పాండవుల యుత్తర జన్మము 174
కృష్ణకృత శివస్తుతి 175
శాలివాహనుఁడు 177
భోజుఁడు 181
కలివిషాదము 183
పృథ్వీరాజు 186
పృథ్వీరాజ జయచంద్రుల యుద్ధము 189
జయచంద్రు వైభవము 191
కాలియుఁడు 193

## చతుర్థఖండము

ప్రమరవంశము 195
చయహాని వంశము 198
సామలదేవవంశము 199
శుక్లవంశము (చాళుక్య) 201
పరిహారుని వంశము 207
వైవస్వత మన్వంతర ప్రారంభ చరిత్ర 210
మహాశిల్పములు 214
తిమిరలింగుని చరిత్ర తైమూర్ లంగ్ 216
సూర్యమహిమ (ఈశ్వరపురి యను భక్తునిచరిత్ర) 218
రామానందునికథ 219
జ్యేష్ఠమాస సూర్యప్రభావము, నింబార్క చరిత్ర 220
మధ్వాచార్యులు 222
శ్రీధరస్వామి చరిత్ర 223
విష్ణుస్వామికథ 224
వాణీభూషణుఁడు 226
భట్టోజి దీక్షితులు 227
వరాహమిహిరాచార్యులు 229
ధన్వంతరి 231
జయదేవుడు 233
కృష్ణచైతన్యులు 236
వాల్మీకి 240
జగద్గురు శంకరాచార్యులు 241
గిరిశర్మ (రుద్రావతారము), ఆనందగిరి 243
పురీశర్మ 244
భారతీశుఁడు, మండన మిశ్రుఁడు 24[illegible]
నాథశర్మ 25[illegible]

క్షేత్రశర్మ 252
కుంతిరాజు 253
కపాలి భైరవుడు 256
బాలశర్మ 258
రామానుజులు 260
వసుమహిమ
త్రిలోచన వైశ్యుడు } 269
నామదేవుడు 274
రంకణుడు 277
కబీరు 279
నరశ్రీ 281
సేపుడు - నానకుడు
నిత్యానందుడు } 283
సధనుడు - రైదాసుడు
అశ్వినీకుమారుల యవతారములు } 285
సోమణుడు 288
కృష్ణచైతన్యులు 289
బలభద్రుడు 290
జీవానందుడు - మహానందుడు 291
విష్ణుస్వామి 292
మధ్వాచార్యులు 293
భట్టోజి దీక్షితులు 294
వరాహ మిహిరుడు 295
వాణీభూషణుడు 296
ధన్వంతరి 297
జయదేవుడు 298
బౌద్ధమత విధ్వంసనము
ఆర్యమత ప్రవర్తనము 301
అక్బరు - ఆతని యాస్థానపండితులు 307
ఔరంగజేబు - శివాజీ 311
వానరులు - గురుండులు
(బ్రిటిష్ వారు) } 312
మహానులు 317
నాగుల పరిపాలనము 318
పుష్యమిత్రుడు 320
ఆంధ్రులు 322
రాక్షసారి 322
భోగసింహుడు - కేళిసింహుడు 331
కలి చతుర్థపాదము 334
కల్పములు - మన్వంతరములు 336

శ్రీ గురుదేవాయనమః

శ్రీపరమేశ్వరాహ్వయము చిన్మయమాగమగేయమున్ బురా
ణోపనిషన్నిరూపిత రసోదయమభ్యుదయైక సాధన
మ్మాపదనీక సంహరణమైన జగద్గురుతేజ మాత్మ వి
ద్యాపరిపాకసిద్ధికి సదా భజియింతును వ్యాసరూపమున్.

అదివ్యాసాత్మకమో శుకాత్మకమొ బ్రహ్మర్ష్యాత్మకమ్మో శుభా
స్పద మస్మద్గురుదేవతాకరుణ రూపమ్మొత్తి నామోల్లల న
ల్లదె లేనవ్వులు పూయుచున్నది కటాక్షాలోలపీయూష సం
పద నాపైఁ గురిపించుచున్నది పురాణానీక సారస్యమై.

హరిహర దివ్యనామ మహిమానుభవంబునఁ గాక యీకలిన్
నరులు తరింపలేరు; యజనంబులు దీవ్రతపస్సమాధులున్
జరుగవటంచు వ్యాసగురు చారుపురాణ మహాగభీరసా
గరఘనగర్జనంబు వినగా వినగా నిజ మర్థమయ్యెడిన్.

హరిహరభేదభావ విలయమ్మది బ్రహ్మలయం బటంచు న
క్షరమగు తత్త్వముం దెలుప జాలిన దక్షరమంచు ద్వైతసం
హరణము దృక్కు-దృశ్యమను నంతరమున్ హరియించునంచు నె
వ్వరియుపదేశ మా ప్రభువు వ్యాసుఁడు మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్.

వ్యాసమహర్షి శేఖరుల వాఙ్మయదర్పణమందు సృష్టి వి
న్యాసము కేవలమ్ము జడమయ్యును జీవకళావిలాస మే
దో సమకూర్చుకొన్న దిపు డుండి మరుక్షణముం గనట్టి యా
వేసము దీసికొంట నిదితోఁచును నిత్యవినూత్నసమున్నగన్.

క్షణముక్షణమ్ము నవ్యతయె చక్కదనంబనినారు విజ్ఞులీ
క్షణమధురమ్ము లాకృతులు సాధుకృతుల్ మఱియెన్నొ కర్ణభూ
షణములు సేసియున్ నవరసంబులు నించి యపూర్వవాసనల్
ఘ్రాణికి ఘటించి స్పర్శసుఖమున్ సకలేంద్రియతర్పణమ్ముగా.

ఒనరిచి తీర్చిదిద్దిన మహోత్తమ సంస్కృత సాహితీ విలా
సినియిది బ్రహ్మచారులను జేరి గృహస్థులనున్ వనస్థులౌ
మునుల విరక్తులం బ్రణయమునం బచరించి హరించు చిత్తమ
మ్మొసకృత మింద్రజాలము నపూర్వపురాణవిలాస మెన్నడన్

వేదోప్రోక్తన జన్మపుణ్యఫల మిట్లే వ్యాససేవాసుధా
స్వాదం బందో కనిష్ఠ గూర్చినది భాషాదేవి వాఁదోడుగా
నీదం గల్గితి నిమ్మహార్ణవము తండ్రీ! నీకటాక్షామృత
ప్రాదుర్భావముచే సుపర్వబుధపర్వమ్మాత నాబాసయున్.

## భవిష్యపురాణ ప్రశంస

ఇదియు భవిష్యదర్థ సముపేతముగాఁ బదునాల్గు వేలపై
నొదవ యఘోరకల్ప కథయుం గల నాలుగు పర్వముల్ శుభా
స్పదములు నాగ సూర్య విభవం బలరన్ మనుమాత్రికిన్ బురా
విదిత మొనర్చు శైవము భవిష్యపురాణము బ్రహ్మ సప్తమో

క. ప్రీతి పరస్పరసోదయమై
శ్రుతిపర్వంబై సుపర్వ సుమధుర భాషా
కృతియై యీ కృతి క్షితిపై
స్తుతిపాత్రంబగుత నిందు చూడునికరుణన్.

## —: భవిష్యమహాపురాణ స్వరూపము :—

వ్యాసభగవానులు రచించిన పదునెనిమిది పురాణములలో నొక్కొక్కదానియం దొక్కొక్కయద్భుతము గోచరించు చున్నది. ప్రకృతము భవిష్యమహా 'పురాణమున' రాబోవు కాలముయొక్క చరిత్ర వర్ణింపఁబడినది. త్రికాలజ్ఞాన సంపన్ను లగు ఋషులకుఁ దప్ప యిట్టి దివ్యదర్శనము కలుగదు. ఈ పురాణమునందు ౧౪౦౦౦ ల శ్లోకములు గలవు. ఇందు బ్రహ్మ పర్వము మధ్యమపర్వము ప్రతిసర్గపర్వము ఉత్తరపర్వము నను నాల్గు పర్వములున్నవి. సృష్టికెల్ల కారణము సూర్యభగవానుఁ డని, యదియే బ్రహ్మపదవాచ్యమగు తత్త్వమని నిరూపింపఁ బడినది, కాన మొదటిపర్వమునకు 'బ్రహ్మపర్వము' అనుపే రుచితమగుఁ గన్పట్టుచున్నది. ఇందంతట సూర్యమహిమ వర్ణిత మైనది. మూఁడవదియగు ప్రతిసర్గపర్వమున మనువు దగ్గర నుండి యారంభమైన సృష్టిక్రమము వర్ణితమైనది బ్రహ్మదగ్గర నుండి కాక, బ్రహ్మమానసపుత్రుఁడగు మనువుదగ్గరనుండి జరిగిన సర్గము (సృష్టి) ప్రతిసర్గము అనఁబడును. ఆ రామాది ప్రతిష్ఠలను గూర్చి తెల్పును.

భవిష్యపురాణములు దేశములో నాల్గురకములుగాఁ గనిపించుచున్నవి. ప్రకృతము నేనొకదాని ననువదించితిని.

మహాపురాణములో నొకటిరెండు చదివినంతమాత్రమున వాని తాత్పర్యము మనకందదు. వానిలో బదునాల్గు పురాణము లను బారాయణచేసి యుపాసించిన నాకిపుడు పోనుపో నవి యగాధరత్నాకరములవలెఁ గన్పట్టుచున్నవి. వానిలో నవ గాహించి సర్వపురాణసమన్వయముగ నొక విపులమైన పీఠిక ప్రత్యేకముగ వ్రాయుచున్నాను.

# అవగాహనము

గురుప్రసాదసంలబ్ధ ప్రసాద గురుయోగతః
తనోమి తీర్థకల్పేషు పురాణే ష్వవగాహనమ్.

శ్రీ వేదవ్యాసభట్టారకులచేఁ బ్రసాదింపఁబడిన మహా పురాణములు జ్ఞానవిజ్ఞానభాండారములు. అవి సర్వమానవులకు ధర్మార్థ కామమోక్షము లనెడి పురుషార్థములను బోధించుచున్నవి. ద్వాపరము చివర నిప్పటికి రమారమి యాఱువేల సంవత్సరములకు మున్నవతరించి కృష్ణద్వైపాయను లనుపేర వ్యాసపీఠము నధిష్ఠించిన యమ్మహర్షి వాగ్దర్పణమునందు భూతభవిష్యద్వర్తమానములు మూఁడును బ్రతిబింబించియున్నవి. అదృష్టవశమున నా పవిత్రవాఙ్మయమును దల్లిభాషలోని కనువదించు కుతూహలము నాకుఁ గల్గినది. గురుకృప యీ నాయభిలాషను నెరవేర్చినది. ఇప్పటికి బ్రహ్మ, విష్ణు, శివ, దేవీభాగవత, వామన, మార్కండేయ, మత్స్య, కూర్మ, వరాహ, నారద, భవిష్య మహాపురాణములను దేట తెలుఁగు వచనమున రచించి శ్రీ కాంచీకామకోటి పీఠాధీశ్వరులగు జగద్గురు శంకరాచార్యస్వామివారి పాదారవింద సన్నిధానమున సమర్పించు భాగ్యము గంటిని. ఈ నేఁ జేయు వాఙ్మయతపస్సులో వ్యాససేవలోఁ బాల్గొని శ్రీ ఈదర వెంకటరావుపంతులుగారు నారచనలను ముద్రించి యాబాలగోపాలమున కందించి కృతార్థులగుచున్నారు.

మొదట మొదట సులభమై తోఁచిన యీ కృషి పోను పో నగాధమైపోయినది. వ్యాసహృదయ మందుకొనుటకు

నా తపస్సు చాలుటలేదు. సంసారముకూండ విశ్రాంతి నీయదు గదా! కొంతకాల మేకాంతముగ నెక్కడనైన నుండి వ్యాసవాణి నుపాసించి 'సర్వపురాణ సమన్వయము'గ నొక్క విమర్శగ్రంథము రచింపవలెనను నామనోరథము మనోరథము గనే నడచుచున్నది.

పురాణములలో భాష, సుబోధము, భావమగాధము. అర్థమయి నట్లుండి యర్థము కాదు. 'వేదోపబృంహకములు పురాణములు' అని యందుమేకాని వేదము లందలి యేవిషయము లెట్లు పురాణము లుపబృంహణముసేసి (విస్తరింపఁజేసి వ్యాఖ్యానించి) చెప్పినవో నిరూపించుకొనలేకున్నాము. నిజముగ వేదార్థము మన కందినట్లు లేదు. వేదమంత్రముల కర్థముసెప్పు పట్టున వైతానిక, శాంతి, నక్షత్ర, చారణ, భౌతిక, చారిత్రిక కల్పముల పరముగ నాలు విధములఁ దాత్పర్య నిర్ణయము చేయవలెనని తపోవృద్ధులు యోగులు నగు మహానుభావులు పలుకుచున్నారు.

ఒక సముద్రమథనకథగాని సూర్యచంద్రగ్రహణములు గాని దేవాసుర యుద్ధములుగాని యహల్యాశాప వృత్తాంతము గాని తీసికొన్నపుడు వినీవినగనే మనకు వానియందుఁ గథాదృష్టి (చారిత్రికదృష్టి) కలుగుట సహజము. కాని యీ కథలన్నియు నక్షత్ర పుంజముయొక్క సన్నివేశమున కన్వయించునని వాని నాకాశమునఁ బ్రత్యక్షముగఁ జూడవచ్చునని వాని కన్నిటికిని ఖగోళవిజ్ఞాన పరమైన పరమ తాత్పర్య మొకటి కలదని యత్యు

ద్భుతముగా నిరూపింపఁగల బ్రహ్మశ్రీ గొబ్బూరి వెంకటానంద
రాఘవరావుగారివంటి మేధావులను జూచుచున్నాము. ఇంత
మున్ను వీరివిమర్శ మనమనుకొన్న యాజు కల్పములలోని
'నక్షత్రకల్పము'నకు సంబంధించిన విషయము. ఒకచిన్న
యుదాహరణము. అగ్నిదేవుని 'మేషారూఢం జటాబద్ధం' అను
శ్లోకముచే మనము స్తుతింతుము. ఇందు మేషారూఢుఁడనగా
నగ్ని మేక నెక్కినని (మేక యగ్నికి వాహనమని) యందరికి
నర్థమగుచునేయున్నది. ఇది చారిత్రకార్థము. కాని నక్షత్రకల్ప
వేత్తలు ''అగ్నియనగాఁ గృత్తికా నక్షత్రము, అదియశ్విని భరణి
కృత్తికా పాదరూపమయిన మేషరాశికి మీఁద నున్నదనియు,
(మేషారూఢమ్'అనువర్ణనమగ్ని దైవత్యమగు కృత్తికానక్షత్రము
మేషరాశిమీఁదుగ నుండుటను శాస్త్రరహస్యమునే చెప్పు
చున్నది' అనియందురు. అశ్విని భరణి కృత్తికా పాదరూపమున
నాకాశమండలి యీ ప్రదేశములో నా చుక్కల యునికింబట్టి
చూచిన నది 'మేక' యాకారమున నున్నట్లు కనిపించునుగాన
దానికి మేషరాశియను పేరును ఋషులు నిర్వచించిరనియు
పల్కుదురు. చూచితిరా! చారిత్రక దృష్టితో మనమనుకొన్న
యర్థమంతయు నిందుఁ దారుమారై పోయినది. ఈ శాస్త్రమే
నిజము) చరిత్ర (కథ) యసత్యమందుమా ! అట్లన వీలు లేదు.
అగ్ని దేవతను మేషవాహనునిగానే ధ్యానించి యుపాసింపుమని
శాస్త్రమనును. నవగ్రహారాధనకు సంబంధించిన యుపాసనా
కాండలో నాయాగ్రహముల వాహనములు, రూపములు వారు
ధరించు నాభరణములు మొదలగు నవన్నియు నట్లే ధ్యానింపఁ
బడి పూజింపబడి యైహిక ఫలముల నొసంగుచున్నవి. అది మన

శ్శాస్త్రమునకు (యోగశాస్త్రము) సంబంధించిన యగాధ రహస్యము. కాన యిందేయర్థమును వ్యర్థమనరాదు. వినాయక చతుర్థినాడు మనము హస్తిముఖుని విఘ్నేశ్వరునిగాఁ బూజింతుము. ఈ పండుగకు సంబంధించినకథలు బోలెడున్నవి. కాని యిందు మనము పూజించు విఘ్నేశ్వరుఁ డెక్కడో లేఁడు. హస్తానక్షత్రగతుఁడైన సూర్యుని ముందిడుకొని చంద్రుడే యీ వినీలాకాశమునహస్తిముఖుఁడనుపేరఁ బ్రత్యక్షమగుచున్నాఁడు. సూర్యచంద్రగతివలన నేర్పడెడు నాయాపండుగులు వానికి సంబంధించిన చరిత్రలతో సమన్వయ పఱచుకొని యందలి పరమ తాత్పర్యమును ఖగోళమునఁ బ్రత్యక్షముగాఁ జూడవచ్చును. ఇదంతయు వేదములకు వేదోప బృంహకములగు పురాణములకు నక్షత్రకల్పపరమయిన వ్యాఖ్యానమువలననేమన కవగాహన మగును. ఈ దృష్టితో దశావతార చరిత్రలు, కాశీ, గయా, ప్రయాగాదిక్షేత్ర తీర్థకథలు బహునీతులసమన్వయించును. ♦ విస్తరభీతిచే నిట వివరింపనైతిని.

పురాణములలోఁ గొన్నికథలు పరస్పరవిరుద్ధములును, వికృతములు నయి కనిపించును. అట్టివాని సమన్వయమార్గము మఱి పెక్కువిశేషములు నా మొదటి యవగాహనమున బ్రహ్మ విష్ణు శివపురాణపీఠికలలో నిచ్చియుంటిని. బ్రహ్మ కుమార్తెను గని యామెయందే మోహితుఁడై నట్లు చెప్పగా నూతుంగని బుషు లీ విపరీతమేమి? తండ్రి కూతురుం గలియుట యేమని

♦ పండుగులు, క్షేత్ర తీర్థములు మొదలగు వానింగూర్చిన యీ విశేషములు 'వ్యాసవాఙ్మయసమితి' పక్షమునఁ బ్రచురింపఁబడు గ్రంథములందుఁ జూడవచ్చును.

యడిగిరి. అప్పుడు సూతుఁడు ఈ విషయము బహు గంభీరము. ఇది అతీంద్రియేంద్రియకము, ఈ దేవరహస్యముంగూర్చి శంకింపం దగదు. అని యొక పురాణములో సమాధానించెను. ఇట్టి కథలు చర్మచక్షువులగు మనకు నచ్చకున్నను విజ్ఞానదృష్టితో వేదములకు వ్యాఖ్యానము చెప్పుటలో నాలువిధములగు కల్పములలో నేదోయొక దానింబట్టి యీకథలకుఁ బరమతాత్పర్యము మంత్రద్రష్టలగు ఋషుల కవగతమై యుండును. అట్టి ఋషుల యనుగ్రహపాత్రుల మైనపుడు మనకును నవి యందవచ్చును. మహాపతివ్రతా శిరోమణియగు 'నహల్య' చరిత్రవంటి కథలట్టివిగూఢ తాత్పర్యము కలవియై నక్షత్రకల్పమును బట్టియో వైతానిక కల్పమును బట్టియో కొండొక వైజ్ఞానిక రహస్యమును జాటునవై యున్నవి.

అంతవఱకెందులకు? పురాణములలోఁ బునరుక్తిగ వర్ణింపఁబడు 'సృష్టి' విధానము చదివినపుడెల్ల నది యెట్లును నా మనసునకు సరిపడకపోయెను.

శ్లో॥ అపఏవ ససర్జాదౌ తాసు వీర్య మవాసృజత్
తదండ మభవ ద్ధైమం సహస్రాంశు సమప్రభమ్.

అని యున్నది. పరమేశ్వరుఁడు సృష్టికిముందు దాపస్సులను సృజించెను. అందుఁ దన వీర్యముంచెను. అది సూర్యునట్లు వెలుఁగు నొక బంగారు గ్రుడ్డయ్యెను. (అదే బ్రహ్మాండము) అని దీని యర్థము. పౌరాణికు లిక్కడ 'ఆపః' అనగా 'నీరు' అని చెప్పెదరు. ఆమీఁద వీర్యముంచుట యేమో, అది బంగారు గ్రుడ్డగుట యేమో! మొత్త మందులో బ్రహ్మాం

డము పుట్టిన సందుకు. ఇది చారిత్రికార్థము. కాని యీ శ్లోకమునకు వ్యాఖ్యానరూపముగ భరద్వాజ మహర్షి రచించిన 'అంశుబోధిని' యను గ్రంథమందపూర్వ సృష్టి రహస్యము బయలు పడినది. అందు;

'ఆపో౽ఉతపవ'

అను సూత్రముక్రింద వ్యాఖ్యానములో 'ఆపః' అనగా సృష్టికారణమైనది పట్టి యీ నీరు కాదు. అది విద్యుదాపస్సు. దానినే వైద్యుతోదకమని ప్రకాశోదకమని తత్త్వవేత్తలందురు. ఆ యుదకమున నీశ్వరుఁడు వీర్యముంచుటయనఁగా 'స ఈక్షత బహుస్యాం ప్రజాయేయ' అను వేదమంత్రోక్తమైన యీక్షణా శక్తిని ప్రవేశింపఁజేయుటయే. అందుపై నా విద్యుదుదకమునందు సంక్షోభము పుట్టెను. ఆ సంక్షోభమున తమః ప్రకాశరూపములయిన రెండావరణ లేర్పడినవి. ఆ రెండిటి సంఘర్షణమున సత్త్వరజస్తమోగుణములు మూడును గలిగి వానిపాళ్లనుబట్టి త్రిగుణాత్మకమయిన యీభౌతిక జగతంత్రయు పుట్టినది.' అని వ్రాయఁబడి ♦ అభౌతికమయిన ఆత్మతత్త్వమును

♦ ఇందులకుఁ బ్రమాణములు భౌతికాభౌతిక శాస్త్రములనుపేర విజ్ఞానగ్రంథములు (Science texts) ప్రాచీనమహర్షులు రచించినవి నలుబదిపైగా నుదాహరింపఁ బడినవి. ఈ అంశుబోధిని మూలము భరద్వాజ మహర్షి రచించిన సూత్రగ్రంథము. ఇందుఁ బండ్రెం డధ్యాయములున్నవి. ఇది సూర్యకిరణముం గూర్చినశాస్త్రము. ఇందులో నొక్క యధ్యాయముమాత్రము శ్రీ బోధానంద సరస్వతీస్వామివారు రచించిన వృత్తితో నొక వ్రాతప్రతి వేదార్థభాస్కర బ్రహ్మశ్రీ కుప్పా లక్ష్మణావధానుల వారియొద్దనుండి నాకు లభించినది. ఇందుట్టంకితములయిన మఱి నలుబది గ్రంథములలో భరద్వాజుల వారు రచించిన యంత్రసర్వస్వము (విమానాద్యులకు సంబంధించిన శాస్త్రము)

బోధించుటయే మన మహర్షుల లక్ష్యము. సర్వశాస్త్రములకు నా పరబ్రహ్మమందే తాత్పర్యము. సర్వవిద్యలకు బ్రహ్మవిద్య యందే విశ్రాంతి. సర్వవిజ్ఞానములకు జ్ఞానమందే విలీనత. అయినను భౌతికదృష్టికల మందమతుల మగు మనకు భౌతికము లయిన దృష్టాంతములతోనే యాత్మనిరూపణము చేయుటకు అత్రి వశిష్ఠ భరద్వాజాది మహర్షులు భౌతికాభౌతిక శాస్త్ర ములను పేర నిట్టి గ్రంథము లెన్నో రచించినట్లు తెలియుచున్నది. ప్రకృతి ముపలబ్ధమయిన యంశుబోధినిలో జీవాత్మ పరమాత్మ లకుఁగల బింబప్రతిబింబ భావమును ఋజువుచేయుటకు మహర్షి స్థూలోపకరణమగు రూపాకర్షణ యంత్రవిధానమును(Photo-graphy) నిదర్శనముగాఁ జూపినారు. అంతియకాదు, రూపా కర్షణయంత్ర నిర్మాణముకూడ సవిస్తరముగ నిందుఁ బేర్కొని నారు. వీనిమూలమున మహాపురాణ రత్నాకరములగాంభీర్యము చూచాయగ నిప్పుడిప్పుడు నామనసునకుఁ దట్టుచున్నది. మన దౌర్భాగ్యమున నిట్టిసారవత్తరములయిన గ్రంథములు ఖండాంత ములకుఁ బోయియో పండితపుత్రులయింట చెదపుర్వుల కాహారమయియో మన కపరూపములయి పోయినవి. ఇది విషాదకర ఘట్టము. ప్రకృతము.

---

మేఘోత్పత్తి (కృత్రిమ మేఘమును సృష్టించు విధానము తెల్పుగ్రంథము) బెంగుళూరు శాస్త్రపరిశోధనాలయము నందున్న ట్లీనడుమ పత్రికలలోఁ జూచితిని.) తక్కిన వానికై యన్వేషించు చున్నాను. ఈ యద్భుతశాస్త్ర గ్రంథములను గూర్చిన వివరములు మఱి యితర పురాణరహస్యములను "సర్వపురాణ సమన్వయము" అను నాగ్రంథమున విపులముగా వెలువరింతును.

## — భవిష్య పురాణ స్వరూపము —

భవిష్య మహాపురాణ మను పేర మూఁడు రకములైన గ్రంథము లున్నట్లు తెలియుచున్నది. బ్రాహ్మము, మధ్యమము, ప్రతిసర్గము, ఉత్తరము నను నాల్గు పర్వములు కలదియొకటి, బ్రాహ్మము, వైష్ణవము, శైవము, త్వాష్ట్రము ప్రతిసర్గము నను నైదు పర్వములు కలది యొకటి. నారద మహాపురాణమునుబట్టి బ్రాహ్మ, వైష్ణవ, శైవ, సౌర, ప్రతిసర్గ (శేష) ములను నైదు పర్వములు కలది మఱియొకటియునై యున్నది. ప్రకృతము నాకు దొరకిన మొదటి రకములో ప్రతిసర్గ పర్వము నాల్గు ఖండములుగా నున్నది. ఇందు శ్లోకసంఖ్య పదునాల్గువేల యైదువందలు. నే ననుసరించిన పురాణములో 'భవిష్యోత్తరము' అను పేర ధర్మ శాస్త్ర విషయములను తెల్పు నుత్తరపర్వము కేవలము భవిష్యోత్తరపురాణమే కాని యవాంతర భాగము కాదు. కాన మొదటి మూఁడు పర్వముల గ్రంథములో నడిమిభాగమునకు మధ్యమపర్వమను పేరు సార్థకమయి యున్నది. 'షట్కాండాని తథోత్తరమ్' అని రామాయణము షట్కాండలుగాఁ బేర్కొనఁబడి యుత్తర కాండ మేడవ కాండగా గణింపఁబడక ప్రత్యేకము 'ఉత్తర రామాయణము' అని పేర్కొనఁ బడినది. అట్లే విష్ణుపురాణ పరిశిష్టమైన ధర్మశాస్త్ర భాగము 'విష్ణు ధర్మోత్తరము' అను పేరఁ బ్రత్యేకముగా నెన్నఁబడినది. ఇంతియ కాదు. మహాభారతమున కుత్తరభాగమగు 'హరివంశము' వందొమ్మిదవ పర్వముగాఁ గాక 'ఖిలపర్వముగాఁ' జెప్పఁబడినది. ఇన్ని నిదర్శనములను బట్టి యార్ష గ్రంథ సంప్రదాయమునుబట్టి భవిష్యమున

మూండే పర్వములని భవిష్యోత్తరము ప్రత్యేక భాగమని తెలియ
నగును. ఈ ధర్మశాస్త్ర భాగముదప్ప మిగిలిన భాగమును
నేను దెనిగించితిని. ఇందలి విశేషముల నరయుఁడు.

## —: బ్రాహ్మ పర్వము :—

బ్రాహ్మపర్వము సూర్యోపాసనకు సంబంధించియున్నది.
ఇది అరుణమంత్రమునకు (సూర్యనమస్కారమంత్రములకు)
వ్యాఖ్యాన మనవచ్చును. సూర్యకిరణములలోని భేదము వాని
ప్రభావము, యజ్ఞములందు దేవతోద్దేశ్యముగా నివ్వఁబడిన
హవిర్భాగములు భువర్లోక సువర్లోకములందే యే పరిణామము
లంది వర్ష కారణమై సస్యాదిపాకరూపమున జీవకోటి కెట్లందు
చున్నదియు నీ పర్వము వివరించును. దీనిని నవీనఖగోళ
విజ్ఞానముతో సూర్యకిరణశాస్త్రములతో సమన్వయించి
భౌతికాభౌతికప్రయోజనముల వెల్లడించి సూర్యోపాసనయొక్క
విశిష్టతను బ్రచారము సేయవలసియున్నది

## —: మ ధ్య మ ప ర్వ ము :—

ఇందు ఇతిహాసపురాణములు వారివారిమనస్సుల కెట్టి
పరిణామము గల్గించునో వర్ణితమైనది. ఆ ఘట్టములలోఁ బురా
ణము వ్రాయుటయెట్లు, వ్రాయుటకుఁదగు నాకులు గంటములు
సిరాలు (పసరులు, జిగురులు) పంక్తులు, అక్షరములసంఖ్య
పురాణప్రవచనము చేయువారి నే యే పురాణముల నెట్లెట్లు
సత్కరింపవలసినది, వారు పాడవలసిన రాగములు, పురాణాను
కూలములగు దేశకాలపాత్రములను కూర్చి యిందు విపులీక
రింపఁబడినది. ఇందుదాహృతమైన అంకమహాత్మ్యమును (సంఖ్యా

శాస్త్రము) వివిధహోమద్రవ్యముల పరిమాణములు, తూక
ములు కొలతలు సద్భుతముగా నున్నవి. ఇష్టాపూర్తములు
(అనగా చెరువులు, తోటలు, బావులు, దేవాలయములు,
పుష్కరిణులు, ప్రతిష్ఠించుట. గొప్పపుణ్యకార్యములుగా
వర్ణింపఁబడి ప్రజలకుఁ బ్రోత్సాహ మీయఁబడి యార్థిక
సమస్యాపరిష్కారము చేయఁబడినది. తోటలలో, దొడ్లలో,
వాస్తు శాస్త్రానుసారముగ నే యే వృక్షములు స్థాపించిన నేమేమి
లాభములు గలుగునో వేనివేని కేమేమి దోహదములు (ఎరు
వులు) వేయవలెనో చక్కగాఁ జెప్పఁబడినది. ఇదంతయు ఉద్భిజ్జ
విద్యకు (Botany) కి సంబంధించిన విషయము. మధ్య
పురాణమునందు నిందు నాయా ఓషధులు మొదలగువాని
యర్థ నిర్ణయము పట్టున నాకు సహాయపడిన ఆయుర్వేదా
చార్య బ్రహ్మశ్రీ ముక్కామల వెంకటశాస్త్రిగారి కెంతేని
కృతజ్ఞుడను. ఇఁక శిల్పవిద్య, శిల్పుల జీతములు, రోజుకూలి
మొదలగువాని నిర్ణయమిందు బాగుగ నుదాహృత మయినది.

—♦ ప్రతిసర్గ పర్వము ♦—

♦ ఇందు వైవస్వత మన్వంతరములోని యిప్పటి యీ
యిరువది యెనిమిదవ మహాయుగములో కృతయుగమునుండి
యెత్తికొని యా రాజుల చరిత్రలు, రాజ్యకాలములు తెలుప
బడినవి. చంద్ర సూర్యాగ్ని వంశీయులగు రాజుల వంశము

---

♦ ఈ నా యభిప్రాయములతో పండిత బ్రహ్మశ్రీ కోట వెంకటా
చలంగారి యభిప్రాయము లేకీభవించు చున్నవి. వారు పురాణములను
ప్రాచ్య పాశ్చాత్యులు రచించిన నవీనచరిత్రలను సమన్వయించి పూర్వోత్తర
విరోధముల బరిహరించి సక్రమముగాఁ గాల నిర్ణయము లొనర్చుచు సృష్ట్యాది

నిందు వర్ణితములు. ప్రత్యేకముగ అగ్నివంశ రాజులు, వారి రాజ్య కాలములు, పరిపాలన పద్ధతులు నిందుఁ బూర్తిగ కలి 2710 మొదలు కలి 4195 వరకు వివరింపబడినవి. అగ్ని వంశీయులలో ముఖ్యులగు యూనేతుహూచలము లేకచ్ఛ త్రాధిపతులయి పాలించి యశ్వమేధము లొనర్చి శకకర్తలైన విక్రమాదిత్య, శాలివాహనుల చరిత్రలు సంపూర్ణముగ నిందు వర్ణితములయి యున్నవి. విక్రమాదిత్యుని పట్టాభిషేకసమయ ములో నతనికి రాజనీతిశాస్త్రవేత్తయగు పండితునిచే (భేతాళుని

---

నుండి నేటివరకుఁ గల యనంత యుగములు మన్వంతరము లందలి మానవ జాతి చరిత్రను అందు విశేషించి కర్మభూమియగు భారతవర్ష చరిత్రను విపుల ముగా రమారమి యిరువది గ్రంథములుగా రచించి ముద్రింపించి భారతీ యుల కందించి యున్నారు. మనకు జరిత్ర లేదని దుర్వాద మీ వీరి గ్రంథ ముల మూలమున ఖండింపఁ బడినది. పురాణములను జరిత్ర దృక్పథముతో సమన్వయపరచుట కింత విపులమయిన ప్రమాణ గ్రంథము లింతవరకు వెలు వడలేదు. పాశ్చాత్యులు కూడ భారతదేశ చరిత్ర వ్రాయుటకు పురాణము లనే యాధారము చేసికొనియు అందులోని విషయములను దారుమారుచేసి పురాణము లన్యోన్య విరుద్ధములుగా నున్న వుక్కుటి పురాణములను నసత్య ప్రచారముతో పురాణ వాఙ్మయముమీఁద మన భారత ప్రజకు వైమనస్యము కల్గించిరి. ఎటు చూచినను జరిత్రలందలి కాలములను వ్యక్తులగూర్చి పురాణ ములలోఁ జెప్పిన ట్లనుసరించిననే సత్యమయిన భారతచరిత్ర లభించునుగాని పాశ్చాత్యులచే వ్రాయబడి నేటి పాఠశాలలోఁ బాఠ్యము లయియున్న చరిత్రల వలనఁ గాదు. అని యపార్థ సంకులములై మన నాగరికతను సభ్య తను తగ్గించి మఱపించి మనకీర్తికిఁ గళంకప్రాయములై యున్నవి.

వీరి చరిత్రకృషి యపారమని గుర్తించి విజయవాడపౌరులు విద్వత్సభా ముఖమున 'భారతచరిత్రభాస్కర' యను బిరుదమిచ్చి సత్కరించియున్నారు.

యుపకారము) దెల్పఁబడిన కథ లత్యద్భుతములై యొక్కొక్క కథ యొక్కొక్క ప్రత్యేక రాజనీతి చతురతను జాటునదై యున్నది. అందు నిగూఢమైన రాజనీతి యిమిడియున్నది. అది పాలకులకుఁ బరీక్షాఘట్టము. రాజ్యాంగవేత్త లెల్లరు దీనిని బఠించి మననము సేయవలసియున్నది. శ్రీకృష్ణుఁడే కృష్ణచైతన్యులుగాఁ గలి యుగమునం దవతరించి యీ యుగమందలి మానవుల కిష్ట దేవతయై నాయకుఁడై రాఁబోవు చరిత్ర నడుపుచున్నట్లు విస్తారముగా వర్ణితమైనది. అక్బరు, ఔరంగజేబు మొదలయిన రాజులను దెల్పి శివాజీ ప్రసంగముచేసి, పిమ్మట ఢిల్లీ రాజ్యమునకు రాజులుగ వానరజాతివారగు గురుండులను వర్ణించిన పిమ్మట మానులు రాజులగుదురని యున్నది. ఈ గురుండులను పేరు 'సీమదొరలకే' సమన్వయింప వీలగుచున్నది ఈ వరుసలో వికటావతి (విక్టోరియా) వాణిజ్యార్థముగా దొరలువచ్చుట, కలికాతాయందు (కలకత్తాలో) రాజ్యస్థాపనచేయుట, అష్టకౌశలమార్గమున (ఎనమండుగురు నిపుణులుగల సంఘము–పార్లమెంటు) రాజ్యమేలుట మొదలయిన వార్త లిందున్నవి. ఇందలి భాషారీతినిబట్టి భావగతినిబట్టి మఱి యితరపురాణ సమన్వయమునుబట్టి యాధునికములయిన యీ పేరులు చరిత్రయుఁ బ్రక్షిప్తములని తోఁచుచున్నది. అవిగాక విక్టోరియా రాజ్యపాలనదాక యుండి యామీఁద కథ (జార్జి మొదలగు వారి పేరు భారతస్వాతంత్ర్యవార్త) మచ్చునకైన లేని కారణముచే విక్టోరియారాణి పాలన సమయమునవో కొంచెము వెనుకనో ముద్రిత మయిన యీ పురాణములో నెవరో యివి చొప్పించియుందు రనుట నిర్వివాదము. భవిష్య పురాణమని

యున్నది కదా యని భ్రమపడి యుండే యీ చేర్పులు మా ర్పులు విశేషముగాఁ జేసియుందురు. కాన యీ భాగమున కంత విలువ కట్టుటకు వీలులేదు.

గురుండుల తరువాత నికముందు తుంగ నివాసులగు హూనులు భారతవర్షమునకు విక్రమశకము 2264 వరకు (క్రీ. శ. 2207 వరకు) రాజు లగుదురని భవిష్యత్తు చెప్పఁబడి నది. ఈ హూనులు బభ్రువర్ణులని చిన్నచిన్న ముక్కులు గల వారని, గుండ్రనివారని, పొడవైన తల గలవా రని, బౌద్ధ ధర్మ పరులని తెలుపబడినది. ఈ వర్ణనను బట్టి హూనులు అనగా చీనావారేమో అని అనిపించుచున్నది.) హూనుల పరిపాలన మున వైదిక ధర్మవ్యవస్థ, దేవపూజ మొదలయిన సద్ధర్మములు పునరుద్ధరింప బడునని యున్నది. అటుమీఁదట పదునొకండవ హూనుఁడగు 'పన్నగారి' యను నాతఁడు నాగులచే జయింపఁ బడును. అంతట విక్రమశకము 2264 నుండి క్షత్రియులగు నాగుల (అస్సాముప్రాంతీయులు) పరిపాలన యారంభమగును. వారికాలమున మరల వేదధర్మము, యజ్ఞాదులు, ఉపాసనయు సాగును. వారిని జయించి పుష్యమిత్రుఁడు రాజగును. అతఁడు భారతదేశ వైదిక ధర్మోద్ధరణము చేయును. అతనికాలము విక్రమశకము 2772. (క్రీ. శ. 2715) అటుపైన ఆంధ్రుల పరి పాలనము మూఁడువందల పది సంవత్సరములు నడువఁగలదు. సుగదుఁ డను నాంధ్రరాజు రాక్షసులచే జయింపఁ బడును. రాక్షసులు బంగారమును హరింతురు. అటుమీఁదట నాంధ్ర వంశములో సూర్యాంశతో ధాక్షసారి యను రాజు జనించి 'బంగారు నాణెమును' చలామణి లోనికిఁ దెచ్చును. వాని తరు

వాత నరువదిమంది రాజులు వేదపరాయణులయి పాలింతురు. పిమ్మట కలి 8800 A. D. లో విశ్వస్ఫూర్జి యనువాఁడు వేద ధర్మ పరాయణుఁడు, దేవపూజాతత్పరుఁడు రాజుగా వచ్చును. అతఁడు బ్రాహ్మణవర్ణమును బునరుద్ధరించును. ఇట్లు కలిలో 1లక్ష 25 వేలు దాటిన తరువాత భోగసింహుఁడు, కేలిసింహుఁడు నను నిద్దరు సోదరులు వచ్చి మానుల జయించి ధర్మ వ్యవస్థ చేయుదురు. వారు వామనమూర్తి యంశచే యోగులయి కల్ప క్షేత్రమున వసింతురని యున్నది. అటుమీఁద కలి తృతీయ చతుర్థ పాదములందలి మానవుల స్వరూపస్వభావములు వర్ణితములు (శ్రీ)మద్భాగవతము, హరివంశము మొదలగు గ్రంథములందును, నిందును వర్ణింపఁబడిన కలికాల లక్షణము లన్నియుఁ జేర్చి విపులముగా 'సర్వపురాణ సమన్వయము' అను నా గ్రంథమునఁ బ్రకటించెదను. కలి ప్రథమ పాదములోనే మన కవి నేడు స్పష్టపడి మహర్షుల త్రికాలజ్ఞానము నెడ వింత గొల్పుచున్నవి. ఇది విని కాలప్రభావ మిట్లున్నపుడు మన మేమి చేయఁగలమని కొందరు నిస్పృహ చెందుదురు. కాని యది తగదు. రాత్రి చీకటి యావరించుట స్వాభావిక మయినను నేదో చిన్నదీపము వెలిగించుకొని యిల్లు చక్కబెట్టుకొనుచునే యున్నాము. అంధకారము గాఢమయిన కొలది యేపాటి చిన్నదివ్వెయైనను నెంతో సాయపడు చున్నది. అట్లే తక్కిన కృతాది పుణ్యయుగములకంటెఁ కలియుగము పాప భూయిష్ఠమైనను నిందు చేసిన యేకొలదిపాటి ధర్మమైనను ననంతఫలము నొసంగునని, యందుచేఁ కలియుగమే తక్కిన వానికంటె శ్రేష్ఠతరమని యందు వ్యాసులు చెప్పినారు. పోను

పోను మహాకలిలో పాప మత్యుత్కటమై సర్వ వ్యవహారములు కట్టుబడి ప్రజలు నిర్వేదము పొందుదురు. ఆదుఃఖ మార్గాని దైనపుడు మరల పుణ్యచింత యారంభ మగును. అదే కృత యుగారంభము. అపుడు మరల సూర్యవంశ మూలపురుషుఁ డగు నిక్ష్వాకువు చక్రవర్తియై ధర్మవ్యవస్థ చేయును. ఈ రా బోవు చరిత్రకూడ భూతకాల క్రియలచే జరిగిపోయినట్లు వర్ణింపఁ బడినది. ఇది యార్ష గ్రంథములలో భాషాసంప్రదా యము కాన యిది విరుద్ధ మని యెవరును శంకింపరాదు. కృష్ణ నిర్యాణమైన వెంట కలి ప్రథమపాదములో సంధికాల మిప్పు డిప్పుడే గడచుచున్నది. నేటి కారువేల సంవత్సరముల లోపుగా నైనది. అనేక విపరీత మతాఘాతములకు శిథిలమయ్యు నేటికిని భారత సంస్కృతి స్వరూపభంగము పొందలేదు. పండుగలని, వ్రతములని, తీర్థక్షేత్ర యాత్రలని, ప్రజ లింకను ధర్మాసక్తి కలిగియే యున్నారు. కావున నీమాత్రపు వెలుఁ గులో మనము జాగ్రత్త పడవలయును. అందులకై ప్రభు త్వము దేవాదాయ ధర్మాదాయ ద్రవ్యమును సద్వినియోగ పరుప వలయును. విశ్వవిద్యాలయములందును, ప్రాచ్య పుస్తక భాండాగారములందుఁ బ్రత్యేక శాఖ నెలకొల్పి వృద్ధిగా జరుగుచున్న మన యాచార సంప్రదాయములకుఁ బండుగులు, క్షేత్ర తీర్థయాత్రలు మొదలగువాని వలనఁ గలుగు నైహికాముష్మిక లాభముల నుపపత్తుల చూపి నచ్చ చెప్పి, శ్రద్ధ కల్గించుటకుఁ బండితుల నియమింపవలెను. ప్రాచీన భారతీయ విజ్ఞానమును నేడు యాంత్రిక పరిశోధనకు సంబంధిం చిన నవీన విజ్ఞానముతో సమన్వయ పఱచుట కుభయవిధ విజ్ఞా

నులను నొకచోఁ జేర్చి వారి వాదములను సమన్వయపఱచు గ్రంథములను వ్రాసి యందింపవలెను. వాని నూరూర, యింటింటఁ బ్రచారము చేయవలెను. అందులకు సర్వకళా నిలయము లయియున్న దేవాలయములే యుత్తమ రంగస్థలములు. బహు శ్రమలోర్చి శాంతిచే గడించుకొన్న స్వాతంత్ర్యమిట్లు మన సంస్కృతిని, సభ్యతను బునరుద్ధరించుకొన్ననాఁడే సంపూర్ణము, సర్వాంగసుందరము కాఁగలదు.

అట్టి శుభోదయమునకు మన వ్యాసవాఙ్మయసమితిపక్షమున నిదే పుష్పాంజలి.

శ్రీ మహాగణాధిపతయే నమః - శ్రీ గురుదేవాయ నమః
శ్రీ వ్యాసభగవతే నమః

# భవిష్య మహాపురాణము

## బ్రాహ్మపర్వము ౧.

శ్రీయుతుండగు శతానీకప్రభుని దర్శింప మహాత్ములగు మహర్షు లందరును దయచేసిరి. వారు భృగువు, అత్రి, వశిష్ఠుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, పరాశరుఁడు, వ్యాసుడు, సుమంతుఁడు, జైమిని, పైలుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, గౌతముఁడు, భారద్వాజుఁడు, నారదపర్వతులు, వైశంపాయనుఁడు, మహాత్ముఁడు, మహాతపస్వియగు శౌనకుఁడు, దక్షుఁడు, అంగిరస్సు గర్గుఁడు, గాలవుఁడు, మొదలగువారు. శతానీకుఁ డట్లరుదెంచిన మునివరుల కెదురేగి యథావిధి నర్ఘ్యాదు లొసంగి పూజించెను. మరియు పురోహితపురస్కృతంబుగ గోవు నొసంగి స్వాగత మ్మడిగి సాష్టాంగవందన మాచరించి సుఖాసనము నమరించెను. సుఖాసీనులయి మార్గశ్రమము వాసి సుప్రసన్ను లయి యున్న యమ్మునిపుంగవుల నా రాజపుంగవుఁడు దక్షిణ బాహు వెత్తి యిట్లు ప్రశ్నించెను. 'ఓ మునిసత్తములారా! ఇప్పుడు నాపుట్టువు ధన్యమయినదని భావించుచుంటిని. కీర్తియు యశమ్మును, బలమ్మును నాకిపుడు లభించినవి. నన్ను జూడ వలయునని తామందరు మన్మందిరమునకు విచ్చేయుటవలన

నేను ధన్యుఁడ నైతిని. నే నిపుడు పుణ్యాత్ముఁడ నైతిని. మిమ్ము స్మరించిన మాత్రమున నరుఁడు పవిత్రుండగుం గాదె! మహాబలసంపన్నులగు మీవలన ధర్మశాస్త్రరహస్యములను వినవలయునని యున్నది. అట్లొనరించి నే నుత్తమగతి కేగఁగలను. మా తండ్రి మున్ను భారతము విని యుత్తమస్థానము నలంకరించెం గాదె!' అట్లు పలికిన విని యా బ్రాహ్మణు లందరు నన్యోన్యము సమావేశమయి విమర్శించి వ్యాసుని బూజించి యిట్లు పలికిరి. రాజా! నీవు వ్యాసభగవానుల ననుగ్రహింపఁ జేసికొనుము. ఈతఁడు నీకుఁ దెలుపును. ఈయన యుండగా మేము బోధింప నర్హులము గాము. గురుసన్నిధిని శిష్యుండు విద్యాబోధచేయుట యుచితమగునే? సాక్షాన్నారాయణుం డగు నీ వ్యాసుఁడే మా కందరకును గురువు. ఇతఁడు పరమకృపాళువు. దివ్యవిధాన మెఱింగినవాఁడు. ధర్మాది పురుషార్థసమన్విత మగు ధర్మశాస్త్రమును చాతుర్వర్ణ్య ప్రజలు పవిత్రులగుటకై యీతఁడు చెప్పియున్నాఁడు. ఔషధమునకు రోగము భయపడినట్లు గహనమగు శాస్త్రమునకు లోకము భయపడుచుండును. రమ్యమును, శాస్త్రమును (శాసకమును) గూడ యగునట్లు భారతము నీతఁడు రచించెను. వైద్యుఁడు రుచికరమును, పథ్యమునయిన యౌషధము నిచ్చునట్లు మునివరుండగు నీతఁడు భారతము విస్తరించి యిచ్చియున్నాఁడు. భారత మాస్తిక్యసౌధము నెక్కుటకు సోపానము. అద్దానిని వినిన యతఁడు స్వర్గనరకముల స్వరూపమును బ్రత్యక్షముగాఁ జూడగల్గును. దేవతలు తీర్థములు తపస్సులు మొదలగు

నాని నిశ్చయజ్ఞానము భారతము వలననే యగును. భారతా
ర్థములను విమర్శించినవాఁ డెన్నఁడును నాస్తికుఁడు గాఁడు.
భారతము వలననే విష్ణువునందు, దేవతలయందు, వేదముల
యందు, గురువులయందు, బ్రాహ్మణులయందు కల్యాణకరమగు
భక్తి యుదయించును. భారతమువలననే ధర్మార్థ కామమోక్ష
ములు సిద్ధించును. మోక్షపథగాములగువారి కకృత్రిమమగు
మార్గము భారతము. పురుషార్థములు భారతమునందుఁ బ్రపం
చింపఁబడి యున్నవి. అసత్యములగు తాపత్రయములచే సంతప్తు
లగు వారికి శాంతి లభించుట యొక్క భారతమువలననే. వృష్ణి
పాండవవంశముల సంపదలకు వినాశనము గల్గిన తీరు విన్న
యాతఁడు దుఃఖావసానములగు నిహలోకసుఖముల బండార
మెఱింగికొని పుణ్యాచరణాపరుండగును. ఇట్టి మహాగ్రంథమును
బలికిన మహాత్ముఁడు వ్యాసుఁడు. వ్యాసరూపము ధరించిన యీ
మహానుభావుఁడు సాక్షాన్నారాయణుఁడు. అని పలికిన ఋషుల
వచనమ్ములాలించి ప్రతాపశాలియగు నానృపశేఖరుండు శాస్త్ర
విశారదుండగు వ్యాసు నిట్లు ప్రసన్ను నొనరించుకొనెను.
'బ్రహ్మజ్ఞా! తమ పాదములందు వ్రాలి యిదిగో నమస్కరించు
చున్నాను. నేను పవిత్రుఁడ నగునట్లు ధర్మశాస్త్రము తెలుప
నర్థింతును శుభప్రసంగము సేసి నన్నీ సంసారమునుండి యుద్ధ
రింపుము. నా తండ్రికి భారతమును దెల్పి యుద్ధరించితివికదా!'
అనిన విని వ్యాసుఁడు 'రాజా! ఇదిగో! ఈతఁడు నా శిష్యుఁడు
సుమంతుఁడు. నీకోరినదెల్ల దెల్పఁగలఁడు. భారతవంశవర్ధన!
అద్భుతమును ప్రీతికరమును శుభదము నగు కథ వినవలతువేని

సర్వపాపభయహారంబును మున్ను వైశంపాయన మునీంద్రుని వలన మీ తండ్రికిఁ దెలుపఁబడినదియు బ్రహ్మహత్యాది మహా పాపవ్యపోహనంబునగు మహాభారతవ్యాఖ్యానమును వినుము.' అనిన మునికులంబు ఋషిపుంగవుని రాజును జూచి ప్రశంసించిరి. బుద్ధిశాలియగు నీ వ్యాసుఁడు తెల్పినట్లు సుమంతుని పృచ్ఛ చేయుము. అతఁడును సర్వశాస్త్ర విశారదుండు. మాకును నిట్టి యంశము వినవలయు ననుబుద్ధిపొడముచున్నది. అంతట బాదరాయణుండు తనశిష్యుండగు సుమంతునితో "తాత! ఈ రాజు సంతోషించునట్లు కథలను దెలుపుము'' అనిన సుమం తుండు గురుహృదయము గమనించి యందరకును దెలుప సమ కట్టినంతట ఆజమీఢుఁ డగు శతానీకుం డతనికి మ్రొక్కి 'విప్రేంద్ర! సర్వపాపములు వాసి నేను పవిత్రత నందుటకుఁ బుణ్యాఖ్యాన మేదేని నాకుఁదెలుపుము' అని యడిగిన సుమం తుం డిట్లు పలుకందొడంగెను. 'భారతా! పుణ్యములగు శాస్త్ర ములు నానావిధములుగ నున్నవి. అవి సర్వకిల్బిషహారంబులె. అందు నీవేది వినఁదలఁచెద వది యడుగు మన ధర్మశాస్త్రమతము లెన్నెన్ని కలవో యవి విని తెలిసికొనఁదలచితిని. విష్ణు, యమ, అంగిరో వశిష్ఠ దక్ష సంవర్త శాతాతప పరాశర, ఆపస్తంబ, ఉశనః, కాత్యాయన, బృహస్పతి, గౌతమ, శంఖలిఖిత, హారీత, అత్రిప్రభృతు లగు ఋషులు రచించిన ధర్మశాస్త్రములు పెక్కులు గలవు. అవి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల శ్రేయస్సు కోరి చెప్పఁబడినవి. అవన్నియు వింటిని. కాని చతుర్థవర్ణులగు శూద్రులు ధర్మార్థకామసంరక్షణమెట్లు చేసికొనగలరో విని

యుండలేదు. వారి కాగమములం దధికారము లేదుగదా!
ఇట్టివారికి త్రివర్గసాధనమగు నాగమ మేమున్నదో, వారి
కష్టము వారించుటకు మార్గము ననుగ్రహింపు' మన
సుమంతుండు 'రాజా! చక్కని ప్రశ్న చేసితివి. అష్టాదశ
పురాణకర్త యగు వ్యాసదేవుఁడు శూద్రసంరక్షణకై భారత
మును రచించెను. అందు వేదార్థమంతయు ధర్మశాస్త్ర
మును గూడ యిమిడించెను. సంసారవార్ధిం బడి కొట్టుకొను
చాతుర్వర్ణ్యము నుద్ధరించుటకదియొక నౌక. వ్యాసుఁడు పదు
నెనిమిది పురాణములను, నెనిమిది వ్యాకరణములను దెలిసి
భారత సంహితను సంతరించెను. అది వినిన యతఁడు బ్రహ్మ
హత్యను దరించును. పదునెన్మిది పురాణములు సుప్రసిద్ధములు.
బ్రాహ్మము, ఐంద్రము, యామ్యము, రౌద్రము, వాయవ్యము
వారుణము, సావిత్రము, వైష్ణవము నని ఎనిమిది వ్యాకరణ
ములుగలవు. ఇందు నీవేది వినదలఁచితి వన 'మునీ! నీ చెప్పిన
వన్నియు మున్నె వినియున్నవాఁడను. భవిష్యమహా పురాణ
మొక్కటి కొఱవడి యున్నది. అన సుమంతుఁడు 'నృపాగ్రణి!
అది తొమ్మిదవ మహాపురాణము. అదివినినయతఁ డశ్వమేధఫల
ము చూరగొనును. సూర్యలోకమున కేగును. ఇది విద్వాంసుఁ
డగు బ్రాహ్మణునిచే నధ్యయనము చేయదగినది. బ్రాహ్మ
ణుఁడు శిష్యులైన చతుర్వర్ణ ప్రజలకుఁ దెలుపవచ్చును.
బ్రాహ్మణుఁడు క్షత్రియుఁడు తప్ప యితరులు దీని నధ్యయనము
చేయరాదు. శూద్రుఁడు వినుటకే యర్హుఁడు. దీనినతఁడు చదువ
రాదు. ఇందు శ్రౌతస్మార్త ధర్మములు రెండును దెల్పఁబడి

యున్నవి. ఇదివినిన యాతనికిఁ ద్రికరణదోషములు నశించును. దీనిని చతుర్వర్ణప్రజలకు వినిపించినయాతఁడు 'గురువు' అనం బడును. అతఁడు సర్వపూజ్యుఁడు. భూమండలమంతయు నత నికి సమర్పించినను చాలని దేయగును. ఆచారము మొదటి ధర్మము. అది యీ గ్రంథము నందున్నది. ఆచారహీనుఁడు వేదఫలము నందలేఁడు. ధర్మగతి యాచారముమీఁద నాధార పడియున్నది. సర్వతపమ్ములకు నాచారము మూలము. కావున నిమ్మహాపురాణమునం దాచారము కీర్తింపఁబడుచున్నది. దాని కనుసరములగు కథలు, వృత్తాంతములు నిందు చేర్పఁబడును. బ్రహ్మ శంకరునికి, శంకరుఁడు విష్ణునికిని, విష్ణువు నారదునికిని, నారదుఁ డింద్రునికిని, ఇంద్రుఁడు పరాశరునకి, పరాశరుఁడు వ్యాసులకును, వారు నాకును పరంపరగా నీ గ్రంథము నుపదే శించియున్నారు. నావలన నీవు వినుము. స్కాందము లక్షయని యెఱుఁగుదుము. భవిష్య మిందు సగమున్నది. ఇది వినినవారికి బుద్ధి, వృద్ధి, శ్రీయును కలుగును.

2 అ. సుమంతుం డిట్లనియె :- ఈ మహాపురాణ మైదు లక్షణములు గలది. దీనిని వినుము. ఇది బ్రహ్మహత్యానివార కము. ఇందు పర్వము లైదున్నవి. బ్రాహ్మము, వైష్ణవము, శైవము, త్వాష్ట్రము; ప్రతిసర్గము నని వాని పేరులు. ఇందు చతుర్దశవిద్యలుం గలవు. అందు తొలుత సృష్టిక్రమము వర్ణి తము. 2 అధ్యాయము నుంచి 47 వరకు ధర్మశాస్త్రవిష యము. వ్రతవిధులు మొదలగునవి.

## —♦ సూర్యప్రశంస ♦—

48 అ. సుమంతుం డిట్లనియె :- మున్ను సాంబుండు తన తండ్రి యగు కృష్ణుని నైహికాముష్మికశ్రేయస్సాధన మేమని ప్రశ్నించిన శ్రీహరి యతని కిట్లనియె. దేవతా ప్రసాదము కంటె మించిన పరమలాభము లేదు. విశిష్టుఁడగు దేహిచే విశిష్టులగు దేవత లారాధింపఁబడి విశిష్టఫల మిత్తురు. ఆగమము లన్నిటియందు దేవతలున్నా రను సిద్ధాంతము నిశ్చిత మయినది. ఆగమప్రమాణముచేతనే కాక యనుమానప్రమాణముచేతఁగూడ యిది సరిపడుచున్నది. సర్వదేవతలు ప్రత్యక్షమున కందరు. ఒక్క సూర్యభగవానుఁడే ప్రత్యక్షదేవత. అతనికి జగచ్చక్షువు అని పేరు గలదు. అంతకంటె నధికమగు దేవత లేదు. ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయము లతనివలననే యగుచున్నవి. సర్వభూతగ్రామమున కతఁడే హేతువు. కృతయుగాది రూపమయిన కాలము సూర్యుఁడే. ఇంద్రాది దేవత లతని రూపములే. వేదములు 'పరమాత్మ' యను శబ్దముచేఁ బేర్కొన్నది సూర్యునే. ఇతిహాసపురాణము లతనినే 'అంతరాత్మ' యని పేర్కొన్నవి. ఇతఁడే సర్వదేహుల యందు ప్రేరకుఁడై యున్నాఁడు. మండలస్థుఁడగు నీతనిని గూర్చి జపించినవారికి సర్వసిద్ధులు కరతలామలకములు. తన దేహమునందును, మండలమునందును నున్నవాని నేకరూపమున గ్రహించిన వాఁ డెవఁడో యతఁడే చూచినవాఁడు. అంగకవచాదులతో నీ వీ దేవు నారాధింపుము. నీకు ఆదిభౌతికాధిదైవికాధ్యాత్మిక దుఃఖములు గలుగవు. 49 అ.

మొదట సూర్యోపాసన చెప్పఁబడినది. ఈ సందర్భములో గ్రహశాంతి వర్ణితమైనది. సూర్యునికి జిల్లేడుసమిథలు, చంద్రునికి మోదుగ, కుజునికి ఖదిరములు (చండ్ర), బుధునికి ఉత్తరేణు, గురునికి రావి, శుక్రునికి ఔదుంబరములు (మేడి), శనికి జమ్మి, రాహువునకు దూర్వలు, కేతువునకు కుశలు, చెప్పఁబడినవి. సూర్యునికి దక్షిణధేనువు, చంద్రునికి శంఖము, కుజునికి ఎఱ్ఱయెద్దు, బుధునికి బంగారము, గురునికి వస్త్రములు, శుక్రునికి తెల్లగుఱ్ఱము, శనికి కపిలధేనువు, రాహువునకు భాండపాయసము (కుండెడు పరమాన్నము) కేతువునకు మేకయు నీయవలెను. సూర్యునికి బెల్లపన్నము, చంద్రునికి నేతిపాయసము, కుజునికి హవిష్యాన్నము, బుధునికి క్షీరాన్నము, గురునికి పెరుగన్నము, శుక్రునికి నేతియన్నము, శనికి తిలపిష్టము (చిమ్మిలి), మినుము, రాహువునకు మాంసము, కేతువునకు చిత్రాన్నము నివేదన చేయవలెను. సౌవీరము, ఆండాలము, స్విన్నబీజము, కాంజికము అనేవిగ్రహశాంతులందు సమర్పించవలసిన వారణములు (మద్యములన్నమాట). నరుల పతనోత్పతనములు గ్రహాధీనములు కావున గ్రహారాధన చాలవ్రిధానము. గ్రహములు, గోవులు, రాజులు, గురువులు, బ్రాహ్మణులు పూజింపఁబడుదురేని పూజ నిచ్చెదరు. అవమానింపఁబడుదురేని యవమానించెదరు. చెలరేగిన యొకయంత్రమును యంత్రముచేతనే యణఁచవలసియున్నట్లు చెలరేగిన పీడను గ్రహశాంతిచేతనే వారించవలసి యుండును. యజ్ఞాలు, సత్యవ్రతులు, నిత్యోపవాసులు, జపహోమ

వరులు నగు సందరికిని గ్రహశాంతి అవసరము. సూర్యరథయాత్రచేసి సూర్యదేవతను దేవాలయమునకు గొంపోయి రథాధిష్ఠితులగు రథదేవతలను గూడా పూజింపవలెను. అపుడు బ్రహ్మకు పాలు, యవాగువు (గంజి) పరమాన్నము సమర్పింపవలెను. కార్తికేయునికి వండ్లు, వివస్వంతునికి మధువు, మాంసము, మద్యము; పురుహూతునికి భక్ష్యములు, అగ్నికి హవిష్యాన్నము, విష్ణునికి అగ్రాన్నము, రాక్షసులకు మైరేయములతో కలిపినయన్నము, రేవతునికి సంస్కృతమైన పిశితాన్నము, పితృపతికి తిలాన్నము, ఆశ్వినులకప్పములు, వసువులకు మాంసము, పితరులకు పాయసము, నేతియన్నము, మధువుతో సహా, కాత్యాయినికి యవాగువు, శ్రీదేవికి పెరుగు, సరస్వతికి త్రిమధురము, వరుణదేవునికి చెఱకురసము కలిపిన యన్నము, కుబేరునికి మిత్రునికి ఖండవాన్నము, మరుత్తులకు నూనెతో కూడిన మజ్జిగ, మాతృకలకు మాంసాన్నము, భక్తము, పప్పు, భూతములకుల్లేపికలు*, సూర్యునికి నీరు, గణపతికి మోదకములు (ఉండ్రములు), నైర్‌ఋతికిచక్కెలములు, విశ్వేదేవతలకు సర్వభక్ష్యములు, ఋషులకు నాగులకు క్షీరాన్నము నివేదితములు చేయవలయును. రథవాహకులకు పైన పూసికొనుటకు కల్లు మాంసము, బ్రహ్మకు నేయి, త్ర్యంబకునికి తిలలు, స్వాహాకుమారునికి లాజలు (పేలాలు), సూర్యునికి కోవిదారము ఇంద్రునికి రాజవృక్షము, పావకునికి హవిష్యము, చక్రికి సప్తధాన్యము, గరుడునికి మత్స్యాన్నము, యక్షులకు

* ఇట్టిపదముల కర్థములు చివరపుటలలోఁ జూడుఁడు.

వివిధాన్నములు, రేవతునికి నిర్యాసము (జిగురు), యమునికి వికంకతమాలికలు, అశ్వినీ దేవతలకు కర్ణికారము (గోగు) శ్రీకి పద్మములు, చండికకు సుచందనము, సరస్వతికి నవనీతము (వెన్న), వినతకు మాంసము, అప్సరసలకు మాలతీకుసుమములు, వరుణునికి అగ్నిమంథము, నిర్‌ఋతికి ఫలమూలములు, కుబేరునికి బిల్వము. మరుత్తులకు వెలగ, గంధర్వులకు ఆరగ్వధము, వాసవులకు కర్పూరము, గణాధిపతికి దారువు, పితరులకు పిండమూలములు, భూతములకు విభీతకము, గోవులకు యవలు, మాతృకలకు అక్షతలు, విఘ్నపతికి గుగ్గులు. విశ్వులకు ఓదనము, ఋషులకు బ్రహ్మవృక్షము, నాగులకు విషము, భాస్కరునికి తేనె నెయ్యి, గైరికము, గుజ్జములకు న్యగ్రోధము నివేదింపనగును. దిండికి సూర్యునికి జరిగిన సంవాదము సూర్యోపాసనకు సంబంధించి యిందు వర్ణితమైనది. సూర్యోపాసనవల్ల దిండియను గణనాయకుఁడు బ్రహ్మహత్యాదోషమునుండి ముక్తుఁడయ్యెనఁట. చూడుడు 61 అధ్యాయమునుండి 70 సూర్యోపాసనావిషయము. (బహువిస్తరముగా నున్నది.)

—♦ సూ ర్య స్త వ ము ♦—

71 అ. బ్రహ్మ యుపదేశించినది.

నమస్సూర్యాయ నిత్యాయ రవయే కార్యభానవే
భాస్కరాయ మతంగాయ మార్తాండాయ వివస్వతే
ఆదిత్యా యాదిదేవాయ నమస్తే రశ్మిమాలినే
దివాకరాయ దీప్తాయ అగ్నయే మిహిరాయ చ
ప్రభాకరాయ మిత్రాయ నమస్తేఽదితిసంభవ !

నమో గోపతయే నిత్యం దిశాంచపతయే నమః
నమోధాత్రే విధాత్రే చ అర్యమ్ణే వరుణాయ చ
పూష్ణే ఖగాయ మిత్రాయ పర్జన్యాయాంశవే నమః
నమోహితకృతే నిత్యం ధర్మాయ తపనాయ చ
హరయే హరితాశ్వాయ విశ్వస్యపతయే నమః
విష్ణవే బ్రహ్మణే నిత్యం త్ర్యంబకాయ తథాత్మనే
నమస్తే సప్తలోకేశ నమస్తే సప్తసప్తయే
ఏకస్మైహి నమ స్తుభ్యమేవ చక్రరథాయ చ
జ్యోతిషాం పతయే నిత్యం సర్వప్రాణభృతే నమః
హితాయ సర్వభూతానాం శివా యార్తిహారాయచ
నమః పద్మప్రబోధాయ నమో వేదాదిమూర్తయే
కాదిజాయ నమస్తుభ్యం నమస్తారాసుతాయచ
భీమజాయ నమస్తుభ్యం పావకాయ చవై నమః
ధిషణాయ నమోనిత్యం నమః కృష్ణాయ నిత్యదా
నమోఽస్త్వదితిపుత్రాయ నమో లక్ష్యాయ నిత్యశః॥

అధ్యాయము **71.**

ఈ స్తోత్రము పఠించినవారు సర్వాభీష్టములు పడయుదురు. సాయంప్రాతఃకాలములం దిది పఠింపవలయును.

## —♦ సాంబుని చరిత్ర ♦—

మున్ను దుర్వాసమహర్షి ద్వారవతి కరుదెంచిన నతని యాకృతి చూచి సాంబుండు రూపగర్వితుండై వెక్కిరించి యతనిని కోపింపఁజేసెను. అంత నమ్ముని ప్రచండుఁడై నన్ను వెక్కిరించితివి గావున కుష్ఠురోగివి కమ్ము” అని కృష్ణకుమా

రుండగు నా సాంబుని శపించెను. ఈసమయముననే నారద మహర్షి త్రిలోకసంచార మొనరించుచు వాసుదేవసందర్శ నార్థముగ ద్వారవతికి వచ్చెను. యదుబాలు రతనిని యథా ర్హముగ సత్కరించిరి. కాని సాంబుఁడు రూపగర్వంబున క్రీడా రతుండై యమ్మునిని గణింపఁడయ్యెను. అంతట నారదభగవా నుండు వీని గర్వభంజనము చేసెద గాకయని సంకల్పించి కృష్ణుని దర్శనమున కేగి, ప్రభూ! నీ పదునారువేలమంది గోపికలును సాంబకుమారునిపై మోహము గొనియున్నారు. అతనిని జూచినగాని వారికి మనమ్ములు నిలువకున్నవి యని తెలిపెను. శ్రీపతి యొకనాడు గోపికలతో జలక్రీడ లొనరించి వస్త్రాలంకారభూషితులైన యా యంగనాజనముతో కూడి విహరించు చున్నతఱి నారదుండు సాంబునిదగ్గర కేతెంచి, సాంబా! నీతండ్రి కృష్ణుఁడు నిన్నుఁ దొందరగాఁ బిలువ బంచినాఁడు. ఏదియో కార్యావసరమ్ము కలిగినదని గొనివచ్చెను. సాంబకుమారుఁ డది నిజమని నమ్మి వచ్చి తండ్రికి నమస్కరించి నిలువబడినంతట నాతని సుందరాతి సుందరమగు నాకారము చూచి రుక్మిణి, సత్యభామ, జాంబవతియుం దప్ప మిగిలిన వారందరి చిత్తములు సంచలిం చెను. అల్లంత దూరముననే యాతనింజూచి గోపికలు తత్తరించి నిలువబడిరి. వాసుదేవుండు చూచుచుండగనే వారు చీరలుపీడి యొడలు మఱచిపోయిరి. అంత యదుస్వామి శ్రీహరి కోపించి యయ్యింతులను 'మీరు దొంగల వశమయ్యెదరు' అని శపించెను. అట్లే కృష్ణనిర్యాణానంతరము వారు పాంచనదులను

చోరుల వశమయిరి. కృష్ణుఁడు సాంబునిగూడ 'కుష్ఠరోగి వగుదువు' అని శపించెను. జాంబవతీ కుమారుండగు సాంబుని కంతట కుష్ఠరోగ మావహించెను. దుర్వాసుని శాప మందుకు తోడయ్యెను. పెద్దలుపఠించు రెండు శ్లోకములు గలవు. ఎవఁడు ధర్మశీలుఁడై, మానదోషములు లేక, విద్యావినయసంపన్నుఁడై పరులను బాధింపక, స్వభార్యానిరతుండై యుండునో వాని కెందును భయము లేదు. మంచునీరు గాని, చందనరసంబు గాని, మధురమైన మాటవలె సంతోషము నీయజాలవు. ఇట్లు శాపోపహతుండైన సాంబుండు సూర్యారాధన మొనరించి విముక్తపాపుండై యెప్పటియట్లు సుందరుండయ్యెను. చంద్రా నదీ తీరమున సూర్యదేవతా స్థాపన మొనరించి సాంబుఁ డారాధనచేసెను. కాని యీప్రతిష్ఠకు మున్నే యిది సూర్యక్షేత్రమై యుండెను. మిత్రనామమున సూర్యుని పండ్రెండవమూర్తి ఈ క్షేత్రమందున్నది. సూర్యుని మొదటి మూర్తికి ఇంద్రుఁడని పేరు. అది దేవరాజ్యాధిపతిత్వము నంది దానవాసుర నాశన మొనరించుచున్నది. రెండవ మూర్తికి 'ధాత' యని పేరు. అది జగత్సృష్టికర్తృత్వము వహించియున్నది. పర్జన్యమూర్తి మూఁడవది అమృతము వర్షించును. పూష యనునది నాల్గవ మూర్తి మంత్రములయందుండి యది ప్రజాపుష్టి చేయును. త్వష్టయను నైదవమూర్తి వనస్పతులందు నోషధులయందు నుండును. అర్యమయను నాఱవమూర్తి ప్రజా సంవరణార్థము శరీరములందున్నది. 'భగ' యను సప్తమమూర్తి పర్వతము లందు భూమియందు నుండును. 'వివస్వతము' అను మూర్తి

యగ్నియందుండి శరీరులు తిను నన్నమును పచనము చేయును. 'అంశువు' అను తొమ్మిదవ మూర్తి చంద్రునియందుండి జగముల నాప్యాయనము చేయును. 'విష్ణువు' అను పదియవ మూర్తి దేవశత్రులను నశింప చేయుచు ప్రాదుర్భావమొందును. వరుణనామకమగు పదునొకొండవమూర్తి జగములను సేవింప జేయుచున్నది.

75, 76 అ. సాంబుండడుగగా నారదమహర్షి సూర్య వైభవముంగూర్చి యిట్లు వర్ణించెను. సాంబా! ఒకప్పుడు నేను ముల్లోకంబులందు సంచరించుచు సర్వదేవగణ పరివృతుండగు సూర్యుంగాంచితిని. అతని సన్నిధిని గంధర్వులు గానము చేయుచుండిరి. అప్సరసలు నృత్య మాచరించుచుండిరి. యక్షరాక్షస పన్నగు లాయుధములెత్తి యతనిని గాయుచుండిరి. ఋగ్యజుస్సామములు రూపము ధరించియున్నవి. ఋషు లీతని స్తుతించు చుండిరి. ప్రాత ర్మధ్యాహ్న సాయం సంధ్యా దేవతలు మూర్తి ధరించి యాతని సన్నిధినుండిరి. అందు ప్రాతస్సంధ్య యరుణ, మధ్యమసంధ్య చంద్రసదృశయు, సాయంసంధ్య వృక్ష సమానయు నైయుండిరి. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, మరుత్తులు. అశ్వినీదేవతలు మూడుసంధ్యలందు నర్కుని పూజించుచుందురు. ఇంద్రుఁడు జయజయ నినాదములుచేయుచు నక్కడ నేయున్నాడు. కలియు, త్ర్యంబకుఁడును, త్రిసంధ్యంబు నర్కు నర్చించు చుండిరి. ప్రాతస్సమయమునఁ దామరపూవువలె నున్నట్లును, మధ్యాహ్నము చక్రాకారముగ నున్నట్లును, రాత్రి నేతిరంగులో నున్నట్లును సూర్యుని బూజింపవలెను. సూర్యుని ముందుండి

యనూరుఁడు సారథ్యము చేయుచుండును. కాలము యొక్క
యవయవములచే నిర్మింపబడిన సూర్యరథము నతఁడు నడుపు
చుండును. ఆ రథికుడు గుఱ్ఱములతో నుండును. అవే ఛందస్సు
లని తెలియవలెను. సూర్యుని కిరువంకల రాజ్ఞి, నిక్షుభ యను
నిద్దఱు భార్యలుందురు. దేవత లతనిచుట్టును సంచరింతురు.
పింగలుఁ డచట లేఖకుఁడుగా నున్నాఁడు. దండనాయకుఁడు మఱి
యొకఁడుండును. రాజాశ్రోషులను నిద్దరు కల్మాషపక్షులు ద్వార
మందుందురు. చతుశ్శృంగమగు నాకాశము మేరువుతో
సమాన లక్షణములు కలిగి యన్వాలనున్నది. దిండి యచట నగ్ర
భాగమందుండును. దిశలయందు మరికొందరు దేవతలుందురు.
ఇట్టి సర్వగతుఁడయి, గీర్వాణసంస్తుతుండగు దేవేశుని, గ్రహే
శుని, భువనేశుని శరణొందుము.

77 అ. మరియు వినుము. అవ్యక్తము, సదసదాత్మకము
నగు నొకవస్తువుగలదు. దానినే పురుషుఁడందురు. తదాత్మకమై
యీ జగమంతయు వ్యాప్తిచెంది యున్నది. అతఁడే సృష్టికర్త
యై బ్రహ్మయనంబడును. అంతకర్తయై కాలుఁడనంబడును.
రక్షకుఁడై విష్ణు వనంబడును. అతఁడు హిరణ్యాండగతుండై
యుండుటచే హిరణ్యగర్భుఁ డనబడును. నారములనగా నాప
స్సులు. అం దయనము (గతి) కలవాఁడు నారాయణుఁడు. 'అర'
అనేది శీఘ్రార్థకమైన నిపాత. ఆపస్సులే సముద్రములయి శీఘ్ర
గమనము లేనివగుటచే వానికి 'నారము' లని పేరుగలిగినది.
ఏకార్ణవ ప్రళయమైన తరి నా యాపస్సులందు శయనించు
సహస్రశీర్షుఁడగు నాదిదేవునకు నారాయణ శబ్దము సార్థకమయి

యుండును, వేదములం దతఁడే పురుషుఁడని పేర్కొనఁబడి యున్నాఁడు. అతఁడు యుగసహస్ర పర్యంతమైన రాత్రి గడపి, రాత్రి చివర సృష్టి కారణమయిన బ్రహ్మత్వము నంగీకరించును. అతఁడు భూమియంతయు జలమగ్నమైనట్లు గమనించి వరాహ మూర్తిధరించి యుద్ధరించును. ఆ వరాహరూపముయొక్క శరీరము వేదమయము. అతఁడే మనస్సుచే భృగ్వంగిరః ప్రభృతులగు ఋషిసంతతింగన్నవాఁడు. దక్షకన్యకయగు నదితి కశ్యపుని వలన భూర్భువస్స్వర్లోక సమిష్టి రూపమైన నొక యండముం గనెను. అందుండి ద్వాదశస్వరూపుఁడు సహస్రరూపుఁడగు దివాకరుండను పేరొంది యుదయించెను. ఆతని విస్తారము తొమ్మిదివేల యోజనములు. ఆ విస్తారముకంటె మూఁడు రెట్లతని పరిణాహము. (వైశాల్యమన్నమాట). కదంబకుసుమము కేసరములతో నిండినట్లతఁడు తేజస్సముదాయముతో నిండి యుండును. ఆ సౌర తేజస్సు సముద్రాదులనుండి నీటి నాకర్షించును. రాత్రి యా తేజం బగ్నియందుఁ బ్రవేశించును. ప్రకాశోష్ణ భావము లీరెండిటియం దుండును. సూర్యకిరణములకు పర్యాయ పదములుగా వేదశాస్త్రములందు వాడబడుపదము లిరువది కనిపించుచున్నవి. హేతి, కిరణము, గోవు, రశ్మి, గభస్తి, అభీషువు, ఘనము, ఉస్ర, వసువు మరీచి నాడి దీధితి సాధ్యము మయూఖము భానువు, అంశువు సప్తార్చి సువర్ణము, కరము, పాదము, అనునివి సమానార్థకములు. చందనాదిభేదముగా నీ కిరణములు శీతవర్షాతపాది కారణములయి యనంతసంఖ్యలో గణింపఁబడియున్నవి. (ఇతరపురాణములలో వీనిని వివరించి

యున్నాడు.) గ్రహరాజైన సూర్యభగవానుఁడు వాయువువలె సర్వగతుండై యున్నాఁడు. ఇతని మూడువందల కిరణములు భూలోకమును, మఱి మూఁడువందలు భువర్లోకమును, మఱి మూఁడు వందలు సువర్లోకమును వెలిగించుచున్నవి. నూఱు కిరణములు క్రింద పాతాళమును తపింపజేయును. ఈ శుక్ల మండలమునకు 'హేలి' యను పేరుగలదు. నక్షత్రగ్రహ సోమబింబముల కిది ప్రతిష్ఠాయోని యయి యున్నది. సూర్యుని వేయికిరణములలో ప్రాజ్ఞ్యములని యుదాహరింపబడిన వానిలో శ్రేష్ఠములయిన కిరణములే గ్రహములని పేరొందినవి. సప్తజము, కంజజము, తారేయము, దేవగురువు, ఉగ్రాష్ణాము శని, కసంజ్ఞితము నని వానిని వాడుదురు. అగ్నియందు వేల్వఁబడిన యాహుతి ఆదిత్యుని జేరును. ఆదిత్యుని వలన వర్షము పడును. వృష్టివలన నన్నము, దానివలనఁ బ్రజలు నేర్పడుదురు. లోకముయొక్క యునికిమనుకులు వినాశముకూడ యాదిత్య నిమిత్తకములే. సర్వజగద్వ్యవహారమునకు మూలమైన ఋతు మాస సంవత్సరాది విభాగమంతయు సూర్యునివలననే యగు చున్నది. అగ్న్యుపాసనయంతయు కాలము మీఁదనే యాధార పడియున్నది. ఆదిత్యుఁడు పండ్రెండు మాసములందుఁ బండ్రెండు పేరులతో వెలుంగుచున్నాడు. ఆపేరులు సర్వపురాణములందుఁ బ్రసిద్ధముగా వాడఁబడి యున్నవి. స్వయంభు వని పిలువబడి యేకైకమయిన సూర్యాత్మ గుణవశమున నానాత్వము నొంది నానా నామరూపములఁ బేర్కొనఁబడి యున్నాఁడు. మేఘ మొక్కటియే యయ్యు రంగుచేత రూపముచేత నానావిధమయి

నట్లు, ఆకాశమునుండి కురిసిన నీరాయాచోట్ల భూమియొక్క రస భేదమును బట్టి నానారుచియయినట్లు, అగ్ని పలువిధములయిన కట్టెలచేత వర్ణముచేత రూపముచేత గుణముచేత పలురకము లయినట్లు, వాయువు ద్రవ్య విశేషములయొక్క స్పర్శచే పెక్కువాసన లందినట్లు, గార్హపత్యాగ్ని యొక్కటే దక్షిణాహవనీయ బ్రహ్మాదిరూపములగు నగ్నులుగా వివిధమైనట్లు దివాకర రూపమున తత్త్వమొకటే నానాత్వ మందినది. ఇతఁడే వేదములు, యజ్ఞములు సర్వస్వమును. సూర్యునికిగల పేరులలో నే యొక్క పేరును ధాత్వర్థమును, నిగమార్థమును బరిశోధించి సమన్వయించి లెస్సగాఁ దెలిసికొనునో యాతఁడు సర్వ రోగ వర్జితుండై యప్పుడే సర్వపాపవిముక్తుం డగును. నీకుఁ గలిగిన యా భయంకరవ్యాధి సూర్యదేవు ననుగ్రహమునం బటాపంచలగును. సందియమువలదు. నీతండ్రియు, బ్రహ్మయు, శివుఁడును నెట్లో కేతత్త్వమున కర్థములో సూర్యుండు నట్లే.

79. సుమంతు డిట్లనియె: నట్లు నారదుండు సాంబున కెఱింగించుచు వెండియు నిట్లు సూర్యచరిత్రి తెలుపఁదొడంగెను. సూర్యుని భార్య రాజ్ఞియను నామెయే ద్యులోకము. నిక్షుభ యను రెండవ భార్య పృథివీలోకమే. పుష్య శు॥ సప్తమి (సౌమ్యసప్తమి) యందు సూర్యుడు ద్యులోకముతోఁ గూడుకొనును. మాఘ కృష్ణసప్తమి నాడు భూలోకముతో నతఁడు సమావేశమందును. అప్పటికి భూమి ఋతుస్నాతయై యప్పుడు గర్భధారణము చేయును. ద్యులోకము గర్భవతియై వర్షమాసములందు వర్షించును. భూమి త్రిలోకైశ్వర్యమున కనువుగ

గ్స్యములను బండును. సస్యోపయోగమున కానందించి ఆహి తాగ్ను లాహుతులను వేల్తురు. స్వాహాకార స్వధాకారము లచే దేవతలను, పితృదేవతల నర్చింతురు. అన్నము, ఓషధులు సుధ, అమృతము అనువానిచే దేవ మనుష్య పితృసంఘమును గనునది గావున భూమికి 'నిక్షుభ' యనుపేరు గల్గినది. ఇటు మీఁద రాజ్ఞియను ద్వితీయభార్య బ్రహ్మ మరీచి కశ్యపాది పరంపరగా దేవతాసంతతిని గన్నది. వారి సంతానము దేవతావర్గముగా వరుసగా పేరుపేర వర్ణితమయినది. (చూడుడు మూలము) అటనుండి యముఁడు యమున, అశ్వినీదేవతలు శని మొదలగు సూర్యసంతతియొక్క యుత్పత్తి వర్ణితము. (నాతక్కిన పురాణములందుఁ జూడవచ్చును.) సంజ్ఞయను సూర్యభార్య రేవతుఁడను కుమారుం గాంచెను. అతఁడు తండ్రియొక్క ఎని మిదవ గుఱ్ఱమునెక్కి పుట్టగనే పారిపోయెను. అతడాఁ గుఱ్ఱము నెప్పటికిని విడిచిపెట్ట కుండెను. అంతట సర్యుఁడు దండనాయక పింగలుల నా గుఱ్ఱముం గొనిరండని పంపెను. వారు రేవతుఁ డెప్పుడైన గుఱ్ఱము వదలునా? గొనువత్తు మని ఛిద్రమన్వేషిం చుచు నతని వెంబడించిరి. కాని యిప్పటికిని వారి కట్టి యవకా శము దొరకనే లేదు. 'రేవృస్తుచ గతౌ' అని యీ ధాతువు నకు ఎగురుచు పోవువాఁడని యర్థము వచ్చినది గాన 'రేవ తుడు' అని రేవంతుఁడని యీతనికి పేరు సార్థకము. మనువు, యముడు, యమి(యమున) సావర్ణి, శని, తపతి, అశ్వినీదేవతలు రేవంతుఁడు ననువారు సూర్యుని సంతానము. ఈ సంజ్ఞాదేవియే మొదటి భార్య. ఆమెయే రాజ్ఞి. పృథివి, నిక్షుభ, యను పేర

సూర్యుని ద్వితీయ భార్యయే ఛాయ. 'రాజృ-దీప్తౌ, యనుటచే రాజనగా సూర్యుఁడు. సర్వోత్కృష్టుఁడై వెలుఁగు వాఁడన్న మాట. రాజుభార్యకాన రాజ్ఞి యయినది. 'క్షుభసంచలనే' అనుటచే నిశ్చలన యగునది నిక్షుభ. స్వర్గవాసులే భూమివలన నాకలి దప్పులు లేనివారై నిశ్చలులుగాఁ జేయఁబడుచున్నారో ఆ భూమికి 'నిక్షుభ' యను పేరు చెల్లుచున్నది. వారందరు నీ ఛాయను (నీడను) ఆశ్రయించుచున్నారు కాన నీమెకు ఛాయా నామము సార్థకమయి యున్నది. ఎల్లప్పుడు పీడితులయిన జన మును ధర్మముచే రంజింపఁజేయువాఁడుగాన ధర్మరాజు అను నామము యమునియం దన్వర్థమైనది. పరిశుద్ధకర్మముచే పరమ తేజస్వియయి పితృవర్గాధిపత్యమంది లోకపాలుండయి, యిపుడు లోకము నందు మనుచుండుటచే 'మనువు' అను పేరు గలిగి నది. అతని వంశమందే శంఖ చక్ర గదాధరుం డవతరించినాఁడు. యముని చెల్లెలుగాన 'యమి' యను పేర యమున యొప్పి నది. సావర్ణి ప్రజాపతి. అతఁడు కాఁబోవు మనువు. (ఎని మిదవ మనువన్న మాట) అతఁడిప్పుడు నమేరు పృష్ఠమున తపము చేయుచున్నాడు. ఆతని భ్రాత శని యనుపేరు గ్రహభావ మంది యున్నాఁడు. తపతి యను కన్య వింధ్య మూలమందు వెడలునదియై సంవరణుఁడను రాజునకు భార్యయైనది. 'తాపి' యనియు నీమెం బిలుతురు. పశ్చిమ సముద్రగామినియై యున్నది. వైవస్వతియగు నీనది శివకాం తతో (శివగంగతో) సంగమమంది సర్వపాప భయ నివారిణియై యున్నది. అశ్వినీ దేవతలు స్వర్గవైద్యులై యున్నారు. వారి

నాధారముచేసికొని లోకమందలి వైద్యులు జీవింతురు. రేవతుం
డను సూర్యసమప్రభుండగు సూర్యకుమారుండు గుఱ్ఱముల కధి
పతిగాఁ జేయబడినాఁడు. అతనిని బూజించువారు ప్రయాణము
క్షేమముగాఁ జేయగలరు. త్వష్ట మార్తాండుని యాజ్ఞచే
భోజలను గాంచెను. సూర్యదేవునియొక్కయు నతని సంతానము
యొక్కయు చరిత్ర మిది విన్నవారు సర్వపాపముక్తులై సర్వ
సంపద్యుక్తులయి ముక్తులయ్యెదరు 80 అధ్యాయమునుంచి
89 వరకు ఆదిత్యకల్పము అనుపేర నంద, భద్ర, జయ, జయంత,
విజయ, విధివర్ణన మను పేర సప్తమీవ్రత విధానము వర్ణితము.
ఆపైన 'ఆదిత్యవారకల్పము' అనుపేర 93 అధ్యాయము
వర్ణితము.

94 అ. ధనపాలుండను వైశ్యుడు బ్రాహ్మణుల వలన
నితిహాసపురాణములను విని ధన్యుడయ్యెను. సూర్యాలయమున
శ్రవణరూపమైన పుణ్యావిశేషమువలన ననంతఫలము కలుగు
ననియు, కర్ణశ్రాద్ధమని దీనికి పేరనియు, భోజ్యశ్రాద్ధము కంటె
నిది యెక్కువది యనియు నిరూపితమయినది. ఇతిహాస పురాణ
వాచకుని సర్వపూజ్యుఁడని యీ కథ నిరూపించుచున్నది.
నక్షత్రపూజావిధితో మొత్తము 96 నుంచి జయ, జయంతి,
అపరాజిత, మహాజయ, నంద, భద్ర నక్షత్ర సూర్యాలయార్చన
కామ్యోపవాస, కామదా, పాపనాశినీ భాను, [illegible]
సర్వార్థావాప్తి మార్తాండ సప్తమీ, అనంత [illegible], అభ్యంగ
సప్తమి, తృతీయపదప్రతాదులు 114 అధ్యాయముల వరకు
వర్ణితములు, 115 కౌసల్యా గౌతమీ సంవాదమున సూర్య

ప్రీతికరమునగు ఫలపుష్ప భక్ష్య లేపనాదులు వర్ణితములు. 116 అ. సత్రాజిత్తు సూర్యోపాసనచేసి యనుగ్రహము వడ యుట వర్ణితము. సత్రాజిత్తుభార్య విమలవతి, తనభర్తకు గల్గిన యనంతకోటి గుణితమగు నైశ్వర్యమునకు నిమిత్త మేమని యడిగిన నతడు పరావసువను మునిని సేవించిన నతఁడు మున్ను శూద్రుండవై పతివ్రతయగు నీ భార్యతో సూర్యు నారాధించి యిపుడు రాజువైతివని చెప్పెను. అనంత దేవాలయార్చకులు దేవలకు లనంబడుదురనియు, నందు భోజకులను జాతివారు వర్ణముచే బ్రాహ్మణులనియు, నను ష్ఠాన శూన్యులయినచో వారు నరకమందుదురనియు 117 అధ్యాయము తెల్పుచున్నది. నా నిమిత్తముగా దానముచేసిన సొత్తునకే భోజకు లర్హులని సూర్యు డిందు తెల్పినాఁడు. 118 అ. సూర్యదీపదానప్రశంస నుంచి సూర్యుని తీవ్రత కోర్వలేక సంజ్ఞాదేవి తన తండ్రియగు విశ్వకర్మకుఁ జెప్పుకొనగా నతఁడు సూర్యుని యంత్రమున కెక్కించి తరణివట్టెను. ఆకథ యిందు వర్ణితము (చూడుడు 199 అ. మొదలు 123 అ. వరకు.)

**124.** పరమ కారుణికుండగు సూర్యభగవానుండు దేవరక్షా ర్థము దానవులతోఁ బోరుచుండును. సూర్యుని కెడమప్రక్క స్కం దుండు దండనాథుఁడను బిరుదునొంది రక్షణయిచ్చుచుండును. అగ్ని కుడిప్రక్క నంగరక్షకుండయి యుండును. అతఁడు పింగల వర్ణుఁడైయుండుటచేఁ బింగలుఁడను పేరొందెను. అశ్వరూపము నందిన సూర్యునివలన జనించినవాడుగావున నశ్వినీ దేవతలనబడిన యిర్వురు దేవవైద్యులు సూర్యునికి పార్శ్వవర్తులై యుందురు.

కార్తికేయుఁడు హరుఁడు ననువారు సూర్యద్వారపాలకులయి యుందురు. 'రాజృదీప్తౌ' అనే ధాతువు సర్వసేనానాయకుఁడుగా రాజిల్లువాడుగావున కార్తికేయునికి రాజశబ్దమును, 'స్రుగతౌ' అనే ధాతువుచే రహస్యగతి గలవాడుగావున స్రోష్ఠుఁడను పేరొందిన హరుఁడును ద్వారపాలురు. సూర్యుని ప్రథమ ద్వారము ధర్మము, అర్థము నను పురుషార్థముల కాశ్రయము. ఆ రెండుద్వారములందు కార్తికేయుఁడు స్రోష్ఠుఁడు ననువారుందురు. ద్వితీయ ద్వారము ప్రేతాధిపతియు పక్షియు నుందురు. వారికే కల్మాష పక్షులని వాడుక. కల్మాషవర్ణము కలవాడగుట కల్మాషుఁడని ప్రేతపతి పిలువబడుచుండును. 'పక్షి' యనగా రెక్కలుగలవాఁడు. అతడే గరుడుఁడు. గరుడునికి దక్షిణముగా దండహస్తుఁడుండును. సూర్యుని కుత్తరముగా కుత్సిత శరీరియు హస్తిరూపుండునగు వినాయకుఁడు కుబేరనామమున నధిష్ఠించి యుండును. సర్వసత్త్వనాయకుఁడు గాన యతనికి నాయకుడను పేరుగలదు. "వివిధం నయతే" వివిధమును బొందించువాఁడుగాన వినాయకుఁడనంబడును. రైవతుఁడు దిండియను 'వారు' రవికిఁ దూర్పుననుందురు. దిండి రుద్రుఁడనఁబడును. రేవతుఁడు సూర్యునికిఁ దనయుఁడు. ఇతఁడు దుముకుచు నడచును గాన "రేవృప్లవగతౌ" అనే ధాతువుమీద నితని పేరేర్పడినది. "టీజ్గతౌ" అనేధాతువుమీద దిండిశబ్దము నిపతింపఁబడినది. "డయతే" ఎగురువాఁడు గావున "దిండి" యన్యోనియుఁ జెప్పవచ్చును. "దివ్-క్రీడాయాం" అనుధాతువుమీద దివంబున క్రీడించువారు గావున 'దేవతలు' అనబడుదురు. ఋగాదులు

సూర్యునావరించియున్నవి. ఇట్లు బ్రహ్మ తెల్పిన సూర్యమహిమ సవిస్తరముగా విమర్శించికొని ఋషులా చతుర్ముఖు నర్చించి దినంబున కేగిరి.

125. అ. సుమంతుండిట్లనియె. వ్యోమ(ఆకాశము)మును గూర్చి తెల్పెద నిఁక వినుండు. ఈ యెదుట కనిపించు వ్యోమము చతుశ్శృంగము. 'వ్యోమ' అనగా శబ్దము. అది చతుశ్శృంగము† అది సర్వదేవమయము. అది గైరికార్ణవమం దుద్భవించినది. ఆయర్ణవముయొక్క గర్భరూపమే యీ వ్యోమము. వరుణునికి పాశము, వేధకు హుంకారము, విష్ణునకుఁ జక్రము (త్ర్యంబకునికి త్రిశూలము, ఇంద్రునికి వజ్రమువలె రవికి 'వ్యోమ' ఆయుధముఁ (ప్రహరణము అని వర్ణింపబడి) వ్యోమకు 'సూర్యప్రహరణము' అని వాడుక యీ పురాణమునందు గన్పించుచున్నది.) కలియొక్క వ్యోమ మహియట. అనగా కలికి ఆయుధము భూమియని తెలియుచున్నది. సర్వదేశ మయమనంబడిన యీవ్యోమమున యజ్ఞీయులగు దేవతలు ముప్పదిముగ్గురు క్రీడించుచున్నారు. వారే హరుఁడు, వర్షశుద్ధుఁడు, త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, వృషాకపి, శంభువు, కపర్ది, రైవతుఁడు, ఈశ్వరుఁడు, భువనుఁడు. ఏకాదశ రుద్రులు ద్వాదశాదిత్యుల పేర్లు విష్ణుచక్రమున కన్వయించును. అర్యమ, మిత్రుఁడు, భగుఁడు, వరుణుఁడు, వివస్వంతుడు, సవిత, పూష, త్వష్ట, అంశుఁడు, భగుఁడు, అతితేజుఁడు ననువారు ద్వాదశాదిత్యులు. ధ్రువుడు, ధరుఁడు, సోముఁడు, ఆపుడు, అనిలుఁడు,

† 'చత్వారిశృంగా' అనే మంత్రమున కీ గ్రంథము వ్యాఖ్యానము.

నలుడు, ప్రత్యూషుఁడు, ప్రభాతుఁడు నను నెనమండుగు
ష్టవసువులు. నాసత్యుఁడు, దస్రుఁడునను నిద్దరశ్వినులు. క్రతువు
క్షుడు వసువు సత్యుడు కాలుఁడు కాముఁడు ధృతి కురుఁడు
ంకుమాత్రుఁడు వామనుఁడు ననువారు విశ్వేదేవులు పదిమంది.
రు వర్తమాన దేవబృందము. భవిష్యద్దేవబృందము పేర్లుకూడా
ఇక్కడ యివ్వబడినవి. (అవి నా పురాణాంతమున నీవరకే
యివ్వబడినవి) పితృగణముకూడా యిందే చూడుడు. నవగ్రహ
ములు ముల్లోకముల భావాభావనివేదకములు. ఆదిత్యుఁడు
సోముఁడు ననునవి మండల గ్రహములు. రాహువు ఛాయా
గ్రహము. మిగిలినవి తారాగ్రహములు. నక్షత్రాధిపతి
సోముఁడు. గ్రహాధిపతి దివాకరుఁడు. అగ్ని ఆదిత్యుఁడని,
ఉదకము చంద్రుఁడని తెల్పబడినది. ఆదిత్యుఁడు బ్రహ్మయని
చంద్రుఁడు విష్ణువనియుం గలదు. మహేశ్వరుఁడు తృతీయ
తారాగ్రహము. (అనగా కుజుఁడు కావలయును) కశ్యపుని
సుతుఁడు సూర్యుడు. సోముఁడు ధర్మకుమారుఁడు. గురు శుక్రులు
దేవాసుర గురువులు. వీరిద్దరు ప్రజాపతికుమారులు. బుధుఁడు
సోమపుత్రుఁడు. శని సూర్యకుమారుఁడు. సింహికకొడుకు
రాహువు. కేతువు బ్రహ్మకుమారుఁడు. అన్ని గ్రహములకు
నధోభాగమున రవి చరించును. దానికిఁ గొంత దూరమునఁ
జంద్రుఁడు నక్షత్రమండలముం గలవు. నక్షత్రములకు కొంత
పైన కుజ బుధులు, వారిమీద శ్వేతాశ్వుడు, వాని మీద
మహేశ్వరుడు, నటుమీద ధిషణుడు, నతనిపై కృష్ణుఁడు, అటు
మీద చిత్రశిఖండిజుఁడు గలరు. ఇదే త్రిదివము. ఋక్షము

లన్నియు బుధునంత పరిమాణము గలవి. కేతు వనియతుఁడు. అతనిగతి తెలియదు. బహు చంచలుఁడు. బహు రూపధరుఁడు. 'భూః' అనేలోకము పృథివి. భువర్లోకము అంతరిక్షము. స్వర్లోకము త్రిదివము. త్రిదివము ధ్రువునియందాసక్తమయి యున్నది. భూపతి అగ్ని. వాయువు నభస్పతి. సూర్యుడు దివస్పతి. (స్వర్లోకపతి) గంధర్వాప్సరసలు గుహ్యకులు సిద్ధులు రాక్షసులు భూర్లోకవాసులు. అంతరిక్షవాసులు మరుత్తులు. (సప్తవాయుస్కంధములు) రుద్రులు అశ్వినులు. ఆదిత్యులు, వసువులు గోగణములు. నాల్గవదియగు మహర్లోకమున కల్పాయుష్కులు వసింతురు. అక్కడనే ప్రజాపతులుందురు. అయిదవదియగు జనలోకమున భూదాతలుందురు. ఋతువు, సనత్కుమారాదులు వైరాజులు. సత్యమను సప్తమలోకమున నపురావృత్తులుందురు. దీనికే బ్రహ్మలోకమని పేరు. ఇతిహాసవిదు లందుఁ గ్రీడింతురు. పురాణవేత్తలు నట వసింతురు. మొత్తమిదంతయు వ్యోమ మనంబడును. ఇది సర్వవేదమయము, సర్వగ్రహమయమునని స్మరింపబడియున్నది. కావున వ్యోమము నర్చించినవారు సర్వదేవార్చన చేసినవారలే. వ్యోమోపాసన చేసినవారు వృషధ్వజుని లోకమున కేగుదురు. సంశయము లేదు.

126 అ. ఆకాశము, ఖము, దిశలు, వ్యోమము, అంతరిక్షము, నభము, అంబరము, పుష్కరము, గగనము, మేరువు, విపులము, బిలము, ఆపోచ్ఛిద్రము, శూన్యము, తమము, రోదసి యనునవి వ్యోమమునకు పర్యాయపదములు.

లవణ, క్షీర, దధి, ఆజ్య, ఘృత, మధు, ఇక్షు, స్వాదూదకము లనునవి సప్తసముద్రములు. హిమవంతము, హేమకూటము, నిషధము, నీలము, శ్వేతము, శృంగవంతము, ననునవియారును వర్షపర్వతములు. వీనికి పర్వతముల నట్టనడుమ నున్నది మహారాజతపర్వతము. మహేంద్రప్రముఖము లయిన దిక్పాల దేవతల పురము లెనిమిదివైపుల నున్నవి. పృథివియందు లోకాలోక మను పర్వతమున్నది. దానికవ్వల 'చండకపాలము' అను నావరణమున్నది. దానికి మీద నగ్ని, వాయువు, ఆకాశము, దానికి మీద భూతాది, దానికవ్వల మహత్తు, అహంకారము, ప్రకృతి గలవు. దానికవ్వల పురుషుండు గలడు. వానికవ్వల నీశ్వరుఁ డున్నాడు. ఆ యీశ్వరునిచే జగమంతయు నావరింపఁబడియున్నది. ఈ యీశ్వరుఁడే భానుఁడు. అతనిచే నీ జగమంతయు నిండియున్నది. ఈ అండ మున కావరణము గూర్చునవి భూర్లోకము. భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనోలోకము, తపోలోకము, సత్యలోకము ననునవి సప్తలోకములుగలవు. భూమి కధోభాగ మున తలాదిలోకము లేడున్నవి. భూమధ్యమున చతురస్రము, చతుశ్శృంగము నైన మేరువున్నది. దానియెత్తు ఎనుబదినాల్గు వేల యోజనములు. దాని శిఖరమున నొకదానికి సౌమనసము అను పేరు గలదు. అది కాంచనమయము. రెండవది పద్మ రాగము రంగుగలది. జ్యోతిష్కము అని దాని నామము. మూడవది 'చిత్ర' మను పేరు గలది. సర్వదేవమయము. నాల్గవది తెల్లనిది. వెండిది. 'చంద్రాజస్కము' అని దాని

నందురు. మేరువుయొక్క గాంగేయశృంగము(బంగారుశృంగము) సౌమనసము. దానికే ఉదయశృంగ మని ఉదయపర్వత మని పేరు గలదు. అచ్చటనే సూర్యుఁ డుదయించినట్లు కానిపించును. సూర్యుఁడు జంబూద్వీపమున కుత్తరముగా నడచి భూతములకు గోచరించును. బంగారుకొండయొక్కయు, నర్కునియొక్కయు, తేజస్సుచేతను నేర్పడి రెండు సంధ్యలు నరుణవర్ణముతోఁ బ్రకాశించుచుండును. ఉత్తరాయణమున సౌమనసశృంగమందును, దక్షిణాయనమున జ్యోతిశ్శృంగమందును సూర్యుఁ డుదయించును. విషువమున నా రెండింటికి నడుమ నుదయమందును. ఇంద్రాదులు దీని కెనిమిదిదిశలం దున్నారు. నడుమ పద్మజుఁడు, బ్రహ్మ యున్నాఁడు. గ్రహములు, జ్యోతిస్సులు నడుమనే యున్నవి. బ్రహ్మరూపమున నాదిత్యుఁడే నడుమ నున్నవాఁడు. ఈ కారణముచే నీ వ్యోమము, దేవమయమని, లోకమయమని చెప్పఁబడినది. దీనికి పూర్వకోణమం దున్న శిఖరమందు శుక్రుఁడున్నాడు. శని రెండవకోణ మందలి శిఖర మందున్నాడు. మూఁడవదానఁ గుబేరుఁడున్నాడు. నాల్గవ శృంగమందు సోముఁడున్నాఁడు. నడుమ కేశములందు పినాకి హుంకారమున్నది. పూర్వోత్తరముగానున్న చంద్రలోకమున మహాదేవుఁ డున్నాఁడు. పూర్వాగ్నేయ యగు శృంగమున శాండిలుఁ డున్నాడు. అవ్వలిమూల కీనాశుండు గలఁడు. అతడు సూర్యకుమారుఁడు. నైఋతిమూలనున్న శిఖరమందు విరూపాక్షుఁడున్నాఁడు. అతని కవ్వలిమూల యాదఃపతి (వరుణుఁడు) గలఁడు. అవ్వలిదెస మిత్రుఁడున్నాడు. (వాయవ్య

మూల నన్నమాట) అవ్వలిదెస నరవాహనుఁడగు దశబలుఁ డున్నాఁడు. మధ్యమందు బ్రహ్మయున్నాఁడు. క్రిందుగా వసంతుఁడున్నాఁడు. ఉపేంద్రశంకరులు బ్రహ్మకు మీఁదుఁగానున్నారు. ఇదే మేరువు. ఇదే వ్యోమము. ధర్మమనియు దీనికిఁ బేరు. ఇది సర్వదేవమయము. సర్వవేదమయము. మేరుశృంగములు నాల్గును నాల్గు వేదములే.

127. సాంబుఁడు సూర్యసాక్షాత్కార మంది రోగ విముక్తినందెను. 128 అ. సూర్యభగవానుఁ డాతనికి సూర్య సహస్రనామముల కంటె మించిన యిరువదియొక్క నామముల నుపదేశించెను.

"వికర్తనో వివస్వాంశ్చ మార్తాండో భాస్కరో రవిః
లోకప్రకాశకః శ్రీమాన్ లోక చక్షు ర్గ్రహేశ్వరః
లోకసాక్షీ త్రిలోకేశః కర్తా హర్తా తమిస్రహా
తపన స్తాపన శ్చైవ శుచి స్సప్తాశ్వవాహనః
గభస్తిహస్తో బ్రహ్మా చ సర్వదేవనమస్కృతః
ఏకవింశతి రిత్యేష స్తవ ఇష్టస్సదా మమ
శరీరారోగ్యద శ్చైవ ధనవృద్ధి యశస్కరః
స్తవరాజ ఇతి ఖ్యాతస్త్రిషులోకేషు విశ్రుతః."

ఇది సంధ్యాకాలములందుఁ బఠించినవారు సర్వపాప విముక్తులగుదురు. ఇది హోమాదులందన్నిట నుపయోగించవచ్చును. సాంబుఁ డిదివిని పారాయణ మొనర్చి యారోగ్యవంతుఁ డయ్యెను. సాంబుఁడు చంద్రభాగానదియందు స్నానము చేయుచుం

డగా నొక యద్భుతమయిన ప్రతిమ లభించెను. అది సూర్య భగవానుని రూపము. సూర్యుఁడే స్వయముగా దానిని నిర్మించి సాంబున కనుగ్రహించెను. విశ్వకర్మ కల్పవృక్షమునుండి తయారు చేసిన యంత్రమునందు సూర్యుని తరణిపట్టినాఁడు. ఆసౌమ్యమూర్తియే సాంబునికిఁ జంద్రభాగానదియందు లభించెను. సాంబుఁడు సూర్యప్రతిష్ఠచేసెను. 130 అధ్యాయమున సూర్యప్రతిష్ఠాకల్పము. శిల్పవిషయము వర్ణితము. 131 అధ్యాయము మొదలు నారదోక్త ప్రతిమా లక్షణాదికముకలదు. ప్రతిష్ఠావిషయమైన జ్యోతిశ్శాస్త్రము 132 అధ్యాయమునందు గలదు. 153 అధ్యాయముదాకా సూర్యార్చనాద్యనేక విషయములు వర్ణితములు. త్రిమూర్తులు నహంకారదర్పంబునఁ దామే సృష్టికాధారభూతులమనుకొని యొండొరులుం గలియఁ బలుకుకొనియుండగా జగమ్ముల గాఢాంధకార మావరించెను. వారి గర్వముహరించుటకు శతయోజన విస్తీర్ణమగు నొక గోళముదయించి యందొక పద్మకర్ణికయందు వెలుంగొందు తేజముచే నీజగమంతయు సుప్రకాశము నొందెను. ఆ తేజము మీఁదు తెలియవలెనని బ్రహ్మ మీఁదికిని శివుడు క్రిందికిని నడ్డముగా విష్ణువును నేగిరి. కాని వారికి దాని యంతు పట్టదయ్యెను. అంత నా త్రిమూర్తుల పెక్కురీతుల స్తుతించిరి. వారి భక్తిభావము గ్రహించి సహస్రకరుండు స్వరూప సాక్షాత్కారము వారి కనుగ్రహించెను. ఆరూప మెట్లుండె ననగా "కృత్తికలచే సంస్పృశింపఁబడక, వానికి దుర్జయమునై, హస్త రహితమై, సప్తర్షి విరహితమై, వర్షాబ్దాదులు లేనిదై, సప్తస్వర

వర్జితమై సకలము నిష్కలముఁ గూడనై యేకరూపమై యనేక శిరస్సులు పాదములు గలదియై అనేక బాహూదరము ననేక కిరీటాది భూషణ భూషితమై సహస్రనయనాభిరామమై యుండెను. త్రిమూర్తులు వేర్వేర నా సహస్రకరుని సర్వలోక శుభకరుని వినుతించిరి. సూర్యదేవుండు ప్రసన్నుండై జగద్రక్షణ నిమిత్తమయిన తన యవతార విశేషము వారికిఁ దెలిపి తనను వినుతించువారును నమస్కరించువారును సర్వరోగములు బాసి సర్వవిధసంపద లందుదు రని యనుగ్రహించెను.

154. మరియు నా సూర్యభగవానుం డిట్లు తెలిపెను. నేను నాలుగుమూర్తులతో లోకమును వ్యాపించియున్నాను. నా సాత్విక రాజస తామస మూర్తులు విష్ణువు, బ్రహ్మయు రుద్రుండు నని పేరొందిరి. నాల్గవమూర్తి నిర్గుణము. అంత టను నిండియున్నను నింద్రియముల కది యందదు. అది నిష్కలయు, సకలయు, సురూపయు, రూపవర్జితయు, లోకములం దంతర్యామిగానున్న నది యొందు నంటదు. ఆరింటెనంటక యేడింటెని దాటియున్నది. (ఆరనగా షడ్భావ వికారములన్నమాట.) అది వ్యోమరూపము. భూపదమున కది దుద్దువలె నున్నది. అది సర్వలోక ప్రకాశకమై జ్వాలామాలా వృతమయి రాణించుచున్నది. గగనోపమమయిన యీ నాల్గవ మూర్తిని మీ రుపాసింపుఁడు. ఆ వ్యోమమందు సర్వభూత ములు కల్పాంతమున లీనమగును. దానికి దక్షిణమున బ్రహ్మ యు, వామభాగమున జనార్దనుఁడు, శివుఁడు శిరమునను లీను లగుదురు. దాని హృదయమున గాయత్రి లయ మొందును. పద

క్రియయుక్తమును షడంగమునగు వేదము మూర్ధమున లయిం చును. స్థావరజంగమాత్మకప్రపంచ మంతయు జఠరమున లీన మగును. తిరిగి యివన్నియుం బుట్టుచుండును. ఆకాశమును వ్యోమమందురు. పృథివి నిక్షుభ యనంబడును. నే నాకాశ స్వరూపుఁడను. నాకుఁ బ్రియురాలు పృథివి. నేనును నిక్షుభ యుం గలిసి సచరాచరమగు జగమ్ము లయితిమి. కావున నా వ్యోమరూపమయిన మూర్తిని మీ రారాధింపుఁడు. శివుఁడు గంధమాదనమం దుండి నామూర్తి నుపాసించి సిద్ధి వడయుం గాక. విష్ణువు కలాపగ్రామమం దుండి యారాధించుగాక! బ్రహ్మ పుష్కరమనఁబడు నా వ్యోమమూర్తి నుపాసించును గాక! 155 అ. ఈ చెప్పినరీతి నతనిం బూజించి మువ్వురు మూర్తులు నుపాసించి జగత్సృష్టి స్థితిలయవిధానము వరముగా బడసిరి. (156 నుంచి 181 వరకు సూర్యవ్రత విధులు వర్ణిత ములు. 181 నుంచి ఆశ్రమధర్మవివరణము. 193 నుంచి మరల సూర్యవ్రత విశేషములు, స్తోత్రములు, ఫలములు సమగ్ర ముగా వర్ణితములు. 215 అధ్యాయము వరకు)

— ఇది బ్రాహ్మపర్వము —

# మధ్యమపర్వము.

## ప్రథమభాగము

1-5 అ. బ్రహ్మాండోత్పత్తి : లోకపరిమాణములు. (నా యితరపురాణములందుఁ జూడవచ్చును.)

### 6 అ. బ్రాహ్మణ గుణప్రశంస.

వర్ణములు మూఁడింటికి జన్మముచే బ్రాహ్మణుఁడు ప్రభువు. బ్రహ్మ తపస్సుచేసి బ్రాహ్మణజాతిని సృష్టించెను. పితృదేవతలు కవ్యములను, దేవతలు హవ్యములను, బ్రాహ్మణ ముఖమున భుజించుచుందురు. జన్మమాత్రముచే బ్రాహ్మణుఁడు సర్వవిధములగు నర్చనలు పొంద నర్హుఁడు. బ్రాహ్మణుఁడు సర్వమును స్వీయముగా ననుభవించును. ఆ యనుభవసారమును మిగిలిన త్రైవర్ణికులకుఁ బంచిపెట్టును. సంతుష్టుఁడైన బ్రాహ్మణుఁడు లోకమును నిలుపగలఁడు. అసంతుష్టుఁడై క్రుద్ధుఁడైనచో లోకములను నశింపజేయఁగలఁడు. అందుచే విప్రునెల్ల మెడలఁ బూజింపవలయును. గర్భాధానాదిసంస్కారము లిఱువదినాల్గింటిచేత శాస్త్రవిధిచేఁ బరిపూతుండైన బ్రాహ్మణుఁడు బ్రహ్మస్థానమును బడయును. సంస్కారపూతుఁడు మొదటివాఁడు. వేదపూతుఁడు రెండవవాఁడు. విద్యాపూతుఁడు మూఁడవవాఁడు. తీర్థపూతుఁడు నాల్గవవాఁడు, క్షేత్రపూతుఁ

డును గలఁడు. వీరి విచక్షణ తెలిసి పూజింపవలయును. అట్టి వారు స్వర్గాపవర్గఫలమందుదురు. లేనిచో వట్టిశ్రమకుఁ బాత్రులయ్యెదరు. ఈ చెప్పిన పూతులందరిలోఁ బరమపూతుఁడు గురువు. గురులకెల్ల గురుండైనవాఁడు పరమసత్త్వమూర్తి. అతఁడు బ్రహ్మచే నిర్మితుఁడై యుండును. ద్విజపూజచేసినవార లక్షయ స్వర్గసుఖమందుదురు. అట్టిద్విజుఁ డే రా జేలు దేశమందుండునో యారాజు దేవభావము నందఁగలఁడు. ఎవనియెడల బ్రాహ్మణులు ప్రసన్నులయ్యెదరో వానియెడ విష్ణువు ప్రసన్నుండగును. విప్రపూజచే విష్ణువు సంతుష్టిఁజెందును. విష్ణుముఖమునుండి విప్రు లుదయించిరి. సృష్టికి సంహారమునకుఁ గారణములయిన వేదములును నక్కడనే యుదయించినవి. పరమాత్మ విప్రముఖమునందే వేదముల నుంచుట కిదియే కారణము. సర్వజ్ఞానార్థలాభమునకు వేదముఖులగు విప్రుల నిందుచేతనే పూజింపనగును. పితృయజ్ఞవివాహములందు, వహ్నికార్యములందు, శాంతిపౌష్టికక్రియలందు సర్వమంగళాచారములందును బ్రాహ్మణులు పూజింపఁబడ వలసినవారు. విప్రుని ముఖముననె ప్రేతాదులగు నసురులు బలిని గ్రహింతురు. పితృదేవతలు హవ్యకవ్యముల నందికొందురు. బ్రాహ్మణుఁడు లేకుండ యిచ్చిన హవ్యకవ్యాదులు, దానములు, హోమములు, బలులు, నిష్ఫలములు. విప్రుఁడు లేకుండ చేసిన కర్మము నసురులు భూతప్రేతపిశాచాదులు భుజింతురు. దేశకాలపాత్ర

లెటెంగి విప్రులఁ బూజింపవలయును. బ్రాహ్మణునికి శ్రద్ధతో నమస్కరించినవారి కాయువు వృద్ధి పొందును. అట్లు మ్రొక్కనివారి కాయుర్దాయనాశనము, భూనాశనము దుర్గతి కలుగును. విప్రపాదోదక కర్దమములును, వేదశాస్త్ర ప్రతిగర్జితములును, స్వాహా స్వధాస్వస్తి భరితంబులు గాని గృహంబులు శ్మశాన తుల్యంబులు. నరకభీరువు లయినవారు షడ్వింశతి దోషములు (26 విధములయిన పాపములు) విడిచి తీర్థమందు గాని, గ్రామమునందుగాని, పత్తనమునగాని, వనమునందుగాని నివసింపవలయును. అట్టివారు స్వర్గమునందు, పితృలోకమునందు బ్రహ్మ లోకమునందును వసింపఁగలరు. రుష్టుడు, దుష్టుడు, పుష్టకుఁడు, అధముఁడు, విషముఁడు, పశువు, పిశునుఁడు, పాపిష్టుఁడు, నష్టుఁడు, కష్టుఁడు, హృష్టుఁడు, కుంఠుఁడు, అంధుఁడు, కాణుఁడు, చండుఁడు, ఖండుఁడు, వక్త, ఇచ్చినది మరల హరించినవాఁడు, నీచుఁడు; ఖలుఁడు, దొంగ, వాచాలుఁడు, కదర్యుఁడు, చపలుఁడు, మలీమసుఁడు అనువా రిరువదియారు విధములయిన దోషములు కలవారు. వీరందరు మరల యెనుబదియైదు రకము లగుదురు. అదెట్లనిన వీరిలో నధముఁడు మూఁడు రకములుగా నుండును. విషముఁడు రెండు, పశువు నాలుఁగు, కృపణుఁడు రెండు, పాపిష్టుఁడు రెండు, నష్టుఁ డేడు, కష్టుఁ డైదు రుష్టుఁడు రెండు, దుష్టుఁడాఱు, పుష్టుఁడు రెండు, హృష్టుఁ డెనిమిది, కుంఠుఁడు మూఁడు, అంధుఁడు రెండు, కాణుఁడు రెండు, చండుఁడు రెండు, చపలుఁడొక్కటి, చండుఁడు, ఖండుఁడు

రెండు, దండషండులు రెండు, ఖలుఁడు నాలుగు, నీచుఁడు రెండు, వాచాలుఁడు మూఁడు, కదర్యుఁడు మూఁడు, మలీమ సుఁడు మూఁడు, చతురుఁడు రెండు, దొంగ యొకటియు నని యిట్లు పలురకములయి యుందురు. వీరి లక్షణములు వేర్వేర తెలిపెద వినుండు. ఈ పరిజ్ఞానము గల నరుఁడు దేవ భావమును బొందును. పాదుకలు, గొడుగు ధరించి గురువుల సన్నిధిని, దేవతల సన్నిధిని జరించుట, గురునికంటె నెత్తుగా గూరుచుండుట, వాహనమెక్కి తీర్థయాత్రలు చేయుట యను నవి యొకరకమైన యధముని లక్షణములు. తీర్థస్నానము చేయు నపుడు మూత్రపురీషోత్సర్జనము చేయుట రెండవరకమైన యధ ముని లక్షణము. శాస్త్రీయము ఋషిసమ్మతము నైన యోగా భ్యాసము విడుచుట మూడవ యధముని పని. మాట మధు రము మనసు హాలాహలము నగుట యొక విషముని లక్షణము. చెప్పునది యొకటి చేయునది యొకటి యగుట రెండవ విష ముని గుణము. మోక్షచింత సేయక హరిసేవవిడిచినవాఁడు పశువు. ప్రయాగ యుండగా మరియొకచో స్నానము చేయుట, యెదుట నున్న దేవుని విడిచి యెక్కడనో యున్న దేవు నారాధించుట పశుత్వము. బహుశాస్త్రగ్రంథములలోని సారము గ్రహింప కుండుట జంబుకపశుత్వము. బలము, మోసము, మాయ అను వానిచే ధనమును బిగించుట పిశాచత్వము; ప్రణయముచే చేసిన బిగువు రెండవరకము. మధురాన్నమును గాక చేదుతో గూడిన యన్నమును దేవ పితృ కార్యములయం దుపయోగించిన వాఁడు కృపణుఁడు. సంతోషము లేక క్రోధియయి యక్షించిన

వాఁడు పూజించినవాఁడు రెండవరకపు కృపణుఁడు. దోషము లేమియు లేకుండనే శుభాచారములు చేయుట మానినవాఁడు శుభజన్మము నొందియు కూడని వస్తు విక్రయము చేయువాఁడు, పితృమాతృ గురు త్యాగి, శౌచాచారములు లేనివాఁడు, తల్లిదండ్రులను విడిచిపెట్టి ముందు భుజించినవాఁడు పాపిష్ఠుఁడు. తండ్రి జీవించియుండగా వానిని విడిచినవాఁడు రెండవ పాపిష్టుఁడు. హోమములు మానినవాఁడు మూఁడవరకము. సాధు సమాచారము విడిచి దాస్యవృత్తి కొడఁబడినవాడు నష్టుఁడు. పడుపువృత్తి (వెలయాలితనము) దేవల వృత్తి (తెలుకలవృత్తి) భార్యనమ్మి జీవించుట కన్యాశుల్కము స్త్రీధనముచే జీవించుటయు పలురకములయిన నష్టుల లక్షణములు. దీనులను జూచి యెవని మనస్సు కోపితమగునో వాఁడు నొకరకము. అకార్యాచరణమందే నిమగ్నుఁడయి ధర్మార్థములను విడచువాఁడు, నిద్రా స్వభావుఁడు, వ్యసనపరుఁడు, మద్యపానము చేయువాఁడు, స్త్రీరతుఁడు, దుష్టులతో నెల్లపుడు సంభాషించువాఁడు నని యేడురకములయిన దుష్టు లుందురు. ఒంటరిగా మధురాన్నములను దినువాఁడు, వంచకుఁడు, సాధునింద చేయువాఁడు నయి పందివలె నూరినవాఁడు పుష్టుఁ డనంబడును. ఏ విప్రుఁడు నిగమాగమ మంత్రముల నితరులచేఁ జదివింపఁడో, వినఁడో వాఁడు దుష్టుఁడు. శ్రుతి, స్మృతి యనునవి రెండు కన్నులు. ఈ రెండింటిలో నొక కన్ను లేని బ్రాహ్మణుఁడు కాణుఁడు. రెండును లేనివాఁ డంధుఁడు. సోదరులతో వివాద పడువాఁడు, తల్లిదండ్రుల కప్రియము సేయువాఁడు నయినద్విజుఁడు చండుఁడు,

రాజసేవాపరుఁడు శూద్రునిసేవించువాఁడు నౌకరకమయిన పిశునుఁడు. శూద్రాంగనా సంగమము చేయువాఁడు చండుఁడు. శూద్రగృహమున వండిన యన్న మొకమారేసి తిన్నవాఁడు, అయిదురోజులు శూద్రునింట నివసించినవాడు చండుఁడు. ఎనిమిదిరకముల కుష్ఠు, మూఁడురకములయిన కుష్ఠుకలవాఁడు, వీరితో నెల్లప్పుడు మాటలాడువాఁడు త్రికుష్ఠి యనంబడును. పురుగు జీవించినట్లు, ఏదిలభించిన నది తిని జీవించువాఁడు, అట్టి నీచమైన వ్యాపారము చేయు వాఁడు, కుపండితుఁడు, తెలియక యే ధర్మముఁజెప్పువాఁడు, అవిముక్తక్షేత్రమును (కాశీని) విడిచి మరియొకచోటికిఁ బోవువాఁడును, శూకరపశువుగా నిరురకముల నెన్నఁబడును. కనుబొమలు ముడివడ రాజువలె నితరుల దండించువాఁడు దండుఁడు. బ్రాహ్మణధనము, రాజధనము, దేవధనము హరించి దానితో నితర దేవ 'బ్రాహ్మణుల' కు సంతర్పణము చేయువాఁడును, దినువాఁడును గాడిద. వట్టి యక్షరములను వల్లించి, వేదము లందలి పదము గాని, పదశాస్త్రమును (వ్యాకరణమును) గాని పఠింపక యర్థ మెరుంగక యుండువాఁడును బశువే. గురు దేవతా సన్నిధిని జెప్పునదియొకటియు చేయునది యొకటియునైనవాఁడు నీచుఁడు. పుష్పఫల సమృద్ధమైన వనమునందు ముండ్లనే వెదకు మిడుతవలె నెవ్వఁడు షడ్గుణ సంపన్నుడయిన సాధువునందు దోషములనే వెదకునో వాఁడు ఖలుఁడు. దైవదృష్టిలేక యాడరాని మాటలాఁడుచు సిగ్గులేనివాఁడు వాచాలుఁడు. చండాలురతో సంభాషణము, పక్షులను బెంచుటయందు ఆసక్తిగల్గి యుండుట,

పిల్లితోఁగూడ భోజనము చేయుట, గడ్డిపోచలు త్రెంచుట, మన్ను మర్దించుట, వృథామాంసాశనము చేయుట, పరభార్యారతియు గలవాఁడు చపలుఁడు. అభ్యంజనము లేనివాఁడు, చందనాదిసుగంధద్రవ్యసేవ చేయనివాఁడు, నిత్య కర్మత్యాగము చేసినవాఁడు, నిత్యము మలినుఁడైనవాఁడు, అన్యాయార్జితములయిన గృహారామాదులు గలవాఁడు, ఇతరుల ఇండ్లను, మంత్రములను హరించువాడు, బ్రహ్మఘాతకుఁడు. దేవపుస్తకరత్నాదులు, మణిముక్తాదులు, గుఱ్ఱములు గోభూమిసువర్ణములు దొంగిలించినవాఁడు స్తేయి (దొంగ). దేవమనుష్యులన్యోన్యభావన చేయవలసినవారు. అనగా యజ్ఞాదుల ద్వారా దేవతారాధన చేయగా వారు యజ్ఞకర్తలయిన వారిని భావించి శుభము లిత్తురు. అట్లు భావింపక స్వలాభాపరుఁడై తనకై తానుడికించుకొని తిన్నవాఁడును స్తేయి (దొంగ). గురుపితృప్రసాద ముత్తమ లోకముల నిచ్చును. గురువులను, దలిదండ్రులను బోషింపనివాఁడును దొంగయే. ఉపకారులను గౌరవించనివాఁడు తప్తనరక మందును. రక్తనదిలోఁ బడును. సర్వవర్ణములకు ధర్మప్రభువు బ్రాహ్మణుఁడు. పృథివీపాలకుఁడైన రాజు ధర్మచక్షువు. బ్రహ్మచెప్పిన హోరాతంత్రము తెలిసిన బ్రాహ్మణుఁడు గణకుఁడుత్తముఁడు. గంగలేని దేశము, విప్రుఁడు లేని క్రియాకలాపము, హోరాశాస్త్ర మెఱింగినవాఁడు (జ్యోతిషికుఁడు) లేని దేశము విప్లవప్లవము. అనగా సర్వవిధ విప్లవములతో మునిగి తేలుచుండునని భావము. దీపములేని రాత్రివలె సూర్యుఁడులేని యాకాశమువలె సాంవత్సరుఁడు (జ్యోతిష

ము తెలిసినవాఁడు) లేని రాజు గాఢాంధకారమున నున్న ట్లుండును. విప్రుడు శ్మశ్రువులు గలవాఁడే పూజనీయుఁడు (అనగా గడ్డము పెరిగిన వాఁడు). సూర్యుఁడు నట్టివాఁడుగానే పూజనీయుఁడు. వ్రాత్యుఁడగు విప్రుని జూచి వెంటనే సూర్యదర్శనము చేసినచో నాపాపము పోవును. ద్విజులలో భోజకుఁడు, కథకుఁడు, శివవిప్రుఁడు, సూర్య విప్రుఁడు నని పలు తెరంగు లయిన వారుందురు. కథకుఁడు మధ్యముఁడు. సూర్యవిప్రుఁ డుత్తముఁడు. శివలింగార్చనపరుండయిన శివవిప్రుఁడు నిందితుఁడు. దేశచక్రము హోరాచక్రము తెలిసినవారిని రాజు మిక్కిలి పూజింప వలెను.

6 అ. చతుర్వర్ణముల వారికిఁ దండ్రికంటె బంధువు, పూజనీయుఁడు మఱియొకఁడు లేఁడు. గురువులు ముగ్గురు. అందులోఁ దల్లి పరమగురువు. సోదరులలోఁ బూర్వపూర్వులు గురువులు. ద్వాదశి, అమావాస్య, రవిసంక్రమణము, అయనములు, విషువము, చంద్రసూర్య గ్రహణములు వస్త్రభోజనాదులు దక్షిణ లొసంగి గురుపితరుల బూజింప వలయును:—

తండ్రికి నమస్కారము.

"స్వర్గాపవర్గప్రద మేకమాంద్యం<br>
బ్రహ్మస్వరూపం పితరం నమామి<br>
యతో జగత్పశ్యతి చారురూపం<br>
తం తర్పయామ స్సలిలై స్తిలైర్యుతైః"

పితరో జనయంతీహ పితరః పాలయంతిచ
పితరో బ్రహ్మరూపాహి తేభ్యో నిత్యం నమోనమః.
యస్మా ద్విజయతే లోక స్తస్మా ద్ధర్మః ప్రవర్తతే
నమ స్తుభ్యం పిత స్తాతాద్బ్రహ్మరూప నమోస్తుతే.

స్వర్గమును మోక్షమును దయచేయుచు, నాద్యమును నేకమును నైన బ్రహ్మముయొక్క స్వరూపమై, సర్వాంగసుందరమయిన యీ జగత్తును జూచుటకుఁ జాలిన చూపునిచ్చిన తండ్రికిఁ దిలోదకములచే తర్పణము చేసెదను. తండ్రులు జన్మింపఁజేయుదురు. పాలింతురు. కావున వారే బ్రహ్మరూపులుగాన వారికి నమస్కారము. లోకవిజయము చేయుటకుఁ దండ్రి కారణము. ధర్మప్రవర్తన కతఁడు కారణము. కావున నట్టి బ్రహ్మరూపుడగు తండ్రికి వందనము,

—♦ త ల్లి కి న మ స్కా ర ము ♦—

యా కుక్షివివరే కృత్వాస్వయం రక్షతి సర్వతః
నమామి జననీం దేవీం పరాం ప్రకృతిరూపిణీం
కృచ్ఛ్రేణ మహతా దేవ్యా ధారితోఽహం యథోదరే
త్వత్ప్రసాదా జ్జగద్దృష్టం మాతర్నిత్యం నమోస్తుతే.
పృథివ్యా యాని తీర్థాని సాగరాదీని సర్వతః
వసంతి యత్ర తాం నౌమి మాతరం భూతిహేతవే.

ఏ తల్లి కడుపున నన్ను భరించి, రక్షించినదో యా తల్లికిఁ, బ్రకృతిరూపిణియైన యమ్మకు నమస్కరింతును. మిగుల శ్రమల కోర్చి నన్ను గర్భమున మోసినదానవు నీవు. నీ యనుగ్రహ

ముచే నేను గండ్లుఁదెఱచి లోకమున జూడగంటెని. అమ్మా! నీకు నిత్యము నమస్కారము. భూమండలమున నెన్ని తీర్థము లున్నవో, యెన్ని సాగరము లున్నవో యన్నియు నే తల్లియం దున్నవో యట్టియమ్మకు నీ కైశ్వర్యకాముఁడనై నమస్కరించు చున్నాను.

—◆ బ్రాహ్మ ణ గు రు వం ద న ము ◆—

గురుదేవ ప్రసాదేన లబ్ధా విద్యా యశస్కరీ
శివరూప! నమస్తస్మై సంసారార్ణవ సేతవే
వేదవేదాంగ శాస్త్రాణాం తత్వం యత్ర ప్రతిష్ఠితం
ఆధార స్సర్వభూతానా మగ్రజన్మ! నమోస్తుతే
బ్రాహ్మణో జగతాం తీర్థం పావనం పరమం యతః
భూదేవ హరమే పాపం విష్ణురూప! నమోఽస్తుతే ॥

గురుదేవుని దయచే యశస్కరియగు విద్య లభించినది. సంసార సముద్రతారణమునకు సేతువగు శివరూపునకు గురునకు నమస్కారము. వేదములు, వేదాంగములు, శాస్త్రములు మొదలగువాని తత్వమెందు బ్రతిష్ఠతమైయుండునో, సర్వ భూతాధార మెవ్వఁడో, లోకములకెల్ల తీర్థభూతుఁడు, పరమపావనుఁడునైన భూదేవుఁడు విష్ణురూపుఁడు గావున నట్టి నీకు నమస్కారము.

పితామహుని, తల్లిని, మాతామహుని, ఆచార్యుని, ఋత్విజుని, అన్నను, పెద్దతండ్రిని నమస్కరింపవలెను. గురువులు దృష్టులు (కనబడువారు) అదృష్టులు (కనబడనివారు) దృష్టాదృష్టులు (కనపడీ కనపడనివారు) అని మూడు తెఱంగులుగా

నున్నారు. తల్లిదండ్రులు దృష్టగురువులు. దృష్టాదృష్టులు సూర్యుడు, చంద్రుడు, అగ్ని యనువారు. మంత్రదాత గురువు. ప్రత్యక్షదృష్టులగు గురువులను వదలి యదృష్టగురువులను సేవించువాడు పాపి. పశుపక్ష్యాది జన్మములెత్తును. తండ్రి, పెదతండ్రి, పినతండ్రివలెనే జ్యేష్ఠభ్రాత పితృసమానుడు. గౌరవార్హుడు. సత్కరింపవలసినవాడు. ఆచార్యుడు బ్రహ్మమూర్తి. తండ్రి ప్రజాపతిమూర్తి. తల్లి భూమూర్తి. భ్రాత లాత్మమూర్తులు. తండ్రి మేరువు. ధర్మమూర్తి. అతడు ప్రత్యక్ష దైవతముకాన నతని వాక్యము పాలింపవలెను. పితామహులను హవ్యకవ్యాదులచే దృప్తిపరచుటకంటె మించినదిలేదు. పితామహపాదోదకస్నానము గంగాస్నానముకంటె గొప్పది. పితామహసందర్శనము జ్యోతిర్లింగదర్శనము కంటె మిన్నయైనది. ముప్పది కుండములందలి శిలాసంస్పర్శమువలన కలిగెడు ఫలముకంటె కోటిగుణితమైన పుణ్యము పితామహప్రదక్షిణముచే గల్గును. నూర్గురు తల్లులఁ బోషించుటవంటిది యొక్క పితామహిని బోషించుట. ఆమె దర్శనము నటువంటిదే. అట్టివానికి సంసారముండదు

## —♦ ఇతిహాస పురాణముల మహిమ ♦—

(7 అ.) సూతుం డిట్లనియె:—ఓ ద్విజోత్తములారా! ఇతిహాసపురాణములు వినుటవలన సర్వపాప విముక్తి కలుగును. బ్రహ్మహత్యాపాతకములు నూరయినను బోవును. సాయంప్రాతస్సమయములు రాత్రి శుచియై వినవలయును. అట్టివానియెడ విష్ణువు, బ్రహ్మ, శంకరుండును సంతుష్టులయి

ప్రసన్ను లయ్యెదరు. ప్రాతఃకాలమున బ్రహ్మయు, సాయం కాలము హరి, రాత్రి మహాదేవుఁడును నితిహాస పురాణ పఠన శ్రవణములవలన ననుగ్రహము నొందుదురు. పురాణవక్తయగు గురునికి నమస్కరించి, శుభ్రవస్త్రధారియయిన శ్రోత చేలా జినకుశోత్తరముగా నెక్కువ యెత్తును నెక్కువ వల్లముగాని యాసనమునం దాసీనుఁడయి వినవలయును. దిక్పతులకు, ఓంకారాధిష్ఠానులయిన దేవతలకు, ధర్మశాస్త్ర గ్రంథమునకు నమస్కరించి పురాణాదులు పఠింపవలయును. వినవలయును. ఆగమములకు శివుఁడు, తంత్రాదులకు శారద, (యా) జామలములకు గణపతి, డామరములకు నిందుర్రిందు, భారతమునకు నారాయణుఁడు, రామాయణమునకు వాసుదేవుఁడు నధిదేవత లయియున్నారు. సప్తపర్వములకు వరుసగా ఆదిత్యుఁడు, వాసుదేవుఁడు, మాధవుఁడు, రామ కేశవులు, వనమాలి, మహాదేవుఁడు ననువా రధిష్ఠాన దేవతలు. విష్ణుధర్మాదికములకు శివుఁడు, ఆదిపురాణమునకు విరించి (బ్రహ్మ) దేవతలు. శుద్ధమైన యన్నము, యవక్షీరము, పాయసము, పులగము బలి పెట్టవలెను. బలి యివ్వదగిన పదార్థములకు 'బలిగణము' అని పేరు. వరియన్నము, గోధుమయన్నము, తిలలు అక్షతలు కలిసినది, గవ్యము, పండ్లు ననునవి వీరికి బలిగా నర్పింప వలయును. ఇవి వేరువేరు కంచుగిన్నెలలోఁ బెట్టి నలుదిక్కులనుంచి మీఁదటఁ బురాణపఠనము చేయవలెను. ఈలా చేసి చదివిన యీ పురాణ పఠన రూపమయిన యాగము 'షణ్మయము' అనఁబడును. చల్లనినీరు, తేనె, పాలు, పంచదార చెఱకురసము

బెల్లము ననునవి షణ్ముయ దేవతలకు బలిద్రివ్యములు. వరిబియ్య ము కుంచెడుగాని అడ్డెడుగాని క్షీరముగలిపి వండిన నది యవ క్షీర మనఁబడును. ఎనిమిది భా గ ము లు పాలు, పదు భాగాలు 'సితము' అనే పేరుగల హైమంతికము (ఒకానొక పంచదార యేమో) కలిపి బియ్యము కలిపి పరమాన్నము వండవలయును. దీనికి 'చరువు' అని పేరు. ఎనుబది పలాల చరువులో నాలుగు పలాల తేనెకాని పంచదారగాని కలుప వలెను. బెల్లము కలిపినదైన నిది చేయవలెను. లేదా తేనెచే సంపృక్తము కావచ్చును. ఈ గ్రంథములను వినువారు గాని చదువువారుగాని నిలుఁవబడి యందుకొన వలెను. నమస్కరింప వలెను. వినిపించునతఁడు తూర్పుగాఁ గూరుచుండి పశ్చిమాభి ముఖుఁడై తర్జని బొటనవ్రేలిని గూర్చి లేదా ప్రస్తర రూపమైన హస్తముతో పురాణ ప్రవచనము సేయవలెను. వేదాంతాగమ విధానమంతయు నట నిలచి పావమానీసూక్తము జపించి, విన వలయును. దక్షిణాభిముఖుఁడై వినువాఁడును ఉత్తరాభిముఖుఁడై వాచకుఁడును పురాణములు, భారతము మొదలయిన గ్రంథ ములు వినవలయును. రామాయణము, ధర్మశాస్త్రము, హరి వంశము మొదలయిన గ్రంథముల కిదే పద్ధతి. ఇంతకు విపరీత ముగా విన్నవారు ఫలము నందఁ జాలరు. ఈ పుణ్యగ్రంథములు వినుచు మాంసము తిన్నవాఁడు గార్దభమై పుట్టును. స్త్రీ సం గముకూడ పనికిరాదు. దేవాలయములందుఁ . దీర్థములందును బఠింపవలెను. వినవలయును. ఏయే తీర్థములం దేయే పుణ్య క్షేత్రములం దేయే తీర్థక్షేత్ర మహిమలు వినునో దానివలన

గోదాన ఫలము లభించును. తలిదండ్రుల ముందు మహాగురువు యొక్క మహిమ వర్ణింపరాదు. తలిదండ్రుల మహిమనుగూర్చి సదస్సులలో పర్వములందుఁ గుమారుఁడు వర్ణింపవచ్చును. వాసుదేవుని సన్నిధిని రుద్రమహిమను రుద్రసన్నిధిని విష్ణుమహిమను వర్ణించుట వలనఁ బుణ్యాభివృద్ధి యగును. దుర్గ సన్నిధిని శివ సూర్యుల చరిత్ర, వైష్ణవ చరిత్ర కీర్తించువాఁడు నీచజన్మము లందును. గురువు ననుజ్ఞగొని తల్లిదండ్రులకు నమస్కరింపనగును. వారియనుజ్ఞచేతనె హరికిఁ బ్రదక్షిణము సేయవలెను. విష్ణువు, బ్రహ్మ, రుద్రుఁడు, ఇంద్రుఁడును సర్వవేదములకు సమముగారు. వేదరాశి సర్వధర్మ పరాయణము. అది సర్వజ్ఞాన మయము. అది సర్వజ్ఞమూర్తియగు సదాశివునితో సమానము. అందుచే బ్రాహ్మణ పితృవర్గముయొక్క సేవవలన బ్రహ్మలాభమగును. తండ్రికిఁ దర్పణము సేయనివాఁడు గురునకు వందనము సేసినను వ్యర్థమే యగును. భాగవతము విడిచి మిగిలిన పురాణములు వినుటవలనఁ బుణ్యము శూన్యము. నరసింహావతారము విడిచి మిగిలిన భాగవతము వినుటయు వ్యర్థమే. ఆదిపర్వముమాని భారతము ధారణఁ జేయరాదు. అశ్వమేధికము, యజ్ఞముఖము లేకుండ భారతము ధారణ చేయరాదు. (లేదా యశ్వమేధమును విడిచి మిగిలిన యజ్ఞకాండను జదువరాదు అని కావచ్చును.) దానధర్మమును విడిచి మోక్షధర్మమును బఠించుట ధారణచేయుట వ్యర్థము. భారతమున స్వర్గారోహణ పర్వము ధారణచేయుటచేఁ బరమపదలాభ మందును. వాయుపురాణము వినక యోగశాస్త్రము వినక ఇంకేది విన్నను

ప్రయోజనము లేదు. సుందరకాండ లేకుండ అరణ్యకాండ ధారణ చేయరాదు. లంకను విడిచి యాదికాండమును వ్రాసి కొని ధారణ చేయరాదు. పారాశరుని విడిచి వ్యాసుని, యాజ్ఞవల్క్యునివిడిచి మఖమును, దక్షుని విడచి శంఖుని, శంఖుని విడచి బృహస్పతిని వినరాదు. ధారణ చేయరాదు. అనగా నాయా ఋషుల గ్రంథములు కలిపి చదువవలెనని తాత్పర్యము. పురాణ గ్రంథములనుగాని, యందలి యక్షరములను గాని (బ్రహ్మాక్షరములని వానికి సంకేతము) దొంగిలించినవాడు రౌరవనరక మందును. భారతము, స్తోత్రరూపములయిన గ్రంథ ములను, స్తోత్రరూపములయిన వేదాగమములను పుస్తకము మీదఁ బఠింపవచ్చును. వేద గ్రంథములను, తంత్రగ్రంథము లందున్న మంత్రములను, నిగమ గ్రంథములను, మంత్ర వ్యాఖ్యాన సంగ్రహమును వ్రాసికొని చదువగూడదు. ఆయా గ్రంథములను వెల్లడిచేసినచో ఘోరనరక మందును. గ్రంథ పఠనమునకు మొదటను నడుమను జివరను బ్రణవ ముచ్చ రింపవలెను. గంధపుష్పాదులచే గ్రంథమునకుఁ బూజ చేయ వలెను. గ్రంథము త్రిమూర్త్యాత్మకము. గ్రంథమునకుఁ గట్టిన సూత్రము (దారము) వాసుకి. కావున గ్రంథమును దేవతా రూపమని గౌరవింపవలెను. గ్రంథమందలి పత్రములు బ్రహ్మ. అక్షరములు విష్ణువు. మాత ప్రకృతి. లిపి శివుఁడు. దానిమాత్ర సరస్వతి. ఏక రేఖ ఏకాత్మ. (ఒక్కొక్క పాదము చివర ఒక్కొక్క నిలువుగీతయన్నమాట) నాల్గుపాదముల చివర రెండు గీతలుండవలెను. శ్లోకము మొదటను రెండునిలువుగీతలుండును.

యుగ్మపంక్తి విపత్కారము. అయుగ్మపఙ్క్తి స్వర్గసాధనము. (అనగా ఒకపత్రములో బేసిపఙ్క్తు లుండవలెను. సరిసంఖ్యలో పఙ్క్తు లుండరాదని భావము కానోపును.) భారతము, పురాణములు మొదలైనవానియెడల నీనియమము ముఖ్యము, ♦ పఙ్క్తిఫలోదయము చూచు విధాన మిట్లున్నది. పుస్తకము నాలుగు విధములయియున్నది. శైవములయిన పురాణములు బ్రహ్మేంద్ర వైష్ణవములు నని. శక్తిప్రతిపాదకమగు పురాణము మహేశ్వరీ దేవతాకము. ఇతిహాసమైన భారతము బ్రహ్మరూపము. రామాయణ మింద్ర దేవ తా క ము. తాళపత్రాదిగ్రంథములకుఁ దార్ళ్ళు గట్టుటకు వేయవలసిన రంధ్రములు, వాని సంఖ్యను బట్టి ఫలము, వాని క్రింద మీఁదను వేయవలసిన చెక్కలు దారుమయములుగానే యుండవలయుననియు; లోహమయములు పనికిరావనియు గంటము రాగిదిగాని, వెండిదిగాని యైయుండవలెననియు నిట్టి వెన్నో నియమము లిందు వర్ణితమైనవి. † గ్రంథము బ్రహ్మచర్య నియమము పాటించుచు వ్రాయవలయును. హరివంశాదిగ్రంథములు వ్రతనియమములఁబూని వ్రాయవలెను. రామాయణము కూడ యట్లే వ్రాయవలెను. గృహస్థు గ్రంథము వ్రాయరాదు. పతితుఁడు, నాస్తికుఁడు, స్త్రీ, దుర్విచారుఁడు, దుష్టభార్య గలవాఁడు, దుర్మతి యైనవాఁడు పురాణాది గ్రంథ లేఖకుఁడుగా నుండరాదు. జీవంతీ రసముచేఁగాని యొకరకము జిగురు కాటుక కలిపిన వానిచేఁగాని వ్రాయవలెను. ఉత్తరాభి

♦ ఈపట్టున మూలశ్లోకములు చాలతప్పులతో నున్నవి. కావున తాత్పర్య నిర్ణయము చేయుటకు వీలులేక పోయినది. † ఇక్కడను మూలము సరిగాలేదు.

ముఖుండై గ్రంథము వ్రాయవలెను. శ్రీలాభము గలుగును. తూర్పుగానుండి వ్రాసిన ధనహాని, దక్షిణాస్యుఁడయి వ్రాసిన మరణము, పడమటముఖమైన ధనహానియు గల్గును. పితృమేధ మందు భూకంపమయినపుడు, జన్మదినమున, అశౌచసమయ మున, అమావాస్య యందు, సంక్రమణమందు గ్రంథము వ్రాసిన దారిద్ర్యము కలుగును. ఆయువు క్షీణించును. లిపి, ఛందస్సు, శబ్దశాస్త్రము తెలిసినవాఁడు, యువకుఁడు, బుద్ధి మంతుఁడు, ఆసనసిద్ధి గలవాడు, (దృఢముగా నొకచోట కూర్చుండగలవాఁడు) వేగముగా వ్రాయగలవాఁడు, తేజస్వి యైనవాఁడు, లేఖకుఁడు భావము పరిశుద్ధముగానుండి సహాక్షర ముగా వ్రాయవలెను. నాందీనాగరము లేక శుద్ధ నాగరము నను లిపులుగాని, కామరూపదేశ లిపిచేగాని వ్రాయవలెను. ఆచేతనముచేత వ్రాసినవ్రాతకూడ యెంతకాలము భూమియం దుండునో యంతకాలము వ్రాఁతగాఁడుకూడ స్వర్గలోకమున వసించును. పతితులు, మ్లేచ్ఛులు, రోగులు, కుష్ఠులు, క్షయ వ్యాధిపీడితులు, బోదకాళ్ళుగలవారు మూఁగవాండ్రు, అధర్మ పరులు వ్రాసిన గ్రంథమును గృహస్థు వర్జింపరాదు. అట్లు చేసిన నాయువు క్షీణించును. అంగలోపమైన ప్రతిమయు, మానహీనమైన పుస్తకము నాయుర్దాయమునుదగ్గించును. పుస్త కముపొడవు ముప్పదిరెం డంగుళము లుండవలెను. అది నారా యణ స్వరూపము. ఇరువదినా ల్గంగుళములు కలది స్వధన మనంబడును. అది శంకరరూపము. ధర్మకామ ఫలప్రదము. ఎనిమిది అంగుళములుగలది కనిష్ఠము. అది బ్రహ్మదేవతా

కము. త్రివర్గఫలమిచ్చును. తాలపత్రము, జలపత్రము, అగురు పట్ట మొదలగువానితోఁ జేసిన యాకులకు లెక్కయున్నది. కాని భూర్జపత్రములకు బ్రమాణనియమము లేదు. తాటియాకు భూర్జపత్రము పండ్రెండంగుళము లుండవచ్చును. వీని రచనకు వేతననిర్ణయము గూడ యున్నది. కుటుంబభరణమునకయి వేత నము తీసికొనరాదని యున్నది. మొదట, మధ్యమున, చివర జైమిని వ్యాస, శంకర, విష్ణువులను ధ్యానింపవలెను. మ్రొక్క వలెను. వాచకుఁడు నిశ్లేయొనర్చి యసందిగ్ధముగ, స్పష్టముగ గ్రంథోచ్చారణ చేయవలెను. సప్తస్వరములు, సప్తనాదములు ననువుపడునట్లు గ్రంథము చదువవలయును. సామగాథల ననుస రించి రాగయుక్తముగాఁ బురాణ పఠన మొనర్పవలయును. మణివారకము. గాంధారము, ఆసంతిక, శ్రీరాగము, హిల్లోల రాగము, వాజావికము, మొదలయిన రాగములు వాడవలెను. శూద్రముఖమున ధర్మసంహితలు వినరాదు. శూద్రుఁడు పై వారివలన వినుటచే శుద్ధుడగును. శూద్రుఁడు వ్యాకరణము చదివిన నశుచి యగును. వైదికాగమధర్మమును శూద్రుఁడు కోరరాదు. కోరినచో రాజుచే దండ్యుఁడు కావలెను. గ్రంథము యొక్క సంపూర్ణభావము గ్రహించి పురాణము చెప్పువాఁడు సాక్షాద్వ్యాసుఁడే. అట్టివాఁడు పట్టణమున, గ్రామమున పుణ్య దేశమున నివసింపవలెను. అతఁడులేని తావు సూర్యుఁడు లేని యాకాశము. చంద్రుఁడులేని రాత్రివంటిది. అట్టి వ్యాసుఁడు లేని సభ రాణింపదు. శిశువులులేని యిల్లువలె నట్టిపౌరాణికుఁడు లేనిచోటు శూన్యము. గ్రహము లన్నియు ఒకయెత్తు. సూర్యు

డోకయెత్తు. అట్లే పండితులందరు నోకయెత్తు. పౌరాణికుఁ డోకయెత్తు.

8 అ. పురాణము చదువుతఱి వక్త్రశ్రోతలకు నడుమ మనుజుఁడు నడచిన నొకరాత్రి (యొకరోజు) పురాణము మానివేయవలెను. మేకగాని గొఱ్ఱెగాని వచ్చిన త్రిరాత్రి మానివేయనగును. కప్పయెగిరిన నైదు రాత్రిలు, సర్పము పాకిన నాల్గురోజులు, గుఱ్ఱము నడచిన సంవత్సరము, ఏనుఁగు వచ్చిన పండ్రెండు సంవత్సరములు, గాడిద, కాకి వచ్చిన నొక మాసము మానవలెను. ఆచోటు వదలిపోవలెనుగూడా. పిల్లి, ముంగిస, ఎలుక వచ్చిన మూడురాత్రిలు విరమింపవలెను. హంసయైనచో నొకదిన మనధ్యయనము గావింపవలెను. పురాణాదులను గురుపుత్రునికి, జ్ఞానికి, ధర్మపరునికి, శుచికి, భక్తునికి, శాంతునికి, విష్ణుభక్తునికి, కోపములేనివానికిఁ దెలిపి చదివింపవలయును. జితేంద్రియునకుఁ గూడ తెలుపవచ్చును. అధ్యాత్మవిద్యోపదేశమునకుఁగూడ వీరర్హులు. శఠుఁడు, ద్వేషి నిర్భయుఁడు, అన్యాయము చేయువాఁడు, డంబముగలవాఁడు, నిరర్థకుఁడు, శుశ్రూష చేయనివాఁడు, నపుంసకుఁడు, వక్రబుద్ధి గలవాఁడు, కోపి, నీచుఁడు, వ్యసని, నిందకుఁడు, విధినిషేధములు తెలియనివాఁడు నగు వారిని దూరదూరముగ విడువవలయును. వాండ్రకు పురాణసంహితాదు లుపదేశింపరాదు. [illegible] దాను జీర్ణించి చనిపోవలెనుగాని యపాత్రున [illegible] రాదు. అందులకే విద్య యిట్లనునఁట "భ[illegible]నునికి, దుర్జనునికి, దురాత్మునికి నన్నివ్వకుము. పౌర[illegible]



బ్రహ్మచారియయి, సార్థకుఁడై విధి నెరింగి సాధువయిన విప్రునికి సన్న్యాసంగుము" అని. నిషిద్ధునకు విద్యాధన మిచ్చినచో నందెవఁడో యొకఁడు వెంటనే యమమందిరమున కేగును. లౌకికము, వైదికము, ఆధ్యాత్మికము నయిన జ్ఞానమును నమస్కరించి విధేయుఁడై యభ్యసింపవలెను. కర్మకాండను జ్యోతిషము లేకుండ నేర్చుకొనరాదు. ♦ చూతభాగాభ్యాసము దారిద్ర్యమును, వాదభాగాభ్యాసము ధననాశనము, నిధిభాగాభ్యాసము నరకమును గూర్చును. మ్లేచ్ఛోక్తములు, ననుక్తములయిన శాస్త్రముల నభ్యసింపరాదు. లోకముల జ్ఞానాభివృద్ధికై ధర్మ సంగ్రహము చేసి ప్రవర్తింపఁజేయు నతఁడు జ్ఞానదాతయగు తండ్రి యనంబడును. నిగమములు, జ్యోతిషము, వేదములు, నాటకము ననువానికి వ్యాఖ్యానసంగ్రహము చేసి కలియందు నాశనము పొందును. (ఇటనుంచి ౧౦ శ్లోకములు సరిగా లేవు)

## —♦ అంకమాహాత్మ్యము ♦—

ఏకాక్షర మంత్రము బ్రహ్మరూపము. రెండక్షరములు గలది ప్రకృతిరూపము. నవాక్షర మంత్రము భైరవము. పది యక్షరములు జనార్దనము. పదుకొండక్షరముల మంత్రము రుద్రస్వరూపము. ద్వాదశాక్షరమంత్రము సూర్యరూపము. పదమూడక్షరములది భూతరూపము. పదునాల్గక్షరములది మనుస్వరూపము. పదునైదక్షరములయిన తిథిరూపము. పదునారక్షరములుగలది కలాత్మకము. పదునేడయిన వాయురూపము. పదునెనిమిది యక్షరములయినఁ బురాణరూపము. పంధొమ్మిది

♦ అర్థము కాలేదు.

యక్షరములుగలది చంద్రరూపము. ఇరువది యక్షరములయిన నారాయణస్వరూపము. ఇరువదియొకటియైన జ్యోతిర్మయము. ఇరువదిరెండయినచో కేశవార్చనరూపము. ఇరువదిమూడయినచో నక్షత్రరూపము. ఇరువదినాల్గక్షరముల మంత్రమయినచో తానకము. ఇరువదియైదయిన తీర్థముల స్వరూపము. ఇరువది యారయిన త్ర్యంబకరూపము. ఇరువది యెనిమిదియైనఁ గుబేర రూపము. ఇరువదితొమ్మిదియయిన సరస్వతి. ముప్పదియైన శివస్వరూపము. ముప్పదియొక్కటియయిన పాతాలరూపము. ముప్పదిరెండయిన నహోరాత్రరూపము. ముప్పదినాల్గయిన గంగానది. ముప్పదియైదయిన గంగాంతము (గంగా సాగరసంగమము) కావలయును. నిండుగా నూరక్షరములయిన దివాకర రూపము. సహస్రాక్షర రూపమయిన శివరూపము. పదివేలక్షరములయిన (గ్రంథసంఖ్య యని యనుకోవలెను) మేరువు. లక్షయయిన బ్రహ్మరూపము. కోటియైన నారాయణదేవతా రూపము. శారదాలిపిమాతృక పుంప్రకృతిరూపము. అది శుద్ధ బ్రహ్మస్వరూపము. నిత్యము. జ్ఞానరూపము. శుచియైనను నశుచియైనను నేచోట నదియుండునో యది క్షణములో బ్రహ్మమయ మగునని మనువు చెప్పినారు.

—♦ అంతర్వేది బహిర్వేది విమర్శనము ♦—

(9 అ.) బ్రహ్మ యొకానొక యుగమునఁ దెలిపిన విషయ మిట్లున్నది. బహిర్వేదియైన క్రియాకలాపము ద్వాపరయుగమునఁ బ్రశస్తము. అంతర్వేదియైన కర్మకలాపము కృతయుగ ప్రశస్తము. అది జ్ఞానసాధ్యము. దేవతాస్థాపనము, పూజ, చలి

విందలి పూర్తాదికము, బ్రాహ్మణగురుపరిచర్య యనునవి బహి ర్వేదికి సంబంధించినవి. రాజు ధర్మకారణము. కావున రాజు నాశ్రయించి బహిర్వేది క్రియాకలాపము నిర్వహింపబడును. బహిర్వేదియగు కర్మతంత్రము ఆెనుబదియేడు. అన్నిటికి సార భూతము దేవతాప్రతిష్ఠ. దేవాలయ నిర్మాణము. తటాక ప్రతిష్ఠ, గురుపూజ పితృపూజ, అధివాసము, దేవతాప్రతిష్ఠ ప్రతిమానిర్మాణము, వృక్షారోపణము. ప్రతిష్ఠా విధానము మూఁడు విధములుగా నున్నది. పూజా హోమాదులు దాన ములు మొదలయిన వానినిబట్టి యీభేద మేర్పడినది. మూఁడు రోజుల దీక్షతో నిరువది యెనమండుగురు దేవతల యారాధ నతో జరిగేది. అందు జాపకులు పదునార్గు రుండవలెను. ఇది యుత్తమ విధానము. అశ్వమేధఫలదము. నల్గురే యాజకులు. పదుముగ్గురే దేవతలు. గ్రహములు, దిక్పాలురు, వరుణుఁడు పృథివి, శివుఁడు. ఒకరోజు దీక్షతో జరిపించేది మధ్యమ విధా నము. గణేశ, గ్రహ, దిక్పాల వరుణ శివదేవతాకము కనిష్ఠ విధానము. ( ఈ మీఁదట ప్రతిష్ఠా విధానము విస్తరింపఁబడి యున్నది. ) వాపీకూప తటాకప్రతిష్ఠలలో విశేషము. వర్షకాల ములో వీనియందు నీరున్నచో నగ్నిష్టోమఫలము గల్గును. శర దృతువునందున్నచో యజ్ఞతీర్థముకంటె నుత్తమఫల మొసం గును. (అవబృథ స్నానము చేయుటవలనఁ గలిగే ఫలముకంటె మించిన ఫలమిచ్చునని తాత్పర్యము.) ఎండకాలమున నున్న స్వర్గము నొసంగును. తనతో ఏకోత్తరశతకులములు వాపీ

కూపాది ప్రతిష్ఠలచే నుద్ధరింపఁబడును. ఏకోత్తర శతము (101 కులములు) అనగా లెక్క యీా క్రిందివిధముగా నీయఁబడినది.

| | | |
|---|---|---|
| పితృవంశములో | 7 | తరాలు |
| మాతృవంశములో | 7 | ,, |
| | 14 | |
| పితృకులంలో పైన | 20 | ,, |
| మాతృకులంలో పైన | 20 | ,, |
| భార్యవంక పితృవర్గము | 5 | ,, |
| ,, మాతృవర్గము | 5 | ,, |
| పితృమాతామహవర్గము | 5 | ,, |
| మాతృమాతామహవర్గము | 5 | ,, |
| గురువుయొక్క పితృవంశము | 5 | ,, |
| ,, మాతృవంశము | 5 | ,, |
| ఆచార్య కులము | 2 | ,, |
| రాజకులము (పితృవర్గము) | 10 | ,, |
| రాజమాతామహకులం | 5 | ,, |
| | 101 | |

ఏకవింశతివంశముల లెక్క 21 తరాలు

| | | |
|---|---|---|
| పితృవర్గము | 5 | తరాలు |
| మాతృవర్గము | 5 | , |
| పితృమాతామహవర్గము | 2 | ,, |
| మాతృమాతామహవర్గము | 2 | ,, |

| | | |
|---|---|---|
| గురుసంతానవర్గము | 2 | ,, |
| యాదవ పితృమాతృ వర్గము | 2 | ,, |
| సాత్వత పితృమాతృ వర్గము | 2 | ,, |
| పరపక్షము | 1 | ,, |
| | 21 | |

నీటిమీఁద గృహనిర్మాణము చేయరాదు. చంద్రరశ్మి ప్రసార మున్న నీ రమృతోపమము. తీరముననున్న చెట్లు లతలనుండి పువ్వు లెంతకాలము నీటఁబడునో యంతకాల మా ప్రతిష్ఠ చేసినవాఁడు స్వర్గమునం దుండును. శివలింగము సరియైనచోట నున్నను లేకపోయినను దానిని గదల్పరాదు. కదల్చిన రౌరవ నరకమందును. నగరగ్రామములకు నాశము కలిగినపుడు స్థాన భ్రంశము తటస్థించినపుడు రాజ్యాదివిప్లవమునందును పునః ప్రతిష్ఠ చేయవచ్చును. మోదుగ, * కేశరము, హరివృక్షము, విప్పచెట్టు, కింశుకము, ననుచెట్లను కదల్పరాదు. దేవాలయము ముందు, బ్రాహ్మణ సమాజమందు, రాజద్వారమందు, నాల్గు దారులు కలియుచోట, పుష్కరిణిఁ ద్రవ్వింపవలయును. దక్షిణపు దిక్కున స్వోపయోగమునకు పుష్కరిణి ద్రవ్వింపరాదు. పడమట దెస పుష్టిగలిగించును. ఉత్తరదిశ సర్వకామదము.

♦ బహిర్వేది క్రియాకలాపము ద్వాపరయుగమునకు సంబంధించి ప్రశంసింపబడినది. కావునను, ద్వాపరమునఁ బురాణవచన జరుగుటను బట్టి యప్పటి రాజవంశాలయిన యాదవసాత్వత వంశాలను వ్యాసు లిందులోఁ జేర్చిరని తోఁచుచున్నది. ఇది తక్కిన యుగాలలోని రాజవంశాల కుప లక్షణముగా గ్రహించవలెననియుఁ దోఁచెడిని. * కేశవము.

పుష్కరిణియందు యూపము శ్రీపర్ణి (పెగ్గుమ్మడు), చండ్రి, ఉసిరిక కర్రలతోఁ జేసిన ప్రశస్తము. అది పదునారు హస్తముల పొడవుండవలెను. రత్నాదులతో నది ప్రతిష్ఠింప వలయును. నూతిలో నాల్గు హస్తముల ప్రమాణముగల స్తంభము ప్రశస్తము. యూపము నీటిలో నెల్లప్పుడు మునుగునట్లుండ కూడదు.

—♦ ఆ రామ ప్రతిష్ఠ ♦—

(10 అ.) మొదట భూశోధన చేయవలయును. ముందు వృషభములచేఁ ద్రొక్కించ వలయును. చెఱువు త్రవ్వినపుడు దేవాలయ ప్రతిష్ఠలందు నిటులే చేయవలెను. తెల్లనియెడ్లే పనికి వచ్చును. గృహయాగ నిమిత్తమయిన భూమినిమాత్రము వృషభములు త్రొక్కకూడదు. నూతులు, తోటలు ప్రతిష్ఠింపఁ దలచిన భూమిని నల్లనియెడ్లు త్రొక్కవచ్చును. దున్న వచ్చును. మూఁడు రోజులు దున్నించిన తరువాత నైదురకాల గింజలుఁ జల్లవలెను. పంచ ధాన్యములు అనగా పెసలు, మినుములు, ధాన్యము, నువ్వులు, చామలు, చారలు, బటాణీలు కలిసి సప్తవ్రీహిగణ మనంబడును. ఆవాలు, బటాణీలు, పెసలు మినుములుకలిసి చతుర్వ్రీహిగణ మనంబడును. మినుములు, పెసలు చామలు కలిసి వ్రీహిత్రయ మనంబడును. మాషగణమని కూడా దీనికిఁ బేరు. బ్రాహ్మణులకు సువర్ణమృత్తిక (పచ్చమన్ను), క్షత్రియులకు తెల్లమన్ను, వైశ్యులకు ఎర్రమన్ను శూద్రులకు నల్లమన్ను ప్రశస్తములు. గోరోజనముతో నాల్గు వత్తులుచేసి క్షీరదారువులో పండ్రెండంగుళముల గుంటచేసి మంచినూనెకాని, కుసుమనూనెగాని, పోసి వెలిగించవలెను.

ఆజ్యాల తూర్పుగా వెళ్ళిన కార్యసిద్ధి. పడమటగా దిరిగినను. శుభము. దక్షిణముగా దిరిగిన మరణము. ఉత్తరముగాఁ దిరిగిన హాని. నలుమూలలనుపోతే విపత్కరము యని తెలియవలెను. పిమ్మట వాస్తుబలి యొసంగి గునపమును బూజింపవలెను. 'ఆబ్రిహ్మన్' అనే మంత్రముచే నట్టనడుమఁ ద్రవ్వవలయును. యజమాని యావునేయి మధూక్తముగా శరీరమునకుఁ బూసి కొని, బంగారము, రత్నములు ముంచిన నీటితో స్నానము చేయవలెను. ఈశాన్యదిశగా వాస్తు తడాగాది దేవతల నిట్లు స్నానము చేయింపవలెను. ఇదిచేయక గృహారామ తటాకకూప వాపీ ముఖప్రతిష్ఠలు చేసిన ధర్మలోపమగును. యూప నిర్మాణ విధిగూడ తెలిసి చేయవలెను. ఆ యూపస్తంభము చెరువునకు సర్పాకారముగను; నూతికి కుంభాకారముగను, తోటలకు పద్మ రూపముగను, మండలనిర్మాణమున ఛత్రాకారముగను, వంతె నలానకట్టలు నిర్మించునపుడు శునకాకారముగను, విష్ణ్వాల యము నిర్మిఁచునపుడు గదాకారముగను, అశ్వమేధమున గుఱ్ఱమురూపునను, నరమేధమున నరాకారముగను, గోయాగ మున వృషభాకారముగను, గృహయాగమున ధ్వజరూపము నను, లక్షహోమమున చక్రాకారముగను, కోటిహోమమున నాగలిరూపమునను నిర్మింపవలెను. యూపస్తంభమునకు సాలము (ఏపి), ఖాదిరము (చండ్రి), మోదుగ, మారేడు, వకులము (పొగడగర్రి), కేశరము (నాగకేశరము) నను కర్రిలు పనికివచ్చును. ద్రిమారోపణమునకుఁ దూర్పు పల్లమైననేల పనికివచ్చును. వనపాలుఁడు శిఖిధ్వజుఁడు. కుమారస్వామి యన్న

మాట. సోముఁడు, నాగరాజు ననువారు వనపాలురుగా నర్చ
నీయులు. పిమ్మట బీజశోధన చేయవలెను. రాద్రితాపముచే
(మండుటెండలో) విత్తుల నెండించవలయును. రెండురోజుల
ముందే వానిని మంత్రింపనగును. విష్ణుమంత్రముచే గర్భాధానము
బీజనిక్షేపము చేయవలెను. 'ఏవమస్య' అనేమంత్రము మూఁడు
మారులు జపించి మార్జన చేయవలెను. 'దేహిమే' అనే
మంత్రముచే పదిమారులు ప్రోక్షణచేయవలెను. 'ఇత్యగృహీత'
అనుమంత్రముచే నైదుసార్లు మంత్రించవలెను. 'త్ర్యంబక' అను
మంత్రముచే బీజారోపణము చేయవలెను. ఇట్లు వృక్ష సంస్కార
ములు చేయుచు నడుమఋతుమతియై స్నానముచేసిన భార్యనయి
దవరోజు తొడమీఁద గూర్చుండబెట్టుకొని చుంబించి మంత్రో
చ్చారణ చేసిన పుత్రలాభము గలుగును. వాపీకూపాదులు
వృక్షరోపణాదులను విధి విధానముగా జేయనివానికి ఫలము
లభింపదు. విష్ణుదేవతాకమయిన నక్షత్రమున తులసీబీజము
నాటి గోమూత్రముచే సేచనముచేసిన స్వర్గలాభము కలుగును.
ఒకరాత్రి దానిని పంచదార నించిన పాత్రలో నుంచవలెను.
నదీతీరమున, శ్మశానమున, యింటికి దక్షిణమున తులసిని
నాటరాదు. అట్లుచేసిన యజమాని నశించును. పత్రపుష్ప
ఫలాదులు పుట్టు టారంభించిన మొదలు పితృదేవత లు తీర్ణు
లగుదురు. వృక్షారోపణమువలన సంతానము లేనివారికి సంతతి
గల్గును. అశ్వత్థారోపణము (రావిచెట్టు) మహాఫలదము. దాని
వలన ధనికుఁ డగును. అశోకము శోకనాశకము. ప్లక్షము
(జువ్వి) భార్యాలాభము గూర్చును. బ్రహ్మదము (బిల్వము)

(మారేడు) ఆయుష్కారకము. జంబువు (నేరేడు) ధనప్రదము. తిందుకము (విషముష్టి) కులాభివృద్ధిదము. దానిమ్మ స్త్రీలాభము కూర్చును. వకులము (పొగడ), వంజులము (మెట్టదామర) పాపము పోగొట్టును. ధాతకి (ఆరె), వటము (మఱ్ఱి) మోక్షదము. సహకారము (తియ్యమామిడి) కామవృద్ధి చేకూర్చును. గువాకము (పోక) సిద్ధినిచ్చును. బలవలము (మధుకము) అతిమధురము· అర్జునము (మద్ది) సర్వోత్తమ ఫలమునిచ్చును. కదంబము (కడిమి) గొప్ప కీర్తినిచ్చును. తింత్రిడి (చింత) ధర్మదూషకము కావున కూడదు· జీవంతి (పాలచెట్టు) రోగశాంతి నిచ్చును. నాగకేసరము శత్రుమర్దనము. వటము, శ్వేతవటము (తెల్లమఱ్ఱి) ధనప్రదము. పనస చెట్టు బుద్ధిమాంద్యము నొసంగును. కలివృక్షము (అవిసె) లక్ష్మీప్రదము. శాఖోటము (మొక్కపుచెట్టు) ఉదరావర్తకి (నువిదడ) మర్కటి (దూలగోవిల), నీపము (కలిమి) నాటిన సంతానము నశించును. శింశప (బూడిద), అర్జునము (మద్ది). జయంతి (సోమెంత), హయమారకము (గన్నేరు), శ్రీవృక్షము (మారేడు). కింశుకము (మోదుగ), లోరకము నాటిన స్వర్గలాభము. సమిథవృక్షము (మోదుగ), కిటంకిని (జమ్మి), రేగు, కుశలను (దర్భ) పద్మము ననువానిని నాటరాదు. నాటిన దుర్గతి కల్గును.మందారము నాటిన కులహానియగును. (మనము సాధారణముగా జూచే మందారము. జపాకుసుమము మందారముకాదు. శాల్మలము(బూరుగు)శత్రువృద్ధి చేయును·నింబము(వేప)పశుహాని

చేయును. ఛత్రాకము (తుమ్మలో రకము) కులహానిచేయును. ఉత్పలము (నల్లకలువ) కులక్షయము, పశునాశనము చేయును. కాశనాదము (కాకిదొండ) శత్రువృద్ధి. బలపూగము (పోకలో నొక రకము) ఐశ్వర్యనష్టము. తియ్యమామిడిచెట్లు వేయికంటె నొక్క రెండు ఆరె చెట్లు, అవి వేయికంటె నొకపాటలము (కలిగొట్టు) శ్రేష్ఠములు. పాటలము నూటిటికంటె నొక రక్త వటము (ఎఱ్ఱమర్రి) శ్రేష్ఠము. అట్టివటములు రెండువేలకంటె నైదు నాగకేసరము లుత్తమములు. దానికంటె శ్రీవృక్షము, జంబూవృక్షము ప్రశస్తములు. దానికంటె హిమము (పెను వేము ) దానికంటె శ్రీపర్ణి (పెగ్గుమ్ముడు) గొప్పది. తిందుక త్రయము(విషముష్టి)జంబూవృక్ష పంచకము,కదంబార్జున నారి కేళములు మూడేసి యుత్తమోత్తమములు. మూఁడుజన్మముల పాపము వృక్షారోపణముచే నశించును. స్వర్గసుఖము కలుగును. నూరుచెట్లునాటిన బ్రహ్మత్వమును, వేయిచెట్లు నాటిన విష్ణు త్వమును బొందును. తులసీరోపణముచే నాదివ్యాధులు నశించును. వైశాఖమాసము కీర్తిని, జ్యేష్టమాసము మరణమును, ఆషాఢము కీర్తిని, శ్రావణము పరమగతిని, భాద్రపదము ధన లాభమును, ఆశ్వయుజకార్తికములు క్షయమును చేయును తులసి మూఁడు రకములు. తెల్లతులసి కృతయుగ ప్రశస్తము. మర్రి, రావి, మారేడు చెట్ల నేమాత్రము త్రుంచరాదు. అందువలన బ్రహ్మహత్యాదోషము వచ్చును. మూలచ్ఛేదము చేసిన కులనాశమగును. చెట్టు నరకినవాఁడు మూగవాఁడగును. ఆధి వ్యాధులు నందును.

## —♦ ఎఱువులు, సామాన్య దోహదములు ♦—

సాయం ప్రాతఃకాలములందు గ్రీష్మము లేనప్పుడు, చల్లని వేళ పచ్చియులవలు (నానవేశివవి) మినుములు, పెసలు, నువ్వులు, యవలు, నెఱువు వేయవలెను. నృత్యము, గీతము, పాలు పోయుటవలనఁగూడ పండ్లు, పువ్వులు పెంపొందును. గొర్రెపెంట, కాకిపెంట, యవపిండి, గోమాంసము, నీరు, నేఁడురోజులు వేసిన నన్ని చెట్లు ఫలపుష్పాది వృద్ధినొందును. ఇది సర్వవృక్ష సాధారణమైన దోహదము. 'రోహి' యను చేప యొక్క పిత్తము (రొయ్యపీత), ధాన్యాకము (ధనియాలు) వేసి నీరుపోసిన పెంపొందును. చింతగింజలను జెఱకు దండముతో మర్దించి యా రసము నశోకమునకు (నరమామిడికి), తీయ మామిడికి వేసిన నది పెంపొందును. కొబ్బరినీళ్ళు తేనె. అన్ని చెట్లకు నుత్తమమైన యెరువు. పోకచెట్లకు నది విశేషించి పని చేయును. దశశిరాబీజములు కలిపి యభిషేకించిన మంచిది. ఈనుముందు మేకలు, గోవులు, గేదెల జరాసలిలము (మావి యన్నమాట) వృక్షము మీఁదపోసిన తీయమామిడి బాగుగఁ గాయును. మినపగంజికాని వితానము (ధనియాలగంజి) గాని తీసి ఆవాలువేసి మర్దించి గువాకువృక్షము (పోకలో రకము) గూడా వేసి నూరి ఆముద్దవేసినచో చచ్చినచెట్టుకూడ చిగిరించును. వేపాకు, యోగపత్రము, (గంజాయి) శతావరి, పిల్లి వేళ్ళఆకు), పునర్నవ (గల్జేరు), క్షీరిక (పాలఆకు), తామ్రమకము (ఎర్రచందనము) నను నాకులతో తీయమామిడి మొదలున ధూపము వేసిన పురుగుచచ్చిపోవును.

## — విశేష దోహదములు —

చేపనీరు మామిడిచెట్లకు, మామిడిపండు, రక్తము దానిమ్మలకు గోమాంసముతోడి యవోదకము కేతకికి (మొగలి) మంచియెఱువులు. క్షీరకవృక్షమునకు తిందుకము (విషముష్టి) కరమర్దకము (వాకాయ) దోహదములు. మాంసము, రస, మజ్జ అనునవి అశోకము, తాడి, గువాకకము (పోక) లకు దోహదములు. నిలువయున్న మాంసము నేతితో వేసినను రోహితమను చేపనీరు, మధుయష్టి (యష్టిమధుకము) నానవేసిన నీరుపోసినను కొబ్బరి తెగకాయును. వెలగ, మారేడునకు బెల్లపునీ రుత్తమము. జాజి, మల్లి, మొల్ల గంతికమునకు పరిమళోదకము, పాముకూసము పొగవేయుట దోహదములు. తాఁబేటిమాంసము, అన్నరసము, విడంగమపు పువ్వులు రథ్యావృక్షమునకు (తినిశ) వేసిన ఫలించును. వాతసర్పము (తాచు) గ్రంథితగరము అజగరము (కొండచిలువ) అనువాని కూసము ధూపము వేసినచో ధాన్యవృద్ధి యగును. నెమలిరెక్క, మేక రోమము లేడు కలిపి యాముదములో ముంచి ఇంగువ, కుసుమ నూనె కలిపి ధూపము వేసిన నెలుకల బాధ తప్పును. ఏనుగులద్దియెలుఁగుగొడ్డు మలమును కృత్తికానక్షత్రమందు దెచ్చి పసుపు నీళ్ళతో కలిపి వేసినచో మొదటనున్న పుచ్చుపోవును. రావి మొదలు పదిచేతులమేర విష్ణుక్షేత్రమంత పవిత్రమై యుండును. రావిచెట్టు నీడనున్న నీరు గంగానదియే. ఇరువది చేతుల కొలటిగాఁ దీయమామిడి, పదునాఱుచేతుల యంతరములో నుసిరి, వకులము, వంజులము, శ్రీపర్ణి, పున్నాగము, శ్రీవృక్షము

ననువానిని బాతవలెను. రాతినేలలో నింతకు రెట్టింపు నెడ ముండవలయును.

11 — అధ్యాయము మొదలు తంత్రవిషయము. ప్రతిమానిర్మాణము, కుండనిర్మాణము, లక్షకోటిహోమపద్ధతి, అగ్నిని పురుషాకారముగా భావించి యాయా యవయవము లందు హోమము చేయుటవలన నాయా సుకృతదుష్కృత ములు గలుగునని యీ యధ్యాయము చెప్పుచున్నది. అగ్ని ధ్యానము, స్తుతికి సంబంధించిన శ్లోకములు షోడశోపచార సమర్పణ శ్లోకములు 16వ అధ్యాయమునఁ గలవు.

—♦ యజ్ఞభేదమునుబట్టి యగ్నిభేదము ♦—

(17 అ.) ఇది వేదానుసారముగాఁ దెల్పబడుచున్నది.† శతార్థమున నగ్ని 'వహ్ని' యనుపేరను మిగిలిన శతార్థమున గాశ్యపుఁడుగను, ఘృతదీపమున విష్ణువు, తిలయాగమున వన స్పతి, సహస్రహోమమున బ్రాహ్మణుఁడు, పదివేలహోమమున హరి, లక్షహోమమున వహ్ని, కోటిహోమమున హుతాశ నుఁడు, శాంతికర్మయందు వరుణుఁడు, మారణమున నరుణుఁడు, నిత్యహోమమున అనలుఁడు, ప్రాయశ్చిత్తమున హుతాశనుడు గృహసంబంధమయిన అన్నయజ్ఞమున లోహితుఁడు, దేవప్రతి ష్ఠాయాగమున లోహితుఁడు, వాస్తుయాగమునఁ బ్రజాపతి, మండపమున, పద్మకప్రతిష్ఠయందు, చలివిందలి ప్రతిష్ఠించు నపుడు నాగుఁడు మహాదానమున హవిర్భుజుఁడు, గోదానమున రుద్రుఁడు, కన్యాదానమందు గోజకుఁడు, తులాపురుషదాన

---

† ఇది యర్థము కాలేదు.

మున ధాత, వృషోత్సర్జనమందు సూర్యుఁడు, అవసానాంతమున రవి, వైశ్వదేవమునఁ బావకుఁడు, దీక్షాపక్షమున జనార్దనుఁడు, త్రాసనమున (భయపెట్టే మంత్రప్రయోగములో) కాలుఁడు, శవదాహనమునఁ గ్రవ్యాదుఁడు, పర్ణ దాహమున (ఆకులు మాడ్చు నొకానొక చేతబడి యన్నమాట) యముఁడు, అస్థి దాహమున (ఎముకలు గాల్చుటలో) శిఖండికుఁడు, గర్భాధానమున మరుతుఁడు, సీమంతమునఁ బింగలుఁడు, పుంసవనమున నిందుఁడు, నామకరణమున ఉపన్యస్తమున పార్థివుఁడు, నిష్క్రమణమున హాటకుఁడు, అన్నప్రాశనమందు శుచి, చూడాకర్మ యందు షడాననుఁడు, వ్రతాదేశమందు సముద్భవుఁడు, ఉద్యానవనప్రతిష్ఠయందు వీతిహోత్రుఁడు, సమావర్తనమున ధనంజయుఁడు, ఉదరమున జఠరాగ్ని, సముద్రమున బడబానలము, శిఖయందు విభువు, స్వరమునకు సరీసృపుఁడు, అశ్వమున కగ్నిమంథరుఁడు, రథమున కగ్ని జాతవేదుఁడు, గజమునకు మందరుఁడు. సూర్యాగ్ని వింధ్యుఁడు, నీటియగ్ని వరుణుఁడు, బ్రాహ్మణాగ్ని హావిర్భుజుఁడు, పర్వతాగ్ని క్రతుభుజుఁడు, దావాగ్నియందలి యగ్ని సూర్యుఁడు. దీపమందలి యగ్ని పావకుఁడు. గృహ్యాగ్ని ధరణీపతి, ఘృతాగ్ని అనిలుఁ డనే వాయువు, సూతికాగ్ని రాక్షసుఁడు.

## —♦ హోమద్రవ్యముల ప్రమాణము ♦—

(18 అ.) హోమము చేయవలసిన వస్తువుల పరిమాణము గమనించి చేయవలెను. హెచ్చుగాని తక్కువగాని

మైనచో హోమము వ్యర్థము. నెయ్యి †కర్ష మాత్రము. పయస్సు శుక్తి మాత్రము (2 రకములు) పంచగవ్యము నంతే. పాలు, పెరుగు, తేనెయు నంతే. అటుకులు, పేలాలు, ముష్టిప్రమాణము (అనగా 8 తులములు). శర్కర (చక్కెర) బెల్లము మూడు తోలకములు ♦ (తులాలు అని తోచుచున్నది) చెఱకు ఒక్క కణుపు. ఆకుగాని పువ్వుగాని యొక్కొక్కటి, శాలూకము (దుంప) మూడు ముష్టులు (24 తు). ఇది యొక్కటిగానే హోమము చేయవలెనుగాని, కొంచెముకొంచెముగా చేయరాదు. మంకెన (జపాపుష్పము), తొడిమితో హోమము చేయవలెను. కేశరము (నాగకేసరము) కూడా అంతే. పద్మములు, జలజములు నొక్కొక్కటిగానే చేయవలెను. జీవంతి (పాలకూర) ఒక పలము. పిండిపదార్థముల సంఖ్యకూడా పలము ప్రమాణమే. వసంతకము (పెద్ద యుసిరికాయంతగాని, కుడుమంతగాని), మాతులుంగము (మాదీఫలము) త్రిఖండకము (పల్లేరు) ఒక్కొక్క పలము వంతున. కొబ్బరి యెనిమిది పలాలు, పనస పది పలాలు, కూష్మాండము (గుమ్మడి) తామర గింజలు, ఉర్వారుకము (కర్బూజా) 8 పలములు. గుడూచి (తిప్ప తీగ) నాల్గంగుళములు, మాంసమును మూడుభాగములు చేసి 1 భాగము చేయవలెను. పోకలున్ను, బెల్లమంత (3 తులములు) లేదా రేగుపండంత; తిందుకమునంతే (విషముష్టి). సమిధ ప్రాదేశ

† కర్షము = 2 తులాలు. మాగధమానప్రకారము. కళింగమానము 1 తులము. ♦ తోలకము = తులము. ముష్టి = పలము 8 తులాలు. అంగుళము = యజమానియొక్క మధ్యమాంగుళియొక్క మధ్యమపర్వమంత. బిల్వము కుంచము చతుర్థిక, ఆమ్రము. ఇవి ముష్టికి పర్యాయపదాలు.

మాత్రము. దూర్వ మూఁడుపోచలుగలది. భుజవత్రము, జమ్మి ప్రాదేశమాత్రము. వ్రీహులు ముష్టి (పలము) పరిమాణము. ఆవాలు శుక్తిమాత్రము (4 తులములు). మరిచములు (మిరియాలు) వినూనంగా (స్వల్పంగా). తామరతూఁడు (మూలకము) ముల్లంగి, వార్తాకము(వంకాయ) ఏడుముక్కలు, త్రిపుషము (దోస) మూఁడవవంతు, చందనము, అగరు, కర్పూరము, కస్తూరి, కుంకుమపువ్వు చింతగింజంత చేయవలెను. పేల పిండి, యవపిండి హోమము చేయవలసివచ్చినపుడు మూఁడు రెట్లు నువ్వులలో ప్లవనముచేసి (గుచ్చియెత్తి) హోమము చేయవలెను. పదిరెట్లు హోమము జరుపవలసినపుడు నూరురెట్లతోను, నూరురెట్లు హోమమునకు వేయిరెట్లుగాను ఈ ప్లవనము చేయవలెను. ధాన్యహోమములోఁగూడ యిట్లు ప్లావనము చేయవలెను. చెఱకు సామాన్యసమిథలనువలెనే చేయవలెను. మారేడాకు హోమము చేయునపుడు తొడిమి తీసివేసి చేయవలెను. తొడిమితో సంప్లవము చేసినచో నా ఫలము రాక్షసుఁడు హరించును. మారేడుదళము (మూడాకులు) ఛిన్నము భిన్నము కాకుండా చూచి చేయవలెను. ఒకవస్తువునకు రెండు మూఁడుమారులు ప్లవనము చేయరాదు. చేసినచో నధోగతి నందును. శిష్యులతో కుమారులతో జాగ్రత్తగా నిది చేయవలెను. మృదువులయిన పువ్వులు, లతలు మొదలయిన వానికి నిట్లే ప్రోక్షణముచేసి హోమము చేయవలెను. పాయసాన్నము, అన్నము, మోదకము, పిండి, శాలిధాన్యముతోఁ గలిపి చేయరాదు. అలా చేసినచో కర్మవ్యత్యయము కల్గును. హోమ

ముల లెక్క చిటికిన వ్రేలిదగ్గరనుంచి కాని, వ్రేలి కణుపుల నుంచిగాని లెక్కపెట్టవలెను. మఱియు నొకదారము చేతి మణి కట్టునకుఁ దోరమువలె కట్టుకొని లెక్కపెట్టవలయును.

శ్రీపర్ణి, శింశుప, బాడిద, క్షీరి, బిల్వము, ఖదిరము, స్రువములకుఁ బనికివచ్చు దారువులు. తటాకాది ప్రతిష్ఠలకు ధాత్రి (ఉసిరి) ఖదిర కేశరము లుత్తమములు. సంస్కారము లందు † శశి, మారేడు, ధాత్రి వృక్షము లుత్తమములు. రిక్తాది తిథులను విడచి తక్కినవానియం దుపవాసముండి మాంసము మాట స్మరింపనైన స్మరింపక మారేడుకఱ్ఱతో స్రుక్స్రువములు తయారు చేయవలెను. కర్ర ముప్పదిభాగములు చేసి యం దిరు వది యంగుళముల అగ్నికుండముయొక్క వేదికతో సమమైన యుదరముంచవలెను. స్రువము కటాహము (కాగురూపముగా) లోతుండవలెను. ఆ లోతు ధాత్రీఫలమంత యుండవలెను. అగ్ని వేదిక శూర్పాకారముగా నుండవలెను. (చేటవలె) దేవతేతర కార్యములందు స్రువము అరువదియంగుళము లుండవలెను. నా ల్గంగుళములు వెడల్పుండవలెను. చివర గరిటవలె నుండవలెను. స్రువదండమునకు మొదట కంకణము చెక్కవలెను. 'మృగ పదము' లేడియొక్క కాలువంటి గుర్తు చివర-మొదట యుండ వలెను. దర్వి రెండంగులముల మండలము కలిగి యుండవలెను. అది బంగారము, రాగి, శ్రీపర్ణి, ఇందు వృక్షము (గార) క్షీర వృక్షముతో చేయవలెను. పండ్రెండంగుళముల పొడ వుండవల

† శశి = ఇందువృక్షము. భిన్నము ?- అశ్మంతము = గారచెట్టు
అంగము = అంగుళము యనే యర్థములో వాడఁబడినట్లున్నది.

యును. రాగిది యైనచో నిరువదినాల్గుతులముల బరువుండ వలెను. దాని క్రైదు అంగుళముల (మండలము) చిప్ప యుండ వలెను. ఎనిమిదంగుళముల కాడి అన్నాదులు పాయసాదులు గ్రహించుటకు వీలుగా నుండవలెను. ఆజ్యాదులు గ్రహించు టకు పదితులాల బరువయినది చాలును. బంగారముగాని రాగి గాని మఱి యేదిగాని లేనప్పుడు పదునారంగుళముల ప్రమాణ ముగల పిప్పలి (రావి) దర్వి వాడవచ్చును. ఆజ్యస్థాలి (నేతి పాత్ర) నేతి చెంబుగాని, మట్టి పాత్రగాని గ్రహింపవచ్చును. ఆపైన పూర్ణవిధి (పూర్ణాహుతి) క్రమము నిర్వహింపవల యును. అయుత, లక్ష, కోటి హోమాదులలో ఋత్విజులసంఖ్య మొదలగు వివరములు మూలమునఁ జూడనగును. (అధ్యాయ ము 20) మండల విధానము (21 అ).

ఇది మధ్యమపర్వమున మొదటి భాగము.

---

## —♦ మధ్యమపర్వము – రెండవభాగము ♦—

క్రౌంచమండలా ద్యుద్ధారము వర్ణితము (1 అ) అందు బ్రసంగవశమున నెమలి, యెద్దు, సింహము, క్రౌంచపక్షి, కోతి అనువానిని పొరబాటుగానైన నింటిలోఁగాని, క్షేత్రమం దునగాని చెట్టుకొనగాని చూచిన వెంటనే నిలువబడి వందనము చేయవలెను. అందువలన బ్రహ్మహత్యాదోషముగూడ నశిం చును. వానిని బోషించుటవలనఁ గీర్తి కలుగును. దర్శనము చేసిన పాపము పోవును. లక్ష్మి వృద్ధి యగును. ఆయుర్భాగ్య మును పట్టును. నెమలి బ్రాహ్మణరూపము, వృషభము సదా

శివరూపము, సింహము దుర్గారూపము, క్రౌంచము నారాయణ స్వరూపము, వ్యాఘ్రము త్రిపురసుందరి, కృష్ణవ్యాఘ్రము కాళిక, చిత్రకపోతకము లక్ష్మీరూపము. స్నానముచేసి వీని దర్శనము నింటిలోఁ జేసినను బోషించినను గ్రహదోషములు శాంతించును. మహాక్రౌంచము, మధ్యక్రౌంచము నను మండలములు (పట్టుపెట్టుట) వానిలోఁ జూపవలసిన రంగులవివరములు నిందుఁ గలవు. అందు వాడవలసిన బియ్యపుపిండి మొదలయిన వానిని గురించియు నిందు గలదు. సుభద్రము, సర్వతోభద్రము మొదలైన మండలములు వాని నిర్మాణమునుగూర్చి యిందు విస్తరింపఁ బడినది.

—♦ శిల్పులకు వేతనాది నిర్ణయము ♦—

(2 అ.) దక్షిణాహీనమయిన, మానహీనమయిన గృహారామాది ప్రతిష్ఠలు ఫలశూన్యములుకావున వాని మానము మొదలయినవి తెలుపఁబడుచున్నవి. ప్రతిష్ఠలలో నాచార్యుఁడు, హోత, యజమాని బ్రాహ్మణుఁడై యుండవలెను. ఎనుబదిగవ్వలొక పణము. పదునాఱు పణము లొక పురాణము. ఏడు పురాణము లొక రజతము. ఎనిమిది రజతము లొక సువర్ణము. ఆరామప్రతిష్ఠలలో రెండు సువర్ణములు దక్షిణ యీయవలెను. నూయి త్రవ్వుటకు సగము స్వర్ణము, తులసి, ఆమలకి (ఉసిరి) యాగముల నొక సువర్ణము. లక్షహోమమున నాల్గు సువర్ణములు, కోటిహోమమునఁ తొమ్మిది సువర్ణములు, దేవతా ప్రతిష్ఠలో, దేవాలయప్రతిష్ఠలోఁ బదునాఱు సువర్ణములు, తటాకపుష్కర ప్రతిష్ఠలందు నాల్గవవంతు, మహాదానము,

దీక్ష వృషోత్సర్జనము, గయాశ్రాద్ధము ననువానియందు విలువ గట్టరానంత దక్షిణ యివ్వవలయును. దంపతులుసేయు వృషభోత్సర్జనమున నొక సువర్ణము, రాజు వన్ను వసూలు చేయుటకు, దీక్షయందు, దానమందు నెనుబది రత్తికముల బంగారము వేతనము. భారతము విన్నపుడు, గ్రహయాగమందు, ప్రతిష్ఠయందు నూరు రత్తికముల బంగారము నొసంగవలెను. అయుత, లక్ష, కోటి, హోమములందు నింతే దక్షిణ. ఏదేవత కిింద నేబ్రాహ్మణునిం గల్పింతురో వానికే యాదేవతకీయవలసిన దాన మీయవలయును. యజ్ఞదానవ్రతాదులలో దక్షిణ ప్రత్యక్షముగా నీయవలెను. (గుప్తదానము చేయరాదని భావము) దాసీదాసాదిదానములు గోదానము మొదలయినవి మనసా సంకల్పించి వానికిఁ బరివర్తనముగా ద్రవ్యముగాని మరియేదిగాని యీయవచ్చును. ఒకనికే యనేక దానములు వేరే వేరే చేయవచ్చును. రత్నదానమునకు బంగారము దక్షిణ యీయవలెను. బంగారు దానమునకు వెండి దక్షిణ. వెండికి బంగారము దక్షిణ. భూమికి భూమియే దక్షిణ. వస్త్రమునకు వస్త్రమే. పానీయమునకుఁ బానీయమే. ధాన్యమునకు ధాన్యమే. గజదానమునకు ఛాగము, గుఱ్ఱమునకు మేక. పశువులకు నాల్గుకాళ్ళ జంతువులు, దేవునికి దేవుఁడే దక్షిణ. యజ్ఞమునం దాచార్యునకు నొకభాగము, ఋత్విక్కులకు మూఁడు భాగములు నీయవలయును. † ఈ

† పాపకైస్తుకలత్రిణాం భాగైకం తదనంతరం
పాత్రిణా మృత్విగాదీనాం భాగత్రయ ముదాహృతం
సర్వసత్వస్వభాగైకం స్వల్పం చోచ్ఛిష్టగౌరవాత్. (అర్థంకాలేదు.)

చెప్పిన లెక్క ప్రకారము చేయలేకపోయినచో యజ్ఞసిద్ధి కొరకు దేవతను (దేవతామూర్తులయిన సాలగ్రామాదులను) పుస్తకము, రత్నము, గోవులు, ధాన్యము, నువ్వులు, నమేరు ఫలములు పువ్వులు నీయవలెను. నాల్గుచక్రములు గల జనార్దనమూర్తియైన సాలగ్రామ మీయవలెను. శ్వేతలింగము, రత్న లింగము, ఇంద్రనీలాదికముగాని, దక్షిణావర్తశంఖముగాని, హరివంశముగాని యివ్వవలయును. సామాన్యలింగము, శ్రీధరమూర్తి, అనంతమూర్తి, బాణలింగము, పుస్తకము, నను నవి యెనిమిదవవంతు స్వర్ణముతో దానమియ్యవలెను. జ్యోతిషమునకు సగము సువర్ణము, వృషోత్సర్జనమున రజతములో సగము హరివంశమున నూరుశ్లోకములకు నొక సువర్ణము నీయవలయును. ధర్మశాస్త్రశ్లోకములు వేయి చెప్పించుకొన్న మూడు రజతము లివ్వవలయును. కపిలాగోదానమున సగము సువర్ణము, సామాన్య ధేనుదానమునకు ప్రాయశ్చిత్తార్థముగ చేయు గోదానమునందును 'పురాణ' పరిమాణమయిన బంగారము నీయవలయును. నల్లనియెద్దును విడిచినపు డారు పురాణములు, తెల్లని వృషభమును వదలినపుడు తొమ్మిది పురాణములు దక్షిణ యీయవలెను. నీలవృషభోత్సర్జనము దక్షిణ యీయవలెను. నీలవృషభోత్సర్జనమునందు ముప్పది రెండు పురాణముల బంగారము నీయవలెను. నమేరువుయొక్క ప్రతిచక్రమును దానమిచ్చునపుడు పండ్రెండు బంగారు రత్తికము లొసంగవలెను. మారేడుపండు దానమిచ్చినంత

మాత్రమున మూఁడు పురాణముల బంగారము దక్షిణ యివ్వవలెను. ఒక యుసిరివందుకుఁ బ్రత్యేకము మాషమెత్తుగల వెండి దక్షిణ యివ్వనగును. ఇది మూల్యపద్ధతి. ఆమీఁద పూర్ణపాత్రము విషయము తెల్పఁబడినది (చూడుడు 4 అ.) చతురస్రాదికుండనిర్మాణమున కీయవలసిన వెల వర్ణింపబడినది. రోజుకూలిని గురించి కూడా యున్నది. బంగారపు పనికి రోజుకొక్క పణ మివ్వవలయును. రత్నకుట్టిమ నిర్మాణమున రోజుకు పురాణ మివ్వనగును. వెండి కుట్టిమమునకు దానిలో సగము. స్ఫటికము నొఱయుటకు రోజుకు రెండు పణములు, రత్నపుపనికి, రత్నమునకుఁ దొలవేయుటకు 'కాకిణీ' పరిమాణమైన వెల యివ్వవలెను. స్ఫటికము, మణివేధకు నాల్గు వరాటికలు. కంచు, మొదలయినవాని నిర్మాణమునందు కంచు నూదుటకు మూఁడు పణములు. ఒక్కపనికి దానిలో సగము. గోవులపాలు పిదుకుటకు నాల్గు వరాటములు. వస్త్రములు నేయుటకు, మూఁడు పణములు. అవివస్త్రనిర్మాణమునకు పదికాకిణులు, పిధానవస్త్రమునకు మూఁడు పణములు. (దుప్పటికి అని తోఁచుచున్నది). కట్టుబట్టకు, కంచువాకు రెండు పణములు. వెదురుపనికి రోజునకు పణముమీఁద నొక కాకిణి. లోహపుపనికి నంతే. మంగలికి శిరోవపనమునకుఁ బదికాకిణులు గడ్డము గోళ్ళుమాత్రమున కయినచో రెండుకాకిణులు, స్త్రీల గోళ్ళమీఁద చిత్తర్వులు రంగులు వేయు పనికి పణముపై నొక కాకిణి కూలి. స్తనములమీఁద చేసిన పత్రరచనకు నంతే. పాపిడియందు, అలకలయందు (ముంగురులయందు) చేసిన

రచనకు నాల్గు పణములు. పాదములకు, మెడకు, గుహ్యావయవములయందుఁ వేసిన చిత్రములకు రంగులకు మూఁడు స్వరపణముల వేతన మీయవలయును. ధాన్యము చల్లికకు రోజునకు నొక్క పణము. ఉప్పుపంటకు నంతే. పోక చెట్లు నాటుటకు నంతే? దండపత్రమునకుఁ జేయు సంస్కారమునకు, మిరియాలకు రెండు పణములు. ప్రతి దుక్కికి నొక పణముమీఁద నొక కాకిణి. చక్రమునకు (బండికి సంబంధించిన పనిలో) మూఁడు పణములు. దున్నపోతుల బండికి నాల్గు పణములు. నరులు మోయు వాహనమునకు నొక్క పణము, పయిన పది కాకిణులు. దాసీలకు, గర్ధభములకు రెండు కాకిణు లెక్కువ. నూనె, కారము నంటిన వస్త్రములుదుకుటకు పయిరీతిగానే. పెద్దవి, వెడల్పుగలవి యగు వస్త్రములకు వానినిబట్టి పెంచవలయును. పొద్దున అప్పటికప్పుడు జాడించి యిచ్చుటకు పైదానిలోసగము. తెల్లనిబట్టకు కొంచెము తగ్గించవచ్చును. మరీ సన్నసిబట్ట యైనచో పెంచవలయును. బెల్లు విఱచుటకు, చెఱకు నరకుటకు, పుష్ప సంస్కారమునకు పది కాకిణులు. మాలకట్టుట కొక కాకిణి. కంఠమాల కట్టుటకు రెట్టింపు. రెండంగుళములు గట్టిన శిరోమాల యగును. మూఁడు హస్తములున్న కంఠమాల యగును. అది నాభికమలముదాక యుండును. దీనికి మూఁడు కాకిణులు. మాలతి, తులసి, జాజి, మల్లి, దవనము, మరువము, వకులము, కలిపికట్టిన పై వెలలో సగమివ్వవలెను. నేతిదీపమునకు ప్రతియామమునకు మాష మెత్తు రజతము. నూనెయయిన నొక్క కాకిని జాలును. అంగుళస్వర

గుడ్డవత్తి వేయవలెను, ఆఱంగుళములకంటె మించరాదు. ఇరువదియైదు దారపు పోగులతో నైదంగుళముల పొడవైన వర్తి చేయవలెను. ఒక హస్తము యెత్తు సెమ్మెయైన నీచము. హస్తముమీద గుప్పెడున్న మధ్యమము. మూఁడు నాలుగు హస్తములున్న నుత్తమమూనము. బంగారు సెమ్మెమీద దీపముంచిన రాజు నశించును. వెండిదయినచో సర్వకామప్రదము. రాగిదయిన నాయుక్షయము. ఇనుపది దుర్గతి నిచ్చును. శరమర్దము చాలమంచిది. కంచుసెమ్మెగాని, రీతి (ఇత్తడి) మయముగాని లేనప్పుడు మట్టిసెమ్మెగాని యుత్తమములు. మట్టి సెమ్మెకు కొలతలేదు. దశాంగము ధూపము వేయుటకు మూఁడువణములు పండ్రెండంగుళముల వత్తిని ధూపమున కుపయోగింపవచ్చును. అయిదు హస్తముల ప్రమాణము కూడా ధూపవర్తి చేయవచ్చును. ఇరువదియైదు హస్తములపొడవయిన నది మహావర్తి యనంబడును.

## —♦ క ల శ స్థా ప న వి ష య ము ♦—

(15 అ.) సప్తాంగము, పంచాంగము అని కలశ స్థాపన రెండు విధములు. మంగళాచారములందు, యాత్రాసిద్ధి కలుగుటకు కలశ స్థాపన యవసరము. కలశలు లేనిపక్షమున నక్షతలయందుగాని, పూ...యందుగాని దేవతాహ్వానము చేసి పూజింపవలయును. మఱియెక్కడను దేవతాహ్వానము చేయరాదు. చేసిన ఫలింపదు. మఱ్ఱి, రావి, ధాతకి (ఆరె) జువ్వి బిల్వము.

ఇవి పంచపల్లవములు– ఇవి కలశమీాద నుంచవలెను. సువర్ణ రజత తామ్రమృణ్మయములు కలశలు యథావిభవముగా గ్రాహ్యములు. వివరములు మూలము చూడవలెను.

## —♦ మా స ని రూ ప ణ ము ♦—

(6అ.) కాలమానము–చాంద్రము, సౌరము, సావనము నాక్షత్రము నని నాల్గు విధములు. శుద్ధ పాడ్యమి మొదలు అమావాస్యదాక చాంద్రమానము. సూర్యుం డొక్క రాసిలో నున్నంతకాలము సౌరమానము. ముప్పదిరోజులు మాసమైన సావనమాస మనంబడును. అశ్విని మొదలు రేవతివరకు నక్షత్రములను బట్టి నాక్షత్రమాసము అనంబడును. సూర్యోదయము నుండి మఱల సూర్యోదయముదాక సావన దినము. ఒక తిథి యొక్క భాగకాలము చాంద్ర దివసము. రాసియొక్క ముప్పదియవ భాగకాలము సౌరదినము. గృహారంభాదులలో సావన మాసము గ్రాహ్యము. ప్రాయశ్చిత్త క్రియలయందు, మంత్రోపాసనాదులందు అన్నప్రాశనమునకు, పన్ను వసూలుచేయుటకు రాజవ్యవహారములందు,యజ్ఞములందు సావనము గ్రాహ్యము. వివాహాదులు సౌరమానముచేఁ జేయవలయును. యజ్ఞములు, వ్రతములు, స్నానాదులందును సౌరము గ్రాహ్యము. పార్వణమందు, వార్షికములందు, అష్టకలశ్రాద్ధాదులందు తిథికార్యములయందు వ్రతములందు చాంద్రము గ్రాహ్యము. సోమయాగ కర్తల యార్యభాగవిచారణమందు, పన్ను వసూలు నందు,

నాక్షత్రము గ్రాహ్యము. చైత్రాది మాసోక్తమైన క్రియాకలాపము, తిథులయందు చెప్పబడిన కర్మములు చాంద్రమానము చేతనే చేయవలెను. అధికమాస మలమాసాది లక్షణము నీమీఁద చెప్పినారు (8 అ.). తిథివిశేషములు వ్రతాదులు. (9 వ అధ్యాయము) ప్రవర, ఖండ, గోత్ర ప్రవరలు. అవి తెలియనప్పుడు కాశ్యపగోత్రమని చెప్పవలయును. కశ్యపబ్రహ్మయొక్క సంతానమే జగత్తంతయు నగుటచే యీ ప్రకారము చెప్పవలెననియున్నది. 10అ. అంకురార్పణవిధి వర్ణితము. (గృహసౌధహర్మ్యాది ప్రతిష్ఠావిషయము) 11 అ. పూజాక్రమము. 12 అర్ఘ్యదాన విధి. 13, 14 హోమాదివిధానము. 15 ధ్యానవిధి. 16 ప్రతిష్ఠాపూర్వదినకృత్యము. 17 హోతలు మొదలయినవారి విషయము, వారి స్తుతులు. 18, 19 దేవతా ప్రతిష్ఠా విషయము. 20 సప్తాగ్నిష్టోమకము అను యజ్ఞవిధానము వర్ణితము. ఇందు నీటిలోఁ జేపలు, తాబేళ్ళు, కప్పలు మొదలయిన వానిని వదలుట మొదలైన విశేషములు, విధానములు వర్ణింపఁబడినవి.

## మధ్యమ పర్వము – మూఁడవ భాగము

1 అ. ఆరామప్రతిష్ఠలో విశేషములు. 2 గోప్రచారము. (గోవుల తిరుగుటకు వదలే భూమికి గోభూమియని పేరు. అది వదలునపుడు చేయవలసిన శాస్త్ర విధాన మిందు వర్ణితము.) అనాథ మండప నిర్మాణము. (దిక్కులేనివాళ్ళు నివసించుటకు నిర్మించు నిండ్ల విషయము) చలిపందిలి.

3, 4 అ. క్షుద్రారామ ప్రతిష్ఠా విధానము. 4 దిగుడు బావుల మడుగులలో తామర చెరువుల ప్రతిష్ఠ. (మారేడువన ప్రతిష్ఠ.) 5. 6. 7. అ. 8 అ. అశ్వత్థ ప్రతిష్ఠ. 9 అ. వట ప్రతిష్ఠ. 10. 11 బిల్వప్రతిష్ఠ (మారేడు) 12, 13 రాతితోను దారువుతోను నిర్మించు మండపముల ప్రతిష్ఠా విషయము. 14 పుష్పారామ ప్రతిష్ఠ. 15 తులసీ ప్రతిష్ఠ. 16 వనప్రతిష్ఠా విషయము. 17 గోభూమి విషయము. 18, 19 ఏకాహ ప్రక్రియలో ప్రతిష్ఠ. 20 దుశ్శకున విషయము, శాంతి విషయము విస్తరింప బడినది.

ఇది మధ్యమ పర్వము.

---

# అ ను బ ం ధ ము

## 8వ పుటలోని పదముల వివరణము

1. సౌవీరము = 'యవలు' అనే బియ్యంలోనుంచి తీసిన మద్యము.
2. ఆరనాళము = 'యవలు' అనే వడ్లు (పొట్టుతీయకుండా) ఉడికించి తీసిన మద్యము.
3. కిణ్వబీజము = (స్విన్న బీజము కాదు) అన్నములోనుండి తీసిన సురమీంద తేరిన తేటకు 'ప్రసన్న' అని పేరు. దానిక్రిందకు తేరిన చిక్కని గుజ్జుకు 'కాదంబరి' అని

పేరు. దానికిృందకు ఇంకా తేరిన చిక్కనిగుజ్జుకు 'జగలము' అని పేరు. అది కాచివడగట్టి తేర్చిన గట్టిపదార్థమునకు కిణ్వబీజము అని పేరు.

4. వారుణి = తాటికల్లు, ఖర్జూరపుకాయలు కలిపి నిలవ చేసి తయారుచేసిన సుధ.
5. కాంజికము (గంజి)= గుగ్గిళ్ళు, ధాన్యం, గంజి కలిపి చేసినది.
6. యవాగువు = 6 రెట్లు నీళ్ళుపోసి తీసిన చిక్కని గంజి.

మండము = 14 రెట్లు నీళ్ళుపోసి తీసిన గంజి.

9వ పుట

మైరేయము = మద్యవిశేషము.

పిశితాన్నము = మాంసాన్నము.

త్రిమధురము = నెయ్యి, తేనె, పంచదార.

ఖాండవము } (మురబ్బా) దీనికి 'షాడవము' అని పేరు
రాగషాడవము } కన్పించుచున్నది. పంచదార, సౌవర్చలవణము, సైంధవలవణము, చింతపండు, చిట్రేతపండు, నేరేడు, వీని రసములతో గలిపి ఆవపెట్టి తయారుచేసినది 'రాగము' అనబడును. ఇందులోనే తీపి, పులుపు కూడా కలిపి చేసినదానికి ఖాండవమని పేరు. మామిడి ముక్కలు చెక్కుతీసి నేతితో వేయించి వీటికి పంచదార పాకం బట్టి ఉడకబెట్టిన ఆ ముక్కలువేసి అందు మిరియాలు, ఏలకులు, పచ్చకర్పూరము తగుమాత్రింగా వేసి చమురుపూసిన కుండలో నుంచినదానికి రాగ ఖాండవము లేక 'రాగషాడవము' అని పేరు.

| | | |
|---|---|---|
| భక్తము | = | మెతుకులు |
| విలేపిక | = | చిమిడిన యన్నము (అన్నపుగుజ్జు) |
| కోవిదారము | = | దేవకాంచనము |
| రాజవృక్షము | = | రేలచెట్టు |
| సప్త ధాన్యములు | = | సప్తవ్రీహిగణము |
| వికంకతము | = | ఆరెచెట్టు (పూలచెట్టు) |
| సుచందనము | = | మంచిగంధములో (భేదము) |
| అగ్ని మంథము | = | నెల్లిచెట్టు |
| ఆరగ్వధము | = | రేల |
| దారువు | = | దేవదారువు |
| విభీతకము | = | తాడికాయ (త్రిఫలాలలోది) |
| గైరికము | = | (జేగురురాయి) |
| న్యగ్రోధము | = | మఱ్ఱి |
| బ్రహ్మవృక్షము | = | మోదుగ |

(పుట 75)

పంచపల్లములు = నేరేడు, వెలగ, మాదీఫలము, మారేడు వీటి చిగుళ్లు (ఆమ్రజంబూకపిత్థానాం బీజపూరక బిల్వ యోః। గంధకర్మణి సర్వత్ర పత్రాణి పల్లవం) మఱ్ఱి, రావి, జువ్వి, కళ్ళరావి, మేడి, వీటి చిగుళ్ళు (పల్లవాః క్షీరివృక్షాణాం హితాః పిత్తాతిసారిణామ్.) పంచ వల్కలములలో వేము ఒకటిగా చేరినది. మఱియొక మత ములో రావి, మఱ్ఱి, జువ్వి, అత్తి, నేరేడు, చేరి యున్నవి. ఈ ఆకులలో భోజనము చలువచేయును. పైత్యము నణచును, బుద్ధిని హెచ్చించును. కొద్ది కఫము. వాతము చేయును. అని వస్తుగుణదీపిక.

# ప్రతిసర్గపర్వము — 3

## — కృతయుగాది రాజ వంశావళి —

భవిష్యమహాకల్పమున, బ్రహ్మయువురయొక్క పరార్థమున మొదటి యబ్దమున ♦ మూఁడవ రోజగు వైవస్వత మన్వంతరము నిరువదియెనిమిదవ సత్యయుగమున రాజు లెవ్వరు ? అని శౌనక మహర్షి యడుగగా సూతుం డిట్లు తెలుపం దొడంగె. శ్వేతవరాహ కల్పమున బ్రహ్మబ్దమున మూడవరోజులో నేడవ ముహూర్తమున వైవస్వతుఁడు మనువయ్యెను. అతఁడు నూరు సంవత్సరములు సరయూ తీరమునఁ దపముచేసి 'ఇక్ష్వాకువు' అను కుమారుని బడసెను. ఇక్ష్వాకువు బ్రహ్మవరముచే దివ్యరథము నంది నారాయణు నారాధించి రాజ్యము హరిసమర్పణము చేసి ముప్పదియారువేలేండ్లు పాలించెను. అతనికి వికుక్షి యుదయించెను. అతనికి రిపుంజయుఁడు, వానికి కకుత్థ్సుఁడు, వానికి సేనాంనుఁడు, అతనికి బృథువు, నతనికి విష్వగశ్వుఁడు, వానికి శార్ద్రిఁడు, నతనికి భద్రాశ్వుఁడు, వానికి యవనాశ్వుఁడు, వానికి శ్రీవత్సుఁడు, వానికి సత్యపాదుఁడు నుదయించి భారత దేశము పాలించిరి. సూర్యోదయ సూర్యాస్తమయము జరుగునంతవరకు భూమండలమంతయు వారేలిరి. బృహాదశ్వుఁడు, కువలయాశ్వుఁడు నను నీ పైవారందరు శతహీనముగా నూరేండ్లు తక్కువగా రాజ్యమేలిరి. దృఢాశ్వుఁడు, నికుంభకుఁడు, సంకటాశ్వుఁడు, ప్రసేనజిత్తు, రవణాశ్వుఁడు, మాంధాత నను

---

♦ ఇప్పుడు మొదటిరోజే జరుగుచున్నట్లు ప్రమాణములన్నీ తెలుపుచున్నవి. సంకల్పములో నట్లే చెప్పుచున్నాము.

వీరందరు సహస్రహీనముగా (వేయేండ్లు తక్కువగా) రాజ్యము నేలిరి. మాంధాత కొడుకు పురుకుత్సుడు, త్రింశదశ్వుడు శతహీన మేలిరి. ఈ త్రింశదశ్వునికి రథమునకుఁ గల గుఱ్ఱములు ముప్పదియుండెడివట. అనరణ్యుడు ఇరువది యెనిమిది వేలు, (ఇతఁడు కృతయుగముయొక్క రెండవపాదమువాఁడు) వానికుమారుఁడు వృషదశ్వుఁ డారువేలేం డ్లేలెను. హార్యశ్వుఁడు, వసుమంతుఁడు, త్రిధన్వుఁడు నను వారు సహస్రహీనముగా నేల నేలిరి. ఇంతటితో భారత దేశమున రెండవ పాదము సమాప్త మైనది. త్రిధన్వునికుమారుఁడు త్రిపారణ్యుఁడు, త్రిశంకువు వేయేసేం డ్లేలిరి. ఈ త్రిశంకువు మోసముచేఁ దక్కువ జాతివాఁడయ్యెను. ఇతని కుమారుఁడు హరిశ్చంద్రుఁడు; వానికుమారుఁడు రోహితుఁడును నిరువది వేలేండ్లు పాలించిరి. అతని తరువాత హారీతుఁడు, చంచువు, విజయుఁడు, రురూకుఁడు, సగరుఁడు నిరువది వేలేసి యేండ్లు పాలించిరి. ఇటుమీఁద బాహుసేనునిదాక విష్ణు భక్తులని పేరొంది వైవస్వతుఁడు మొదలుగ నీరాజులు కృతయుగము మూఁడవ పాదము సగముదాకా పాలించిరి. సగరుఁడు కృతయుగము మూఁడవపాదము మధ్యమునకు వచ్చెను. అతఁడు శివభక్తుఁడు. వాని కుమారులు సాగరులు. వారి రాజ్యకాలము ముప్పదివేల యేండ్లు. సాగరులు నశింపగా వారి కుమారుఁడు అసమంజసుఁడు రాజయ్యెను. వానితరువాత అంశుమంతుఁడు, దిలీపుఁడు, భగీరథుఁడు, శ్రుతసేనుఁడు, నాభాగుఁడు, అంబరీషుఁడు నేలిరి. శ్రుతసేనునిదాక యందరు శైవులు. నాభాగుఁడు వైష్ణవుఁడు. ఇంతటితో కృతయుగతృతీయపాదము

ముగిసెను. అంబరీషుఁడు సరిగా కృతయుగము నాల్గవపాదము
మొదట నుండెను.అతని రాజ్యకాలము పదునెనిమిది వేల యేండ్లు.
అతనికొడుకు సింధుద్వీపుఁడు, అయుతాశ్వుఁడు, ఋతుపర్ణుఁడు,
సర్వకాముఁడు, కల్మాషపాదుఁడు, సుదాసుఁడు, శమకుఁడు
(మదయంతికి వసిష్ఠునికిం గలిగినవాఁడు). అంబరీషునినుండి సుదా
సునిదాక యేడుగురు వైష్ణవులు. వీరు శతహీనముగా నేలినవారు.
సౌదాసుఁడు (అశ్మకుఁడన్నమాట) గురుశాపముచే రాజ్యాంగ
మును గురున కిచ్చెను. గోకర్ణలింగభక్తుఁడు. శమకుని కొడుకు
హరివర్మ వైశ్యునివలె సాధుభక్తుఁడు. మూఁడువేలయేండ్లు
లోపుగాఁ పరిపాలించెను. వాని కుమారుఁడు దశరథుఁడు. తం
డ్రివలె నేలినవాఁడు. వాని కుమారుఁడు దిల్లీవయుఁడు. ఇట్లు
విశ్వసహుఁడు, నియుజ్ఞుఁడు నేలిరి. నియజ్ఞుఁడు సామాన్యుఁడు.
వాని యధర్మముచే వానలు కురియకుండెను. నూరేండ్లనా
వృష్టివలన సర్వరాజ్యము నశించెను. వశిష్ఠుఁడు రాణిమాట
ననుసరించి యజ్ఞము చేసెను. అందు ఖట్వాంగుఁ డుదయిం
చెను. అతఁడు శస్త్రముదాల్చి ముప్పదివేలేండ్లు దేవేంద్రునికి
సహాయ మొనర్చి వరమంది దేవతల యనుగ్రహముచే ముక్తి
నందెను. ఖట్వాంగుని తరువాత ముప్పదివేలేండ్లు దీర్ఘబాహుఁ
డేలెను. వానివలన సుదర్శనుఁడు జనించెను. అతఁడు దేవీపూజా
తత్పరుఁడు. దశరథుని కుమారునివరకు వారు వైష్ణవులు.
ఖట్వాంగుఁడు, దీర్ఘబాహువును వైష్ణవులే. సుదర్శనుఁడు ప్రా
జ్ఞుఁడు. కాశిరాజు కుమార్తెను వివాహమాడి రాజులజయించి
దేవీప్రసాదముచే భరతఖండాన్తము రాజ్యమును ధర్మముగా

నేలెను. అతం డయిదు వేలఏండ్లు రాజ్యముచేసెను. మహాకాలి యతనికి స్వప్నమందు "వత్సా నీవు ప్రియురాలితో, వశిష్ఠాది మహర్షులతో హిమాలయమున కేగియుండుము. మహామాయ ప్రభావముచే భరతఖండమున నాశనముకల్గును. పశ్చిమసముద్రమైన 'రత్నాకరము' అందలిద్వీపములు నశించును. పూర్వసముద్రమగు 'మహోదధి' దానిద్వీపములు నశించును. దక్షిణసముద్రమగు 'బాడబము' అందలి ద్వీపములు నశించును. ఉత్తర సముద్రమగు 'హిమాబ్ధి' సగరులు త్రవ్వినది ద్వీపములతో లయించును. ఈ భారతవర్షము నేటి కేడవరోజున జీవకోటితో ప్రళయమందును. కావున నీవు జీవించియుండుము.' అని వివరించెను. రాజు మహాకాళి వచనమ్ముల నంగీకరించి హిమగిరి కేగెను. ఆ యేగునపుడు ముఖ్యులగు రాజులను, ప్రధానవైశ్యులను ద్విజులను వెంటదీసికొని వెళ్ళెను. పంచవర్షప్రమాణముగ వాయువు, తేజస్సు, ఇసుక, భూమిపైఁ గురిసి జీవులు క్షయించిరి. అయిదేండ్లు నేల జలమయ మయ్యెను. అది శాంతించి వాయువు రేగి యా నీటినెల్ల యెండించెను. పదియేండ్లలో భూమి మరల తేలెను.

(2 అ) వైశాఖశుక్లపక్ష తృతీయా గురువారమున సుదర్శనుఁడు పరివారముతో నయోధ్యకు వచ్చెను. మాయా దేవీ ప్రభావముచే పురమెల్ల మనోహరమై యన్నసమృద్ధమై రత్నాఢ్యయయ్యెను. పదివేలేం డ్లతఁడు రాజ్యమేలి శాశ్వత లోకమందెను. అతని కుమారుఁడు దిలీపుఁడు. నందినీధేను వర ప్రసాదముచే నతని కుమారుఁడు రఘువయ్యెను. వీరిద్దరు పది

వేలేండ్లు యేలిరి. ఆ రఘువు పేర 'రఘువంశము ఖ్యాతికలిగెను. ఇది త్రేతాయుగమే. బ్రాహ్మణవరముచే నతనికి "అజుఁడు" జన్మించెను. ఇతఁడును తండ్రియంత కాలమేలెను. అతనికి దశరథుఁ డుదయించెను. ♦ అతఁడు తండ్రియంత కాలమేలెను. అతని కుమారుఁడు రాముఁడు పదకొండువేల సంవత్సరములు పాలించెను. అతఁడు సాక్షా ద్విష్ణువే. అతని కుమారుఁడు కుశుఁడు పదివేలేండ్లేలెను. అతని కొడుకు కతిథి, మరి నిబంధుఁడు, నలుఁడు (శక్తి పూజకుఁడు), నాభుఁడు, పుండరీకుఁడు, క్షేమధన్వుఁడు, ద్వారకుఁడు, అహీనజుఁడు, కురువు ననువారు క్రముగా పదివేలేసి యేండ్లు పాలించినవారే. ఈ కురువు పేరనే పది యోజనములమేర కురుక్షేత్రమని పేరొందెను. ఇంతటితో త్రేతాయుగము ప్రథమపాదము భారతాంతరమున ముగిసెను. కురువు కొడుకు పారియాత్రుడు, అటుమీద దలపాలుఁడు, ఛద్మకారి, ఉక్థుఁడు, వజ్రనాభి, శంఖనాభి, వ్యుత్థనాభి, విశ్వపాలుఁడు, స్వర్ణనాభి, పుష్పసేనుఁడు, ధ్రువసంధి, రాజ్యవర్మ, శీఘ్రగుఁడు, మరుపాలుఁడు, ప్రసూవమిత్రుఁడు, సుసంధి అనువారును పదివేలేండ్లు పాలించినవారే. ఇంతలో త్రేతాయుగ పాదము మఱియొకటి ముగిసెను. అటుమీద సుసంధి కుమారుఁడు మామర్షుఁడు, మహాశ్వుఁడు, బృహద్బలుఁడు, బృహదైశానుఁడు, మురుక్షేపుఁడు, వత్సపాలుఁడు, వత్సవ్యూహుఁడు, పతివ్యోముఁడు, దేవకరుఁడు, సహదేవుఁడు, మరుదేవుఁడు, సునక్ష

♦ రామాయణమున నితఁ డరువదివేలేం డ్లేలినట్లున్నది. ఈ భేదము కల్ప భేదము వలననేమో!

త్రుడు, కేశీనరుడు, దుంతిరక్షుడు, సువర్ణాంగుడు, అమిత్రజిత్తు బృహద్రాజు, ధర్మరాజు, కృతంజయుడు, రణంజయుడు, సంజయుడు, శాక్యవర్ధనుడు, క్రోధదానుడు, అతులవిక్రముడు, ప్రసేనజిత్తు, శూద్రకుడు పదివేలేల్రి. తర్వాత సురథుడు అనువాడు అయిదువేలయేండ్లే పాలించెను. వీరందరు రఘువంశ రాజులే. వీరందరు మొత్త మిరువదియైదుమంది. అందరు దేవీపూజాతత్పరులు. హింసాయజ్ఞములు చేసినవారే. ఈపరంపరలోని కొందరు బద్ధులయి వర్ణ సంకరులయి త్రేతాయుగము మూడవపాదము మొదట వర్తించిరి. రోహిణీపతియయిన చంద్రు డింద్రునిచే భూమికి బంపబడెను. ప్రయాగనగరమం దతడు రాజయ్యెను. అతడు విష్ణుభక్తుడు. శివపూజా తత్పరుడును. మాయాశక్తి ప్రసారమునకయి నూరు యజ్ఞము లాచరించెను. పదునెనిమిదివేలేండ్లు పాలించి స్వర్గస్థుడయ్యెను. అతని పుత్రుడు బుధుడు. అత డిలాదేవిని వివాహమాడి పురూరవునిగాంచెను. అతడు పదునాల్గువేలయేండ్లు భూమిని బాలించెను. అత డూర్వశిని భోగించెను. అతని కుమారుడు ఆయువు వైష్ణవుడు, పురూరవుడు ముప్పదియారువేలేండ్లు పరిపాలన చేసెను. గంధర్వ నగరము నేగెను. వాని కుమారుడు నహుషుడు. అత డింద్రత్వమును గూడ సంపాదించెను. ఒక్క వేయేండ్లు మూడులోకములను వశముచేసికొని ఏలెను. దుర్వాసుని శాపముచే గొండచిలువయయ్యెను. తర్వాత యయాతి. అతని కైదుగురు కొడుకులు. ముగ్గురు మ్లేచ్ఛులయిరి. ఇద్దరుమాత్ర మార్యత్వమందే యుం

డిరి. అందు యదువు పెద్దవాఁడు. పూరువు చిన్నవాఁడు. అతఁడు లక్ష సంవత్సరాలు రాజ్యమేలి విష్ణు ప్రసాదముచే వైకుంఠము పొందెను. యదువు కొడుకు క్రోష్టుఁడు. అరువది వేలేండ్లు పాలించెను. అతని కొడుకు వృజినఘ్నుఁడు. ఇరువది వేలు పాలించెను. స్వాహార్చనుఁడు, చిత్రరథుఁడు, అరవిందుఁడు నిరువది వేలు పాలించిరి. అర్ధశ్రవుఁడు, తేజశ్శాలి, వైష్ణవుఁడు పదివేలు పాలించిరి. తామసుఁడు, ఉశనుఁడు, శీతాంశుకుఁడు, కమలాంశుఁడు, పారావతుఁడు, భామఘుఁడు, విదర్భుఁడు, క్రోధుఁడు, కుంతిభోజుఁడు, పురుదైత్యుని కూతురుకొడుకు పాతాళమున వృషపర్వుని పట్టణమున వసించి మాయావిద్య సంపాదించి ప్రయాగ ప్రతిష్ఠానపురమున రాజ్యమేలెను. అతని రాజ్యకాలము పదివేలు. అతఁడు దేవీభక్తుఁడు. వాని కుమారుఁడు జనమేజయుఁడు. మీఁదట ప్రాచిన్వంతుఁడు, ప్రవరుఁడు, నభస్యుఁడు, భవదుఁడు, సుద్యుమ్నుఁడు, బాహుగరుఁడు, సంయాతి, ధనయాతి, ఐంద్రాశ్వుఁడు, రంతినరుఁడు, సుతపుఁడు, సంవరణుఁడు పదివేలేలినారు. సంవరణుఁడు హిమాలయమున నూరేండ్లు తపమొనర్చెను. సూర్యుని కుమార్తె యగు తపతి నితని కొసంగెను. ఆ రాజు తుదకు రవిలోక మందెను. అవ్వల మాయాశక్తి ప్రభావముచేఁ బ్రళయ మయ్యెను. భారతదేశము నాల్గు సముద్రములు నశించెను. రెండేండ్లు సముద్రమునందు భూమి యుండి మహావాయుప్రభావముచే నవియింకి యగస్త్య ప్రభావముచే మరల బయలు పడెను. అయిదేండ్ల తర్వాత భూమి వృక్షములు, గడ్డి మొలచి రాజిల్లెను.

సూర్యాజ్ఞచే సంవరణుఁడు తపతితో వశిష్ఠమునితో, త్రివర్ణ ముఖ్యులతో మరల యరుదెంచెను.

(3 అ.) సంవరణుఁడు వచ్చిన కాలమేమి? అటుమీఁద ద్వాపరయుగ రాజులెవ్వరు? తెలుపుమని శౌనకుం డడుగ నాతనికి సూతుం డిట్లనియె. భాద్రపదబహుళ త్రయోదశీ శుక్రవారము సంవరణుఁడు ప్రతిష్ఠాన నగరమునకు మరలి వచ్చినరోజు. అప్పు డైదువేల యోజనములు విశాలమైన యా నగరము మిగుల రమ్యముగా నలంకరింపఁబడెను. అందు రాజ సౌధ మర్ధక్రోశ మెత్తుగా విశ్వకర్మచే నిర్మింపబడెను. బుద్ధివంశ మునఁ బ్రసేనుఁడు 'స క్త' అనుపురమున కధిపతి కావింపబడెను. యదువంశమందు సాత్వతుడు మధురాధిపతిగా నొనరింపబడెను. మ్లేచ్ఛవంశమున శ్మశ్రుపాలుఁడు మరుదేశమున కేలికయయ్యెను. క్రమముగా వీరు ప్రజావృద్ధినందిరి. సంవరణుని రాజ్యకాలము పదివేలు. వాని కుమారుఁడు అర్చాజ్ఞుఁడు నంతేకాలమేలెను. తర్వాత సూరిజాపి యైదువేలు పాలించెను. వాని కుమారుఁడు సూర్యయజ్ఞుఁడు (సూర్యోపాసకుడు) శతహీనముగా రాజ్య మేలెను. వానితర్వాత ఆదిత్యవర్ధనుఁడు, ద్వాదశాత్ముఁడు, దివాకరుఁడు, ప్రభాకరుఁడు, భాస్వంతుఁడు, వివస్వజ్ఞుఁడు, హరి దశ్వార్చనుఁడు, వైకర్తనుఁడు, అర్కేష్టిమంతుఁడు, మార్తాండ వత్సలుఁడు, మిహిరార్ధుఁడు, అరుణపోషణుఁడు, ద్యుమణివత్స లుఁడు, తరణియజ్ఞకుఁడు, మైత్రేష్టివర్ధనుఁడు, చిత్రభానూర్జ కుడు, వైరోచనుఁడు, హంసన్యాయి, వేదప్రవర్ధనుఁడు, సావి త్రుఁడు, ధనపాలుఁడు, మ్లేచ్ఛహస్తుఁడు, ఆనందవర్ధనుఁడు,

ధర్మపాలుఁడు, బ్రహ్మభక్తుఁడు, బ్రహ్మేష్టివర్ధనుఁడు, ఆత్మ ప్రపూజకుఁడు, పరమేష్ఠిసుతుఁడు, హైరణ్యావర్ధనుఁడు, ధాతృయాజి, దుహిణవైరంచ్యుఁడు, కమలాసనుఁడు, శమవర్తి, శ్రాద్ధదేవుఁడు, పితృవర్ధనుడు, సోమదత్తుఁడు, సౌమదత్తి, సోమవర్ధనుఁడు, అవతంసుఁడు, ప్రతంసుఁడు, పరాతంసుఁడు, రాజ్యమయతంసుఁడు, సమాతంసుఁడు, అనుతంసుడు, అధితంసుఁడు, అభితంసుఁడు, సముత్తంసుఁడు, తంసుఁడు, దుష్యంతుఁడు-వీరందరు శతహాయనముగా నేలినవారే. దుష్యంతుడు శకుంతలాప్రియుఁడు. ఆమెయందు భరతునిం గన్నవాఁడు. ఇతఁడు దేవపూజాతత్పరుఁడు. మహామాయామహిమచే నతని ముప్పదియారేండ్ల యాయుర్దాయము ముప్పదియారువేల యేండ్లుగాఁ బెంపబడినది. అతని పేరనే యిది 'భరతఖండము' అని పేరొందినది. అతనిచే భూవిభాగము చేయఁబడినది. అతఁడు నూరు దివ్యవర్షము లేలినవాఁడు. వాని కుమారుఁడు మహాబలుఁడు. భరద్వాజుఁడు. నూరు దివ్యక్షేత్రములు పాలించిరి. అతని కుమారుఁడు భవనమన్యువు పదునెన్మిదివేలేండ్లు పాలించెను. బృహత్ క్షేత్రుఁడు, శక్రహోత్రుఁడు నట్లే యేలిరి. ఈ చివరివాఁ డింద్రు ననుగ్రహముచే స్వర్గమందినవాఁడు. అపుడు ప్రతాపేంద్రుఁ డయోధ్యను బదవేలేండ్లు పాలించెను. తర్వాత మండలికుఁడు, విజయేంద్రుఁడు ధనుర్దీప్తుఁడు పదివేలేండ్లు పాలించిరి. శక్రహోత్రుఁడు ఘృతాచితో దనుర్దీప్తుఁ డను వానిని జయించి రాజ్యమేలెను. హస్తియను రాకుమారుఁ డైరావతుని పిల్లయగు నేనుఁగు నెక్కి పడమటి దెస 'హస్తినా

పురము నిర్మించిరి. అది నూబది యోజనముల విస్తీర్ణము. గంగానది యొడ్డున నున్నది. అతని కుమారుఁడు ధ్వజమిత్రుఁడు నంతే కాలమేలెను. వాని కొడుకు సుశర్మణ్యుఁడు కురువు నంతే యేలిరి. అతఁడింద్రివరమున సశరీరస్వర్గమందినవాఁడు. అపుడు సాత్వతవంశమున వృష్ణియను బలవంతుఁడు మధుర నేకచ్ఛత్రముగ పాలించెను. హరికృపచే నతని కైదువేలేండ్లు రాజ్యము వశమయ్యెను. వాని కుమారుఁడు నిరావృత్తి, దశారి, వియామునుఁడు, జీమూతుఁడు, వికృతి, భీమరథుఁడు, నవర థుఁడు, దశరథుఁడు, శకుని, కశుంభుఁడు, దేవరథుఁడు, దేవ క్షేత్రుఁడు, మధువు, నవరథుఁడు, కురువుఁడు, అనురథుఁడు, మరుహోత్రుఁడు, విచిత్రాంగుఁడు సాత్వతవంతుడు, భజ మానుఁడు, విదూరథుఁడు. సురభక్తుఁడు, సుమనసుఁడు, తది క్షేత్రుఁడు, స్వాయంభువుఁడు, హరిదీపకుఁడు, దేవమేధ, సురపాలుఁడు నైదువే లేలిరి. కురువిందు నాజ్ఞచే ద్వాపరము మూఁడవపాదము గతించినపుడు దేవవేశ్య యగు సుకేశికిఁ బ్రియుండై భారతఖండమున కేతెంచెను. అపుడు దీనికి కురుక్షేత్ర మని పేరు గల్గెను. ఇది యిరువది యోజనముల వైశాల్యముగల పుణ్యక్షేత్రము. పండ్రెండువేలు కురురాజు దీని నేలినవాఁడు. వానికి జహ్నువు తరువాత సురథుఁడు, విదూరథుఁడు, సార్వభౌముఁడు, జయసేనుఁడు, అర్ణవుఁడు పండ్రెండువేలేండ్లు పాలించినవారు. అర్ణవుఁడు చతుస్సముద్ర ముద్రితధరామండలమునకుఁ జక్రవర్తి. వాని కొడుకు

ఋక్షసుతుఁడు, భీమసేనుఁడు, దిలీపుఁడు, నంతే యేలిరి. దిలీప పుత్రుఁడు ప్రతీపుఁ డైదువేలు పాలించెను. వానికొడుకు శంతనుఁ డొకవేయి యేండ్లు ప్రభువయ్యెను. వాని కొడుకు విచిత్రవీర్యుడు. రెండువందలయేండ్లు పాలించెను. పాండురా జైదువందలు పాలించెను. వాని కుమారుఁడు యుధిష్ఠిరుఁడు నేబది వర్షములు దొరయయ్యెను. అతనిముందు సుయోధనుఁ డరువది యేండ్లు పాలించెను. కురుక్షేత్రములో నతఁడు కురుక్షేత్రమునఁ గూలెను. మున్ను దేవాసురయుద్ధమున నే రాక్షసులు దేవతలచే నీల్గిరో వారందరు శంతనుని రాజ్యమున జన్మించిరి. వారి లెక్క యొక లక్షయష్టాదేహిణులుగాఁ దేలినది. వారి బరువుచే భూమి యింద్రుని శరణొందెను. అంతట కృష్ణావ తార మయ్యెను. అతఁడు శూరవంశమున వసుదేవునకు దేవకి యందుద్భవించెను. అటుపై రోహిణి గృహమ్ము చొచ్చెను. నూటముప్పదియై దేండ్లు భూమియందుఁ జరించి కృష్ణచంద్రుఁడు గోలోకము నధిష్ఠించెను ద్వాపరము నాల్గవపాదము చివర కృష్ణావతారముజరిగినట్లు పండితులు తెల్పుచున్నారు. ఆమీఁదట నభిమన్యునికుమారుఁడు పరీక్షిత్తుహస్తినాపురము నధిష్ఠించి ఒక వేయి యేండ్లు పాలించెను. ఆమీదట జనమేజయుఁడు మూఁడు వేలేండ్లు ప్రభుత్వము గావించెను. మీఁదట శతానీకుఁడు నంతే కాల మేలెను. మీఁదట యజ్ఞదత్తుఁ డైదు వేలు, నిశ్చక్రుఁడు వేయి; ఉష్ట్రపాలుఁడు, చిత్రరథుఁడు, ధృతిమంతుఁడు, సుషేణుఁడు సునీథుఁడు మఖపాలుఁడు నచక్షువు సుఖవంతుఁడు, పారిప్ల వుఁడు, సునయుఁడు, మేధావి రిపుంజయుఁడు, మృదువు, తిగ్మ

జ్యోతి, బృహద్రథుఁడు. వసుదాముఁడు, శతానీకుఁడు, ఉద్యా నుఁడు, అహీనసుఁడు, నిర్మిత్రుఁడు, క్షేమకుఁడు, వీరందరు నైదువేలు పాలించినవారే. క్షేమకుఁడు రాజ్యము వాసి కలాప గ్రామమున వసించి. మ్లేచ్ఛులచేఁ జంపఁబడెను. అటుమీఁదట వాని కుమారుఁడు ప్రద్యోతుఁడు నారదోపదేశముచే మ్లేచ్ఛ యజ్ఞము చేసెను. అప్పుడు మ్లేచ్ఛులితని జంపవచ్చిరి.

## —♦ ప్రద్యోతుని మ్లేచ్ఛయజ్ఞ వృత్తాంతము ♦—

4 అ. శౌనకుఁడు ప్రద్యోతుఁ డెట్లు యజ్ఞము చేసెనో తాము త్రికాలజ్ఞులు గాన నా సంగతి నా కెఱింగింపుఁడన సూతుం డిట్లనియె. ఒకనాడు హస్తినాపురమున ప్రద్యోతుఁడు కొండొక ప్రసంగమున నున్నతఱి నారదులవారే తెంచిరి. రాజుచేఁ బూజితులయి య మ్మునీంద్రులు సుఖాసనముండి యిట్లనియె. రాజా! మీ తండ్రి మ్లేచ్ఛులచే సంహరింపఁ బడెను. అందుచే నతనికి నరకము వచ్చెను. నీవు మ్లేచ్ఛయజ్ఞము చేసిన స్వర్గము పొందఁగలఁడు. అనిన విని చాల కోపముగొని నారదోపదేశముచే బ్రాహ్మణోత్తముల రావించి మ్లేచ్ఛయజ్ఞ మారంభించెను. అందు యజ్ఞకుండము చతుష్కోణముగాఁ బది యోజనముల వైశాల్యముగలది రచించి దేవతాధ్యానమొనర్చి మ్లేచ్ఛులను హోమముచేసెను. హూరులు, హూణులు, బర్బ రులు, గురుండులు, శకులు, ఖసులు, యవనులు, పల్లవులు, రోమజులు, ఖరజులు, ద్వీపస్థితులు కామరూపులు సాగర మధ్యగు లయిన చీనావారిని (మ్లేచ్ఛులనంబడు నీ యందరిని)

హోమము చేసెను. వేదమంత్రప్రభావముచేతనే ఆ యాహ్వానము చేసెను. పిమ్మట బ్రాహ్మణులకు దక్షిణయిచ్చి యభిషేకము గావించెను. పిమ్మట నతని తండ్రి యా యజ్ఞప్రభావముచే స్వర్గము నందెను. ఈ యపరిమితమయిన కర్మముచే బ్రిద్యోతనికి 'మ్లేచ్ఛహంతకుఁ' డను బిరుదు వచ్చెను. ఆ మహానుభావుఁడు పదివేల యేండ్లు రాజ్యము చేసెను. పిమ్మట స్వర్గ మందెను. అతని కుమారుఁడు వేదవంతుఁడు. రెండువేల యేండ్లు పాలించినవాఁడు. అప్పుడు మ్లేచ్ఛుఁడయిన కలి స్వయముగా నారాయణుని బూజించి యిట్లు స్తుతించెను. సర్వలోక ప్రవర్తకుఁడు, అనంతుఁడు, చతుర్యుగవిభాగకర్తయు నగు వాసుదేవునకు నీకు నమస్కారము. నీవు సాక్షిమాత్రుఁడవు. దశావతారధరుఁడవు. నీవే శక్తివి. రామకృష్ణుఁడవు నీవు. గౌరవాసివి. మత్స్యమూర్తివి నీవు. భక్తావతారుఁడవై కల్పక్షేత్రనివాసివైన నీకునమస్కారము. వేదవంతుఁడైనయీ రాజుచే నాకు నిలువనీడ లేకపోయినది. నాకుఁబ్రియుఁడైన మ్లేచ్ఛుని నితఁ తండ్రి నాశనము చేసినాఁడు." ఇట్లు స్తుతింపబడి హరి దేవీసమేతుఁడై మ్లేచ్ఛునియెదుట దర్శనమొసంగెను. "మఱియు నీకొఱకు నేను బహురూపమైన యొకానొక యుగశ్రేష్ఠమును గల్పించి నీకోరిక పూరించెదను. ఆదముఁడనెడి పురుషుఁడు భార్య హవ్యవతి యను భార్యయు విష్ణుకర్దమునివలన జనించి మ్లేచ్ఛవంశవృద్ధిచేయుదురు." అని తెలిపి హరి యంతర్ధాన మందెను. కలి యానంద సంకులుఁడయ్యెను. నీలాచలమునకేగి కొంతకాలముండెను. వేదవంతునికి సునందుఁడను రాజు కల్గెను. తండ్రి

యేండ్లెంతకాలము గతించెనో సంతానము లేకయే మృతినొందెను. అంతట నార్యదేశములు క్షీణించి మ్లేచ్ఛవంశములు బలాన్వితములు కాగలవు. ♦ 'ఓ భృగుశ్రేష్ఠా! అందువలన హిమవత్పర్వతమునకుఁ బోయి విష్ణు సమారాధనము చేసి హరిలోక మందుదము.' అనెను. ఆమాట విని నైమిశారణ్యవాసు లెనుబది యెనిమిదివేల మంది తుహినాచలమున కేగిరి. విశాలానగరమున కేగి విష్ణుగాథను వెల్లడించిరి. కలివిశారదమైన యీ వాక్యము వ్యాసునిచేఁ జెప్పఁబడినది. వ్యాసభగవానులు వినెడి ఋషులు వెళ్ళిపోవుటవలన తమ మనస్సునే శ్రోత్రగా నొనరించుకొని మనస్సు నుద్దేశించియే యీ భవిష్యకథ చెప్పిరి. వ్యాసుఁడిట్లనియె. 'ఓ మనమా ! వినుము. సూతుఁడు వర్ణించిన భావి గాథను వినుము. కలియుగముయొక్క పరిపూర్ణతను విని తృప్తిచెందుము.' సూతుండిట్లు తెల్పినాఁడు. ద్వాపరమున పదునారు వేల సంవత్సరములు మిగిలియుండగా భూమండలము బహుకీర్తిమతియై పేరొందెను. కొన్ని దేశముల విప్రులు కొన్ని యెడల క్షత్రియవంశీయులు, కొన్ని తావుల వైశ్యులు, కొన్ని చోట్ల శూద్రులు, మఱికొన్ని మూలల వర్ణసంకరులు రాజులయ్యెదరు. ఎనిమిదివేల యెనుబదినాల్గుసంవత్సరములు ద్వాపరయుగము మిగిలియున్నదనఁగా ✻ మ్లేచ్ఛ దేశమంతయుఁ గీర్తివంతమగును.

---

♦ భృగుమహర్షి అక్కడ వినే ఋషులలో నొకడని తాత్పర్యము.

✻ 4 అ. 28 శ్లోకమునుంచి 'ఆదాము హవ్వ' అనేవారి పేరులు 'బైబిలు' లో వ్రాయబడిన వాండ్ర కథ కనిపించుచున్నది. 'ఇది యిందెవరో నడుమ

జేశ్చరి' అని నా సంపూర్ణ విశ్వాసము. క్రైస్తవమతము 'చాలాప్రాచీనము' అని 'పవిత్రము' అని ప్రచారము చేయుటకు వచ్చిన 'ఫాదరీలు' దబ్బిచ్చి మన పండితులను గొని యిట్టి యపభ్రంశములు చాలాచేసిరి. చరిత్రయంతయు తారుమారు చేసిరి. పురాణములలో బుద్ధిపూర్వకముగా నిట్టి యపాత్రపు పని జరిగినది. ఈ అధ్యాయము 'భాష' తీరు చూచినను నాయూహ బలపడు చున్నది. ఆ కథ యిట్లు నడచినది.

ఇంద్రియములను దమించి, ఆత్మధ్యాన పరాయణుఁడయినవాఁడగు టచే 'ఆదాము' అనే పేరు గలవాఁడొక మ్లేచ్ఛుఁడుండెను. వాని భార్య 'హవ్యవతి' యఁట. 'హవ్వ' అనేదాని కృత్రిమ సంస్కృతరూపమిది. ప్రధాన నగరమునకుఁ దూర్పునఁగల మహావనము నాల్గు క్రోసులమేర నీశ్వరునిచే నిర్మితమయినది. పెండ్లాము దర్శనము కోరి పాప వృక్ష తలమున నుండెను. కలి యటుకు సర్పరూపమున వచ్చెను. ఆ ధూర్తునిచే మోసగింపఁబడి 'ఆదాము' విష్ణునాజ్ఞను భంగపరచెను. ఆ పాపవృక్షఫలము తినవద్దని విష్ణువు శాసించి నను నందముగానున్న యా పండును భార్యాభర్తలిద్దరు తినిరి. ఆ మేడియా కులు తిని, వాయువు భక్షణముకూడా చేసిరి. అంత వాండ్రకు కొడుకులు కలిగిరి. అంతా మ్లేచ్ఛులే. ఆదాము తొమ్మిదివందలముప్పదిసంవత్సరములు జీవించెను. ఆపండ్లను భార్యతో హోమముచేసి స్వర్గమందెను. వానికిఁ బుట్టినవాఁడు శ్వేతుఁడు. వాఁడు తండ్రికంటె మరి పండ్రెండేం డ్లెక్కువ బాలించెను. వానికొడుకు 'అనువరుఁడు' వానికంటె నూరేండ్లు తక్కువ జీవించెను. తరువాత కీనాశుఁడు నంతే జీవించెను. మహాల్లలుఁ డైదేండ్లు తక్కువగా తొమ్మిదివందలు జీవించెను. వాఁడు తనపేర నగరము నిర్మించెను. వాని తరువాత విరదుఁడు తొమ్మిదివందలఱువదియేండ్లు బ్రతికెను. తనపేర నగరము నిర్మించెను. హనూకుఁడు విష్ణుభక్తిపరుఁడు. పండ్లను హోమముచేసి తత్త్వమసి జ్ఞానముపొందెను. మూడువందల అరువదియేండ్లు జీవించెను. వాఁడు మ్లేచ్ఛధర్మ పరాయణుఁడై స్వర్గమందెనఁట. ఆచారము, వివేకము, ద్విజత్వము దేవపూజ అనునవి చేయువాఁడు కాన 'మ్లేచ్ఛుఁడు' అనుపేరు వచ్చెనని పండితులందురు (ఎట్లో?) విష్ణుభక్తి, అగ్నిభక్తి, అహింస, తపస్సు, దమము అనేవి మ్లేచ్ఛధర్మములని మునులన్నారు. హనూకుని కొడుకు మత్లో

ష్ట్రులను తొమ్మిదివందలడెబ్బదియేండ్లు పాలించెను. పిమ్మట లోమకుఁడు
ఏడువందల [illegible]దియేడేండ్లు పాలించెను. వాని కొడుకు న్యూహుఁడు.
విశేషజ్ఞానము 'న్యూహ' కలవాఁడని యీ పేరువచ్చినదఁట. అయిదువం
దలయేండ్లు పాలించెను. సీముఁడు, శముఁడు, భావుఁడు అనువారు వాని
ముగ్గురు కొడుకులు. న్యూహుఁడు విష్ణుభక్తుఁడు 'సోఽహం' ధ్యానపరా
యణుఁడు. ఒకనాఁడు విష్ణుభగవానుఁడు వాని కలలో కనిపించి "వత్స!
నేటి యేడవరోజు ప్రళయము వచ్చును. నీవు నీ జనులతో నావయెక్కి!
బ్రతుకుము, సర్వశ్రేష్ఠుఁడ వయ్యెదవు." అనెనఁట. మూడువందల హస్తములు
పొడవు ఏబది హస్తములు వెడల్పు, ముప్పది హస్తముల యెత్తుగల నావ
నెక్కెను. నలుబది రోజులు సాంవర్తక (ప్రళయ) మేఘములు సర్వభారత
వర్షమును నీట ముంచెత్తును. (ఈ ప్రళయ మీకాలములో జరిగినట్లు
సంస్కృతివాఙ్మయములో నెక్కడనులేదు. మనువులు మారినప్పుడు తప్ప
మఱియెప్పుడు జలప్రళయము వచ్చినట్లులేదు. కనుక యీ కథ యబద్ధము.)
అపుడు న్యూహుఁడు ఎనుబదివేలమంది మునులు విశాలానగరమునకు వచ్చి
జీవించిరి. మిగిలిన జీవకోటి నశించెను. అప్పుడు విష్ణుమాయను వారు
నుతించిరి. అపుడు మరల నేల బయలుపడెను. శిషిణములనెడి హిమాద్రి
ప్రదేశముల దగ్గర నావనెక్కి జల ప్రళయమయిన తరువాత నచట నివా
సము చేసికొనెను. (౨౮) న్యూహునికి విష్ణువు దయచూపి వంశవృద్ధిచేసెను.
'దేవభాష' కు వ్యతిరేకముగా మ్లేచ్ఛభాష వృద్ధిచేసెను. కలివృద్ధియగుటచే
యీపని చేసెను. 'బ్రాహ్మి' భాష నశించెను. న్యూహుని కొడుకులు
సిముఁడు, హాముఁడు, యాకూత్ అనే ముగ్గురు. యాకూత్తుకు జుమ్రిఁడు,
మాజాజ్, మాదీ, యూనానుడు, తూవలుడు, మసకుడు, తీరసుడు, అనే
కొడుకు లేడుగురు పుట్టిరి. వాళ్ల పేర్లతో దేశము లేర్పడెను. జుమ్రినికి
కనాజ్ఞాశ్వుఁడు రిఫతుడు తెజరుముడు యూనానులు, ఇలీశుడు తరలీశుడు
కిత్తీ హూదాని అనే వాళ్ళపేరుతో నాలుగు దేశము లేర్పడెను. (ఈ ఇలీశు
పేరే 'ఇంగ్లీషు' కాబోలు) హాబీలు, సవతిక, నిమరూహుఁడు. అనే వారు
వాళ్ళ సంతానము. కులనుడు, సినార్కరకుడు, అకృదుఁడు, బావునుఁడు,
రసనుఁడు ఆదేశకుఁడు అనేవారు వారిసంతానము. ఇంతవరకుఁ జెప్పి
(మునులకు) విష్ణువు యోగనిద్ర చెందెను. రెండువేలయేండ్లకు మరలలేచి

సిమవంశము వివరము చెప్పెను. సిముకు పెద్దవాఁడు. అయిదువందలేండ్లు పాలించెను. వానికొడుకు 'అర్కన్సదుఁడు' నాలుగువందల ముప్పదియేండ్లు, వానికొడుకు సింహుఁడు నాల్గువందల యిరువదియేండ్లు. ఇవ్రితుఁడు- వాని కొడుకు నంతే కాల మేలెను. ఫలజుఁడు- వానికొడుకు నలుబదిరెండువంద లేలెను. వాని తరువాత 'రఊ' అనేవాఁడు రెండువందల ముప్పదియేడేండ్లు పాలించెను. వానికి జూజుఁడు నంతే. వానికి నహూరుఁడు నూటయిరువది యేండ్లేలెను. శతుప్రి సంహారకుఁడు, తాహరుఁడు తండ్రివలె నేలెను. విరాముఁడు, నహూరుఁడు, హారనుఁడు అనేవాండ్రు వానికి ముగ్గురు కొడుకులు. సరస్వతీ శాపముచే మ్లేచ్ఛభాష నాశ్రయించి పరిపాలించిరి. కలిలో నీ మ్లేచ్ఛులు వృద్ధి పొందిరి. సంక్షేపముగా నీకథ చెప్పితిమి. భారతదేశ భాష సంస్కృతమనియే యెఱుంగునది. ఆ సంస్కృత భాష యితరదేశములపాలై పోయినది. ఓ భృగూ! నీ కిదంతయు తెల్పినాము. అనగానే విశాలయందు నివసించు నమ్మునులు విష్ణుని బూజించి ధ్యానించి రెండువందల పది వత్సరములు తపస్సుచేసి సంధ్యాతర్పణ దేవార్చనాదుల నొనరించి లోమహర్షణుని దర్శించి "వ్యాస శిష్యా! మహానుభావా? ఇప్పు డేరాజున్నాడో తెలుపుము" అన నూతుఁ డిట్లనియె. కలిలో మూడువేల సంవత్సరములు గతింపగా అవంతిలో 'శఖుఁడు' అనేరాజు పాలించుచున్నాడు. మ్లేచ్ఛదేశమును 'శకుఁడు' అనేరాజు ఏలుచున్నాడు. కారణము వినుడు. కలిలో రెండువేలు అగునప్పటికి మ్లేచ్ఛవంశము పెంపొంది భూమియెల్ల మ్లేచ్ఛమయ మయినది. ఒక్క బ్రహ్మావర్తము (సరస్వతీ దృషద్వతీనదుల మధ్యభాగము) సరస్వతీ తటము (అలహాబాదు ప్రాంతము - కురుక్షేత్రము) పవిత్రముగా నుండెను. మూశుఁడనే మ్లేచ్ఛ గురువుచే సర్వము వ్యాప్త మయ్యెను. దేవతార్చన దేవభాష లోపించెను. మ్లేచ్ఛభాష నాలుగు విధములు. వ్రజభాష - మహారాష్ట్రి - యావని - గురుండిక. వాని యవాంతర భాషాభేదములచే నాల్గులక్షల భాష లయినవి. పానీయము = పానీ, బుభుక్ష = భూఖ్, పానీయము = పాపడీ భోజనము = కక్కనమ్, ఇష్టిశుద్ధరవము = ఇస్తినీ, ఆహుతి = ఆజు, దదాతి = దధాతి, పితృ = పైతర్, (ఫాదర్) భ్రాత = బాదర్, (బ్రదర్) అశ్వము = అస్పస్, (హార్స్) జానువు = జైను, సప్తసింధు = సప్తహిందు, ఇవన్నీ యావనీభాషయొక్క రూపాంతరములు. ఇక గురుండిక భాషలో

## —♦ కశ్యపకథ: అగ్నివంశ చరిత్ర ♦—

6 అ. శౌనకుం డడుగ సూతుం డిట్లనియె.- కలిలో వేయి సంవత్సరములు గడువగా స్వర్గమునుండి కాశ్యపుఁడను ద్విజుఁడు దేవాజ్ఞచే భూమికి బ్రహ్మావర్తమునకు వచ్చెను. అతని భార్య 'ఆర్యావతి.' వానికి పదిమంది కుమారులు గలిగిరి. ఉపాధ్యాయుఁడు, దీక్షితుఁడు, పాఠకుఁడు, శుక్లుఁడు, మిశ్రకుఁడు, అగ్నిహోత్రి, ద్వివేది, త్రివేది, పాండ్యుఁడు, చతుర్వేది అనువారు పేరులకుఁ దగిన గుణము గలవారు. అందు కాశ్యపుఁడు కాశ్మీరమునకేగి సరస్వతిని ఎర్రని పుష్పాక్షతలచేఁ బూజించి ధూపదీపాదులచే నైవేద్యములచే దృప్తిపరచి స్తుతించి మ్రొక్కుకొనెను. 'అమ్మా! శంకరార్ధాంగీ! నాయెడనీ కేల దయరాదు? నీవు జగదంబవుకదా! ఏల జగమ్ముల కరుదేరవు. నీవు సురకార్య నిమిత్తముగా ద్రోహియగు మ్లేచ్ఛునేల సంహారింపవు? ఉత్తమ సంస్కృతమును బాలింపుము. మ్లేచ్ఛులను వేగమే

---

(ఇంగ్లీషు) భానువారము (సండే - Sunday) ఫాల్గుణమాసము (ఫిబ్రవరి - February), షష్టి (సిక్స్టి) (Sixty) అని యీలా మారినది. పవిత్రములయిన అయోధ్య, మథుర, మాయ, కాశి, కాంచి, అవంతిక, ద్వారావతి, అనేవానియందు హింస ఎక్కువయ్యెను. దశ్యులు, శబరులు, భిల్లులు, మూర్ఖులు ఆర్యదేశమున వసించిరి. బుద్ధిమంతులయినవారెల్ల మ్లేచ్ఛదేశమునందు మ్లేచ్ఛులయిరి. భారతదేశమందును, దానినంటిన ద్వీపములందును మ్లేచ్ఛరాజ్యము స్థిరపడెను. ఇది యెరింగి మునీంద్రా హరిం భజింపుము, అనిన విని మునులందరును మిక్కిలి రోదన మొనరించిరి. ఈ కథ యంతయు పరస్పర విరుద్ధముగాను, చాలా యసందర్భముగాను, అప్రాకరణకముగాను నున్నది. ఇదంతయుఁ బ్రక్షిప్తమని పండితుల యభిప్రాయము.

మోహింపఁజేయుము. నీవు బహురూపవు. ఒక్కహుంకారముచే ధూమ్రలోచనుం గడతేర్చితివి. భయంకరుఁడైన యీ దైత్యుని దుర్గవయి యేల సంహరించి జగమ్ములకు సుఖంబు సేయవు? దంభము, మోహము, ఘోరమైన గర్వమును హరించి సుఖము నెల్ల యెడల చేయుదానవు. జగద్ద్రోహులను వెంటనే కూల్పుము. అమ్మా! లెమ్మ! అని యిట్టులనిన నయ్యంబ వాని మనమున వసించి యుత్తమ జ్ఞానము ననుగ్రహించెను. అంతట నమ్ముని మిశ్రదేశమున (ఈజిప్టు) కేగి మ్లేచ్ఛులందరిని విద్యాబలముచే మోహపెట్టి అందుఁ బదివేలమందిని దన శిష్యులను గావించు కొనెను. రెండువేలమంది వైశ్యులను, మిగిలిన వారిని శూద్రులను గావించుకొనెను. వారిం దీసికొని యార్యదేశమునకు సరస్వతీ ప్రసాదమువలన నేతెంచెను. ఆర్యసమూహములు దేవీప్రసాద మున గ్రమముగా నాలుగు కోట్లమంది స్త్రీపురుషులుగా వృద్ధి గాంచిరి. కాశ్యపుఁడే వారికి రాజయ్యెను. అతడు నూట యిరువది యేండ్లు పాలకుఁ డయ్యెను. ♦ రాజపుత్రస్థాన మన బడు నా దేశమున శూద్ర లెనిమిది వేలమంది నా డుండిరి. ఇంతవరకు భృగుశ్రేష్ఠుండు వినెను. శౌనకుండు ప్రార్థించెను. సూతునికి మ్రొక్కి విష్ణుధ్యానపరుండయ్యెను. మరల నాల్గే డ్లకు మునులు తపస్సులనుండి లేచి నిత్యనైమిత్తికము లాచరించి లోమహర్షణునాదరముతోఁ 'సూతా! మాగధుని తర్వాత

---

♦ రాజు పెద్ద కొడుకు రాజగుటయు, మిగతా రాజపుత్రులు చెదురు చెదురుగా చిన్న చిన్న రాజ్యభాగములు పొంది నివసించుటయు పూర్వ ముం డెడిది. అట్లు చెదరిన రాజపుత్రులందరు నివసించిన చోటు రాజపుత్రస్థానము అని పేరు నొందెనని తెలియుడు.

రాజు లెవ్వరు ? కలిలో రాజ్యము చేయువారిని మాకు తెలుపవే. నీవు వ్యాసశిష్యుఁడవుకదా ' అనిన సూతుండిట్లు వచించెను. కాశ్యపకుమారుఁడు మాగధుఁడు 'మగధను' దొరయయ్యెను. తండ్రి రాజ్యమున 'కార్యదేశ'మని పేరు. దానిని మాగధుఁడు రెండుగా విభజించి తానే పాలించెను. ఆ రెండు ముక్కలే మగధయని, రాజపుత్రస్థానమని తరువాత వ్యవహారమందినవి. ఈ రెండిటికిని హద్దులు : తూర్పు పాంచాలము. మాగధమున. కాగ్నేయదిశ కలింగము, దక్షిణము 'అవంతి ' (ఉజ్జయిని), నైఋతిదిశ ఆనర్తము, పడమర 'సింధు దేశము.' వాయవ్యము కైకయము. ఉత్తరమున ' మద్రదేశము.' ఈశాన్యమున ' కోణిందము ' గలవు. మగధుని పేరుతో నాదేశమునకు 'మాగధము' అని పేరు వచ్చెను. ఇట్లు మాగధుని కుమారులు మగధ రాజ్య భాగములను బాలించిరి. మగధుఁడు పిమ్మట యజ్ఞమొకటి చేసెను. బలరామమూర్తి యందు భావితుండై సంతుష్టి నంది 'శిశునాగుడను ' పేర బలరాముని యంశభూతుండై యొక బాలుఁడు క్రతుపరిభావమునఁ గల్గెను. 1 శిశునాగుఁడు (౧౦౦), 2 శాకవర్మ (౯౦), 3 క్షేమధర్ముఁడు (౮౦), 4 క్షేత్రౌజుఁడు (౯౦), 5 వేదమిశ్రుఁడు (౬౦), 6 అజాతశత్రువు (౭౦), 7 దర్భకుఁడు (౪౦), 8 ఉదయాశ్వుఁడు (౩౦), 9 నందవర్ధనుఁడు (౨౦) సం॥ పరిపాలించిరి. అటుమీఁద నందవర్ధనునికి శూద్రస్త్రీ యందు జన్మించిన, 1 నందుఁడు (౨౦), 2 ప్రనందుఁడు (౧౦), 3 పరానందుఁడు (౧౦), 4 సమానందుఁడు (౨౦), 5 ప్రియానందుఁడు (౨౦), 6 దేవానందుడు

(౨౦), 7 యజ్ఞభంగుఁడు (౧౦), 8 కుమార్యానందుఁడు (౧౦), 9 మహానందుఁడు (౧౦), ఇట్లు నవనందులను పేరున వీరి రాజ్య కాల మిట్లు నడచెను. ♦ ఈ సమయములోనే కలిచే స్మరింపఁబడి హరి కాశ్యపునివలన (కశ్యపవంశీయునివలన) రాజపుత్రదేశములో శూద్రుల నెనిమిదివేల మంది నుంచి రాజధానికి రాజుగా తన కుమారుఁడైన యార్యపృథువును నియమించెను. ఈ ఆర్యపృథువు కాశ్యపుని యౌరసుఁడు కాఁడు. కాని యన్య క్షేత్రమునందుఁ బుట్టినవాఁడని తాత్పర్య మగుచున్నది. వాని కుమారుఁడు మాగధుఁడు. ఆ మాగధుని రాజ్యమున నభిషేకించిన తరువాత కాశ్యపుఁడు మరల వెళ్ళిపోయెను. వానికి (1) 'గౌతముఁడు' అను ప్రఖ్యాతితో నొకడు జన్మించెను. * బౌద్ధ ధర్మము నీతఁడు సంస్కరించెను. అతఁడు ప దేండ్లు పాలించెను.

---

♦ ఈ మగధ శిశు నాగవంశముల కాలములు, వంశీయుల పేరులు సరిపడుటలేదు. శిశునాగ వంశముల రాజ్యకాలము లితర పురాణములతో (మత్స్య పురాణాదులతో) సరిపడుటలేదు. శిశునాగ వంశము 10 మంది రాజులు సం॥ 360 లున్నూ, నందవంశము 9 మంది 100 సంవత్సరములునూ పాలించినట్లు ఇతర పురాణము లన్నియు నేకగ్రీవముగాఁ జెప్పుచున్నవి. పురాణముల ప్రామాణ్యము తగ్గించుటకు కాలనిర్ణయము లన్నియు హెచ్చు తగ్గులుగా చేయబడినట్లు కనిపించు చున్నది.

* బుద్ధుఁడు తెల్పినది బౌద్ధధర్మము. ఈ బుద్ధుఁ డీనాటివాఁడు కాఁడు. ఈ బౌద్ధధర్మము ఈనాటిదికాదు. ఇది యుగాంతరముల నాటినుండి వచ్చుచున్నది. ఈ ధర్మము ననుసరించువారిలో గొప్పవానికి 'బుద్ధుఁడు' అనేది బిరుదుగా పౌరుష నామముగా వ్యవహరింపఁబడుచుండినది. దశావతారములలోఁ బేర్కొన్న బుద్ధుఁ డీ బుద్ధుఁడేయని చాలమంది భ్రమ ప్రమాదములకు లోనగు చున్నారు. అది సరికాదు. బుద్ధావతారము 'త్రిపురాసుర సంహార

అతని తరువాత (2) శాక్యముని (౨౦). (3) శుద్ధోదనుఁడు(౩౦), (4) శాక్యసింహుఁడు, కలిలో ప్రథమ పాదంలో ౧౨౦౦ సంవ

---

మున రాక్షస సంహారమునకై వచ్చినది. అది చాలప్రాచీనమైనది. రామాయణములో జాబాలి యీ బౌద్ధధర్మాలను ప్రసంగించినాడు. 'రామో రామశ్చరామశ్చ, బుద్ధఃకల్కిరేవచ' అనెడి శ్లోకము మనము వినుచున్నాము. ఇందులో రాములు ముగ్గురైన తరువాత బుద్ధుఁడు వినిపించును. ఇతనితరువాత 'కల్కి' వినిపించును. అనగా కల్కి అవతారమునకు ముందు 'బుద్ధుఁడు' 'శౌద్ధోదనుడే శుద్ధోదనుని 'కుమారుఁడే' అనుటకిది ప్రమాణముగా నున్నది. మఱియు నమరములో "సర్వజ్ఞస్సుగతో బుద్ధో" మాయాదేవీ సుతశ్చసః-శౌద్ధోదనః అని పర్యాయ పదము లివ్వఁబడినవి. ఏయవతారమునకుఁ బర్యాయ పదము లివ్వని యమరకారుఁడు ఒక బుద్ధునికిఁ బర్యాయపదము లిచ్చుట మొదటివింత. దానినిబట్టి అమరసింహుఁడు బౌద్ధమతానుయాయి యనియు నిర్ణయింపనగుచున్నది. అదంతయు నొక రగడ. అది యిట్లుండగా ప్రకృతము 'అవతారబుద్ధుఁడు' మనము వాడుకొనే బుద్ధుఁడు కానేకాఁడు. ఇది 'బుద్ధుని అనుకరించు నొక వ్యక్తి. నాటక పాత్రమువంటిది.' బుద్ధావతారమైన తరువాత బుద్ధుని ముముక్షు వేషమును కాపీనధారణము శిరోముండనము మొదలయిన బాహ్యలక్షణములను మొదటిఅర్హన్తుడనుకరించెను. అటుపైన అర్హన్ మతమను పేర నీ వేషములు వేయు వారెందరో బయలుదేరిరి. వారె జైనులయిరి. అట్లే సగరుని యజ్ఞములో' ఇంద్రుఁడు బుద్ధునివేషముని వేసికొనివచ్చి యజ్ఞాశ్వమును దొంగిలించెను. వానిని జూచి బౌద్ధమత ప్రవర్తకులందరు నదేవేషము ననుకరించుచుండినవారు. ఇది భాగవతమునందే యున్నది. ఏవిధముగాఁజూచినను త్రిపురాసురసంహారమునాటి బుద్ధావతారమును కృష్ణావతారము తరువాతిగా నెట్టుటకు వలను పడదు. అదిగాక 'రామో రామశ్చ రామశ్చ' అను శ్లోకములో మొదటిది పరశురామావతారము, రెండవది దశరథ రామావతారము పోగా మూడవ రామశబ్దమునకు 'బలరామావతార మర్థమనుచున్నారు. పూర్ణ పుణ్యావతారమగు' కృష్ణావతారము వదలి, కృష్ణనామము విడిచి యంశమగు రామమునిందు జేర్చుటకుఁ గారణము కనిపింపదు. కాన యీ శ్లోకము పట్టి కట్టుశ్లోకముగ కనిపించుచున్నది.

త్సరములు గతించిన తరువాత వేదమార్గ నాశకుఁడై జన్మించెను. వాని పాలనమున నందరు బౌద్ధులయిరి. వాని కాల మరువది సంవత్సరములు. రాజెటులో ప్రజలట్లు (యథా రాజా తథా ప్రజాః) అన్నట్లు విష్ణువీర్యానుసారము జగత్తులలో ధర్మము నడక సాగుచుండును కాన విష్ణుని శరణొంది ప్రజలందరు పాపులయి కూడ మోక్షవంతు లనిపించుకొందురు. శాక్యసింహునికి బుద్ధసింహుడు పుట్టి 30 సంవత్సరము లేలెను. వాని కుమారుఁడు చంద్రగుప్తుఁడు. చంద్రగుప్తునిగురించి యీ వ్రాసిన దంతయు తప్పుగా నున్నవి. మౌర్యవంశమంతా లేనేలేదు. పౌరసారథిపుఁడు 'సులూవు' డను (సెల్యూకస్) కావచ్చు. వాని కూతురును బెండ్లియాడి యావనీ బౌద్ధధర్మ తత్పరుడయి యరువది యేండ్లు పాలించెను. వాని కుమారుఁడు బిందుసారుఁడు యరువది యేండ్లు రాజయ్యెను. వాని కుమారుఁడు అశోకుఁడు పిమ్మటఁ బ్రభువయ్యెను. ఇతని కాలములో కన్యాకుబ్జ దేశవాసి యగు బ్రాహ్మణోత్తముఁడు అర్బుదమను పర్వత శిఖరమునందు (రాజపుటానాలో నిది యున్నది) బ్రహ్మ హోమము చేసెను. అందుపయుక్తములయిన వేదమంత్రముల ప్రభావముచే నల్గురు క్షత్రియులు జన్మించిరి (క్షత్రియులు కారు, క్షాత్రధర్మలగు బ్రాహ్మణులే.) వారు (1) ప్రమరుఁడు (సామవేదము తెలిసినవాఁడు), (2) చాపహాని (యజుర్వేది), (3) శుక్లుఁడు (త్రివేది) (4)పరిహారకుఁడు(అధర్వవేది).వీరైరావతగజమెక్కి-వచ్చిఅశోకుని లోఁబఱచుకొనిరి.బౌద్ధులందరిని నాలుగు లక్షలమందిని దివ్యాయుధములచే సంహారింపించిరి. ప్రమరుఁడు నాలుగు యోజన

ముల వైశాల్యము కల 'అంగావతి' యను పురమునకు ప్రభువ య్యెను. (7 అ.) పరిహారుఁడు చిత్రకూట పర్వత ప్రదేశము నకు ఱేఁడయ్యెను. (ఇది యిప్పుడు బెంగాల్ అని వ్యవహరింపఁ బడెను) అతని ముఖ్యపట్టణము (క్రోసు మేరనున్నఁ కలింజర పురము. చాపహాని రాజపుత్రస్థానమున అజమేరపురము (అజ్మీర్) ముఖ్యపట్టణముగా నేలెను. అది చతుర్వర్ణ వ్యవ స్థితమున్న నగరము. శుక్లుఁడు (చాళుక్యుఁడు) ఆనర్తమండ లము (గుజరాత్) నకు వచ్చి ద్వారక రాజధానిగా నేలెను. శౌనకుఁ డిట్లనియె. ఆ అగ్నిసంభవులగు రాజులు రాజ్య సత్కారము లందినవారయి యెవరెవ్వరు పాలకులయిరో తెలుపుమనునంతలో సూతుఁడు రెండు వేలేండ్లు యోగనిద్రా వశుఁడయ్యె. అయ్యెడ మునులు విష్ణుధ్యానపరులయిరి. పిమ్మట సూతుఁడు సమాధి చాలించి యిట్లు తెలుపఁ దొడంగెను కలిలో 2710 సంవత్సరము లయిన తరువాత ప్రమరుఁ డారే డులు రాజయ్యెను. 2 మహామదుఁడు 3, గేవాపి 4, దేవ దూత3, 5 గంధర్వసేనుఁడు50, 6 శంఖుఁడు30, యేండ్లుపాలిం చిరి. గంధర్వసేనుఁడు శంఖుని కభిషేకించి తాను తపస్సుకు వెళ్ళెను. శంఖుఁడు 30 ఏండ్లు పాలించెను. పిమ్మట చనిపోయెను. అరాజకమయినదని విని గంధర్వసేనుఁడు తిరిగి రాజ్యమునకు వచ్చెను. ఆ వచ్చేటప్పుడు వీరమతిని తీసికొనివచ్చి వివాహము చేసికొనెను, ఆమెయం దతని కొక కుమారుఁడు జన్మించెను. అతఁడే విక్రమాదిత్యుఁడు.

అతఁడు జన్మించిన వేళ నాకసమునుండి పుష్పవర్షము గురిసెను. దేవదుందుభులు మ్రోసెను. సుఖ వాయువులు

వీచెను. శివదృష్టి యను విప్రుఁడు శిష్యులతో వనమున కేగి కలిలో రెండువేల యేండ్లు కర్మయోగానుసారముగ శివు నారాధించెను. కలిలో మూఁడువేలు పూర్ణమగుసరికి 'శకులను' వారి సంహారమునకును, ఆర్యధర్మవృద్ధికిని శివాజ్ఞచే గుహ్యాకాలయమయిన కైలాసమునుండి వచ్చి భూమిపై ♦ నవతరించెను. అతఁడే గంధర్వసేనుని కుమారుఁడు. అతనికి విక్రమాదిత్యుఁడు అను నామకరణ మొనర్చి తండ్రి సంతోషించెను.

---

♦ విక్రమాదిత్యుని జన్మకాలము కలి. 3001 (B. C.101) పట్టాభిషేకము కలి 3020 (B. C. 82) 5వ వాఁడు పారిపోయి శ్రీశైల ప్రాంతములో 195 సంవత్సర మేలిరి.

ప్రమరప్రారంభము కలి 2710 B. C.

| | | | |
|---|---|---|---|
| ప్రమరుఁడు 6 = | 2710 | : | 392 B. C. |
| | 6 | | |
| | 2716 | | 386 B. C. |
| మహామర | 3 | | |
| | 2719 | | 383 B. C. |
| దేవాపి | 3 | | |
| | 2722 | | 380 B. C. |
| దేవదూత | 3 | | |
| | 2725 | | 377 B. C. |
| శకులవల్ల ఓడిపోయి శ్రీశైలంలో రాజ్యంచేసిన కాలము (దక్షిణదేశమంతా) | 195 | | |

| | | |
|---|---|---|
| | 2920 | 182 B. C. |
| గంధర్వసేనుఁడు | 50 | |
| | 2970 | 132 B. C. |
| శంఖుఁడు | 3000 | 102 B. C. |
| శంఖుని మరణానంతరం తిరిగి గంధర్వసేనుడు (శకులజయించి ఉజ్జయినిలో భాగాన్ని తీసికొన్నాఁడు) | 20 | 82 B. C, |
| | 3020 | |

ఇంతవరకు నీ రాజవంశముల కథలు మత్స్యపురాణము మొదలయిన వానితో సరిపడుట లేదు. రాజులు, వారి రాజ్య కాలములు తారుమారుగా నున్నవి. అవి యన్నియు పరస్పరము సమన్వయించుకొని చాల శ్రమచేసి నిర్ణయింప బడిన సిద్ధాంత మీరీతిగా నున్నది. కలిలో 100 సంవత్సరము లయిన తరువాత కాశ్యపుడను బ్రాహ్మణుఁడు వచ్చినాఁడు. అతఁడు 120 సంవత్సరము లేలెను. వాని తరువాత మగధుఁడు రమారమి 30 సంవత్సరములు పాలించెను. (వీని రాజ్యకాలము పురాణములో సరిగా లేదు) తరువాత శిశునాగవంశమువారు తొమ్మిది మంది 540 సంవత్సరములు పాలించినట్లు దీనిలో లెక్క కనబడుచున్నది. ఇతర పురాణాలలో 360 సంవత్సరములే యున్నది. ఇందులో నంకె తప్పు. 360 సంవత్సరము లనెడిది సరియైనది. అటుపైన నందవంశము (నవనందులు) 130 సంవత్సరాలు రాజ్యము చేసినట్లే పురాణములో నున్నది. ఇదికూడా తప్పే. వారు మొత్తము నూరు సంవత్సరములు మాత్రమే యేలినట్లు

మత్స్యాది పురాణముల లెక్క తేలినది. కావున నది వంద గానే గ్రహింపవలయును. మఱియొక తేడా. ఇందులో గౌతమ వంశము తరువాతిదిగాఁ జేర్కొనఁ బడినది. గౌతమవంశము సూర్యవంశముగా నెంచవలసి యున్నది. అది శిశునాగ నంద వంశముల తరువాతిదిగా నెంచకూడదు. వానికి సమకాలికమైన సూర్యవంశముగా గణింపఁ దగినది. తరువాత మౌర్యచంద్రగుప్తుఁడు, బింబిసారుఁడు, అశోకుఁడు అనువారి పేరు లిందున్నవి. వీరు ముగ్గురు మొత్తము 180 సంవత్సరములు రాజ్య మేలినట్లున్నది. ఈ మౌర్య వంశములో పండ్రెండుగురు 316 సంవత్సరముల కాలము రాజ్యమేలినట్లు సర్వ పురాణములు పేర్కొన్నవి. వాని కన్నిటికి నీపురాణ మీ భాగములో విరుద్ధముగా నున్నది. ఇందులో 'సులూకుఁడు' అనువాని కుమార్తెను చంద్రగుప్తుఁడు పెండ్లియాడి యవన మ్లేచ్ఛాచారము లవలంబించినట్లు ఒక వాక్యము కనిపించుచున్నది. ఈ సులూకుఁ డనెడి పేరు 'సెల్యూకస్' అనేవాని పేరుగా నెంచవచ్చును. ఇది ఇక్కడ పూర్తిగాఁ బ్రక్షిప్తమే. కశ్యపుని మొదలు నందశిశు నాగులను కలుపుకొని చంద్రగుప్తుని వరకును రాజ్యకాలము మొత్తము 1610 వచ్చినది. కలియుగ ప్రారంభము 3102 లో నీయంకె తీసివేసిన 1492 B. C. లో చంద్రగుప్త దున్నట్లు కనిపించుచున్నది. సెల్యూకస్ 300 B. C. వాడు. కనుక వీనికి చంద్రగుప్తునికి లంకెపెట్టుట కేవలము దురాగతము. పాశ్చాత్యులు చంద్రగుప్తమౌర్యుని కాలమును 320 B. C. కి తీసికొని వచ్చి దానిని ధ్రువపరచుట కీవిషయ మిందులో దూర్చినారు.

అని స్పష్టముగా కనిపించుచున్నది. ఈ విధముగా నీ పురాణ ములో ప్రధాన విషయముగాఁ జెప్పఁబడిన 'అగ్నివంశపు రాజుల' చరిత్రను బూర్తిగా నెత్తివేయునిమిత్త మీపురాణములో కృత్రిమపు వాక్యములు చేర్చి మొత్త మీ పురాణమే యప్రమాణముగాఁ జేయుటకుఁ బ్రయత్నములు జరిగినట్లున్నది. ఈ పురాణములో అగ్నివంశరాజులచరిత్ర ముఖ్యముగా నున్నది. వారు నాలుగువంశములవారు. ఇవే ప్రమర - చేహాని - శుక్ల (ఇదే చాళుక్య) పరిహార వంశములు. వీని పుట్టుక మొదలు వంశముల చివరదాకా సరిగా నిందున్నది. ఇందులో విక్రమాదిత్య, శాలివాహనుల చరిత్ర పూర్తిగా నివ్వబడినది. పాశ్చాత్యులు కల్పించిన తప్పుచరిత్ర కాలములను గప్పిపుచ్చుకొనుటకు శకకర్తలయిన యీ యిద్దరు చక్రవర్తులను జారిత్రక పురుషులు కారని త్రోసివేసినారు. అందులకు సాధనముగా నీ పురాణ మసలే యప్రమాణమనిపించుటకుఁ దగిన ప్రయత్నము చేసిరి. అందుచే నీ గ్రంథమం దంతటను బండితులచే శ్లోకములు కూర్పించి చేర్పించినారు. ఈ విధముగా నిందు పాశ్చాత్యులు హస్త ప్రక్షేపము చేసినారు. మొన్నటివరకు నీ గ్రంథము తాటాకులమీద వ్రాయబడి యుండుటచేతను, ప్రతులు విస్తారము వ్యాప్తిలో లేకపోవుటవలనను స్వేచ్ఛగా చెడగొట్ట వీలయినది. అట్లు చెడగొట్టబడి మొత్త మీ గ్రంథ మప్రమాణమనుటకవకాశము గల్పిత మైనది.

—♦ విక్రమాదిత్యుఁడు ♦—

విక్రమాదిత్యుఁ డయిదవ యేటనే తపము సేయ వనమున కేగెను. పిమ్మట నతఁ 'డంబావతి' యను పురమున కేతెంచెను. అందు ద్వాత్రింశన్మూర్తులు (32 సాలభంజికలు) కల దివ్య సింహాసనము శివుఁడంపగా సమీపించెను. బేతాళుని నతనికి రక్షగాఁ బార్వతి పంపెను. ఒక నాడతఁడు 'మహాకాలేశ్వరుని' సన్నిధి కఱిగి యట నప్పినాకిని దేవదేవుని బూజించెను. అట ధర్మమయి యను 'నొకసభ' చక్కఁగా నేర్పరుపఁబడి యుండెను. అందలి స్తంభములు నానా ధాతుమయములు నానా మణిభూషితములు, అది నానాద్రుమలతాకీర్ణము, పుష్పవల్లీ సముల్లసితము. అందొక దివ్యసింహాసనము ప్రతిష్ఠిత మయియుండెను. వేదవేదాంగ పారంగతులగు బ్రాహ్మణుల నాహ్వానించి పూజించి విధివిధానమున ధర్మగాధలను విక్రమాదిత్యుఁడు శ్రవణము చేయుచుండెను. ఇంతలో భేతాళుఁడను దేవత బ్రాహ్మణరూపమున నేతెంచి జయాశీర్వాదములను రాజునభినందించి యాసనమునఁ గూర్చుండి రాజుతో 'ఓ విక్రమాదిత్యప్రభూ! నీకు వినవలయునను శ్రద్ధయున్నచో నితిహాససముచ్చయరూపమైన యొక యాఖ్యానము చెప్పెదను వినుము. అనెను.'

—♦ ప్రతిసర్గ పర్వము - ద్వితీయ ఖండము ♦—

బేతాళుఁడు విక్రమాదిత్యునకు కథలు చెప్పుట.

(1 అ.) వేతాళుఁడట్లు పలికి మహాకాలేశ్వర క్షేత్రాధి దైవతమగు శివుని మనమున నిలిపి విక్రమాదిత్యునితో నిట్లు

నియె. 'ఓయీ! రాకుమార! మనోరమ మయిన కథ తెల్పె దను, వినుము. శ్రీశివాధిష్ఠితమయిన వారణాసి యందుఁ జతు ర్వర్ణప్రజలు ప్రతాపముకుటుని పరిపాలనమున సుఖముండిరి. ఆరాజుభార్యమహాదేవి. వారికి వజ్రముకుటుఁడను కుమారుడు కలఁడు. అతఁడు పదునాఱవయేటహయమెక్కి వనమేగెను. అతని వెంట మంత్రికుమారుఁడు బుద్ధిదక్షుఁడు నేగెను. వజ్రముకుటుఁ డరణ్యశోభగాంచి కామవశుఁడై సంతోషించుచు నచటఁ జక్కని దివ్యసరస్సును, దాని తీరమున మునిబృందములు పూజించు శివస్థానమును గాంచెను. వార లా దివ్యక్షేత్రముంగని పరమా నంద భరితులైరి. అంతలో కర్ణాటకపతి దంతవక్త్రుఁ డనువాని కుమార్తె పద్మావతి యట కరుదెంచి కామపూజ గావించుకొని చెలికత్తెలతో నా సరోవరమున జలక్రీడ లొనరించెను. వజ్ర ముకుటుం డాయంగన సౌందర్యాతిశయమును, నందుల కనువైన గుణసంపదను గని మూర్ఛితుఁడై భూమిపై పడెను. మరియు నంతలో లేచి శివా! శంకరా! నన్ను పాలింపుమని పలుకుచు మరల నాసుందరిం గనెను. ఆమె యొకపద్మము గని తలపై నిడి కొని చెవులం దానించి, పాదములందు వ్రాలించి పిమ్మట దంత ములచే గట్టిగా నొక్కెను. మరల యా కుసుమరాజము నెత్తి కొని హృదయమునం జేర్చెను. ఇట్లు తన భావప్రకటన మొన ర్చి సఖులతో గృహమ్మున కరిగెను. తండ్రితో గిరిజావనము నకుఁ దీర్థార్థముగా నేతెంచినది గావున నతనితో మరలి ఇంటికి వెళ్ళక తప్పినది గాదు. ఆ సన్నివేశము గన్నది మొదలుగ నా రాకుమారుఁడు మదనబాణవశం పదుఁడై మనోవ్యథనంది పిచ్చి యెత్తినవానివలెఁ జరించుచు నాహార పానీయములు విడచి

పద్మావతిని ధ్యానించుచు మౌనము దాల్చెను. అంతట బరివారమెల్ల "రాజకుమారు డేమొకో యిట్టి విపరీత దశ నందినాఁడని" హాహాకార మొనర్చిరి. మూఁడు రోజులయిన తరువాత మంత్రికుమారుండగు దక్షుఁడు బుద్ధివిశారదుండు కావున వజ్రముకుటుని దరికరిగి నిజము తెల్పుమని యడిగిన నానృపనందనుఁడు సరస్తీరమునఁ దానొకనృపనందనిని గనినది మొదలుగ డెందము తత్తరించెనని విన్నవించెను. అంత నమ్మంత్రికుమారుఁడుఁ "ఇస్సీ! ఇదియా! సరిసరి! ఆ దేవి మిగుల శ్రమపడిన మీఁదట నీకుఁ జెలి కాఁగలదు. ఆమె కర్ణాటపతి కుమారిత పద్మావతి. నీపై నామెకు మోహము కలదని యామెచూపిన పద్మలీలచే నేనుగ్రహించితిని. ఆమెసన్నిధికి నేను నిన్ను గొనిపోయెద" నని పలికి ప్రతాపముకుటుని కీ జరిగిన దెల్ల విన్నవించి యాతని యాజ్ఞంగొని యా రాచబిడ్డంగొని కర్ణాట నృపతి పట్టణంబున కశ్వారూఢుండై యేతెంచెను. అట్లేగి నాటి నిశీథమున నానగరమం దొక వృద్ధురాలి యింట బసచేసి యామెకు విశేష ద్రవ్య మొసంగెను. ప్రాతఃకాలమయిన తర్వాత నది రాజాంతఃపురమున కేగుచున్నం దానిం గని 'అమ్మా, నీ వేకాంతమునందుఁ జని పద్మావతితో నా మాట లిట్లు పలుకుము. జ్యేష్ఠ శుక్ల పంచమీ సోమవారమున సరస్తీరమున నీవు చూచిన సుందరుఁడు నిను వలచి వచ్చినాఁడు.' అని తెలుపు మన నాయవ్వ రాచకన్యక కా చెప్పినది చెప్పినట్లు పద్యము వప్పగించెను. పద్మావతి విని రోషము గొని "ఛో ఛో దుష్టురాలా!" యని యా ముదుసలినిం బలికి చందనపంకముచే దడిసిన వ్రేళ్ళుగల తన కరపద్మమున

దన హృదయమునఁ గొట్టుకొనెను. ఆ వృద్ధ యారాచకన్నియ చెక్కిలి పుణికి బుద్ధిదక్షునికడ కేతెంచి సర్వము వివేదించెను. అది విని మిగుల పరితపించు రాజకుమారునిం గని ' మిత్రమ! శోకింపకు. ఆమె నీ కిప్పుడొక సందేశ మంపినది. నీవు తన కెవ్వా డు సఖుఁడ వయ్యెదవో కదా యని యామె హృదయమునఁ దట్టుకొన్నది. నీవార్త మధురముగా వినినంతన నాదేహమున రజస్సంటినది. రజస్వలాస్నాన మాచరించి తరువాత నీ నెమ్మోము ముద్దుబెట్టుకొనెద' అను భావము నామె తన చేష్టలచే వ్యక్తపఱచినది. అనిన రాజబాలకుఁడు మిక్కిలి యానందించెను. మూఁడురోజు లయిన తరువాత మఱల నా ముసలిది పోయి రాజకన్యకకడ కేగి "భూపాలబాలుఁడు నీపై మఱులుకొని నీ దర్శనము నపేక్షించి యున్నాఁడు. సుందరీ! నీ వా జగన్మోహనుని చెట్టవట్టుము. నీ జీవితసాఫల్య మొనరిం చుకొనుము. అనిన విని యా చిన్నది మిగుల సంతసించి మసిచే నంటిన వ్రేలిచే గవాక్షద్వారమున నంటి పిరుదుపై కరతల మ్మునఁ గొట్టుకొనెను. వెనువెంటనే ముసలియవ్వ చనుదెంచి మంత్రిసూనున కద్ది యెఱింగించెను. బుద్ధిదక్షుఁడు మిగులఁ బ్రసన్నుఁడయి మిత్రుని చెంత కేగి "ప్రియమిత్రమ! ఆ నృప కన్యక యంతఃపురమునఁ బడమటిద్వారమున నీకొక గవాక్షము నిర్మింపఁ బడినది. అర్ధరాత్రిమున నీవు నాకడకు విచ్చేసి నన్నుం బొందవచ్చును" అను భావము తెలిపిన దన నా రాజసుందరుఁ డానాటిరాత్రి యయ్యిందువదనం జేరి విహరించెను. ఒక నెల గడచిన తరువాత, తమిదీరి, నెచ్చెలి యేమయ్యె ననితలంచి, చెలితో "రమణీ! నీ వే బుద్ధివిశారదుని యనుగ్రహముచే

నాకు లభించితివో యా మంత్రికుమారుఁడు నా ప్రియమిత్రు
డెందుండెనో తెలిసికొని తిరిగి వచ్చెద నాజ్ఞ యిమ్ము.' అనిన
నా బాలిక విని యామాట తన హృదయమున కెంతేని క్షుర
మయి తాకినం గనలి షడ్రసోపేతమయిన యన్నమున విషము
పెట్టించి యా మంత్రిసుతున కంపించెను. అయ్యెడ బుద్ధి
దక్షుఁడు చిత్రగుప్తప్రాజకుఁ డగుటచే నా యన్నమందలి
దోషము గమనించి యది తినఁడయ్యెను. అంతలో రాజకుమా
రుఁ డట కేతెంచి వివేకవంతుఁ డయిన యమాత్యబాలునిం గని
రోషముతో 'ఏల నా ప్రియురాలంపిన యన్న మారగింప
వైతివి?' అని యడిగెను. మంత్రికుమారుఁడు నవ్వి యా
యన్నము నక్కడనే యతఁడు చూచుచుండగనే యొక కుక్కకు
వైచిన నది యక్కడనే విలవిల దన్నుకొని ప్రాణములు విడ
చెను. రాకుమారుఁ డచ్చెరువు నొందెను స్త్రీజనము నడవడి
యిట్లుండుంగదా యని యెఱింగికొని యయ్యంగనపై మోహంబు
విడిచి స్నేహితునిం గని నే నా పాపినిని విడిచితిని. ఇంటి కేగ
వలయు రమ్ము. అనిన మంత్రిసూనుఁడు "రాజా! నీవు శీఘ్రమే
ప్రియురాలి దరి కరుగుము. నీ వామె ధరించు నొక బంగారు
నగ కొనివచ్చి దాని పిక్కపై నొక త్రిశూలపు ముద్ర వేసి
యది నిద్రబోవు చుండగాఁ దీసికొనిరమ్ము" అనిన నాతఁడట్లే
యరుదెంచెను. పిమ్మట నా మంత్రిబాలుఁడు మిత్రునితో
శ్మశానమున కేగి రుద్రమండపమునఁ గూరుచుండెను. రాజకు
మారు నొక శిష్యునిగా నటింపఁ జేసెను. మరియు నా భూషణ
మును బురమున నమ్ముకొని రమ్మని పంపెను. వజ్రముకుటుం

డతని యాన గొని యటులే నగరవీధుల నమ్మకము నూపినం తట రాజభటు లాతని బంధించి రాజు నెదుటఁ బెట్టిరి. అతఁ డడిగినంతట 'రాజా! నాగురు వొకానొక యోగి కలఁడు. అతఁడు జడలు దాలిచి యీయూరి శ్మశానమునందే యున్నాఁ డు. అతఁడు దీని నమ్ముకొని రమ్మని నాకిచ్చినాఁడు.' అంతే అనెను. రాజు విని యా యోగిని రప్పించి యడిగెను. 'నేనొక యోగిని. నేను మంత్రి మొకటి యనుసంధించి యొక పిశాచిని రప్పించితిని. నే డామె కొక త్రిశూలముతో నెడమ పిక్కపయి నొక ముద్రకూడ వేసి పంపితిని.' అనిన నదియెల్ల గమనించి యా రాజు తన కుమార్తె నింటినుండి వెడలించెను. అంత వజ్ర మకుటుం డా బాలికను గొని యింటి కరుదెంచెను.' అని యీ కథ తెల్పి బేతాళుండు నవ్వి 'విక్రమాదిత్య! వింటివి కదా! ఇక్కథలో నీ నల్వురలో నెవ్వరి కేపాపము పంచెదవు? తెలుపుము.' అని అడిగెను. విక్రముడు 'ఈ పాపమెల్ల రాజుది. మంత్రి మిత్రకార్య నిర్వాహకుఁడు. నొకరులు ప్రభు కార్యము చేసినవారు. రాజకుమారుఁ డర్థసిద్ధి సాధించినవాఁడు కావున నిందు రాజే నరకము నంద నర్హుఁడు. రజస్వల యయిన కన్యకు వివాహము చేయనివాఁడు మహాపాపి. వాని కరువది వేలేండ్లు నరకము తప్పదు రాజపుత్రి గాంధర్వ విధిచే వివాహ మాడి నది. దాని కభ్యంతరము చేసినవాఁడు యమలోక మందును. ఎట్టి పాపము నెఱుంగని బాలిక నింటినుండి తరిమెను. అది లక్ష సంవత్సరములు నరకయాతన ననుభవింపఁ జేయును. అని రాజు పల్కిన విని బేతాళుండు మిగుల ప్రసన్న హృదయుండై ధర్మ తత్పరుఁ డయిన యా రేనితో నెండియు నిట్లనియె.

## — 2. మధుమతి కథ —

(2 అ.) సూతుం డిట్లనియె. ప్రసన్నమనస్కుఁడై మహా సింహాసనాధిష్ఠితుండయిన విక్రమాదిత్య భూపాలునింగని ద్విజ రూపధరుండగు బేతాళుండును ప్రసన్నమనస్కుండై ఇట్లనియె. యమునా తీరమందు 'ధర్మస్థలి' యను పురము చాతు ర్వర్ణ్యవ్యవస్థా సుందరమై ధనధాన్య సమృద్ధమై యుండెను. గుణాధిపుం డను రా జా పుర మేలుచుండెను. అతనికడ 'హరి శర్మ' యను పురోహితుండు స్నానపూజాది సదాచార తత్ప రుం డొకరుం డుండువాఁడు. ఆతని ధర్మపత్ని సుశీల. పతివ్రతా తిలకము. వారికి సత్యశీలుండను కుమారుండు కలిగెను. అతఁడు విద్యాధ్యయన తత్పరుఁడు. వానికి 'మధుమతి' యను శీలరూ పాది లక్షణలక్షిత యగు నొక చెల్లెలుండెను ఆమెకు బండ్రెం డేండ్లు రాగానే వివాహ ప్రయత్నము గావించిరి. తండ్రియు, నన్నయును దేశదేశముం గాలించిరి. ఒకతరి రాజపుత్రుని వివా హామునకయి యా పురోహితుం డేగెను. వాని కుమారుఁడు సత్యశీలుఁడు జదువుకొనుటకు కాశీపురమున కేగెను. ఆనడుమ వామనుఁడను నొక బ్రాహ్మణుఁ డనుకూల రూప శీల వయస్సుం దరుఁ డేగుదెంచిన నాతనిం గని మధుమతి మోహావడెను. నిద్రాహారము లెఱుంగక, యొడలివలువను మఱచి చంద్రు నికై తపించు చకోరివలె నతని యెడ గోరికగొని యా సుశీల స్వర్ణద్రవ్యాదులలతోఁ గూడిన తాంబూల మొసంగి యఱుగ కుండ నాపెను. అంతట హరిశర్మ ప్రయాగయందు త్రివిక్ర ముండను నొక విప్రబాలకునింజూచి, యతడు వేదవేదాంగ

పారగుండని కని కుమార్తె కనుకూలుండగు వరునిగా వరించెను. సత్యశీలుండును గాశీపట్టణమునఁ దన గురుని కుమారుఁడగు 'కేశవుని' జెల్లెలి కనురూపుండగు వరుండని కోరుకొని యింటి కేతెంచెను. మాఘ బహుళ త్రయోదశి శుక్రవారమున వివాహలగ్నము నిర్ణయించిరి. కన్యారూప మోహితులై ముప్వురు వరులు మూఁడుదారుల నేతెంచిరి. సరిగా నదే సమయమునఁ బాము కఱచి యా బాలిక పూర్వకర్మ బలమున మృతినొందెను. ఆ బ్రాహ్మణు లామెం బ్రతికింప నెంతేని శ్రమపడిరి. కాని లాభము లేకపోయెను. హరిశర్మ యాపిల్ల కౌర్ధ్వదైహిక క్రియ లాచరించెను. త్రివిక్రముం డామెకై దుఃఖించి బొంతదాల్చి దేశదేశాంతరములందుఁ దిఱుఁగ జొచ్చెను. కేశవుఁడు శోకించి యామె యస్థికలగొని తీర్థముల వెంటఁ జరించెను. వామనుఁడు బూడిదఁజల్లుకొని, విరహ వశుండై తదేకధ్యానపరుండై నిలిచెను. ఒకపుడు సరయూ తీర మున లక్ష్మణపురమున త్రివిక్రముఁ డొక విప్రునియింటికి భిక్షార్థమేగెను. 'రామశర్మ' యను ద్విజుఁ డానాఁడు దన యింటి కాహ్వానించియుండెను. వాని భార్య విశాలాక్షి యతని బిలిచి భోజనపాత్రము నుంచెను. అదే సమయమున వారి పిల్లవాఁడు పాపవశుఁడై చనిపోయెను. దాది యేడ్చెను. విశాలాక్షి శోకముచే మూర్ఛిల్లెను. రామశర్మ వచ్చి సంజీవన మంత్రము పఠించి మంత్రపు నీళ్ళు చల్లి శిశువును బ్రతికించెను. అవ్వల సవినయముగ నా సన్యాసికి భిక్షనేసి పిమ్మట సంజీవనీ మంత్రము నాతని కుపదేశించెను. త్రివిక్రముఁ డామంత్ర

మును జపించి యాహరిశర్మకుమార్తెను బ్రతికించెను. ఇంతలో నట రాజకుమారుఁడు మృతినొందెను. ఆకుమారుఁడు దహింపఁ బడెను. కాని మంత్రప్రభావముచే మరల బ్రతికెను. ధర్మ స్థలియను రాజ్యమునకుఁ బ్రభువైన గుణాధిపుని కుమారుఁడగు వీరబాహుఁడు త్రివిక్రమునితో నాకుఁ బ్రాణదానము చేసిన వాఁడవు కాన వర మేదియేని కోరుము అనెను. అంతట నా విప్రుఁడు 'రాజా! కేశవుఁడను బ్రాహ్మణుఁ డస్థికలను గొని తీర్థముల వెంటనేగినాఁడు అతని వెదకింపుము.' అన నాతఁ డొక దూతను బంపి వెదకించిన కేశవుఁడు వారికిఁ గనఁబడి యస్థికలతో నరుదెంచి యవి వారికొసంగెను. అంతట నా బాలిక బ్రతికింపఁబడెను. అట్లు బ్రతికి యా బాలిక యా ముప్పురు విప్రకుమారులను గని ధర్మానుసారముగ నే నెవ్వతెకు భార్యగాఁదగుదునో తెల్పుఁడు. ఆతని నే చేకొనెదను' అనెను. అది విని ముప్పురును మౌనముపట్టిరి. ఓ విక్రమాదిత్య నృపాలా! నీవు ధర్మజ్ఞుఁడవు. ఆమధుమతి యాముప్పురలో నెవ్వనికి ధర్మ పత్ని గాఁదగినది? తెలుపుము. అని బేతాళుఁడు ప్రశ్నింప రాజు నవ్వి సవినయనముగ మధుమతి వామనునికి భార్య కాఁదగినది. ఇఁక ప్రాణదానము చేసిన బ్రాహ్మణుఁడు తండ్రి వంటివాఁడు. అస్థులనిచ్చిన యాతఁడు సోదరునివంటివాఁడు' అని నిర్ణయము చేసి తెల్పెను.

## ——◆ 3. రూపసేనుని కథ ◆——

సూతుం డిట్లనియె. 'ఓ విప్రోత్తమా! వినుము. మరి యొక మనోహరమైన కథ తెల్పెదను.' బేతాళుఁడు విక్రమాదిత్యునితో వెండియు నిట్లనియె. నానాజన నివాసమగు వర్ధమాన నగరమున రూపసేనుఁ డను మహాబలవంతుఁ డొకఁడు రాజుండెను. అతనికి 'విద్యున్మాల' యను నుత్తమ పతివ్రత భార్య యయ్యెను. ఒకప్పుడు వీరవరుఁడను క్షత్రియుఁడు దారపుత్రి పుత్రికాదులతో జీవనమునకై యా పురమున కేగుదెంచెను. అప్పు డరుదెంచి వినయవినమితుఁడై రూపసేనుని దర్శించిన నతఁడు దినదిన మొక వేయి సువర్ణము లిచ్చుచుండెను. వీరసేనుఁ డా ధనము నగ్నిహోత్రములకు, బ్రాహ్మణులకు వినియోగించి శేషించిన దానిని దా ననుభవించుచుండెను. ఇటులొక యేఁడు గడచినంతట శివాజ్ఞచే రాజ్యలక్ష్మి యరుదెంచి స్మశానమున రోదనము చేయుచుండెను. అదివిని రా జర్ధరాత్రి మెళుకువగొని, వీరవరుఁడను సేవకుని బిల్చి యా యేడుపు వినిపించు చాయకేగి కారణమరసి రమ్మని పంపెను. వీరవరుఁడు రాజాజ్ఞ గొని శస్త్రాస్త్రములం దాలిచి శుభవదనయగు నా రాజలక్ష్మియున్న తావునకరిగి 'ఏల దుఃఖించు చున్నావు అంతటి కష్టమేమి వచ్చినది? తెలుపు' మని యామెను బ్రశ్నించెను. రాజ్యలక్ష్మి వీరసేనుని కిట్లనియె. నేను రూపసేనుని రాజ్యలక్ష్మిని. ఈ నెలతుదలోనే ప్రళయ మందవలసి యున్నాను. అందులకు శోకించుచున్న దానను. అనిన విని యాబలశాలి దేవీ! నీ యల్పాయువు సంగతి తెల్పితివి సరియే నీవు దీర్ఘాయు

వ్వంతురా లెట్లగుదువో యాయుపాయముకూడ నీవే తెల్పవే' యని యడిగెను. అంతట నా రాజ్యేరమ 'వీరాగ్రేసర! బుద్ధిశాలివి. నీ కుమారుని కపాలమును జండిక కర్పింతువేని నేను దీర్ఘాయుష్క నయ్యెదను. దీన స్వామికార్యము నిర్వహించినవాఁడవు నయ్యెదవు. చేతనైన నిది సాధింపుము.' అనెను. ఈమాట వినీవినగానే వీరవరుఁ డింటికిం జని భార్యతో నీవు నిందు మన నుతోఁ గుమారు నర్పింపుము. అని యడిగెను. ఆమెయు నందుల కౌ ననెను. మరియు నా మహాసాధ్వి పసివానిం బిల్చి 'నాయనా! నీవు రాజునిమిత్తముగా దేహమును సమర్పింపుము' అనిన నా బాలుఁడు సోదరితోఁ దల్లితో విమర్శించి వెంటనే బయలువెడలి చండికాలయమునం దున్న తండ్రిసన్నిధికే తెంచి 'తండ్రీ! నా శరీరమును జండికకు బలియిమ్ము, దీనివలన మన దేని రాజ్యలక్ష్మికి సుస్థిరమైన యాయువు గలుగున ట్లొనరింపుము' అనెను. వీరసేనుఁడు సుతుని మాటవిని వెంటనే వాని శిరమ్ము ఛేదించి దేవికి సమర్పించెను. మరియు నటనే యాబాలుని చెల్లెలు, తల్లి, తుదకుఁ దండ్రియును శరీరము లర్పించిరి. రూపసేనుండది చూచి తనసేవకుఁడింత రాజభక్తుఁడనియు, సత్యసంధుడనియు గ్రహించి తానును తన శిరమ్ము నట సమర్పించెను. అంతట నా చండిక పరమ ప్రసన్నయై రాజుం బ్రతికించి వరము కోరుకొమ్మని తెల్పెను. అతఁడును "వీరసేనుఁడు సకుటుంబముగా జీవించుఁగాక" యని కోరిన నాదేవి యనుగ్రహమున నందఱు నావెంటనే జీవించిరి. దేవి యంతర్ధాన మొందెను. రూపసేనుఁడు మిగుల ప్రసన్నమైన చిత్తముతో కామరూపిణి

యగు తన కుమారునైను వీరసేనునికుమారున కొసంగెను. బేతాళుండు విక్రమాదిత్యునిం గని 'ఈ నల్వురలో ముఖ్యమైన స్నేహము చూపిన వారెవరో తెలుపుము రాజా!' యని ప్రశ్నించెను. విక్రముఁడు తన 'సేవకునికై తనశరీరమును బలి యిచ్చిన రాజిందులో నకృత్రిమ స్నేహమును జూపినవాఁడు. వీరవరుఁడు సువర్ణముమీఁది ప్రీతిని, వాని భార్య పతివ్రత ధర్మ ప్రీతిని, చెల్లెలు బంధుప్రీతిని, కుమారుఁడు పితృప్రీతిని జూపినవారు. వీరి ప్రీతియంతయు సనిమిత్తము. అనిమిత్తమైన మహాస్నేహము చూపినది యొక్క రూపసేనుఁడే' యనెను.

## —♦ 4. చంద్రవతి కథ ♦—

(4. అ.) బేతాళుండు రాజున కిట్లనియె. భోగవతియను నగరము కలదు. 'రూపవర్మ' యారాజ్యము నేలుచుండెను. బుద్ధికౌశలము గల 'చూడామణి' యను నొక చిలుక యా రాజునింటఁ బంజరమున వసించుచుండెను. ఒకనాడు రూపవర్మ ముప్పదియేండ్ల ప్రాయముగలవాఁడై 'ఓ చిలుకా? నాకుఁ దగిన సుందరి యెవ్వతియేని యున్నదా?' తెల్పుమన నాశుకము మగధదేశాధిపతి కుమారిక 'చంద్రవతి' యను కన్యక సర్వ విధముల నీకనురూపయై యున్నది. ఆమెను గ్రహింపుము. అనిన నానృపతి గణేశుఁడను నొక విప్రోత్తముని సముచిత సువర్ణమణిభూషణము లిచ్చి యాపిల్లకొరకుఁ బంపించెను. అతఁడును మగధకేగి మహాదేవసందర్శనము సేసి యిట్లునుతిం చెను "శివా! నమస్కారము. నీవు శాంతుఁడవు, సర్వాభీష్ట

ప్రదాతవు, భవుఁడవు, శంకరుఁడవు. రుద్రుఁడవు నగు నీ కెల్ల వేళల నమస్కారము. మృడుఁడును ఆనందరూపుఁడును సర్వ దుఃఖహరుండవు నగు హరునకు నీకు వందనము. ఇట్లు వినుతించునంతలో చంద్రవతి కామార్తయై మదనమంజరియను చెలికత్తెం బిలిచి నాకనురూపుండగు వరుండెవ్వఁడేని యీధరణీ మండలమ్మున గలఁడే" యని యడిగిన నది భోగపురీశుండగు రూపవర్మ నీ కుచితుండనియె. ఆ మాటవిని యాకన్నియ వాంఛితార్థదాయిని యగు దుర్గను సకలభువనైకజనని నారాధించెను. "ఓ జగదంబ! నీకు నమస్కారము. నా వాంఛితముల నెరవేర్చు తల్లివి. మాయమ్మవు నీవు త్రిలిజ్గజననివి. వర్ణమూర్తివి. సనాతనివి. నీవు స్వాహా స్వధాసంధ్యాదిరూపవు, నీకు నమస్కారము" అని వందన మాచరించి "రూపవర్మను నాకుఁ బతిగావింపుమమ్మా" యని కోరుకొనెను. ఈ నమస్కారమునకుఁ బ్రసన్నయై జగన్మాత మగధరాజును వాని ధర్మపత్నిని మోహింపఁజేసి సిద్ధస్వరూప యగు నా దేవి యొకమాసము దాటకుండ నామెకు వివాహము సంఘటింపఁజేసెను. అంతట రూపవర్మ చంద్రవతిం గూడి యభీష్టభోగము లనుభవించుచుండెను. ఒకనాడు రాజు మేనక యగు మదనమంజరినిం గని నీవు శుకముతో వివాహము చేసి కొమ్మనెను. అంత నమ్మెనక యిట్లనియె. ఇలాపురమున లక్ష్మీపతి యను వైశ్యుఁడు మిగుల ధనవంతుం డుండెను. అతనికి సంతానము లేకపోగా దేవతారాధన మాచరించెను. అతని భార్య పతివ్రత. వారి కెట్టకేల కొక కుమారుఁడు గల్గెను. కాని

వాఁడు నీచాతినీచుఁడు, ఎల్లప్పుడు జూదమాఁడువాఁడు. సురా పానరతుఁడు. వేశ్యాలోలుఁడు, మాంసాశనుఁడు. దుష్టుఁడు. వానినడవడి గని తల్లిదండ్రు లసహ్యాంచుకొని యడవి పాలయి పోయి నరనారాయణుల ధ్యానించి పరమపద మందిరి. వారి తనయుఁడు మదనపాలుడు దుర్మార్గుఁడు. ధనమెల్ల వ్యయముసేసి దేశాంతరమున జీవితము గడుప నేగెను. 'హేమపతి' యను వైశ్యుడు నివసించు చంద్రపురమున కేగి తన వృత్తాంతమెల్ల చెప్పికొనెను. నేను స్వల్పధనము గొని దేశాంతరవ్యాపారముచేయుట కోడమీఁద బయనించి వచ్చితిని. పెనుగాలి కోడ మునింగి ద్రవ్యము కోల్పోయితిని. నే నెట్లో బ్రతికి యొడ్డునఁ బడితిని. ధన నష్టమునకు సిగ్గుపడి మా తండ్రిమొగము చూడలేక యందందుఁ తిరుగుచున్నాను' 'అనిన విని హేమపతి యను నా వణిజుఁడు తన భార్యయగు కామమంజరిం బిలిచి, ఓసీ! దైవవశమున నీ వైశ్యబాలుఁడు మనకు సమకూరినాఁడు. మన 'చంద్రికాంతి' యను బాలిక నీతనికిచ్చి యథావిధిగా వివాహము చేయుదును. నీ వంగీ కరింతువేని యనుకూలపడు ననిన నది యౌ ననియె. అంత నా యిర్వురకు వివాహము కావించి యల్లుని గూతునిం దన యింటనే నిలుపుకొనెను. కొన్నాళ్ళకు మదపాలుఁడు మామ గారి యనుమతిం గొని సర్వైశ్వర్య సమన్వితముగ నా బాలికం గొని దాసదాసీజనమ్ములతో నింటికి బయలుదేరెను. అట్లు వెడలి త్రోవలో పల్లకిబోయీలను బొమ్మని, దాసీపరివారము లను జావమోది, భార్యనువిడచి యా దుష్టుఁ డా ధనమెల్ల

కొల్లగొని యొంటరిగా నింటి కేతెంచును. పిమ్మట నొక
సంవత్సరము నిండకయే యా బంగారము నెల్ల వ్యయమొనర్చి
తిండికిం గుడ్డకు గరవై మరల శోకవశుండయ్యెను. తిరిగి
తిరిగి మరల యత్తవారింటికిఁ బరతెంచినఁ జంద్రకాంతి
యను నా బాలిక భర్తం గని "దారిలో మన ధనము
దొంగల పాలైనది" అని మా తలిదండ్రులతోఁ దెల్పితిని.
కావున నీవు సిగ్గుపడక యిచ్చట నే యుండు మని పలికెను. అది
విని యా మహాధూర్తుండు కొన్నాళ్ళటనే యుండెను. ఉండి
యుండి యొకనాటి నిశీథమున గాఢాంధకార మావరించినతఱి
భార్య నిదురలో నుండగా నామెను హతమొనర్చి నగకట్టునెల్ల
మూటగట్టుకొని పారిపోయెను. కావున శుకమునకు నాకును
నీ వన్నట్లు వివాహ మంతబాగుండదు" అని మేనక పలికెను.
ఆమాటవిని యా చిలుకయు "అధమురాలగు మేనక నాకుఁ
దగదు. నల్లని మొద్దు. కురూపిణి. నేను త్తముఁడను. నీకుఁ
గారణముం దెలుపుదును వినుము. కాంచనపురమున శంఖపతి
యను నొక్క వర్తకుం డుండెను. వాని సుతుఁడు సింధుగుప్తుఁడు.
వాఁడు ధనవంతుఁడు, గుణవంతుఁడును, బుద్ధిమంతుఁడును. వాని
భార్య ప్రభావతి. శ్రీదత్తుఁడు వారికిఁ బుత్రుఁడు. 'జయశ్రీ'
నగరమున వానికి వివాహము గావించెను. సోమదత్తుని కుమా
రిక 'జయలక్ష్మి' వానికి భార్యయయ్యెను. శ్రీదత్తుండు వాణి
జ్యార్థము కురుస్థలమను దేశమున కేగెను. పండ్రెండేండ్లకు
సమృద్ధమైన ధనముతో నింటి కేతెంచెను. జయలక్ష్మి మోహా
వశయై భర్తయేగిన తరువాత పుట్టింట నివసించుచు దూతి

ముఖమున హోమదత్తునితోఁజేరి ధనమెల్ల వ్యయించి విచ్చల
విడి సంచరించెను. మూఁడుమాసము లయినతరువాత తన భర్త
వచ్చినంగని యది మహాదుఃఖమొందెను. శీఘ్రమునఁ దల్లిచే
నంపఁబడియుఁ దనభర్తదరి కతిక్రోధమున నేగెను పిమ్మట
దూతికయింటి కేగెను. హోమదత్తుఁ డట పాముచేఁ గాటువడి
శూన్యగృహమునఁ బడియుండెను. విషహతుండైన యా
జారునితోడనే యది మోహాంధయై క్రీడించెను. అటనున్న
యొక రావిచెట్టుపైనున్న పిశాచ మా జారిణింగని యాశవ
దేహమున నావేశించి దానితో రమించెను. మఱియు వాఁడు
దంతములచే దానిముక్కు గఱచి తిరిగి రావిచెట్టుపైఁ గూరు
చుండెను. కపల్లుఁడను దొంగ యదెల్ల కనిపెట్టి యా కామిని
వెంటబడి దానియిల్లు చొచ్చియుండెను. జయలక్ష్మి యిట్లు
గృహమ్ము సొచ్చి తన భర్తను సమీపించి గట్టిగా నేడ్చెను.
లోకులు గుంపుగూడిరి. సోమదత్తుఁడు ముక్కుపోయిన
తన కన్యంగని కినిసి యల్లుని బంధించి రాజసన్నిధిని
బెట్టెను. రాజాజ్ఞచే భటులు వానిం బంధించిరి. అంతటఁ
గపల్లుఁడు (చోరుఁడు) తాను మొదటినుండి చూచు
చున్న వృత్తాంత మంతయు రాజునకు నివేదించెను. అంతట
రాజు సర్వపాప స్వరూపిణియు నధమాధమురాలు నగు జయ
లక్ష్మిని గాడిదపై నెక్కించి నగరము వెడలఁగొట్టెను రాజా!
వింటివికదా! ఇందుచే మేనక నా కర్హురాలు గాదంటి నని చిలుక
తెల్పెనని తెల్పి బేతాళుండీ తెల్పిన కథలో 'నాఁడుది యెక్కువ
పాపాత్మురాలా? పురుషుఁడా? తెలుపు' మని యడిగిన విక్రమార్క

ధరణీపాలుం డిట్లనియె. 'అగుణము అరూపమునగు పరబ్రహ్మ
యొక్క మాయ వర్ణరూపిణి. సత్త్వము పుంరూపము. రజస్సు
స్త్రీరూపము, తమోగుణము నపుంసకరూపము. ఈ త్రిలిఙ్గ
ముల సమిష్టి యవ్యయమయిన బ్రహ్మము. అవ్యయము బ్రహ్మ
ధామము. మాయ త్రిలిఙ్గరూపిణి. ఆ మాయచేతనే యీభువన
జాలమెల్ల జనించినది. అట్టి తల్లికి నమస్కారము. నపుంసకము
కంటె స్త్రీ యుత్తమురాలు ఆమెకంటెఁ బురుషుఁ డుత్తముఁడు.
జ్ఞానాధికుఁడు పురుషుఁడు. కర్మచే నధికురాలు స్త్రీ. అజ్ఞానాధి
కము క్లీబము(నపుంసకము)అని కోవిదులగు పూర్వులు పల్కిరి.
పురుషులకు కర్మమే బంధనము. జ్ఞానము బంధరాహిత్యము.
అందుచే స్త్రీ పాపాధిక. పురుషుఁడు పాపరహితుఁడు.'' అనిన
విని బేతాళుండు సంతోషించెను.

## —: (5) మహాదేవికథ :—

(5 అ) సూతుండిట్లనియె:- బేతాళుండు సుప్రసన్నుండై
విక్రమార్క భూపాల కుమారునికిట్లు తెలుపం దొడంగెను.
ఉజ్జయినీనగరమున మహాబలుఁడని విశ్రుతి కెక్కిన చంద్ర
వంశపు ఱేఁడొకఁ డుండెను. అతఁడు ప్రాజ్ఞుఁడు. వేదశాస్త్ర
విశారదుఁడు. వాని దూత హరిదాసుఁడు. స్వామిభక్తుఁడు.
వాని భార్య భక్తిమాల. అది సాధుసేవాపరాయణ. వారికి
మహాదేవియను నొక కన్యక మిగుల నందకత్తె జన్మించెను.
ఆమెయు సర్వవిద్యానిపుణ. ఆమె తనకంటె నన్నివిధముల
నధికుఁడైన వరునకిచ్చి వివాహము సేయుమని తండ్రికిఁ

నిద్రించెను. అతఁ డొకనాఁడు రాజసభ కేగెను. రాజు త్రైలింగ దేశాధీశుండగు హరిశ్చంద్రుని కడ కేగి యాతని యోగక్షేమము తెలిసికొని నాకుఁ దెలుపుమని కోరెను. అతఁడు నట్లే యేగి యచటికుశలవార్త తన రాజునకు మామగారగు హరిశ్చంద్రునకుఁ దెలిపిన నతఁడు హర్షించె. మరియు నతఁడు హరిదాసుం గని 'అయ్యా! కలి యెప్పుడు వచ్చును?' అని ప్రశ్నించెను. హరిదాసు ♦ 'న్యూహుఁ డనువాఁడు రాజ్య మేలునపుడు కలి రాఁగలఁడు. బ్రహ్మ యొక్క తొలిముఖమున 'ఓం' కారము జనించెను. రెండవముఖమున లోకవిమోహిని యగు మ్లేచ్ఛభాష పుట్టినది. అది యమలోక కారణము. ఎపుడు వేదోక్తమైన ధర్మము విపరీతముగఁ దోచునో యపుడు కలిరాజ్య మారంభమయ్యెనని యెరుంగ నగును కలికి మ్లేచ్ఛులం ప్రియులు. అధర్మమిత్రమగు కలి సర్వదేవతాతిరస్కారము గావించును. పాపమను పురుషునికి భార్య అబద్ధము. దుఃఖము వాని కుమారుఁడు. దుర్గతి వాని కోడలు. ఇల్లిల్లు నిట్లే యుండును నృపు లెల్లరు క్రోధవశులు. బ్రాహ్మణు లెల్లరు కామకింకరులు. ధనికులు లోభవశులు. శూద్రులు మహత్వభావితులు. స్త్రీలు సిగ్గు విడుతురు. కింకరు లెల్ల స్వామిఘాతుకులు. భూమి నిస్సారము. కలిలో నెవ్వరు హరిశరణుచొత్తురో వారు సంతోష మందుదురు.' అనిన విని హరిశ్చంద్రుడు సంతోషించి యా విప్రునికి దక్షిణ యొసంగెను. బ్రాహ్మణుఁ డతని శిబిరమున కేగెను. ఇంతట

---

♦ వీని పేరు మ్లేచ్ఛులలో మొదట నున్నది. చూడుఁడు.

నొక బుద్ధిశాలి యగు బ్రాహ్మణుఁడు తన విద్యావిశేషమును హరిదాసునికిఁ దెలుపవలయునని, తన జపమునకు సంతసించి దేవి యనుగ్రహించిన కామసంచారము సేయఁగల విమాన మొకటి యత్యాశ్చర్యకరమైన దానిం జూపించెను. అదిచూచి యా విప్రునిం దన కూతురున కనుకూలుఁడగు వరునిగా వరించి స్వపురమున కేతెంచెను. హరిదాసుని కుమారుఁడు ముకుందు డనువాఁడు విద్యలు నేర్చి 'గురుదక్షిణ' యేమి కోరు దురని గురువు నడిగిన నతడు 'నీ చెల్లెలిని నా కుమారున కిచ్చి వివాహము చేయింపుము' అని కోరిన నత డట్లే చేయుదునని మాటయిచ్చి యింటికి వచ్చెను. ఆ సమయమున మహాదేవి యశ్వత్థామకు శిష్యుడై శబ్దవేధి యను విద్యను సాధించిన వామనుఁడను బ్రాహ్మణబాలుని తన కీడుజోడగు వరునిగాఁ గోరుకొనెను. ఇట్లొక్క బాలికకై ముగ్గురువరు లొకరికి దెలియ కుండ నొకరుగా సమావేశమైరి. ఇట్లుండగాఁ గాముకుఁడైన యొక్క రాక్షసుఁడు దేవమోహితుఁడై వచ్చిపడి మహాదేవిని హరించికొనిపోయి వింధ్యపర్వతమునం బెట్టెను. వచ్చిన పెండ్లికొడుకులు దిగులుగుడిచిరి. అపుడు ధీమంతుఁ డను బ్రాహ్మణకుమారుండు జ్యోతిషికుడు కావున వింధ్య పర్వతముపై బాలికయున్నది. ఒకరాక్షసునిచేతఁ జిక్కినది. అని తెలిపిన బుద్ధికోవిదుఁడంతటఁ దక్కిన యిద్దరను దన విమాన మెక్కించుకొని యట కేగెను. అంతట శబ్దవేధి తెలిసిన విప్రుడు వి ల్లెక్కిడి యొక బాణముచే నారక్కసునిం గూల్చెను. ఇట్లమ్మువ్వురు బ్రాహ్మణ బాలకులు నమ్ముద్దియం గొని

తద్దయు నానందంబున నింటి మొగము వట్టిరి. త్రోవలోనే వా రాకన్నియ నాదినాది యని తగవులాడం జొచ్చిరి. విక్రమార్కనృపాల! ఈ తగ వెట్లులు దిద్దెదవో తెలుపు మన బేతాళునకు తేడిట్లనియె. స్వామీ! తన జ్యోతిశ్శాస్త్రబలమునం గన్నియజాడ దెల్పిన యాతం డామెకు పితృసమానుండు. విమానమునం గొనివచ్చిన యతండు భ్రాతృతుల్యుండు. రాక్షసుని గూల్చిన వీరు డక్కన్యను వివాహమాడందగిన వరుడు. అనిన బేతాళస్వామి మిగుల యామోదించెను.

## —: 6. కా మ్రాం గి క థ :—

6 అ. ధర్మపురమను నందమైన యొక గ్రామమున ధర్మశీలుండను రాజుండెను. వానిభార్య లజ్జాదేవి. వాని మంత్రి న్యాయశాస్త్రవిశారదుం డగు సంధకుడు. ధర్మశీలుం డొక యాలయము నిర్మించి యందు దుర్గాప్రతిష్ఠ గావించెను సంతానార్థియై యామె కుత్సవములును గావించెను. వరము కోరుకొమ్మనగా నాతండిట్లు వినుతించెను. అమ్మా! నీ వేక రూపవు. సర్వవర్ణస్వరూపిణివి. ప్రకృతివి. నిత్యవు. నీవు సాక్షాద్భగవతివి. నీచే నీచరాచరభూతజాల మల్లుకొనియున్నది. నీ యానతిచే నీ జగజ్జాలముల రచించి బ్రహ్మ వినోదించును. మహాలక్ష్మీసమేతుండై విష్ణువు దీనిం బాలించును. నీవు మహాకాలివై యీ జగమ్ముల భస్మ మొనరింతువు. నీవు సనాతనివి సురాసురవర్గమెల్ల నీ లీల చే, నవతరించిరి. జగన్మాతా! నమస్కారము. అనిన విని యశరీరవాణి యిట్లనియె. నీకు

మహాబలుఁడగు తనయుండు గల్గును. నీస్తుతికి నేను బ్రసన్న నైతిని. వివిధఫలములిచ్చెదను.' అన నా రాజు నిజమందిరమున కరుగుదెంచెను. రాణి కీదేవికృప తెలిపెను ఇట్లుండగా నొక నాఁడొక చాకలి కలిభోజనుఁడనువాఁడు కాశీదాసునితోఁ గూడి యాధర్మపుర మేతెంచెను. రాజమార్గమునఁ దండ్రితో నేగు చున్న యొక సుందరిని మిగుల నలసియున్నదానిం గని మోహ వివశుండై చండికకుఁ దన తల బలి యిత్తునని మ్రొక్కికొని యామె యనుగ్రహముచేఁ దనకులములోని యాబాలికను బొందెను. పిమ్మటఁ దన తలను జండికకు సమర్పించెను. వానియెడలఁ గలస్నేహముచే గాశిదాసుదాసుఁడును బలియయ్యెను. వారితోఁ బాటు పతివ్రతయగు కామాంగియుం దన ప్రాణముల చండిక కర్పించి దేవీసారూప్యమందెను. చండిక దయచూపి వారిని మువ్వురను బున రుజ్జీవింపఁజేసెను. మీమీ కోరిన వరమ్ము లిత్తుననియె. కాశిదాసుఁడు నాకుఁ గామాంగి నొసంగుమని కోరెను. కామాంగి తన భర్త నిమ్మని కోరెను. ఇట్లుండగా గలి భోజనుఁడు నా స్నేహితుని యందమైన శరీరము నాకిమ్మనెను. వారి మాటలు విని దుర్గ యేలనో పలుక కూరకుండెను. కాని వారు కోరిన వరమ్ము లొసంగెను. అని తెల్పి బేతాళుఁడు నవ్వి రాజు 'నిందు చండిక గావించిన విశేషమేమి ?' తెల్పు మనియె. విక్రమార్కుం డిట్లనియె. ఆ యిద్దరు పురుషుల శిరమ్ములు రెండును ఖండించి యొకరి తల యింకొకరి కతికించెను. అందువలన వారువారు కోరినవరములు వారివారికి లభించినవి.' అనెను. బేతాళుఁడు సంతసించెను. (కలిభోజనుఁడు

చండికవరముచే కాళిదాసుని చక్కని శరీరమును బడసెను. కాళి దాసుఁడు వరలాభమునఁ గామాంగిని బడసెను. కామాంగి కోరిన భర్తను బడసెను. పరస్పరవిరుద్ధములయిన కోరికలను సమన్వయపరుచుటలో దేవతానుగ్రహ మెంత చమత్కార ముగా నుండునో చూపుటయే యీ కథయందలి యద్భుతము.)

## —: 7. త్రిలోకసుందరి కథ :—

(7 అ) వేతాళుండు విక్రమార్క నృపశిఖామణికి మఱియు నొక విచిత్రమగు కథ నిట్లు తెలుపం దొడంగెను. చంపాపురమున జంపకేశియను బలవంతుఁడగు రాజుండెను. వాని భార్య సులోచన. వారికిఁ త్రిలోకసుందరి యను కూతు రుండెను. ఆమె స్వయంవరమునకై యింద్రుఁడు, యముఁడు, కుబేరుఁడు, వరుణుఁడు నను దిక్పాలురు మానుషాకారమున నే తెంచిరి. రాజునకు, 'నే నింద్రదత్తుఁడను సర్వశాస్త్ర నిపుణుఁ డను, సుందరుఁడ' నని యింద్రుఁడును, 'నేను ధర్మదత్తుఁడను, ధనుర్వేద పండితుఁడ' నని యముఁడును, 'నేను ధనపాలుఁ డను సర్వజీవుల భాషల నాకుఁ దెలియును, గుణశాలిని రూప శాలి' నని కుబేరుఁడును, 'నేను సర్వకలాకోవిదుండను, నా యొద్ద పంచరత్నములు కలవు. ఒకటి పుణ్యావృద్ధి హోమకార్య ములకు, నొకటి స్వభోగమునకు, నొకటి భార్యాభోగములకు, నొకటి ధనసమృద్ధికి, మఱియొకటి మృష్టాన్నభోజనమునకు నిత్యము నేను వినియోగింతును. ఇట్టి నాకు నీతనయారత్న మొసంగు' మని వరుణుఁడును గోరిరి. రాజు కన్యకం బిలిచి

యిందు నీవెవరిం వరింతువని యడిగిన నామె ధర్మశీలిని, లజ్జావతి గావున దైవమోహితయై యేమియుఁ బ్రత్యుత్తర మీయకుండెను. అని తెల్పి బేతాళుండు 'రాజచూడామణి! ఇందెవరి కీ నృపకన్యక యుచితమై యున్నదో నిశ్చయింపు' మన నా భూపాలుం డిట్లనియె. ఆమె ధర్మదత్తుని వరింప నర్హురాలు. అతఁడు సర్వశాస్త్ర నిపుణుఁడు. వర్ణముచే నాతఁడు ద్విజుఁడు. భాషాపాండిత్యము, ధనధాన్య సమృద్ధియుంగల యాతఁడు వైశ్యుఁడు. కలలు తెలిసి ధనుర్వేదము దెలిసినవాఁడు శూద్రుఁడు. కన్యక 'తనతో నీడగు వర్ణము కలవాని కర్హురాలనుట యుక్తము కాదా!' యనెను. బేతాళుఁడు సంతసించెను.

## —: 8. చిరందేవుని కథ :—

(8 అ.) బేతాళుం డిట్లనియె. విదేహరాజ్యమున మిథిలావతి యను నగరమున గుణాధిపుండను రాజుండెను. ఒకనాడు చిరందేవుఁడను రా జటకు జీవనార్థము వచ్చెను. వర్షఋతువు గడచిన తరువాత గుణాధిపుడు వేటకేగి యొక శార్దూల రాజమును వధించెను. అటనుండి యింకను లోనియడవికి చిరందేవునితో నతఁ డేగెను. అందు మిగుల శ్రమపడి యలసి యాకలిగొని నాకేదైన నాహారము సమకూర్పుమని రా జడుగ చిరందేవుఁ డేగి యొక లేడిని జంపి సంస్కరించి రాజునకుఁ బెట్టెను. అందులకు భూపతి సంతసించి వరము కోరుమనిన నాతఁడు 'రాజా! నీవు నా సొమ్ము వేయిముద్రిలు విలువగలది యనుభవించితివి కావున నెలనెల నూరువంతున నాకది చెల్లింపు'మనియె.

తే డంగీకరించెను. ఒకప్పుడు తన భృత్యుఁడగు చిరందేవుని సముద్రప్రాంతమునకుఁ బంపిన నాతఁడేగి కుసుమదయను నొక దేవి మార్కండేయ క్షేత్రమున నున్నదానిం గంధర్వ తన యను బూజించి ప్రాంజలియై నిలువఁబడెను. ఆమె వరము కోరుమిత్తుననఁ నీ రూపము నెడ మోహము పడియున్న వాఁడను. నన్ను జేపట్టుమనియె. ఆమె 'యిదిగో యీ కుండమున స్నానము జేసి రమ్మనియె. వాఁడేగి స్నానముచేసి మిథిల కేగి యీ చిత్రవృత్తాంతము గుణాధిపున కెఱింగించిన నాతఁడును బయలు దేరి యా దేవీమందిరమున కేతెంచెను. ఆమె 'గుణాధిప! నన్ను గంధర్వ వివాహపద్ధతిని గ్రహింపు' మన నతఁడు'' దేవి! నే నొకమాటచెప్పెదను. అందులకు నీ వంగీక రింతువేని నిన్ను జేకొందు' ననియె. ఆమె వల్లె యనియె. అతఁడు 'నా భృత్యుఁడు చిరందేవుని చేకొనుటయే నాకోరిక' యనియె. అంత గంధర్వకన్య సిగ్గునఁ దలవాంచి 'భూనాథ! నీవు దయా సింధుడవు. నాకు నాథుఁడవుకమ్ము, నే నింద్రునిచే నంపఁబడిన దానను, పుష్పదంతుని కూతురను, నా కొకానొక శాపముచే వరమాత్రిలతోడి భోగము తటస్థించినది' అని నామెపలుకులు విని ధర్మమూర్తియగు నా రాజు 'నేనెట్లు నిన్ను గైకొందును. నీవు నాకుఁ గోడలివరుసదానవు చిరందేవుఁడు నాకుఁ గుమా రుని యట్ల వర్తించుచున్న వాఁడు. నీ వాతనికి భోగకాంతవు కాఁదగినదానవు.' అన నామె మిక్కిలి లజ్జవడి యతఁడని నట్లు కోడలే యయ్యెను. 'విక్రమార్కనృపశేఖరా! ఇం దేది ధర్మమో సత్యమో నిర్ధారణచేసి తెల్పుమా!' అనెను.

రాజు చిరునవ్వు నవ్వి యిట్లనియె. ఇందు చిరందేవుని యెడల సత్యధర్మము లున్నవి. సర్వజనోపకారము చేయుట రాజ ధర్మము. రాజున కతఁ డెంతేని యుపకరించినవాఁడు. వృత్తి పేరు సెప్పి తాను రాజ్యార్హుఁడయ్యు నొకరాజునకు సేవచేసిన వాఁడు. రాజసత్కారము నందినవాఁడు. కావున నతనియందే ధర్మమున్నది' అనిన బేతాళుం డనుమోదించెను.

—: 9. కామాలసకథ :—

నిపుణాతినిపుణుండగు బేతాళుండు నృపమణి కిట్లనియె. కామపురమున వీరసింహుఁ డను ధర్మప్రభు వుండెను. అందే ధనమత్తుండగు హిరణ్యదత్తుండను వైశ్యుండు నుండెను. వాని కూతురు కామాలస యనునది రూపయౌవనశాలిని, కుసు మాపచయమునకై యుద్యానవనమున కేగెను. ధర్మదత్తుఁ డను వైశ్యుని కొడుకు సోమదత్తుఁ డా సుందరిం గని దరిచేరి యామె కేలు పట్టుకొనెను. జనసంచారములేని యా కుసుమవని నా బాలిక వానితో 'నేను గన్యను, న్యాయము కాదు, వదలు మని వివాహమైన తరువాత నేటికిఁ బదియవ రోజున నిన్ను గలిసెద నంతదనుక నా కనుజ్ఞ యిమ్మ'ని వేడుకొనెను. వాఁడు సరియనియె. అవ్వల దాని తండ్రి యాకన్యను మణిగ్రీవుని కుమారుఁడగు మదపాలున కిచ్చి పెండ్లి చేసెను. అత్తవారింటి కేగియు నా సుందరి తన చెలికానినే స్మరించుచుండెను. తొమ్మిదవరోజున భర్త యా బాలికం గదిసి కౌగలించుకొనగా నది యేడువ నారంభించెను. అపుడు వైశ్యుఁడు శాంతముగా

దానితో 'కల్యాణి! ఏల దుఃఖించెదవు. నిజము తెల్పు'మన నది
సత్యవచనగావున 'సోమదత్త! నీదరికి పదియవరోజు నేను రాకున్న
వైధవ్యము పొంది యీపాప మనుభవింతు' నని ప్రతిజ్ఞ చేసితిని.
ఆమాటకు నేను గట్టునడి వానిదరి కేగెద ననిన దాని భర్త
పొమ్మని యూరేయి స్వస్థుండై నిదురపోయెను. అది యిల్లు
వెడలి ప్రియునియొద్ద కేగుచుండగా నొకదొంగ సర్వాభర
ణములు పెట్టుకొని వెళ్లు నా పిల్లంజూచి 'సుందరి ! నీ వెందుఁ
బోవుచున్నావు? ఎవఁడు నిన్ను గోరినవాఁడు? రాత్రివేళ నీవెట్లు
పోయెదవు ? నిజము తెల్పుము' అనెను. అది వాని కున్నది
యున్నట్లు తెలిపెను. వాఁడు నాకీ నగలిచ్చి పొమ్మనెను. అది
నా యుపభర్తను జేరి బిగికౌఁగలింజేరిచి తిరిగివచ్చి యీ యాభర
ణముల నిత్తును' అని తెల్పి సోమదత్తుని వద్దకరిగినవాఁ 'డోసి!
నీవెట్లు రాఁగల్గితివి. నిజము తెల్పుము పిమ్మట నిన్ను జేకొందు'
ననియె. కామాలస జరిగినదెల్ల వివరించెను. వాఁడు విష్ణుదేవు
ననుగ్రహమునఁ దెలివి తెచ్చుకొని యది మహాపతివ్రతయని
యామెకుఁ బ్రదక్షిణము గావించి స్వయముగా నామె భర్త
సన్నిధికిఁ గొనివచ్చి దిగవిడచెను. అదియు విష్ణుదత్తములగు
సకల సంపదలను జూరలాడెను. బేతాళుండిం దెవరిది సత్యము
ఎవరుత్తములని యడిగిన రాజిట్లనియె. ఇందు దొంగ చూపిన
సత్యనిష్ఠ మెచ్చుకోదగ్గది. రాజువలన భయముచే నావైశ్యు
డామె ననుభవింపలేదు. ఆ యాడుది వైధవ్యభీతిచేఁ దనమిత్రుని
యొద్ద కేగెను. ధర్మభీతిచే నాయంగన మగఁడు దాని ననుభ
వింపఁడయ్యెను. దొంగ కేవలము సత్యమునకు వెఱచి
యామెను వీడి సంతసించెను.

## —: గుణశేఖరునికథ :—

### (వైదికధర్మప్రశంస)

(10 అ) బేతాళుండు రాజున కిట్లనియె. ధర్మపరుండగు గుణశేఖరుఁడను రాజుగలఁడు. వానిమంత్రి జైనధర్మ పరుఁడు. నిర్భయానందుఁ డని యతని పేరు. ఒకనాడు రాజు శివాలయమున కేగి గిరిజాపతి నర్చించుచుండగా నొకతేలతనిం గుట్టెను. ఆబాధకు రాజు మూర్ఛచెందెను. వెంటనే మంత్రి వాని విషము నకుఁ జికిత్సచేసి యాతని బాధనుమాన్పి జైన ధర్మములు గొప్పవి యని యాతనికడ నిట్లు కొనియాడ నారంభించెను. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము నను నాలుగుణములు రజోగుణమునుండి జనించినవి. ఆగుణములను బట్టి యనేకగుణభేదములు పుట్టినవి. విష్ణువు కాముకుఁడు. రుద్రుఁడు క్రోధి. బ్రహ్మ లోభి. ఇంద్రుఁడు దంభపరుఁడు. యముఁడు మోహి. యక్షరాజగు కుబేరుఁడు మదోన్మత్తుఁడు. ఈ దేవత లనంబడు వారందరును మాయకు లోఁబడినవారు. అట్టి మాయావశులను బూజించుటవలన నీకేమిలాభము గల్గును? ఈ చెప్పిన యాఱుగుణము లనెడి శత్రువులను జయించిన వాఁ డొక్క జినుఁడుసుమా! అతనిని జయింపగలవారు లేరు. ద్వైతవాదములో నతఁడు గొప్పవాఁడు. ఆతనిని ధ్యానించిన వారు మోక్షము నందుదురు. ఆ జినదేవుని యనుగ్రహామునకై నీవు నిత్యము గోపూజచేయుము. గోపూజవలన సర్వదేవతాను గ్రహము గల్గును. హింస యెన్నఁడును చేయరాదు. కల్లు త్రాగుట నిషిద్ధము. మాంసము, పానము నింద్యములు. న్యాయా

శ్రితమైన సొమ్ము నాకలితో నున్నవారికిఁ బెట్టవలయును. జినుని మతమున సూర్యుఁడే యాత్మరూపుఁడు. కావున సూర్యుఁ డస్త మింపకున్నపుడే భోజనము చేయవలెను. భోజనము పెట్ట వలయును. ఇట్లు పలికిన విని రాజా మతమునం దభిమానము గలవాఁడై వేదధర్మమును విడిచి జైనధర్మమును స్వీకరించెను. అంతట నాతనిభార్య యా యకృత్యమునకు దుఃఖపడి శివుని శరణందెను. శివుని యనుగ్రహముచే నామెకు 'ధర్మరాజు' అను ప్రసిద్ధిగల కుమారుఁడు పుట్టెను. అతఁడు వైదికమార్గ పరాయణుండై యుండెను. కొంతకాలమునకు గుణశేఖరుండు చనిపోయి నరకము పొందెను. ధర్మరాజు రాజ్యపాలనము గావించెను. అతని ధర్మవర్తనచే వాని తండ్రి స్వర్గమును బడసెను. ధర్మరాజునకు ముగ్గురు భార్యలుండిరి. వారితో నతఁడొక వసంతకాలమున నుద్యానవనమున విహరింప బోయెను. వారితో సరోవరమున జలక్రీడ లొనరించెను. పిమ్మట నొక తామరపూవును రాజు పెద్దభార్య చేతి కందించెను. అది యామెచేతినుండి జారి పాదము మీఁదపడగా నామె పాదము విరిగిపోయెను. రాజామెకుఁ జికిత్స చేయించెను. అటుపై రాత్రి చంద్రోదయము కాగా వాని రెండవ భార్య వెన్నెలశోకి మూర్ఛపోయెను. ఆమె నేల మీఁద పడుచుండగా నైన చప్పుడు విని మూఁడవ భార్య జ్వరము నొందెను. రాజు తనహస్తమునఁ దాకినంతనే యామె జ్వరతాపము చల్లారెను. తెల్లవారగనే యా రాజా సుకుమారలగు భార్యలతో గృహ మున కేగెను. ఇట్లు పలికి బేతాళుఁడు! "ఈ ముగ్గురిలో నెవ్వతె

మిక్కిలి సుకుమారురాలో నిర్ణయింపు' మని రాజు నడిగెను. అందులకు విక్రమాదిత్యుఁ డిట్లనియె. వాతప్రకృతికలది కావున పెద్దభార్య తామరపువ్వు తగిలినంత మాత్రముచే నొచ్చినది. శ్లేష్మప్రకృతి యయినది కావున రెండవభార్య వెన్నెలకు వాడిపోయినది. పిత్తప్రకృతి యయినది గాన మూఁడవ భార్య శబ్దమాత్రమునకే మూర్ఛపడినది. ఈ ముగ్గురలో తుదియామెయే యెక్కువ సుకుమారురాలు, అనిన విని బేతాళుఁడు జైనధర్మము గొప్పదియా? వేదధర్మము గొప్పదియా? తెలుపు మని యడిగిన విక్రమాదిత్యుఁడు 'వేదధర్మము సనాతనమైనది. దానిలోఁ గూడ యెనిమిది మెట్లున్నవి. అవి వరుసగా శూద్రుఁడు, వైశ్యుఁడు, క్షత్రియుఁడు, బ్రాహ్మణుఁడు, బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు, యతి యనుస్థానములు. అందులో నొకదానికంటె నొకటి యుత్తమములు. ఎవఁడు భార్యను వివాహమాడియు సన్యాసివలెఁ జరించునో వాఁడు పాపి, నరకమందును. గృహమందుండియు సన్యాసిధర్మము ననుసరింపుమని చెప్పునది జైనమతము. అందుచే నది పాషండమత మనిపించుకొన్నది. అది యనుసరింపఁ దగినదికాదు. ఇట్లు తెలిపిన సిద్ధాంతవాక్యములకు బేతాళుఁడు మిగుల హర్షించెను.

## —: 11. బుద్ధిప్రకాశుని కథ: —

బేతాళుండు ధర్మసమ్మితమైన వేఱొక గాథ విక్రమార్కునికి వినిపించెను. 'రాజా! పుణ్యపురమును ధర్మవల్లభుం డేలుచుండెను. వానిమంత్రి సత్యప్రకాశుఁ డనువాఁడు. ఆ మంత్రిభార్య 'లక్ష్మీదేవి' యను పేరుగలది. రాజొకనా 'డానంద మెన్నివిధములు?' అని యడిగెను. మంత్రి బ్రహ్మచర్యాశ్రమము బ్రహ్మానందము, అదియుత్తమము. గార్హస్థ్యము విషయానందము. అది మధ్యమము. వానప్రస్థము ధర్మానందము. అది యధమము. కర్మకాండము ననుసరించి చేయుకర్మము, దానివలనఁగల్గు నానందము సత్యధర్మానందము. సన్యాసానందము శివానందము. అది సర్వోత్తమోత్తమము. విషయానందము స్త్రీప్రధానము. సంసారికి స్త్రీ లేనిదే సుఖము లేదు. అనిన విని యారాజు దేశదేశములందుఁ జరించి యోగ్యురాలు ధర్మతత్పరురాలు నగు నిల్లాలికై వెదకివెదకి, వేసారి యిఁకఁ బ్రాణములు విడిచెదనని మంత్రితోఁ దెల్పెను. అంతట నమ్మంత్రి బయలుదేరిపోయి సింధుదేశమునకేగి సముద్రునిం గాంచి యాతని నుతించి శరణొందెను. అంతట నాసాగరుఁ డాతని వినుతికి హర్షించి పూవులు కాయలు పండ్లతో నిండిన యొక బంగారువృక్షమును సముద్రమధ్యమునం దామంత్రికిఁ జూపించెను. ఆ చెట్టుమీఁద నొక బాలిక సర్వాంగసుందరి యుండెను. మంత్రి రాజున కాయందమెల్లఁ జూపిన నా రాజా బాలతోఁ బాతాళలోకమున కేగెను. అందామెను గంధర్వ విధానముచే 'నన్ను బెండ్లియాడు'మని కోరెను. ఆమెవిని 'యీ

కృష్ణపక్ష చతుర్దశిరోజున నిన్ను జేపట్టెదఁగాక' యని పలికెను. సరిగా నానాటికి రాజు కత్తి చేఁ బూని యా సుందరియంతః పురమున కేగెను. అక్కడ నొక రాక్షసుఁడు బకవాహనుం డను వాఁ డా బాలికను బలాత్కరించి స్పృశించుచుండ గా రాజు చూచి కోపించి వానిని సంహరించెను. మఱియు నాయింతిం గని 'వీఁ డెవ్వఁడు ? ఎందుల కిటువచ్చినాఁడు ? 'అని ప్రశ్నించెను. అంత నాబాల "రాజా! వినుము, నేనొకవిద్యాధరునికూతురను. నాయెడ నాతండ్రి కెంతేని వాత్సల్యము గలదు. కామవివశనై నేనొంటరిగా వనమున కేతెంచితిని. నేను భోజనసమయమునకు మరలి యింటికిఁ బోకున్న నాతండ్రి ధ్యానమువలన నాయునికిఁ దెలిసికొని "ఈకృష్ణచతుర్దశినాడు నిన్నొక రాక్షసుఁడు బలాత్కరించుగాక !" యని శాపమిచ్చెను. నేను నాతండ్రిపాదముల పైఁబడి వేడ్వగా నతఁడు కరుణించి 'నిన్నొక వీరుండు వరించును. అప్పుడు శాపమోక్షమగు'నని తెల్పెను. నా తండ్రి తెలిపినట్లుగా నేడు నీచేత శాపముక్తి యిపుడు గాంచితిని. అని తెలిపి యా సుందరి రాజుతో రాజధాని కేతెంచెను. అంతట నానగరమందుఁ ప్రజ లుత్సాహముతో నుత్సవము నాచరించిరి. మంత్రియగు బుద్ధిప్రకాశుండు రాణితో వచ్చిన రాజుం గని యిఁక రాజ్య నాశనము కాక తప్పదని భయమంది వెంటనే ప్రాణములువిడచి స్వర్గమున కేగెను. అట్లు మంత్రి ప్రాణములు విడచుటకుఁ గారణము తెల్పఁగలవా? యని బేతాళుం డడిగిన విక్రమాదిత్యుండు రాజు విషయాసక్తుండు గాకూడదు. స్త్రీవ్యామోహము గలవాఁడు రాజ్యభ్రష్టుఁడు గాక తప్పదు." అని

గ్రహించి రాజభక్తుండగు మంత్రి శరీరత్యాగము చేసెను. ఇదే యిందలి యర్థమని తీర్పు చెప్పెను. అందులకు బేతాళుండు సంతసించెను.

## —: 12. హా రి స్వా మి క థ :—

బేతాళుండు నవ్వి మఱియు నిట్లనియె. చూడాపురము నేలు చూడామణియను రాజుండెను. అతనిగురువు దేవస్వామి యను బ్రాహ్మణుఁడు. అతఁడు వేదవేదాంగపారంగతుఁడు. వానిభార్య విశాలాక్షి పతివ్రత. ఆమె పుత్రార్థినియై శివు నారాధించెను. ఆదేవు ననుగ్రహముచే హారిస్వామి యను కుమారుఁడు మన్మథునంత యందము గలవాఁడు కలిగెను. అతఁడు దేవాంశ సంభూతుఁడు, బలశాలియు నై యుండెను. రూపలావణ్యాక యనునది దేవకన్యయయ్యును దేవలశాపముచే మానవకన్యయై జనించి వానికి భార్యయయ్యెను. ఒకనాఁ డామె భర్తతోఁగూడి వసంతమునఁ గుసుమాపచయ మొనరించి బడలి భర్తతో నేకాంతమున నిదురించియుండెను. సుకలుఁడను గంధర్వుఁ డొకఁ డామెరూపమునెడ మోహించి దానిని దన విమాన మెక్కించుకొని తననగరమున కేగెను. అంతట హారి స్వామి మేల్కని భార్యకై వెదకివెదకి యెందును గానక పరి తపించి యడవికి లేచిపోయెను. సన్యాసమును స్వీకరించి సర్వ విషయములను విడిచి హరిధ్యానపరాయణుండై తిరుగుచుండెను. ఒకనాఁ డొకబ్రాహ్మణుని యింటి కేగగా నావిప్రుఁడు పాయసము వండుకొని యొక మఱ్ఱిచెట్టుపై నుంచికొని నదీస్నానమునకు వెళ్ళెను. అంతట నొక సర్ప మా పాయసమును విషమయ

మొనర్చెను. అది యెఱుంగకయే యా బ్రాహ్మణుఁ డా పాయసము నీ యతికిఁ బెట్టెను. పెట్టిన వెంటనే సన్యాసి ప్రాణములువాసి శివలోకమందెను. అక్కడ రూప శీల సంపన్నురాలగు తనభార్యను బడసి సుఖించెను. 'రాజా! ఈ బ్రహ్మహత్యాదోష మిందరిలో నెవరిది? వివరింపుము' అన విక్రమార్కుఁడు బేతాళునితో 'సర్పము స్వభావముచే విష జంతువు. అది తెలియకయే పాయసమును విషమయ మొనర్చినది. అందుచేఁ బాము నెడ తప్పిదములేదు. ఆకలి గొన్నవానికి భిక్షపెట్టిన బ్రాహ్మణుఁడు స్వధర్మము నిర్వహించినవాఁడు కాన వానినిగూడ యా బ్రహ్మహత్యాపాతక మంటదు. ఎవఁడుచేసిన పాపము వాఁ డనుభవింపక తప్పదు. ఆత్మత్యాగము అతిథి నవమానించుటయు బ్రహ్మహత్యా తుల్యములయిన పాపములు. అట్టిపని చేయనివాఁడు కావున నా గృహస్థునెడ దోషమున్నదనరాదు. ఇఁక నీపాప మెవ్వరిది? అన్నచో 'విషముతోఁగూడిన పాయసము నతిథికిఁ బెట్టి యతి థిని జంపినాఁడు' అని యా బ్రాహ్మణునిపై నిందమోపి యానోట నానోట నాపాపమును జెప్పికొన్న లోకులందరికి నా పాపము పంచఁదగినది' అనెను. బేతాళుఁ డా రాజవరుని ధర్మసూక్ష్మజ్ఞానమున కెంతయు సంతసించెను.

## 13. వాశకుఁడను రాక్షసుని కథ (హరిమహిమ)

బేతాళుం డనుగ్రిహదృష్టితో నృపున కిట్లనియె. చంద్రి హృదయమను నగరమున రణధీరుఁడను రాజుండెను. అందు ధర్మధ్వజుం డను నొక వైశ్యుఁడు నుండెను. వానికొక చక్కని కుమార్తె కలిగెను. ఆనగరమున నొక జూదరి మద్యపాన రతుఁడు నగు యాతుభక్తుడను నొకఁడుండెను. ఆచోటనే వాశరుఁ డను రాక్షసుఁడు సంచరించుచుండెను. యాతుభక్తుఁడు దినదిన మా రాక్షసునికిఁ గావలసిన మద్య మాంసాదుల నొసంగు చుండెను. అందులకు వాఁడు వరముగా దొంగలు దాగుకొను టకు వీలయిన రహస్యమయిన సొరంగ మొకటి కల్పించెను. అది మనుజుల బుద్ధిని మోహింపజేయునదిగా నుండెను. అందు వానితోఁగలిసి తానును నివసించెను. ఒకనాటిరాత్రి రాజదాసి దొంగిలింపబడి యా గుహాలో దాచబడెను. దానియొద్ద చాలా ధనముండెను. వాని కంతకుఁ బూర్వ మేడుగురు భార్యలుండిరి. అందులో నీ రాజదాసి మిక్కిలి ప్రియురాలయి యుండెను. ఆ రాక్షసుఁ డచట పెద్ద కోటంత యిల్లు నిర్మించెను. అందు దొంగతనము చేసి కొనివచ్చిన ధనరాసులుకొల్లలుగా నుండెను. రాక్షసునిచే ధనము గోల్పోయిన గృహస్థులందరును దమ యిడుములను రాజునకుఁ దెల్పుకొనిరి. అంతట నారాజు నిశీథ మున నా నగరమున నొంటరిగా సంచరించెను. వానిని చోరుఁడు చూచి నీ వెవ్వఁడ వని యడిగెను. రాజు 'నే నొక దొంగను. ధనవంతుల యిండ్లఁ గన్నము వేయబోవుచున్నాను నీవును నావెంబడి వచ్చి సహాయము చేయుము. నీకును లాభము

గల్గును. సుఖమందుదువు ' అని తెల్పెను. అవ్వేల నయ్యి ద్వారుం గలిసి ధనవంతుల యిండ్ల ధనమును దొంగిలించి సరిగా నా సారంగమునకుఁ బోయిరి. ఆ దొంగ యా గుహావెలుపల రాజునుంచి లోనికిఁబోయెను. అంతట నా రాజదాసి వెలికివచ్చి ' రాజా ! నీవు వెంటనే గృహమ్మునకేగుము. ఏడు దొంగ. నిన్ను జంపు తలంపుతో నున్నాఁడు. అని మారుదారి చూపింపగా రాజు తన సౌధమునకు వెళ్ళెను. ప్రాతఃకాల మగుసరికి సేనతో నా సారంగమును జుట్టు ముట్టెను. దొంగ భయభ్రాంతుఁడై వాశముఁడను రాక్షసునిబూజించెను. వాఁడు సర్వమానవ సైన్యమును భక్షించెదను. నాకు మంచి భోజనము పెట్టితివని రాజుమీఁదికిఁ జొచ్చి సర్వసేనను భక్షించెను రాజుకూడ పారిపోవ నెంచుచుండగా రాక్షసుఁడు పట్టుకొని పారిపోవ రాచపాడి గాదు. నిలు నిలు మన నా నృపాలుఁడు మహాకాళిని ధ్యానించెను. కాళీప్రభావముచే నాగుహ యెల్లరతోఁగూడ దహింపబడెను. రాజాదొంగను సంకెలలచే బంధించి వైచెను, ధనమును, స్త్రీపరివారమును గొని రాజధాని కేతెంచెను. ఈ చర్య పట్టణమునం దంతటఁ జాటింపించెను. మఱియు నా రక్షకుని గాడిదమీఁద నెక్కించి నగరమునం దంతటను దిప్పించెను. ఆదొంగ ధర్మధ్వజుని యింటిముందరకు రాగా వాని రూపముఁ జూచి, వాని కూతురు సుఖభావిని యనునది దుఃఖవశయై తండ్రితో నీ దొంగను వెంటనే విడిపింపుమని ప్రార్థించెను. అతఁడు రాజసన్నిధి కేగి "నే నైదు లక్షల ధనమిత్తును. ఈ దొంగను విడిచి పెట్టుము. లేనిచో నా కూతురు ప్రాణములు

విడుచును' అనెను. రాజునవ్వి 'వీఁడు దొంగ. మనుష్యులందినువాఁడు. ఎన్నఁడైన నేను వీనిని విడువను.' అని తెల్పి వానినిగొరతవేయించెను. ఆ కొరతవేయుటుం దాదొంగ నవ్వి యంతలోయేడ్చి ప్రాణములు విడిచెను. ధర్మధ్వజుని కుమార్తె వానిపైమోహము గొని వానిదేహముపై బడ్చి యేడ్చి వానితోఁబాటు నగ్నిలోఁ బడెను. అంతట దుర్గ వారిద్దరిని బ్రతికించిభుక్తి ముక్తుల ననుగ్రహించెను. అని తెలిపి బేతాళుఁడు'రాజా! ఆ దొంగ ముం దెందులకు నవ్వెనో, తరువాత నెందులకేడ్చెనో తెలుపం గలవా? అని ప్రశ్నింప విక్రమాదిత్యుఁ డిట్లనియె. దొంగ 'యీమె నాకై ప్రాణములనుగూడ సమర్పించుచున్నదే. ఇట్టి ప్రియురాలి కే నేమి చేయఁగల' ననియేడ్చినాఁడు. హరిలీల చిత్రము గదా! 'అధర్మపరునికి స్వర్గమును, ధర్మాత్మునికి నరకము నీయగల హరిమహిమకు నమస్కారము' అని నవ్వెను. అట్లు శూలాగ్ర మందున్న వేళ హరిధ్యాన పరుఁడయి హరిని శరణొందెం గావున వానికి దేవిప్రాణముల నొసంగెను ఇదే యిందలి సారాంశము. అనినబేతాళుం డతని ధర్మ సిద్ధాంతమునకు సంతసించెను.

## 14. మూ ల దే వు ని క థ.

బేతాళుండు నృపవర్యున కిట్లనియె. పుష్పావతియనునగరమున సువిచారుండను రాజుండెను. రూప యౌవనశాలినియగు 'చంద్రప్రభ' యను నామె వాని భార్య యయ్యెను. ఆమెకు 'ఇం ద్రా వ లి' యను కూతురు జన్మించెను.

చంద్రావలి చెలికత్తెలతోఁ బూలుకోటకుఁ బుష్పాపచయము
సేయ నేగెను. అచ్చట సుదేవుఁడను విప్రకుమారునిం గాంచి
మోహపడెను ఆమెంగని యాతఁడును మూర్ఛపోయెను. అవ్వల
నాకన్నియ యింటికిఁ జనెను. అచటికి యిద్దరు విప్రబాలకులు
మూలదేవుఁడు, శశి యనువారు సర్వవిద్యా విశారదులు వచ్చి
నీవేల మూర్ఛపోయితి వని యాబ్రాహ్మణ కుమారుని బ్రశ్నిం
చిరి. అంతట నాతఁడు రోదనము చేయుచు జరిగిన వృత్తాంతము
దెలిపెను. మూలదేవుఁ డతనియెడ జాలిపడి యింటికిఁ గొని
వచ్చి చాముండీబీజమును మేళవించి మంత్రమును జపము
చేసెను. ఒక రసగుటిక చేసి సుదేవునికి సమర్పించెను. ఒక
దానిచేఁ బండ్రెండేండ్ల బాలయు, రెండవదాన నొక ముసలి
వాఁడుగను మూలదేవుఁ డయ్యెను. అట్లయి రాజదర్శనమున
కేగి యాశీర్వదించి నాయిల్లు తాంత్రికమను నగరమున
నున్నది. అది రమ్యాతిరమ్యము, విలాపధ్వజుఁ డనువాఁడు
నాయింటఁబడి సొత్తు హరించెను. నాకుమారుఁడు, భార్యయును
నెటకో పారిపోయిరి. ఈ కన్నియ నా పుత్రునిపై మోహము
గొని వరించి యున్నది. కొన్నాళ్ళు నీ వీమెను నీ గృహమునం
దాచియుంచుము. అనిన విని రాజు తన కుమారికను బిల్చి
యామెకు జతగా నా బాలికను సమకూర్చి జాగ్రత్త పఱచెను.
పిమ్మట బ్రాహ్మణవృద్ధు డింటికి వెడలి పోయెను. అంతట నర్ధ
రాత్రము జడుపు విడిచి యా రమణిం గదిసి 'సఖీ ! నీ మన
సెవనియెడల ననురక్త మయినది, నిజము తెలుపుము.' అనిన
నామె "నా హృదయము సుదేవుఁ డను విప్రకుమారునిపై

లగ్నమయి యున్న" దని చెప్పెను. అంతట నామె నిన్ను సుదేవునికి సమర్పింపఁగలనేని నా కేమి బహుమాన మిత్తు వని ప్రశ్నించిన నామె, 'నీకు సర్వదా దాసినయి యుందు'ననెను. ఆ మాట విన్న వెంటనే తన పూర్వరూపము ధరించి యెదుటఁ గన్పట్టెను. మఱియు నామెతోఁ గ్రీడించెను. ఆమె గర్భవతి యయ్యెను. అవ్వల నాలుగుమాసములు గడచిన తరువాత మంత్రికుమారుడు మదనాలసుఁడు తనకూతురు నెడ మోహావశుఁ డైనట్లు విని రాజతని కామెకు సమర్పించెను. అటుమీఁదట నా బాలిక 'ఓ మంత్రికుమారా! నీవు మూఁడుమాసములు తీర్థ స్నానములు చేసి రమ్ము, అటుమీఁదట నన్ను గలియ నర్హుఁడ వగుదు వనెను. మదనాలసుం డట్లే తీర్థాటనమున కేగెను. సుదేవుఁడు యథాపూర్వముగా దానితో వినోదించుచుండెను. ఆమెగర్భవతియైనపిమ్మట సుదేవుఁడు మనుష్యాకారముపూని మూలదేవు నింటికేగి యీ జరిగిన వృత్తాంతమంతయుఁ దెల్పెను. మూలదేవుఁడు ప్రసన్నుఁడై శశియను నిరువదియేండ్ల వయస్సు వానిని తన స్నేహితునివెంట నిడుకొని తాను వృద్ధరూపము దాల్చి రాజుకడకేగి నీకుమారికను శశికిమ్మని యడిగెను. రాజు వానికి భయపడి మెత్తనిమాటలతో నామంత్రి రాజశరుఁడు గలఁడు. అతని కుమారుఁడు మదనాలసుఁడు నాపిల్లను వరించి యున్నాఁడు. నేను నతని కిచ్చితిని. కావున నాయెడ నెట్టి యాగ్రహము చూపక యనుగ్రహము చూపుమని వేడుకొనెను. మూలదేవుఁడు విషము గ్రక్కుచు "రాజా! నాకు నీకూతురు నీయక తప్పదు! అని బెదరించెను. రాజు బెదరిపోయి బహువిధ

సంపదలతోఁగూడ తనకూతురును వానికి సమర్పించెను. శశి యను రాజకుమారికంగొని యింటికి వచ్చెను. సుదేవుఁడం దులకు దుఃఖించి మూలదేవునితో నీబాలిక నా సొత్తు, నాభోగ పత్ని' అని చెప్పుకొనెను. ఇట్లు తెల్పి బేతాళుండు నృపమణీ! రాజసుత ధర్మముగా నిందెవరి సొత్తగునో నిర్ధారణచేయుమన 'బాలిక తల్లిదండ్రులు దేవతా సమ్ముఖమున నెవనికి సమ ర్పింతురో వానికిఁ జెందును. శాస్త్రములందుఁగూడ యిట్లున్నది. ఒకని క్షేత్రమున నింకొకఁడు బీజారోపణము చేయు నను కొనుఁడు. అంతమాత్రముచే నా క్షేత్రము బీజక్షేపము చేసిన వానిది కాఁజాలదు. అది కృషికారుని దే యగును. అందుచే రాజకుమారిక శశినే వరింపగలదు. దానికి పుట్టినకుమారుఁడు మాత్రము సుదేవునికే చెందును. ఇది శాస్త్రసిద్ధాంతము' అని తెలిపి విక్రమాదిత్యుఁడు మంత్రి పుత్రుఁడగు మదనాలసుండేమి చేసెనో తెల్పుమన, బేతాళుం డిట్లనియె. మదనాలసుండు బృందావనమున కేగి రాధాకుండమునందు బహులాష్టమినాడు స్నానముచేసి మోహరూప పాపమెల్ల భస్మమయి, గోవిందుని హృదయ పుండరీకమున నిల్పుకొని, మెల్లనిమాటల నిట్లు విను తించెను. ఓ దయాసింధూ! కృష్ణదేవా! సముద్రమంతగానున్న యీ విశ్వమును రాధాదేవీ సమేతుండవై విలాసముగా ధరించి యున్నావు. రక్షించుచున్నావు. కాలమూర్తివై నీవే దీనిని గబ ళింతువును. హృషీకేశ! నా బుద్ధి నిర్మలమగునట్లు సేయుము. అని యిట్లు నుతించి దేవదేవుని యనుగ్రహవిశేషముచే మదన

వికారము నెల్లఁ బాసి స్వకీయధర్మపత్నింగూడి యానం
దించెను. మఱియు సుదేవుఁడు పిలిచి తన చెల్లెలి నాతనికిచ్చి
వివాహము కావించెను.

## — జీమూతవాహనుని కథ —

15. బేతాళుండు విక్రమేశుని ప్రశంసించి మఱియు
నిట్లనియె. కాన్యకుబ్జమున దాత, సత్యసంధుఁడు, దేవీభక్తుఁడు
నగు నొక విప్రుఁడుండెను. తాను ప్రతిగ్రహము పట్టిన ధన
మెల్ల దానములకు వినియోగించెను. శరదృతువునందు నవ
దుర్గా వ్రతము వచ్చెను. కాని యెందును దానము పట్టుటలో
ద్రవ్యలాభము కలుగక పోయెను. అయ్యో! కన్యలను పిలిచి
కొంటిని. వారికి భోజన మెట్లు పెట్టఁగలను? ఏమి చేయుదునని
పరితపించెను. అంతట దేవీ ప్రసాదముచే నైదు ముద్రలు
(నాణెములు) లభించెను. వానిచే దుర్గావ్రతము సాగించెను.
నవరాత్రములందు నిరాహార వ్రతము పూనెను. ఆ వ్రత
ప్రభావముచే నతఁడు చనిపోయి దేవభావము నందెను. మఱియు
నాతఁడు జీమూతకేతు వను విద్యాధరుం డయ్యెను. హిమాచల
మున నున్న విద్యాధరపురమునఁ గొన్నేళ్ళు నివసించెను.
అందు నిత్యము కల్పద్రుమమును బూజించుచుండెను. ఆపూజా
ప్రభావముచే వానికి జీమూతవాహనుఁ డను నొక కుమారుఁ
డుదయించెను. ఆతఁడు పూర్వజన్మమున నుత్తమమగు భారత
ఖండ మధ్య దేశమున శూరసేనుఁ డను క్షత్రియుఁడై యుం
డెను. ఒకనాడు వేటమీఁది యుత్సాహముచే నాతఁడు వాల్మీ
కులవారు వసించు 'ఉత్పలారణ్యము' న కేగెను. చైత్రశుద్ధ

నవమి యగుటచే నానాడు జంతువధ చేయఁబడియెను. మఱియు నా పుణ్య సమయమున 'రామోత్సవము' నాచరించెను. వాల్మీక్యాశ్రమ కుటీరమున నొక రాత్రి జాగరణముకూడ చేసెను. రామాయణము వినెను. ఆ పుణ్య ప్రభావముచే నింద్రునివలె సర్వభోగసమృద్ధుండయి యచట వినోదించెను. కల్పవృక్షమును బూజించి యున్నవాఁడు గావున "నా దేశము నా నగరము ధనధాన్య సమృద్ధమగున ట్లొనరింపు" మని కోరి వరములను బడసి, యా కల్పతరు కరుణావిశేషముచే నట్టి వైభవము నచిరకాలముననే పొందెను ఆ నగరమున నున్న వారెల్లరు రాజాశ్రయము లేకయే రాజుతో సమానులయిరి. అవ్వల నాతండ్రి, కుమారుఁడును తపమునకై వనమున కేగిరి. మలయగిరిపై తీవ్రమయిన తపమాచరించిరి. ఒకనాడు మలయధ్వజుఁడను రాజున కనుంగు బిడ్డ కమలాక్షి యనునది సఖురాలితో పూజార్థము శివమందిరమున కరుదెంచెను. జీమూతవాహనుఁడును సరిగా నదేసమయమున కచటికి శివపూజకుఁ జనియెను. దివ్యాంగిని, సర్వాభరణభూషితయు నగు నాకన్నియం గని, కనినమాత్రన సుమశరములు దాకి మన్మథునిం బెక్కుతెఱంగుల వినుతించెను. ఆమెను దనకుఁ బ్రియురాలి నొనర్పుమని యర్థించెను. మదనదేవత యనుగ్రహించి యాతని కోరిక సంఘటించెను. ఆ రాజుకొడుకు 'విశ్వావసువు' అను వాఁడు చెల్లెలి భర్తతో గంధమాదనగిరికి విహారమున కేగెను. అచట నరనారాయణుల నర్చించి 'గరుడోత్తుంగ' మను గిరికిఁ జనెను. అచట శంఖచూడుని తల్లి దుఃఖించుచుండెను. జీమూత

వాహనుఁడు త్వరగా నటకేగి గాంచి యావృద్ధురాలి
నోదార్చి, అమ్మా! ఏందుల కేడ్చుచున్నదానవని యడిగిన
నామె, దేవా! నాకుమారుఁడు గరుడునిచే మ్రింగఁబడనున్నాఁడు.
అందులకు దుఃఖార్తనయి యున్నదానను. అనిన విని రాజు
చంచర గరుడోత్తుంగమున కెక్కెను. వెంటనే గరుడుఁడు
జీమూతవాహనుని గూడ ముక్కునఁ గఱచుకొని యాకసమునఁ
బర్వెత్తెను. కమలాక్షి తన భర్తకుఁ గలిగిన యీ దురవస్థ గని
దుఃఖించుచుండెను. గరుడుం డట్లు జీమూతవాహనుని గొని
పోయి నిలిపి, నీవు నాకెందులకు భక్ష్యమయితి వని యడిగెను.
జీమూతవాహనుఁడు 'పక్షీశా! నా పలుకులు వినుము. శంఖ
చూడుని తల్లి పుత్రునకై మిగుల దుఃఖించుచున్నది. ఆ బాలుని
నీవలన విడిపింప వలయునని యిచటికి నీసన్నిధికి వచ్చితిని నన్ను
నీవు భక్షించి యీ పన్నగుని శంఖచూడుని వదలివేయుము '
అని నివేదించెను. శంఖచూడుఁడు వైనతేయునిగని నన్నే
భక్షించి రాజును విడువు మనెను. ఆమాటల కతండు ప్రసన్నుఁ
డయి శంఖచూడునే కాదు, వాని కులములో నెవ్వరినింగూడ
భక్షింపనని, నీవు విద్యాధరపురమున కధీశ్వరుండవై లక్షసంవ
త్సరములు రాజ్యభోగములు చూరలాడెద వని, అవ్వల వైకుం
ఠమును బొందెదవని మూఁడు వరము లొసంగెను. అట్లొసంగి
గరుఁడు డంతర్ధాన మందిన తరువాత జీమూతవాహనుఁడు
పితృరాజ్యమును, స్వార్జిత సామ్రాజ్యమును గూడ వడసి చిర
కాలమేలి వైకుంఠము నందెను. ఇట్లు తెలిపి భేతాళుండు
మీఁదఁజెప్పిన ముగ్గురలో నెవ్వరి కుత్తమ ఫలము గల దని

యడిగిన విక్రమార్కుఁ డిట్లనియె. 'స్వామీ! ఇందు శంఖచూడునికిఁ బ్రాణదాన ఫలము వచ్చినది. రాజు పరోపకారుఁడు కావలయునని విధియే యున్నది. కాన జీమూతవాహనుని యెడ విశేషము లేదు. పతివ్రత ప్రార్థనాప్రభావముచే గరుడుఁడు సంతుష్టుండయి ప్రాణదానము చేసినవాఁడు. శంఖచూడుఁడు తన శత్రునియెదుట నిలిచి శరీర మర్పింతునని చెప్పుటచే నిందరిలో నతఁడే యుత్తమ ఫలభాజనుఁడని తీర్పు చెప్పెను. భేతాళుం డానిర్ణయమునకు సంపూర్ణామోద మందెను.

## —• 16. దేవశర్మకథ •—

బేతాళుం డిట్లనియె. దక్షిణ దేశమునఁ జంద్రశేఖరుండను రాజు రాజ్యమేలు చుండెను. ఆతని రాజధాని యందు రత్నదత్తుండను వైశ్యుండు ధర్మజ్ఞుఁడు ధనధాన్యవంతుఁడు నివసించు చుండెను. వానికిఁ గామావరూధిని యను కుమార్తె యుండెను. రత్నదత్తుండు రాజునకుఁ దన కూతురు నిత్తునని తెల్పెను. చంద్రశేఖరుండు విప్ర మంత్రియగు విదురుని నా బాలిక సౌందర్య మరసిరమ్మని పంపెను. అవ్వల నా రాజు భార్య శ్యామల యంతఃపురమున కేతెంచిన భర్తను ధూప దీపాదులచే నర్చించెను. ఈ సమయమందే యొక గోవు పులి నోటఁ జిక్కి అంబా! అంబా! అని యార్చుచుండెను. రాజా యాక్రందన ధ్వనివిని తటాలున ఖడ్గహస్తుండై యురికి యా శార్దూలమును వధించి గోరక్షణము సేసి సంతోష మందెను. కూలిన పులి శరీరమునుండి ముకులుఁడను నొక రాక్షసుండు రూపొంది వచ్చి రాజుతో సవినయముగ 'నృపతీ! నీ దయచే

ముక్తి సంపాదించితిని. వరుణలోకమున కేగుచున్నాను. ప్రహ్లాదుం డిచ్చిన శాపముచే నేను వ్యాఘ్రమయితిని.' అని రాజునకుం బ్రదక్షిణ మాచరించి ప్రహ్లాదుని సన్నిధి కేగెను భూపతి యింటికిం జని సుఖనిద్ర నందెను. ప్రభాతసమయమున వంది మాగధగానములచే మేల్కొలుపంబడి కాల్యములు దీర్చి యలం కరించుకొని సభ కేగెను. మఱియు నారాజు కామావరూథిని రూపమునకు భ్రమించి యెల్లప్పుడు నామెనే తలంచికొను చుం డెను. అది చూచి మంత్రి నీకది యుక్తాచారముగాదని తెలిపెను. రా జామాట విశ్వసించి రత్నదత్తుని కుమార్తెను దన సేనాధి పతియగు బలభద్రుని కిచ్చి వివాహము చేసెను. అవ్వల నొక నాడు రాజు కామావరూథిని జూచుట తటస్థింపగా నామెవిలా సమునకు మోహపడి మూర్ఛితుండై యీ సుందరి యెవ్వని భార్య? ఎవని కుమార్తె? అని యడిగిన బలభద్రుండు విని వినయవినమితుండై ఈమె నా భార్య. రత్నదత్తుని కుమారిత. నీ మంత్రి నీ వీమె సౌందర్యమునకు మోహించి రాజ కార్య ములు మరచిన రాజ్యభంగ మగునను భయముచే నీమెరూపలా వణ్యము లున్నవి యున్నట్లు నీకు వర్ణించి చెప్పండయ్యెను. పోనిమ్ము, ఇప్పుడయిన నీ వీమెం జేకొనుము. నీకు నేను దాసుం డనుగాన దాసునిభార్యను నీవు స్వీకరించుట దోషము గాదు. నేనిచ్చుటయుం దప్పుగాదు. నా యభిలాష పూరింపుము. నీవు దయచూపుము. అని ప్రార్థించెను. ఆమాటలు విని క్రోధ తామ్రాక్షుండై "ఈమె నీకు ధర్మపత్ని. నేనీమెం గ్రహించినచో యమకింకరులు నన్ను నరకమునం దొరసి దుఃఖ పెట్టుదురు."

అని విరహార్తుఁడై కృశించి కృశించి ప్రాణములు వాసెను. రాజా! ఇట్లు రాజు మృతినొందగా వాని భార్య సతీధర్మముచే సహగమనము చేసెను. సేనాపతియు శోకించి ప్రాణములు విడిచెను. వారందరు పుణ్యశీలులయి స్వర్గము నందిరి. అని తెల్పిన విక్రమార్క చక్రవర్తి రాజు కొఱకై ప్రాణములు వాయుట సేవకునికి విధివిహితము. భర్తతో ననుగమించుట పతివ్రతకు సహజధర్మము. రాజు కింకరుని ధర్మపత్ని గొనకుండుటలో నతని యెడ 'కామజయము' ధర్మపాలనము విశేషించి కాన వచ్చుచున్నది. కావున నిందరిలో రాజు ఉత్తమోత్తముఁడని నిర్ధారణ చేసెను. బేతాళుండు మోదించెను.

## —◆ 17. గుణాకరుని కథ ◆—

బ్రాహ్మణరూపుఁడగు బేతాళుండు వెండియు నిట్లు తెలుపఁదొడంగెను. మహాభాగ! విక్రమప్రభూ! వినుము. ఉజ్జయినియందు మహాసేనుఁడను రాజుండెను. వాని రాజ్యమున దేవశర్మయను విప్రుఁడుండెను. వాని కుమారుఁడు గుణాకరుఁడు. వాఁడు మద్య మాంసపరాయణుఁడు జూదమాడి ధనమెల్ల గోల్పోయెను. బంధువులు వానిని వెళ్ళఁగొట్టిరి. వాఁడు భూమిం దిరుగాడుచు నొక నాడొక సిద్ధాశ్రమమునకుఁ జనెను. అందు కపర్దియను యోగి వానికి కపాలముననున్న యన్నము పెట్టెను. అది పిశాచాన్నమని గ్రహించి వాఁడు గ్రహింపఁ డయ్యెను. అవ్వల కపర్ది యొక యక్షిణిని పిలిచెను. ఆ బ్రాహ్మణుఁ డారాత్రి దానితో సుఖించెను. ప్రాతఃకాలము కాఁగానే యక్షిణి కైలాసమేగెను. యక్షిణి నెడబాసి విప్రుఁడు

యోగి దరికే తెంచెను. యోగియగు కపర్ది యక్షిణీకర్షిణియను నొక విద్యను వాని కొసంగెను. నలుబదిరోజులు నిశీథమున నీటిలో నిలిచి యా మంత్రమును జపించెను. కాని యక్షిణి రాదయ్యెను. అందులకు వాఁడు యోగి యాజ్ఞగొని మోహమును విడిచి యింటికేగి తల్లిదండ్రులను మ్రొక్కి రాత్రి యటనే యుండెను. ప్రాతఃకాలమున సన్న్యాసివేషనయి తన వారు దుఃఖితులగుచుండఁగా వారిని విడిచి ప్రతిబోధ యను వాని వనమునకేగి శిష్యుఁడయ్యెను. పంచాగ్ని మధ్యమందు నిలిచి మరల నా మంత్రమును జపించెను. యోగినిమాత్రము రాదయ్యెను. అందులకు వాఁడెంతేని చింతించెను. ఇట్లు తెల్పి బేతాళుండు యక్షిణి రాకపోవుటకుఁ గారణము తెలుపఁగలవా? యన విక్రమార్కుండు రుద్రకింకరుఁడగు బేతాళునితో 'విప్ర! కర్మము మూఁడు తెఱంగులు. మనస్సుతో కలిపి చేసిన కర్మము పరలోకమునందు సుఖప్రదమగును. శరీరము, మాట కలిపి చేసిన కర్మము స్వల్పసిద్ధి నిచ్చును. అది యిహలోకముననే ఫలించును. పిండదేహము (స్థూలదేహము) చేఁ జేసినది పరలోకమున ఫలించును, మనశ్శరీరముచేతఁ చేసినది పరజన్మమందు ఫలించును. మనోవాక్కాయములు మూఁడును జేర్చి చేసినది యిహజన్మమం దిప్పుడే ఫలించును. అది పరలోకమందుఁగూడ పరమసిద్ధినీయఁగలదు. కావున సాధకులు త్రికరణశుద్ధిగా నిక్కడనే కర్మ మాచరింపవలయును. వాఁడు వేఱు చిత్తముతోఁ జేసెను గాన వేఱుజన్మమందే వానికి యక్షత్వము

గల్గును. అని సిద్ధాంతీకరించెను. బేతాళుండు విని ప్రసన్న ముఖుండయ్యెను. బాగు బాగని ప్రశంసించెను. మఱియు నొక్క యితిహాసమును పరీక్షార్థముగా విక్రమునికి వినిపించెను.

## —◆ 18. మోహినీకుమారుని కథ ◆—

బేతాళుం డిట్లనియె. సుదక్షుండనురాజు కంబుకమను పురమందుండెను. అతఁడు న్యాయధర్మపరుఁడు, శూరుఁడు, దాత, శివభక్తుఁడు, వానిరాజ్యమునధనాధ్యక్షుఁడను కోమటియుండెను. వాని కూఁతురు 'ధనవతి' చాల చక్కనిది. ఆమెను గౌరీదత్తుఁడను వణిజబాలున కిచ్చి వివాహముచేసెను. వారికి 'మోహిని' యను పుత్రిక కలిగెను. ఆమెకుఁ బండ్రెండేండ్ల ప్రాయమునఁ తండ్రి గతించెను. ధనవతి కూఁతురుతో నర్ధరాత్రి పుట్టింటికి వెళ్లెను. న్యాయశర్మయను నొక ద్విజుండు బ్రహ్మస్వమును హరించి శూలమున కెక్కింపఁబడియుఁ జావఁడయ్యెను. హఠాత్తుగా కూఁతురుతో నా దారినే వచ్చుచున్న యా వైశ్యస్త్రీ తన చేతితో వానిని స్పృశించెను. ఆ తాకిడికి వాఁడు శూలమునందు కదలి మిక్కిలిబాధ నొంది రోదనము చేసెను. హా రామ! హా కృష్ణ! ప్రద్యుమ్న! అనిరుద్ధ! యని మాటిమాటికి వాఁడు ఘోషపెట్టెను. ధనవతి విని నీ వెవ్వఁడవని జాలిగొని యడిగెను. నేనొక బ్రాహ్మణుఁడను. మూఁడురోజులయి యీ శూలమునఁ గ్రుచ్చఁబడినాఁడను. నీ కూఁతురును నాకిత్తువేని కోటి బంగారము నిత్తును అనెను. ధనవతి విని యట్లే కూఁతురునిచ్చి వివాహము గావించెను. ఒక మఱ్ఱి మొదటఁ బాతినధనము పెల్లగించి యింటికి కొనివచ్చెను మోహిని వానింగని నీవు

మృత్యుముఖమున నున్నావు. నాకుఁ గుమారుఁడెట్లు కల్గును? అనిన వాఁడు 'ఓసీ! నీకెప్పుడు కామవికారము కలుగునో యపు డొక విద్వాంసుని బ్రార్థించి పుత్రలాభమందుము' అని యాజ్ఞ యిచ్చి వాఁడు యమలోక మొందెను. నిత్యము నరక యాతన ననుభవించెను. మోహిని తల్లియింటవసించుచు యౌవనము రాఁగా, భర్తయాజ్ఞను మనసునం దెంచుకొనుచు,

"కే భోగాశ్చ కిమాశ్చర్యం కో జాగర్తి శయీత కః
పాపో వ్యాధిశ్చ దుఃఖంచ కుతో జాతం హృది స్థితమ్"

భోగము లేవి? ఆశ్చర్య మేది! ఎవఁడు మేల్కొనియున్నవాఁడు? ఎవఁడు నిద్రించినవాఁడు? పాపము, వ్యాధి, దుఃఖము, కామ ము నెట్లు పుట్టును? అను నర్థముగల యీ శ్లోకము నెల్ల బ్రా హ్మణులకు వినిపించి యడుగుచుండెను. కాని యొక్కఁడును సమాధాన మీయలేకుండెను. మేధావి యను నొక కాశ్మీర బ్రాహ్మణుఁడు వచ్చెను. ఆతఁ డామెతో "మోహిని! సుందరి! వినుము. సుగంధము, స్త్రీ. వస్త్రము, గీతము, పానము, భోజ నము, శయ్య, భూషణము, నని భోగ మెనిమిదివిధములు (అష్ట భోగములు). దినదినము భూతములు (జీవులు) పుట్టుచున్నవి. గిట్టుచున్నవి. అట్టివానియందు మమకారము పెట్టుకొనుటయే వింతలకెల్ల వింత. ఎవడు వివేకియై ఘోరతమోరూపమయిన చీకటిలో కర్మసంగ్రహము చేయునో వాఁడు మేల్కొని యున్నవాఁడు సంసారమను కొండచిలువ నెఱింగి యుదాసీనుఁ డయి సమాధినిష్ఠను బొందినవాఁడు సుఖముగా నిద్రించిన వాఁడు. సంకల్పము వలనఁ గామము, కామమువలన లోభము,

లోభమువలన తృష్ణ జనించును. ఆ తృష్ణయే నరకప్రదము. ఎవఁడు జలప్రకృతి కలవాఁడై జన్మించునో వాని శరీరమందు వ్యాధి జన్మించును రసవికారమే వ్యాధి. అది కర్మమయము. అమంగళము. అదే పాపము. రుద్రునివలన కాళియందు మోహము జనించెను. అదే లోక సంహారకము. రుద్రుఁడు సురపూజితయగు మహాదేవిని నుతించి మోహునికి భార్యగా మిథ్యాదృష్టి యనుదానిని సంపాదించెను. వారికి స్నేహమను బిడ్డ జన్మించెను. స్నేహము భార్య మమత. మఱల నామమతా స్నేహములకు శోక దుఃఖములు జన్మించెను. ఇది విని యా యంగన మూర్ఛపోయెను. మానవంతుఁడు, శూరుఁడు, చాతుర్యము గలవాఁడు, అధికారి, గుణవంతుఁడు, సఖుఁడు, స్త్రీరక్షకుఁడు నయిన పురుషుఁడే స్త్రీని వశము చేసికొనఁ గలఁడు. అట్లు తెల్పి యా విప్రుఁ డామెకు సంతతి నొసంగి యామెకడ నున్న బంగారముం గొనెను. ఒకనాడు శివుఁడు గర్భవతియగు మోహినికిఁ గలలోఁ గానిపించి చెప్పిన విధముగా, నుయ్యేలలో వేయి బంగారు నాణెముల నుంచి బాలు నందుఁ బరుండఁబెట్టి రాజద్వారమం దుంచి తాను సుఖముగా నిద్రపోయెను. శివునిచే మేల్కొలుపఁబడి రాజు హరదత్తుఁ డనువాఁడు పుత్రార్థియై శివప్రసాదముచే నా మోహిని కుదయించిన బాలకుని బడసెను. వాని జాతకర్మము గావించెను. దానములు చేసెను. తండ్రి గతింపగా నా రాజ్యమునకు మోహినీ కుమారుఁడే రాజయెన్యు. మఱియు నాతఁడు ఫల్గునదీతీరమునఁ దండ్రికి గయాశ్రాద్ధము నాచరించెను. అప్పుడు వానికి మూఁడుచేతులు వచ్చెను. దాని

కతఁ డాశ్చర్య మందెను. ఇట్లు దెలిపి బేతాళుండు ఈ బాలుఁడు నైచిన పిండ మెవరికి ముట్టునో తెల్పుమన విక్రమార్కుండు విప్రుఁడు దరిద్రార్థి. రాజు గురుతుల్యుఁడు. న్యాయశర్మయను దొంగకే యీ పిండము చెందును. వానిభార్య మోహిని ఆపిండ ప్రభావముచే బ్రహ్మదరిద్రాపహర్తయగు ద్విజుఁడు నరకముం బాసి స్వర్గలోక మందెను.

—: 19 రూ ప సే ను ని క థ :—

చిత్రకూటమున రూపసేనుఁడను రాజుండెను. ఒకప్పు డతడు వేటకుఁ బోయెను. మధ్యాహ్న వేళ నొకసరోవరతీరమున నొక మునికన్యను జూచెను. ఆబాలిక రూపయౌవనశాలిని. ఒక పద్మముకొఱకు వెదకుచుండెను. ఒకరిచూపులొకరి చూపులతో సరిదాకెను. అంతలో నాకన్యక తండ్రియగు ముని యచటి కేతెంచి యిద్దరిని గాంచెను. ఆబ్రాహ్మణుని దర్శన మగుటతోటనే నృపతికి జ్ఞానోదయ మయ్యెను. వినయావన తుండై ధర్మప్రశ్నము చేసెను. దయయే ధర్మపోషణము. అభయదానముకంటెమించినది లేదు. దండనార్హుల దండించినచో బూజ్యులయినవారిని బూజించుటవలని ఫలము కల్గును. గో బ్రాహ్మణులయెడ మిత్రభావము నిగ్రహానుగ్రహములందు నిష్పక్షపాతత్వము, దేవపూజయందు సత్యత్వము, గురుపూజ యందు ఇంద్రియనిగ్రహము, దానమునందు మృదుభావము, నింద్యకర్మమునందు సంతుష్టి (మోహప్రవృత్తియందు తగు మాత్రముతోఁదృప్తిచెందుటయని భావము కానోపును) అనునవి యుత్తమ ధర్మములని తెలిపి యామునిని తనకుమారిక నారాజు

గొనసంగి చనియెను. రా జాసుందరితో నవ్వనమం దొక మఱ్ఱి నీడను విశ్రమించెను. అంతట నొకరాక్షసుఁడు రాజుభార్యను దినవలయునని వచ్చి రాజును లేపి బలియిమ్మని యాచించెను. రా జేడేండ్ల బాలకుని గొనివచ్చి బలియిత్తునని చెప్పి యింటి కేగెను. ఏగి, మంత్రులతో సమాలోచనముసేసి యొకబ్రాహ్మ ణునికి లక్షసువర్ణముద్రల నొసంగి మధ్యముఁడగు కుమారుని దెచ్చి రాక్షసున కర్పించెను. బలియిచ్చు సమయమునఁ బ్రా హ్మణబాలుఁడు మొదటనవ్వి పిమ్మట యేడ్చెను. బేతాళుండు విక్రమునిగని యాపిల్లవాఁడు తొలుత నవ్వుటకును బిమ్మట రోదనము చేయుటకును గారణ మేమని యడిగెను. విక్రి మార్కుం డిట్లనియె. ఓయీ ! బ్రాహ్మణోత్తమ! పెద్దవాఁడు తండ్రికిని, చిన్నవాఁడు తల్లికిని మిక్కిలి ముద్దుగూర్చువారని తాను మధ్యముఁడగుటచే నిం దెవ్వరికిని బట్టలేదని వెఱంగి రాజును శరణొందెను. రూపసేనుఁడు నిర్దయుండై తనభార్య క్షేమము వర్ధించినవాఁ డయ్యెను. వాఁడు ఖడ్గహస్తుఁడై బలి యిచ్చుటకు సిద్ధమగుట చూచి బాలుఁడు తొలుత నవ్వెను. శివభక్తిపరుండనైన నా శరీరము రాక్షసునిపాలయ్యెఁ గదాయని రోదనమొనర్చెను.

## —♦ 20. సు వ ర్ణు ని క థ ♦—

బేతాళుండు రాజునకు మఱియొక కథ చెప్పఁదొడంగెను. విశాలానగరమున విపులేశుఁడను రాజుండెను. అం దర్థ దత్తుండను వైశ్యుఁడు కూడ వసించుచుండెను. అతఁడు వ్యాపారమునం దభిని వేశము గలవాఁడు. వాని కనంగమంజరి యను కన్యక జనించెను. ఆ సుందరిని దండ్రి సువర్ణుఁడను వైశ్య

బాలునకిచ్చి పరిణయము గావించెను ఒకమారు కమలపుని గ్రామము నుండి సుపర్ణుడు ద్వీపమున కేగెను. అందు ద్రవ్యార్జనకై చిరకాలము వసించెను. ఒక ద్విజోత్తముఁడు కమలాకరుఁడను వాఁ డనంగమంజరి నివాసమున కొకానొక పనిమీఁద వచ్చెను. హేమంతఋతువున ననంగమంజరి కూఁతురు కామకలిక స్నానార్థినియై యాచాయకు వచ్చిన దానింగని కమలాకరుఁడును మోహించెను. అదియును వానికొక సమయము సంకేతించి తెల్పెను. అది తెల్పిన యర్ధరాత్రి సమయమునకు వాఁడు నిద్రావశుండై రాఁ డయ్యెను. దైవికముగా నదివెంటనే మరణించెను. అవ్వలఁ గమలాకరుఁడు మెలకువగొని వచ్చెను. వాఁడును దనప్రియురాలి మరణముంగని తోడనే మృతినొందెను. సువర్ణుఁడువచ్చి తన భార్యకై మిగుల దుఃఖించెను. ఇట్లు తెలిపి బేతాళుండు నృపతింజూచి 'విక్రమేశ్వరా ! ఇందరిలో నెవ్వరి ప్రేమగొప్పది ? ' అనిన నతఁ డిం దనంగమంజరిభర్త యగు సువర్ణుని స్నేహమే యుత్తమము. అనంగమంజరీ కమలాకరుల స్నేహావృత్తి మధ్యమము. ఆ వనిత ద్విజుని మీఁదివలపుచే స్వర్గమునందెను. బ్రహ్మమూర్తియగు బ్రాహ్మణుఁడు వైశ్యులకు మిగులఁ బూజనీయుఁడు. బ్రాహ్మణుఁ డా సుందరింబడయనేరక హరినిధ్యానించుచు మరణించి స్వర్గమునందెను. సువర్ణుఁడు నా ప్రియురాలు బ్రహ్మభక్తురాలయి నన్నువిడిచి స్వర్గమునందఁగల్గినదని సంతృప్తిపడి తాను నామె ననుగమించినవాఁడు. కావున వాని మనశ్శుద్ధియే యుత్తమమంటి నన బేతాళుండనుమోదించెను.

## —: 21. విష్ణుస్వామి కుమారులకథ :—

బేతాళుం డిట్లనియె. జయస్థలమను పురమున వర్ధమానుఁడను రాజుండెను. వాని పురంబున వేదవేదాంత పారగుఁడగు 'విష్ణుస్వామి' యను పాఱుఁడు రాధాకృష్ణ భక్తుండు వసించెను. వానికి నల్గురు కుమారు లుండిరి. ద్యూతకర్ముఁడు, కులటుఁడు, విషయి, నాస్తికుఁడు నని వారల పేరులు. ఒకప్పుడు వాండ్రందరు దరిద్రులయిరి. వినయాన్వితులై వారు విష్ణుశర్మకు మ్రొక్కి మా యైశ్వర్య మేలపోయినది ? తెల్పు మనిరి. జూదము, ధన వ్యయమునకుఁ గారణము. పాపమూలము ఆపై వ్యభిచారబుద్ధి గల్గును. దానివలన దొంగతనము, దానివలన నిర్దయత్వము నేర్పడును. కావున తీర్థయాత్ర చేసిన నీ పాపము పోవునని జూదరితోఁ దెల్పెను. వేశ్యాసంగమము మహాపాపము. నీ వది విడిచి బ్రహ్మపరుండవై బ్రహ్మచర్యము పూనుమని జారునితోఁ దెల్పెను. మాంసము, మద్యము, పాపవృద్ధిచేయునవి అందుచేఁ జౌర్యము నీకు వచ్చినది. అదినొక హేతువు. అందుచే నీ వీశానుని, విష్ణుని, జిష్ణుః జగత్పతిని సేవించి నీద్రవ్య మాతనికి నివేదించి యనుభవింపుమని చోరునితోఁ దెల్పెను. దేవనింద మాని సర్వాభయమగు నాత్మ నాశ్రయింపుము. ఆయాత్మ యొక్క శక్తిరూపమే చండిక. సర్వదేవతలు నాత్మయొక్క యవయవరూపులు. ఈయంశ మెఱింగి నీవు పాపశాంతికై వారిం బూజింపుము. అని నాస్తికునికి బోధించెను. వా రాయుపదేశము ననుసరించిరి. తీర్థాటనముల సేయుచు శివు నారాధించిరి. ఒక యెడగుసరికి భవానీపతి ప్రసన్నుఁడై ప్రసన్నులయిన యా

విప్రబాలురకు 'సంజీవన' యను విద్య ననుగ్రహించెను. వారది వడసి వనమునకుం జని దానిని పరీక్షింపఁదలచిరి. మొదటివాఁడు చనిపోయిన యొక పులియొక్క యెముకమీఁద మంత్రోదకము జల్లెను. వెంటనే యది యెముకలగూడుగా నేర్పడెను. రెండవవాఁడగు వ్యభిచారి దానిమీఁద నుదకముం జల్లగా రక్తముతో నిండిన మాంసమేర్పడెను. మూఁడవవాఁడగు విషయి యుల్లే మంత్రోదకముఁ జిమ్మఁగా నది ప్రాణములం బొందెను. నాస్తికుఁ డది నిద్రపోవుచున్న దనుకొని జలమును జల్లగా నది తటాలున లేచి వారిపైబడి యందరిని దినివేసెను. బేతాళుం డిట్లుపలికి, యిందరిలో మూర్ఖుఁడెవ్వఁడు? తెల్పుమన విక్రమ భానుండు, పులిని లేపినవాఁ డిందరిలో మూర్ఖుఁడని నిశ్చయము సేసెను. బేతాళుండు సంతసించి మఱియు నిట్లనియె.

## —♦ 22. బేతాళుని పూర్వవృత్తాంతము ♦—

గంగాయమునా సంగమస్థానమున బిల్వాతియను నూర నేను బూర్వజన్మమందు క్షుత్రిసింహుఁడను రాజయి యుంటిని. అందు వేదవేదాంగ పారగుఁడగు శంభుదత్తుఁడను శివభక్తుఁ డుండువాఁడు. వానికి లీలాధరుఁడను కుమారుఁడు. పెద్దవాఁడు విష్ణుభక్తుఁడు. బలశాలి. రెండవవాఁడు శాక్తుఁడు. వాని పేరు మోహానుం డందురు. క్షుత్రిసింహుఁ డొకప్పుడు యజ్ఞార్థియై శంభుదత్తు నాహ్వానించి యజమేధ మొనరింపించెను. శంభుదత్తుఁడు శివభక్తిపరాయణుండయి నాలుగు చక్రముల రచించి నడుమ కార్యసిద్ధికరముగ కలశ స్థాపనముసేసి సంస్కృతములు

రసమ్యములునగు హవ్యములచే హోమము గావించెను. లీలా ధరుఁడు మరణోన్ముఖ మయిన మేకనుజూచి విష్ణుభక్తుండు కావున దయాళువై " ఈ జీవహింసచే దారుణ నరకము గలుగును. భగవంతుఁడు సర్వేశ్వరుండు విష్ణువు హింసాయజ్ఞము నకు మెచ్చఁడు." అనెను. అది మోహానుఁడు విని గట్టిగానవ్వి మెల్లగా నిట్లనియె అన్నా ! మున్ను సత్యయుగమునం దెల్ల బ్రాహ్మణులు యజ్ఞపరులు. అప్పు డజమేధము చేసి తీరవలె నని శ్రుతియున్నది. తిలాదులే అజముగా, తిలాదులనే హోమ ద్రవ్య మొనరించిరి. అప్పు డింద్రాది దేవత లరుదెంచి యగ్ని గుండము నడుమ నిల్చి నీమతము నిష్ఫలము. అజమనఁగా ఛాగ మని వేదములు తెలుపు చున్నవి. కావున దానిచే యజ్ఞము చేయవలె ననిరి. ఆ మాట విని మునులందరు నాశ్చర్య పడిరి. ఈ లోగా నచట పితృయోనియగు నమావసువను వాఁడు విమానమెక్కి వచ్చి మునులంగాంచి నిర్భయముగా ఛాగమేధ మునే చేయవలయు ననెను. వారటులే యాచరించి శుభమం దిరి. కావున నీవు నాతోఁ గూడ యజ్ఞము చేయు మనెను. లీలాధరుఁ డుదారబుద్ధి యగువాఁడు కావున నామాట విని మోహానునింగని యిట్లనియె. త్రేతాయుగమునందు యజ్ఞము రజోగుణమయమయి నడచినది. కాని సత్యయుగము నందు ( కృతయుగమం దన్న మాట ) మాత్రము కేవలము హింసా రహితముగానే జరిగినది. అప్పుడు ధర్మము నాలుగు పాదముల నొప్పెను. అపుడు రక్త మాంసాదులచేఁ గాక కేవలము హవ్య మాత్రముచే దేవతలు తృప్తి నందింపఁ బడిరి. అనిన నీ మాట

లను విని క్షత్రసింహుఁడు భయభ్రాంతికినై యున్న (మేకను) భాగమును వదిలివేసి పండ్లు మొదలగున వానిచేఁ బూర్ణాహుతి నడిపించెను. అంతట తామసీశక్తి క్రోధమూర్ఛితయై చెలరేగి నరనారీ సమన్వితముగ నా నగరమెల్ల దహించెను. శంభుదత్తుం డను నా శివభక్తుండు మహా మాయా ప్రభావముచేఁ బిచ్చియెత్తి దేహము వాసి స్వర్గ మందెను. లీలాధరుఁడు పదిమంది కుమారులను బోషించుకొనుచుఁ బద్మపురమున వారి కధ్యయనము చెప్పుకొనెను. క్షత్రసింహుఁడు మోహానుని దరి కేగి దేవమాత యనుగ్రహము లభింపఁజేయుమని కోరెను. మోహానుఁ డిట్లనియె. బ్రహ్మబీజ మంత్రజపముచే బ్రాహ్మీశక్తి నందెను. అట్టి బ్రాహ్మీశక్తి మహావీరయు నగు నాతల్లికి నమస్కారము. విష్ణువు సప్తశతిని జపించి వైష్ణవీ శక్తిని బడసెను. అట్టి మహాలక్ష్మికి నా తల్లికి నీకు నమస్కారము. ఏ తల్లికి పరమపురుషార్థ ప్రియయగు ప్రణవరూపశక్తి కుమార్తెయో అట్టి నా తల్లికి ప్రణవరూపిణికి నమస్కారము. ఈ దృశ్యమెల్ల యేతల్లిచే జనింపఁజేయఁబడునో, పాలింపఁబడునో యే యమ్మ తనువున నీవిశ్వమెల్ల యుండునో యా యమ్మకు నమస్కారము. శచి, సిద్ధి, మృత్యువు, ప్రభ, గీర్వాణి, నీ సైనికులు, స్వాహా, నిర్ ఋతి, రాత్రి, బుద్ధి భుక్తి నీయం దుద్భవించినవి. నీవు లోకపాలప్రియవు. లోకమాతవు. నీకు నమస్కారము. తృష్ణ, తృప్తి, రతి, నీతి, హింస, క్షాంతి, మతి, గతి, నింద, స్తుతి, ఈర్ష్య, లజ్జ నీవే. అట్టి నీకు నమస్సులు. అని యీ యంబాష్టకముఁ జపించి తత్ప్రభావముచే క్షత్రసిం

హుఁడు శివలోక మందెను. అతఁడే బేతాళుం డను పేర జన్మిం చెను. ఆ బేతాళుఁడనే నేను. అందుచే నో విక్రమాదిత్య చక్రవర్తి ! సనాతనియగు దుర్గను నీవు భజింపుము. నేను శివాజ్ఞచే నీ సమీపమునకు వచ్చితిని. ప్రశ్నోత్తరములచే నేను లెస్సగాఁ బరీక్షించితిని. నీ భుజములం దధిష్ఠించి నేనుందును. కాన సర్వ శత్రువులను సంహరింపుము. సర్వ పురములు, వివిధ క్షేత్రములు చోరులచే నష్టములయి యున్నవి. శాస్త్రా ధారముగ మరల స్థాపనము సేయుము ప్రతిజ్ఞ సేయుము. ఏ రాజు నష్టములయిన సర్వ తీర్థములను పునరుద్ధరించునో, యట్టి విక్రమార్కుఁడవగు నీ పరిపాలన కాలము వచ్చినది.♦

సూతుఁడు:- నైమిశారణ్య వాసులగు మహామునులు విశాలకువచ్చి చక్రతీర్థ నివాసులయి పురాణ శ్రవణ కుతూహాలు లయ్యెదరు. అని పలికి బేతాళుం డక్కడనే యంతర్ధానమందెను. విక్రమాదిత్యుఁడు పరమానంద భరితుం డయ్యెను. అందుచే 'మునిశ్రేష్ఠులార ! మీ రందరు సంధ్యాసమయ మయ్యెనని యెఱింగి శివుని సర్వేశుని ధ్యాననిష్ఠాగరిష్ఠులై భజింపుఁడు' అని సూతుండు శౌనకాదులకుఁ దెలిపెను.

---

♦ " యోనృప స్సర్వ తీర్థాని పునరుద్ధారయిష్యతి
నహి మత్ స్థాపితం సర్వం విపరీతం కరిష్యతి
విక్రమాఖ్యాన కాలోఽయం పునర్ధర్మం కరోతి హి
ద్వాదశాబ్దశతం వర్షం ద్వాపరోహి ప్రవర్తతే
తదంతే భువి కృష్ణాంశో భవిష్యతి మహాబలీ
కలే రుద్ధరణార్థాయ మ్లేచ్ఛవంశ వివృద్ధయే.

ప్రతిసర్గ. ప. 23 అధ్యా. 33—35 శ్లో.

ఇటుపైనీ శ్లోకము లున్నవి. భావము సరిగా సమన్వయ మగుటలేదు.

## —♦ 23. విక్రమాదిత్యుని నిర్యాణము ♦—

అ. వ్యాసభగవాను లిట్లనిరి. విశాలానగరమందున్న యామునులు లై కథ విని కేదారకుండమున స్నానములుచేసి శివునిబూజించి సమాధినిష్ఠులై యొకసంవత్సరము గడిపిరి. విక్రమాదిత్యుఁడు వారికి నమస్కరించి స్తుతించెను. అట్లుండి యా ఋషులు సూతునికడ కేగి 'నీవుచెప్పిన విక్రమాదిత్యుఁడు వచ్చినాఁడు. ఇదుగో! ఈతనిచే నశ్వమేధము చేయింతుము. నీవు మాకాజ్ఞయిచ్చి చక్రతీర్థమునఁ దపమూనుము' అనిన విని సూతుండట్లే యశ్వమేధ మారంభింపఁ జేసెను. యజ్ఞాశ్వము తూర్పున కపిలస్థానము వరకును దక్షిణమున సేతువుదాకను పడమర సింధునది వఱకును నుత్తరమున బదరికావనము దను కను వెళ్ళినది. అక్కడనుండి క్షిప్రానదికిఁబోయి శరీరము నగ్ని యందువిడిచి స్వర్గమున కేగెను. అయ్యెడ దేవతలు భార్యలతో నృపుని యజ్ఞమునకు వచ్చియుండిరి. కాని యందుఁ జంద్రుఁడు మాత్రము రాఁడాయెను. రాజు మనస్సు చిన్నవోయెను. యజ్ఞ సమాప్తి కాఁగా బేతాళునితోడఁ గూడి యెన్నో దానములుసేసి విక్రమాదిత్యుడు చంద్రలోకమున కేగెను. చంద్రుఁడు సంతుష్టుఁ డయ్యెను. మఱియు నాతఁడు "రాజా! భూమిపై భయంకరుఁడైన కలివచ్చి యాక్రమించి యున్నాఁడు. కాన నే నా లోకమునకు నీ యజ్ఞమునకు నీవు పిలిచినను రాకుంటిని." అని తెల్పి యమృతోదకమును రాజునకొసంగియంతర్ధానుఁడయ్యెను. అయ్యెడ నింద్రుఁడు బ్రాహ్మణవేషియై వచ్చి యా యమృతమును దనకిమ్మని విక్రముని యాచించెను. అతఁడది శక్రున

కొసంగెను. ఇంద్రుడు స్వర్గమునకు వెళ్ళిపోయెను. ఆ యిచ్చిన సుకృతముచే రాజునకు లక్షసంవత్సరము లాయుర్దాయము సిద్ధించెను. ఆసమయమున జయంతు డను ద్విజుడు తపస్సు చేసి యింద్రునివలన నీ చెప్పిన ఫలము సాధించి యింటికి వెళ్లెను. మఱియు నా జయంతుడు భర్తృహరికి లక్ష బంగారమున కాఫల మమ్మెను. భర్తృహరి యాసిద్ధి ననుభవించి యోగారూఢుడై వనమున కేగెను. విక్రమాదిత్యుడు నిష్కంటకమైన రాజ్యభోగము ననుభవించి నూరేండ్లు పాలించి స్వర్గమందెను. శౌనకాది మహర్షులు రాజు స్వర్గగమనవార్త విని సూతునికడ కేగి మ్రొక్కి పుణ్యాసారమగు విషయము తెలుపుమన నతడు వారికి బురాణము నైదులక్షల శ్లోకముల గ్రంథమును నూరేండ్లు వినిపించెను. వా రానంద భరితులై తమదారిం జనిరి.

## —: 24. సత్యనారాయణ వ్రతకథ :—

అ. నైమిశారణ్య వాసులయిన ఋషులు పౌరాణికుండగు సూతు నడుగగా చతుర్యుగములందుం బూజనీయుడు సత్యనారాయణస్వామియని తెలిపి సత్యనారాయణ వ్రతకథ నతడు ఋషిమండలికిం దెలిపెను. అది యైదధ్యాయము లున్నది. (ఇది సుప్రసిద్ధముగాన యిందు దెనిగింపక విడిచితిని)

———

## — 30. చంద్రగుప్తుఁడు —

ఋషు లడుగ సూతుం డిట్లు తెలుపఁ దొడంగెను. కలియుగమునఁ బిత్రుశర్మయను బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు కలిలో దంభులు పాషండులుకూడ సన్యాస వేషధారులగు చున్నారు. వానప్రస్థ ధర్మము కలిలో లేదు. బ్రహ్మచర్య మచ్చటచ్చట గనిపించును. గార్హస్థ్యమే యుత్తమ ధర్మమట్లున్నది యని మహాకాళిని స్తుతించి యామె యనుగ్రహలభ్యయైన బ్రహ్మచారిణి యను కన్యను వివాహమాడెను. ఆమె యం దతనికి చతుర్వేదాధికారులగు నల్గురు కుమారులు గల్గిరి. ఋగ్వేదాధికారి వ్యాడి యనువాఁడు. అతఁడు న్యాయశాస్త్ర పండితుఁడు. యజుర్వేదాధికారి మీమాంసాపండితుఁడు. సామాధికారి పాణిని. అతఁడు వ్యాకరణ పండితుఁడు. వరరుచి యను కుమారుఁ డథర్వణాధికారి. వారు మగధరాజగు చంద్రగుప్తుని సభలోని కేగిరి. రాజు బ్రహ్మచర్య మన్నిటి కంటె నుత్తమమా! యని ప్రశ్నించెను. వ్యాడి బ్రహ్మచారి సర్వోత్తముఁడు. అతఁడు స్తుతితత్పరుండై దేవతానుగ్రహము సంపాదించు ననెను. (ఋగ్వేదాధికారి కాన, ఋగ్వేదము దేవతాస్తుతి రూపమని యున్నది కాన, యతఁడు స్తుతిని బ్రశంసించెను. మీమాంసకుఁడు ‘ రాజా! దేవతలను గూర్చి యజ్ఞములు చేసిన యాతఁడే బ్రహ్మచారి. అతఁడు దేవతలను గర్మము జేసి తృప్తిపరుపవలెను. హోమము తర్పణముచేసి దేవతా ప్రసాదము పొందవలెను. అదే నిజమైన బ్రహ్మచర్యమగుననెను.

అంతటఁ బాణిని 'చంద్రగుప్త మహారాజా! శుద్ధశబ్దమయము లైన మూఁడు స్వరములచేతను (ఉదాత్తానుదాత్తస్వరితములు) అష్టాధ్యాయ సూత్ర పఠనము చేతను, లింగ ధాతు గణములు వర్ణించుటచేతను నెవ్వఁడు భగవదారాధనము (యజ్ఞము) చేయునో యతఁడు పరబ్రహ్మము నందును.' అంతట వరరుచి 'ఓ మగధేశ్వరా! యజ్ఞోపవీతము వేసికొని (ఉపనయనము చేసికొని యన్నమాట) గురుకులమున వసించుచు దండము ధరించి, గోళ్లు జుట్టును బెంచుకొని భిక్షార్థియై వేదతత్పరుఁడై గురునాజ్ఞావశుఁడై చరించినవాఁడే బ్రహ్మచారి. అదే బ్రహ్మచర్యమనెను. వారిమాటలు విని వారి తండ్రి పితృశర్మ, గృహస్థుగ నుండి పితృదేవాతిథి తృప్తి చేయుచు, ఋతు కాలమున మాత్రము స్త్రీని సేవించుచు వర్తించువాఁడు నిజమైన బ్రహ్మచారి యనెను. రాజు పితృశర్మ వాక్యము విని ''ద్విజోత్తమ! మీరు తెల్పినదే నాకు నచ్చినది. ఈ పాడు కలిలో నింతకంటె నుత్తమ సిద్ధాంతము లేనే లేదు' అని యాతనికి మ్రొక్కి యాతఁడే గురువని యెంచుకొని యుపాసించి చంద్రగుప్తుఁడు ధన్యుండై స్వర్లోక మందెను. పితృశర్మగూడ దామోదరుని ధ్యానించి హిమాలయమున కేగి యోగనిష్ఠఁబూనెను.

—: 31 అ. మానసతీర్థ ప్రశంస :—

ఋషులు కలిలో నేది యుత్తమతీర్థము? ఏది యుత్తమ దానము! తెలుపుమన సూతుం డిట్లనియె. పాణిని సామ వేదాధికారి. అతఁడు కణభుక్కను పండితుని శిష్యులచే నోడింపఁబడెను. (కణభుజ్మతము న్యాయశాస్త్రము) అందులకు పాణిని

సిగ్గుపడి తీర్థాంతరమునకేగి స్నానముచేసి పితృదేవతర్పణముచేసి కేదారమునందలి యుదకము గ్రోలి, శివధ్యానపరుండయ్యెను. ఆకులుదిని యేడురోజులుండి యామీఁద జలభక్షణముచేసెను. అట్లు పదిరోజులుండి వాయుభక్షణ మారంభించెను. ఇరువది యెనిమిదవరోజున రుద్రుఁడు సాక్షాత్కరించి వరము కోరుకొమ్మనెను. ఆ యమృతోపమానమైన పలుకు విని గద్గదకంఠుడై సర్వేశుని సర్వాంగేశుఁ గిరిజావల్లభు నిట్లు స్తుతించెను.

—: శ్రీ పాణిని కృతశివస్తుతి :—

శ్లో॥ నమో రుద్రాయ మహతే సర్వేశాయ హితైషిణే
నందీశస్థాయ దేవాయ విద్యాభయకరాయచ
పాపాంతకాయ భర్గాయ నమోఽనంతాయ వేధసే!
నమో మాయాహరేశాయ నమస్తే లోకశంకర!
యదిప్రసన్నో దేవేశ! విద్యామూలప్రదోభవ!
పరం తీర్థంహిమే దేహి ద్వైమాతురపితర్నమః

ఇట్లు నుతింపఁ బాణినిస్తుతి విని మహాదేవుఁడు శంకరుఁడతని సర్వవర్ణమయములగు 'అఇఉణ్' అను మంగళప్రారంభముగల సూత్రముల నాతనికి దయచేసెను. రాగద్వేషములను మలమును హరించునట్టియు, సత్యమను జలముగలదియు నగు జ్ఞానహృదయము మానసతీర్థము. ఆ తీర్థమును సేవించిన సర్వతీర్థఫలము లభించును. బ్రహ్మసాక్షాత్కారమునకు మానసతీర్థమే యుత్తమము. పాణినీ! నీకది యనుగ్రహించుచున్నాను. దాన సర్వథా కృతకృత్యుండవుగమ్ము. అని తెలిపి శివుం డంతర్హి

తుండయ్యెను. పాణిని గృహమున కేతెంచెను. మఱియు నా పాణిని సూత్రపాఠమును ధాతుపాఠమును, గుణపాఠము నొనరించి లింగసూత్రమును రచించి పరమ నిర్వాణము నందెను. కావున నో భార్గవ శ్రేష్ఠ! నీవు మానసతీర్థసేవ నొనరింపుము. సర్వతీర్థమయమగు గంగ యందునుండియే నిర్గమించినది. అట్టి తీర్థ మీవంకకు లేదు. మఱి దీనికొకటి గల్గఁబోదు.

—: 32 అ. గోపదేవుఁడు - భాగవత ప్రశంస :—

సూతుండిట్లనియె. గోవర్ధనపురమను పట్టణమున గోప దేవుఁడను విప్రుఁడు వేదవేదాంగ పారగుఁడు కలఁడు. అతఁడు కృష్ణభక్తుఁడు. గోపగోపీ విశేషవితమగు బృందావనమున కేగి యాతఁడు దేవదేవుఁడగు జనార్దనుని మనసులోఁ బూజించెను. ఒక సంవత్సరమున నచ్యుతుఁడు దయచూపి యుత్తమ జ్ఞాన మొసంగెను. ఆజ్ఞానముచే నతని హృదయమున 'భాగవతకథ' స్ఫురించెను. శ్రీ శుకులు పరీక్షిత్తున కే కథను దెల్పిరో మోక్ష మూర్తియగు నా కథనే యతఁడు వర్ణించెను. అది పూర్తియై నంతట జనార్దనుండు ప్రత్యక్షమయి మధురముగ వరము కోరుకొమ్మని పలుకరించెను. "లోకానుగ్రహకారక! హరి! నీవు విశ్వమయుఁడవు. నీ నామము నుచ్చరించిన మాత్రమున లోకులు తరింతురు. కలిలో నింతకు మించినది లేదు. నీ యనుగ్రహమున వ్యాసులు రచించిన భాగవతముయొక్క మాహాత్మ్యము నాకుఁ దెల్పుము. అదే నాకు వరము. అదే యనుగ్రహము. అని గోపదేవుఁడు విన్నవించెను. మున్ను భవానీ

శంకరులు ప్రసంగము చేసికొనుచు సన్న్యాస విధానమున భాగవ
తము పఠించుటకంటె ఉత్తమ ధర్మము లేదని సిద్ధాంతీకరించిరి.
పార్వతి చండీశ గణేశ గణేశాదులగు గుహాదుల రక్షణమున
నియోగించి శంకరుడు కైలాస ధ్యానము చేయు రోజులలో నిష్ఠ
తో వినెను. శంకరుఁడు కనులుమూసికొని ధ్యానించు చుండెను.
ఎనిమిదవదినమునఁ గన్నులు తెరచిన తోడనే పార్వతి నిద్రావశు
రాలైయుండెను. భగవంతుఁడామెను మేల్కొలిపి 'దేవి! నీవెంత
వఱకు వింటివి?' యని యడిగిన నామె 'అమృతమథనముదాక
వింటిననెను. ఆ సమీపమున ద్రుమకోటరమున్న శుకుండు చిరంజీవి
యయ్యెను. పార్వతియే యా పక్షి సుతుని నట్లు సంరక్షించు
చుండెను. అతఁడు శివసదనమందుండి శివధ్యాన నిష్ఠాగరిష్ఠుండై
యున్నవాఁడు. అతఁడు కేవలశివానుగ్రహము చేతనే భాగవత
మును బడసినాఁడు. నీవు విక్రమార్కుని తండ్రియగు గంధర్వ
సేనునకు నర్మదానదీతీరమున నీ పరమమంగళ కథను వినిపింపుము.
'హరిమహిమ దానముసేయుటకంటె సు[illegible]దానము లేదు.
ఉత్తమ పాత్రుఁడు విష్ణుభక్తుఁడు. ఆకలి గొన్నవాని కన్నము
పెట్టుటయు నిదియు సమములు.' అని పలికి హరియంతర్ధాన
మందెను.

—: 33, 34, అ. దేవీమహిమ :—

వేదపాఠము వాచనికమైన కర్మము. వేదములు
బహుఫలములు. సర్వవేదములు పఠనము చేసినఫలము దేనివలనఁ
గల్గును? తెలుపుమని ఋషులు ప్రశ్నింపగా సూతుండిట్లనియె.
విక్రమాదిత్యుని రాజ్యమున వ్యాధకర్ముఁడనువాఁ డుండెను.

వాఁడు బ్రాహ్మణస్త్రీకి శూద్రునివలన జన్మించినాఁడు. త్రిపాఠి యను వానిభార్య కామినియనునది యొక కైటిలవ్యాపారము చేయు నిషాదునింగని మోహించి వానివలన నొక కుమారుని గనెను. వాఁడు వ్యాఘుఁడయ్యెను. త్రిపాఠి భార్యయు వాని కొడుకును నిల్లు వెడలగొట్టి బ్రహ్మచర్యవ్రతమూని చండికా పారాయణము సేయుచుండెను. అందుచే నతఁడు జీవన్ముక్తుఁడయ్యెను. తల్లియుం గొడుకును వ్యాఘునియింట నసించి బహు నీచవృత్తి చేసికొని జీవించుచుండిరి. ఒకప్పుడు దానికొడుకు బ్రాహ్మణులు చెప్పుకొనుచుండగా తన తల్లిదండ్రుల మొదటి కథ వాఁడు వినుట తటస్థించెను. దేవినామము వానికి వినఁబడెను. ఆ పుణ్యముచే వానికి ధర్మబుద్ధి కల్గెను. తనయొద్దనున్న దొంగ సొమ్మెల్ల త్రిపాఠికిచ్చి శిష్యుఁడై దేవిమంత్రమును జపించెను. ఆ ప్రభావముచే వాఁడు పాపము వాసెను. పండ్రెండేండ్లు కాశీపురమున నన్నపూర్ణను భజించెను. అన్నపూర్ణాష్టకము పఠించెను. ఒకనాడు స్వప్నమున దేవి దర్శనమిచ్చి వానికి 'బుగ్హృదయ' మనుగ్రహించెను. ఆవిద్యాప్రభావముచే వాఁడు విక్రముని యజ్ఞమున నధ్వర్యుఁడై తుదకు యోగమునంది పరమ గతి నందెను. ఇట్లే యజ్ఞమునియం దొకహింసాపరుఁడు మహాలక్ష్మి నర్చించి యుత్తమగతి నందెను. (చూ. 34 అ)

## —: 35 అ. పతంజలి చరిత్ర :—

చిత్రకూటగిరిపై పతంజలియను పండితుండుండెను. అతఁడు వేదవేదాంగములను గీతాశాస్త్రమును దెలిసినవాఁడు. విష్ణుభక్తుఁడు భాష్యకర్త. అతనికి కాశీ పండితుఁడగు కాత్యా

యనునితో వాదము వచ్చెను. కాత్యాయనుఁడు దేవీభక్తుఁడు కావున పతంజలి దేవి నిట్లు స్తుతించెను.

శ్లో॥ 'నమో దేవ్యై మహామూర్త్యై సర్వమూర్త్యై నమోనమః
శివాయై సర్వమాంగళ్యై విష్ణుమాయే చ తే నమః
త్వమేవశ్రద్ధా బుద్ధి స్త్వం మేధా విద్యా శివంకరీ!
శాంతి ర్వాణీ త్వ మేవాసి నారాయణి నమోనమః.

ఇట్లు చేసినస్తుతి శకిరవాణి 'ఓ విప్ర శ్రేష్ఠ! నాచరిత్రము పారాయణము చేయుము. దాన నీకు జ్ఞానోదయ మగును. కాత్యాయనుని జయింపఁగలవు. అని వినిపించెను. అట్లే యా దేవి నర్చించిన మహిమచే నతఁడు శత్రుపండితుని గెలిచెను. మఱియు మహాభాష్యమును రచింపఁగల్గెను.

ఇది ద్వితీయ ఖండము

---

## ప్రతిసర్గపర్వము – తృతీయఖండము (చతుర్యుగ ఖండము)

### —: 1 అ. పాండవుల యుత్తర జన్మములు :—

సూతుండు శౌనకాదుల కిట్లనియె. భవిష్య మహాకల్ప మున నిరువది యెనిమిదవ ద్వాపరముచివర కురుక్షేత్రసంగ్రా మము జరిగెను. కౌరవు లోడిపోయిరి. పదునెనిమిదవ రోజున పాండవులు జయించిరి. భగవంతుఁడగు శ్రీ కృష్ణుఁడు సంగ్రా మము తుదిదినము సాయంకాలము కాలగతిని గుర్తించి శివుని యోగరూపుని సనాతనుని వినుతించెను.

—: కృష్ణకృతశివస్తుతి :—

"నమః శాంతాయ రుద్రాయ భూతేశాయ కపర్దినే
కాలకర్త్రే జగద్భర్త్రే పాపహర్త్రే నమోనమః
పాండవా న్రక్ష భగవ న్మద్భక్తాన్ భూతభీరుకాన్"

ఈ స్తుతి విని రుద్రుఁడు నంది వాహనము నెక్కి శూలము దాల్చి పాండవ శిబిరసంరక్షణము సేయ నేతెంచెను. కృష్ణుఁడు గజసనగరమునకు వెళ్ళిపోయెను. పాండవులు సరస్వతీ తీరమున వసించిరి. రాత్రి ద్రౌణి (అశ్వత్థామ) కుంతిభోజుఁడు కృపాచార్యుఁడును వచ్చి రుద్రుని స్తుతించిరి. రుద్రుఁడు వారికి మార్గమిచ్చెను. అశ్వత్థామ శివుడు తనకిచ్చిన ఖడ్గముచే ధృష్టద్యుమ్నాదుల నుపపాండవులను సంహరించెను. అంతట భీమాదులువిని యీ ప్రలయమునకుఁ గారణము శివుఁడు కారణమని యతనిపై దండెత్తిరి. వారు విసరినయాయుధములు రుద్రుని శరీరము నందు లయమయ్యెను. అంతట వారు వింతపడి పిడికిలిపోటుల నతని నలయింపఁ దొడఁగిరి. అప్పుడు రుద్రుఁడు "ఓరీ మీరు కృష్ణభక్తులు. మి మ్మిప్పుడు చంపఁగల్గియు కృష్ణభక్తులగుటచే నేను రక్షింపవలసి యున్నది. కాన పునర్జన్మమెత్తి యీ నేరము ననుభవింతురుగాక!" అని వారిని శపించెను. అంతట భీమాదులు హరిని శరణొంది యతనితోఁ గూడ రుద్రుని స్తుతించిరి. శివుఁడు సాక్షాత్కరించి వరము కోరుకొనుఁ డనెను. కృష్ణుఁడు స్వామీ! ఇంతకుమున్ను వీరువిసరిన యాయుధములు నీ శరీరమున లయించినవి. అవి మఱల వారికి దయసేయుము. అన నతఁ డనుగ్రహించెను. మఱియు నేను ద్వారపడి నీ భక్తులను

శపించితివి. అయినను నా మాట వ్యర్థము కాదు. యుధిష్ఠిరుఁడు వత్సరాజుని కుమారుఁడై జన్మింపఁ గలఁడు. 'బలఖాని' యని పేరొందును. అతఁడు శిరీషమను పురమేలును. భీముఁడు మ్లేచ్ఛుఁడై జన్మించును. వాని పేరు 'వీరణుఁడు' అని కలుగును. వనరసాధిపుఁ డగును. పరిమలుఁ డనువాని కుమారుఁడై యర్జునుఁడు పుట్టును. బ్రహ్మానందుఁ డనబడును. నకులుఁడు కాన్యకుబ్జమున రత్నభాను కుమారుఁడయి పుట్టి లక్షణుఁడను పేరొందును. సహదేవుఁడు భీమసింహుని సుతుఁడయి దేవసింహుఁ డని పేరు పొందును. ధృతరాష్ట్రుని యంశము అజమేరపురమున పృథివీరాజను పేర జన్మించును. వానికిఁ గుమార్తెయయి ద్రౌపది పుట్టును. ఆమె 'వేల' యని పేరొందును. కర్ణుఁడు తారకుఁ డగును. రక్తబీజుఁడు రుద్రుఁ డగును. కురుపాండవవర్గములవారు వీరాధివీరులై జనింతురు. అనిన విని కృష్ణుఁడు "నేను శక్తిగా నవతరించి మహావతి యను పురమునందుండి వారల రక్షింతును. నా భాగమయి దేశరాజను రాజకుమారుఁడు జన్మించును. జయసింహుఁ డని యతని నందురు. ఆహ్లాదుఁ డనువాఁడు నాయంశమయి యగ్నివంశ రాజులను సంహరించును." అనిన విని రుద్రుఁ డంతర్ధాన మయ్యెను.

2 అ: పాండవులు పుత్రశోకార్తులయి ప్రేతకృత్యములు నిర్వర్తించి భీష్ముని సన్నిధానమున కేగిరి. అతనివలన రాజధర్మములను మోక్ష ధర్మములను బ్రశ్నించి తెలిసికొనిరి. మఱియు నశ్వమేధములు చేసి ముప్పది యారేండ్లు పాలించి

స్వర్గ మందిరి. వారి యంశములు కలిధర్మము వృద్ధినొందిన తఱిని వేఱువేఱు రూపముల నవతరించుచు. అని యింతవరకుఁ దెలిపి వ్యాసభగవానులు చక్రతీర్థమున యోగనిద్రావశు లయిరి. మునులును యోగసమాధి నంగీకరించి పండ్రెండు వందల యేండ్లు గడువగా మఱల లేచి దేవఖాతమందు స్నాన సంధ్యాదులు నిర్వర్తించుకొని సూతుని సన్నిధికేగి సంభాషణ మారంభించిరి. వారికి సూతుండిట్లు తెలుపందొడంగెను.

## —: శాలివాహనుఁడు :—

విక్రమరాజ్యకాలము శివాజ్ఞచే ద్వాపరయుగ ధర్మములు కలిగి నడచెను. * విక్రమార్కుఁడు స్వర్గస్థుఁడైనంతట నాతని రాజ్యము భిన్నభిన్నమై పదునెనిమిది రాష్ట్రములయి పదునెనిమిదిమంది రాజులు పాలకులైరి. పడమట సింధునది వరకు, దక్షిణమున సేతువువరకు, ఉత్తరమున బదరీక్షేత్రము దనుకను, తూర్పున కపిలాంతకముదాకను వ్యాపించి పదునెనిమిది రాష్ట్రములుండెను వానిపేరులు ఇంద్రప్రస్థము, పాంచాలము, (పంజాబు) కురుక్షేత్రము, కాంపిలము, (అస్సాముకు పడమర) అంతర్వేది, వ్రజభూ (బృందావనప్రాంతము), అజమేరము (అజ్మీర్), మరుధన్వము, (రాజపుటానా), గూర్జము, (గుజరాత్ మహారాష్ట్రము, ద్రావిడము, కలింగకము, ఆవంత్యము, ఉడుపము (ఉరిసిప్రాంతము, కర్ణాటకము, వంగము (బెంగాలు),

* విక్రమార్కుఁడు కలి 3120 లో స్వర్గస్థుఁడయ్యెను. 3179 లో అతని మనుమఁడు శాలివాహనుఁడు వచ్చినాఁడు.

గౌడము, మాగధము, (బీహారు) కోసలము, (హిమాలయము
నకు దక్షిణముగా నానుకొని యున్నది). వానికి రాజులు వేరు
వేరుగా నుండిరి అందు నానా భాషలు, నానా ధర్మబోధక
ములుగా నుండెను. ఇట్లొక నూరేండ్లు జరిగిన తరువాత శకులు
మొదలగు మ్లేచ్ఛులు భారతభూమిలో * ధర్మము నాశనమయ్యె
నని తెలిసికొని సింధునదిని దాటి గుంపులుగుంపులుగా
నార్యదేశమునకు వచ్చిరి. హిమవత్పర్వతము లోయనుండి
సింధునదీ మార్గమునుండి వారు వచ్చినారు. వారార్యుల
జయించి బహు ధనములను దోచుకొని తమ దేశమునకుఁ
బోయిరి. మరియు నార్యరాజుల భార్యలను దొంగిలించుకొని
పోయిరి. విక్రమాదిత్యుని మునిమనుమఁడు శాలివాహనుఁడు
పితృరాజ్యమునకుఁ బాలకుండయ్యెను. అతఁడు చీనా, తిత్తిరి
దేశస్థులగు శకులను. బాహ్లీకులను (హిమాలయమున కుత్తర
మున 'బాక్' అని నేడు పిలువబడు దేశమువారు) కామరూపు
లను (అస్సామువారిని) రోమకులను (సింధునదికి పడమటనుండు
రోమక దేశవాసులను) వీరికే రామతులనియు పేరున్నది.
శకులయిన ఖురజులను (ఖురాసాన్ దేశమువారు. ఖురాసాన్
అనునది పశ్చిమాసియాలోనున్నది) గూడ జయించి వారు
కొల్లగొట్టుకొనిపోయిన ధనసంపదలన్నింటిని మరల
భారతదేశమునకుఁ దరలించుకొనివచ్చెను. అతఁడే మ్లేచ్ఛ

* భారత భూమిలో వైదిక ధర్మనాశన మెప్పుడగునా యని కనిపెట్టి చూచి అదియయిన సమయములో వచ్చిపడి యీ దేశమును విదేశీయులాక్రమించుకొను చుండిరి. నాటికిని నేటికిని యిదేపని జరుగుచున్నది.

దేశమునకు నార్యదేశమునకు హద్దులేర్పడెను. అతని నిర్ణయము ననుసరించియే సింధునదికి తూర్పున నున్న భూస్థానము 'సింధుస్థానము' అనియు, సింధునదికి పశ్చిమభాగము 'మ్లేచ్ఛ స్థానము' అనియుఁ బేరొందినవి. సింధుస్థానమను సంస్కృత శబ్దమే ప్రాకృతభాషలో హిందుస్థానమను రూపము పొందినది.

ప్రతిసర్గపర్వము 3 వ ఖండము - 2 వ అధ్యాయము, 20 వ శ్లోకము నుండి యీ కథ మూలములో నున్నది. ఇది సుమారుగా క్రీస్తునుగూర్చి వ్రాయబడినది. క్రీస్తుమతస్థులెవరో తెలుపబడిన ప్రమాణమునకై దీని నీ పురాణములోఁ జేర్చియుందురని యిది పూర్తిగాఁ బ్రక్షిప్తమని నా అభిప్రాయము. ఆ కథ యిట్లున్నది.

ఒకప్పుడు శకాధీశుఁడు (శాలివాహనుని పేరనే శాలివాహన శక మేర్పడినది. కాన యితనికి శకాధీశుఁడను పేరు కల్గినది. 'శకులకు రాజు' అని మాత్రము కాదు) హిమవంతమున కేగెను. అచట హూణరాజ్యమునకు నడుమ నొక పర్వతముమీఁద నొక పురుషుని జూచెను. (అమరపర్వతము ప్రాంతమున యవనుల రాజ్యమున్నది. ఆయవనులు మొదట భారత క్షత్రియ జాతికిఁ జెందిన వారే. ఈ యవనుల రాజ్యమునకే 'రామఠకము' అను పేరున్నది. దానికి పూర్వపుపేరు 'రామకము' ఈ యవనులే ఇటలీ నాక్రమించి రామనగరము నిర్మించిరి. దానినే యిప్పుడు 'రోమ్' నగరమని పిలుచుచున్నారు. దీనిపూర్వ నామము రామనగరమని రోము చరిత్రలోనే యున్నది. మొట్టమొదట అమర పర్వత ప్రాంతమున నుండిన యవనరాజ్యమగు రామఠమున కుత్తరముగా 'హార' రాజ్యమును, దాని కుత్తరముగా హూణరాజ్యము నున్నది. హూణులుకూడా మొదట భారతదేశ క్షత్రియులే అయియుండి వైదికధర్మము విడిచినారు. వీరే తరువాత 'యూరప్' దేశ మాక్రమించిరి. అందుచేతనే 'యూరప్' దేశమువారికి 'హూణులు' అను పేరు నిల్చిపోయినది. యవనుల రాజ్యమునకు 'రామఠము' అని పేరు. రామఠమున కుత్తరముగా 'హార' రాజ్యము, దాని కుత్తరముగా హూణదేశమున్నది. హూణులుకూడా మొదట భారతీయులై తరువాత వేదధర్మము విడిచి దూరదేశముల కేగినవారు.

ఆ దేశమునకు 'హూణదేశము' అను వాడుక కలుగుటకు నిదే కారణము. ఆక్లే రాముకులు ఇటలీని ఆక్రమించి రోమా నగరమును నిర్మించిరి.

అటు శాలివాహనుఁడు చూచి సంతసించి 'నీ వెవ్వఁడవు' అని యడిగెను. ఆ పురుషుఁడు "కుమారీ గర్భమునఁ బుట్టినవాఁడు ఈశపుత్రుఁడను, మ్లేచ్ఛధర్మపరివర్తకుఁడను, సత్యవ్రతపరాయణుఁడను" అని చెప్పెను. అంతట మరల రాజా నీ ధర్మమేమి? అని యడిగెను. అతఁడిట్లనె 'సత్యయుగము క్షయింపగా, మ్లేచ్ఛదేశము [illegible] నేను 'మసీహుఁడు' అను పేర నవతరించితిని. దస్యులకు [illegible] 'ఈశామసి' యను నొక్క[illegible] పుట్టినది. ఆమెను [illegible] నేను 'మసీహుఁడను' అయితిని. నేను మ్లేచ్ఛమతము స్థాపించితిని. [illegible] [illegible] దేహామందలి శుభాశుభ రూపములు మకిలి [illegible] [illegible] చెప్పిన జపము చేయుచు న్యాయము సత్యము ననుసరించి సూర్యమండలమందలి పురుషుని ధ్యానింపవలెను. సూర్యుఁడు చలనములేని ప్రభువు. చలనస్వభావము లయిన తత్త్వముల నతఁ డాకర్షించును.' ఈవిధమయిన యాచరణముచే 'మసీహా' లయమొందెను. ఈశ్వరమూర్తి శుభమును గూర్చునదై హృదయమందు నిలిచినది. ఈశామసీహుఁడనికూడ నా పేరు ప్రపంచమున ఖ్యాతికెక్కెను. ఈ మాటలు విని శాలివాహనుఁడు మ్లేచ్ఛులకు గురువైన వానికి నమస్కరించి యా భయంకరమైన మ్లేచ్ఛరాజ్యమున స్థాపించి స్వరాజ్యమున కేతెంచెను. మరియు నాతఁ డశ్వమేధము గావించి యరువదియేండ్లు రాజ్యమేలి స్వర్గ మందెను.

జ్ఞాపిక :— ఈ యీశపుత్రునికి శాలివాహనునికి నైనట్లు వర్ణింపబడిన యీ సమావేశ మబద్ధము. క్రీస్తు చనిపోయిన తరువాత A. D. 78 లో శాలివాహనుఁ డున్నాడు. కాన యీశపుత్రునికి నితనికిని సంబంధము లేనేలేదు. శాలివాహనుఁడు పర్షియాదాకా వెళ్ళి యిక్కడనున్న శకస్థానానమును ముట్టడించి వాండ్రు పట్టుకొనిపోయిన ధనమంతయుఁ దరలించి తెచ్చినాఁడు.

## —: 3 అ. భోజుఁడు :—

సూతుండు ఋషుల కిట్లనియె. శాలివాహనుని వంశమునఁ బదిమందిరాజు లైదువందల యేండ్లు పాలించిరి. అంతట భూమియందు మర్యాద చెడిపోయెను. శాలివాహనుని పదియవ కుమారుఁడు భోజుఁడు దిగ్విజయయాత్ర చేసెను. కాళిదాసు మొదలగు బ్రాహ్మణులతో సముద్రతీరము దాక నేగెను. గాంధారము (ఆఫ్ఘనిస్థానమునకు దక్షిణముగను బెలూచిస్థానమునకు నుత్తర పశ్చిమముగనున్న దేశము గాంధారము) కాశ్మీరము, ♦ ఆరవము (ఇది కాశ్మీరమునకు దక్షిణముగా సింధునది, దాని యుపనదుల మధ్యమునయున్నది) మొదలగు దేశములందలి శత్రులగు మ్లేచ్ఛులను జయించి తరిమికొట్టి వారి వద్దనుండి ధనరాసులను మఱల రప్పించెను. *

---

♦ ఆరవమునకు దక్షిణము బాహ్లీకము. బాహ్లీకదేశస్థులే యాక్రమించినది ఉత్తరబాహ్లీకము. ఇది యిప్పటి ఆఫ్ఘనిస్థానమున కీశాన్యముగా నున్నది. అది యిప్పుడు రష్యన్ టర్కీస్థానములో కలిసిపోయినది.

* ఇఁక 3 అ. 5 వ శ్లోకమునుండి. 32 శ్లో. వరకు : ప్రక్షిప్తమని నా యభిప్రాయము. అది మహమ్మదు చరిత్ర.

ఈ సమయమున మ్లేచ్ఛుఁడు మహామదుఁడనువాఁడు శిష్యపరంపరతోఁ గూడి యుండెను. భోజుఁడు మరుస్థలమందున్న మహాదేవుని (శివుని) దర్శించి మ్లేచ్ఛులచేఁ దాచబడిన యాస్వామిని గంగాభిషేకము చేసి, మనస్సులో ధ్యానించి సంతుష్టు నొనర్చెను. శివుఁ డనుగ్రహించి భోజరాజా! నీవు మహాకాళేశ్వరమను క్షేత్రమున కేగుము. బాహ్లీకమను ఆదేశము మ్లేచ్ఛ దూషితమై యున్నది. అచట నార్యధర్మ మన్నది లేదు. మున్ను నాచే దగ్ధుఁడయిన త్రిపురాసురుఁ డక్కడ బలిచేఁబంపఁబడి యున్నాఁడు. వాఁడు

పాకలక కర్మములంబడసి యున్నాఁడు. మహామదుఁడను పేర వాఁడు పిశాచ కర్మములు సేయుచుండెను. ఆపిశాచాక్రాంతమయిన దేశమునకు నీ వేగవలదు. నా యనుగ్రహముచే నీవు శుద్ధిఁగన్నను. అనిన విని భోజుఁడు తన దేశమునకు మరలెను. మహామదుఁడా భోజునితో సింధుతీరము దాక వెన్నంటి వచ్చెను. మఱియు వాఁడు ఒక శివలింగమును జూపి 'భోజా! నీకు దేవుఁడయినవాఁడు నాకు దాసుఁడై యున్నాఁడు. వాఁడు నా యుచ్ఛిష్టము నతఁడు దినును." అని తెల్పెను. భోజుఁడు వాని మాటల కాశ్చర్యమందెను. మఱియు నతని కా మ్లేచ్ఛ కర్మములపై విద్వేషము గల్గెను. కాళిదాసు నాతని కోపముగొని ధూర్తుఁడా! రాజును మోహింప నీకీ మాయ వచ్చితివి. బాహ్లీకదేశ మ్లేచ్ఛుఁడవగు నిన్నిదిగో చంపెదను.' అని పదివేలు నవార్ణమంత్రము జపించి యందు దశాంశము హోమము చేసినంతట మహామదుఁడు భస్మమయి మ్లేచ్ఛులకు దేవుఁడయ్యెను. భయభ్రాంతులయిన వాని శిష్యులు బాహ్లీకమునకుఁ బారి పోయిరి. వారు మహామదుని బూడిదను గొనిపోయి భూమిలో నుంచి పూజించిరి. దేవరూపుఁడయిన యా మహామదుఁడు బహుమాయలు నేర్చిన వాఁడు గావున పైశాచిరూపము దాల్చి యర్ధరాత్రమున వచ్చి భోజునితో నిట్లనియె. రాజా! నీది ఆర్యధర్మము. అది సర్వోత్తమము. నే నీశ్వరాజ్ఞచే నీ పైశాచధర్మమును విస్తరింపఁ జేసెదను లింగము ఛేదించుకొనుటయు, జుట్టు తీసివేయుటయు, గడ్డము పెంచుకొనుటయు, గట్టిగా నార్చుటయు (నమాజు చేయుచున్నమాట) అన్నియుఁ దినుటయు నా మతమువారి ధర్మ ములు. పశువధయు, బహుమాంస భక్షణము నిత్యకర్మము. ఆర్యులు దర్భల చేత సంస్కారము చేసికొన్నట్లు నా మతమువారు 'ముసలము'చే సంస్కా-రము చేసికొందురు. అందుచే నావారు ముసలవంతులు (ముసలమానులు) అను పేర ధర్మదూషకు లగుదురు. ఇది నేను స్థాపించు మతము. ఇట్లు తెల్పి మహామదుఁ డేగెను. రా జింటికేగెను. త్రివర్ణజనులకు సంస్కృతము వాడుకభాషగా భోజుఁ డొనరించెను. శూద్రులకుఁ బ్రాకృతము భాష యయ్యెను. భోజుఁ డేబదియేండ్లు పాలించి స్వర్గమందెను. వింధ్య హిమవన్నగ ముల మధ్యమందు ఆర్యావర్తమను ప్రదేశమునం దాతఁడు దివ్యమయిన మర్యాద నిలిపెను. అచట వర్ణవ్యవస్థ చక్కఁగా నేర్పడెను. వింధ్య ప్రాంతమున వర్ణ

## —: 4 అ. కలివిషాదము :—

భోజుఁడు స్వర్గస్థుఁడైన తరువాత నతని వంశీయు లేడుగురు సామాన్యరాజులు మూఁడువందల యేండ్లు పాలించి చనిపోయిరి. వారి కాలములో భూమి ఖండఖండములయి చిన్న చిన్న పాలకుల వశమయ్యెను. వారిలో నేడవయాతఁడు వీర సింహుఁడు. వాని తరువాత ముగ్గురు రెండువందల యేండ్లలో గతించిరి. గంగాసింహుఁడు పదియవవాఁడు కల్పక్షేత్రము నేలెను. అంత కాన్యకుబ్జమునందును జయచంద్రుఁడు రాజయ్యెను. ఇంద్రప్రస్థ మనంగపాలుని రాజ్యమయ్యెను. అతఁడు తోమరవంశమువాఁడు. ఇంక నెందరో రాష్ట్రపతులు, గ్రామపతులు (జమీందారులు) నైరి. అగ్నివంశరాజులు తూర్పున కపిలస్థానము, పశ్చిమమున బాహ్లీకము, ఉత్తరమున చీనా, దక్షిణమున సేతువుదాక గల నేల నేలిరి. వారిలెక్క

---

సంకరులను సముద్రతీరమున ముసలమానులను నతఁ డుంచెను. బర్బరమునకును తుషదేశమునకును నానావిధ ద్వీపములకు నతఁడు ఏసుమతస్థులను వెడల ద్రోలెను. (బర్బరదేశము అమరపర్వతమునకుఁ బడమరగా నున్నది.) వీరే యాఫ్రికావెళ్ళి యాక్రమించినారు. ఆక్రమించిన యా భాగములనే బర్బరరాజ్యములు (Barbara States) అని పిలువఁబడుచున్నవి.

జ్ఞాపిక:—మహమ్మదునకు భోజునకు నయినట్లు వర్ణింపబడిన యీ సమావేశము సర్వాసంబద్ధము. మహమ్మదు అరేబియాలో క్రీ. శ. 620 నుండి యున్నాఁడు. కాని ఇండియాకు మహమ్మదు వచ్చినట్లు 'ఖురాన్' మొదలయిన గ్రంథాలలో నెక్కడను లేదు. వానితో భోజుని సమావేశపరచి క్రీస్తుయొక్క యున్నతి స్థిరము చేయుటకే కల్పనయంతయును క్రైస్తవమతము వారు చేసిరని తెలియుచున్నది.

యుపిపది లక్ష లుండునట. వారే చిన్న చిన్న గ్రామపాలకులు గూడ నయిరి. వారందరు నగ్నిహోత్రములు సేయువారు. గోబ్రాహ్మణభక్తులు, ద్వాపరయుగ ధర్మతత్పరులు నై ధర్మయుక్తముగాఁ బాలించిరి. వారి పాలనమున సర్వత్ర ద్వాపరయుగధర్మము ప్రవర్తిల్లెను. ఇంటింట ధనము జనజన మందు ధర్మము, గ్రామగ్రామమున దేవాలయము, దేశ దేశ మున యజ్ఞములు ప్రవర్తిల్లినవి. మ్లేచ్ఛులుకూడ యార్య ధర్మముపై భక్తినొందిరి. ఇదిచూచి కలి మ్లేచ్ఛ స్త్రీలఁగలిసి నీలాద్రియందు హరిని బాడ్రెండేం డ్లుపాసించి రాధాకృష్ణ సాక్షాత్కారము వడసి 'నాకు నాల్గు నివాసములుకలవు. అవి జూదము, మద్యము, బంగారము, స్త్రీహాస్యము అనునవి ఈ నాల్గును నగ్నివంశ్యులగు క్షత్రియులు (క్షత్రియధర్మము నను సరించు బ్రాహ్మణులన్నమాట. అగ్నివంశము వారందరు బ్రాహ్మ ణులే. వైదికధర్మ విప్లవముచూచి వారు కత్తిపట్టుకొని మ్లేచ్ఛా దులను సంహరించి ధర్మరాజ్యస్థాపన చేసి వేదధర్మోద్ధరణ చేసిరి. వృత్తినిబట్టివారు క్షత్రియులుగాని జన్మముచే బ్రాహ్మణులే) నాశనముచేసి కలినైన నాకు నిలువనీడ లేకుండ చేసినారు. మేనిపై నాశవిడిచి, కులముచెడి, రాజ్యముపోయి నేను భ్రష్టుఁడనై నీ పాదముల నీడఁ జేరితిని' అని కలి వాపోయిన విని కృష్ణుడు చిఱునవ్వునవ్వి, 'ఓకలీ! నేను నిన్ను రక్షించుటకు 'మహావతి' యందు జన్మింతును. నా యంశము భూమిపై నవతరించి మహాబలులయిన యగ్నివంశీయులను నశింపఁజేసి

మ్లేచ్ఛరాజులను స్థాపించును. అని రాధాస్వామి పలికి యంత
ర్థాన మందెను. కలి మ్లేచ్ఛ స్త్రీలతోఁ బరమానంద మందెను.

ఈలోన 'వాత్సరము' అను గ్రామమున 'ప్రతప' అను
పేరుగల 'ఆభీరి' (గొల్లపడుచు) ◆ నవదుర్గావ్రతము నవవర్షము
లాచరించెను. చండిక ప్రసన్నయై బలరామకృష్ణులకు సమాను
లయిన కుమారులు నీ వంశమున గల్గుదురని వర మనుగ్రహించి
యేగెను. వసువంతుఁడను రా జాగోపిసౌందర్యమును చూచి
ముచ్చటపడి యామెను యథావిధిగా వివాహమై యామెం
దనయింటికిఁ దెచ్చికొనెను. ఆమెయం దతనికి దేశరాజు, వత్స
రాజు నను నిర్వురు కుమారులు గల్గిరి. వారు మగధదేశములను
జయించి రాజులయిరి. వసుసాధిపుఁడగు శతయత్తుఁడను నొక
మ్లేచ్ఛుఁడుండెను. వానికుమారుఁడు హిరణుఁడు. శివునియాజ్ఞచే
నతఁడు భీముని యంశమునఁ బుట్టెను. వానికి తాలవృక్షమంత
యెత్తును నూర్ధ్వవేగమును గల తాలనుఁడను కుమారుఁడు
గల్గెను. వానికి దేశరాజ వత్సరాజులతో యుద్ధము తటస్థిం
చెను. తాలనుఁ డోడిపోయి వారితో సంధి చేసికొనెను. వారు
మువ్వురు 'జయసింహుని' బలపరీక్ష కరుదెంచిరి.

---

◆ ఆభీరులు, గొల్లలు యాదవ శాఖలోనివారు. వీరు క్షత్రియులే.
గొల్లవృత్తి నాశ్రయించిరి. కంసుని పరిపాలనలో వానికి భయపడి నందాదు
లగు యాదవులు రాజ్యము చేయుటకు వీలులేక, గొల్లవృత్తి నాశ్రయించి
గోపోషణ ననుసరించి పాలు పెరుగు లమ్ముకొని జీవించిరి. ఆపద్ధర్మముగా
వీరీవృత్తి గ్రహించిరి. అప్పుడుకూడ వీరొక్క గోవులను కాచిరేగాని గొఱ్ఱె
లను మేకలను గాచినట్లు లేదు. భాగవతమున నాభీరులు యాదవులని
పేర్కొనబడి యున్నది.

—: 5 అ. పృ థ్వీ రా జు :—

ఇంద్రప్రస్థమున ననంగపాలుఁడు సంతానార్థియై శైవ యజ్ఞ మొకటి చేసెను. వానికి చంద్రకాంతి, కీర్తిమాలిని యను నిద్దరు కూతురులు గలిగిరి. చంద్రకాంతిని కాన్యకుబ్జ రాజునకును, రాష్ట్రపాలుని వంశమువాఁడు, చాపహానికులుఁడు నగు సోమేశ్వరరాజునకు కీర్తిమాలిని నొసంగి వివాహము గావింపఁబడెను. సోమేశ్వరుఁ డజమీరు రాజ్యాధిపతి. హిమాలయమునఁ దప మాచరించు జయశర్మ యను ద్విజుఁడు రాజు వివాహోత్సవము, రాజవైభవము గాంచి తాను రాజు కావలె నని కుతూహలపడి దేహము విడిచి, చంద్రకాంతికిఁ గుమారుఁ డయి జన్మించెను. ఆ బాలుఁడే జయచంద్రుఁ డను పేరొందెను. వాని తమ్ముఁడు రత్నభానుఁడు. రత్నభానుఁడు గౌడ వంగ మరుదేశములందలి రాజులను దండించి యింటికివచ్చి యన్నయాజ్ఞ ననువర్తించెను. గంగాసింహుని చెల్లెలు వీరవతి రత్నభానుని భార్య యయ్యెను. (ఈ గంగాసింహుడు భోజుని పరంపరలోవాఁడు) వారికి నకులుని యంశమై లక్ష్మణుఁ డను కుమారుఁడు పుట్టెను. అతఁ డేడేండ్లు వచ్చునంతకే తండ్రితో సమమయిన బలము గలవాఁ డయ్యెను. ఇఁక కీర్తిమాలినికి ముగ్గురు పుత్రు లుదయించిరి. దుంధుకారుఁడు, కృష్ణకుమారుఁడు, పృథివీరాజు నని వారి పేరులు. పృథివీరాజు పండ్రెండేండ్ల ప్రాయమందే సింహముమీద స్వారిచేయువాఁడయ్యెను. అనంగపాలుఁ డతని విక్రమము విని యా దౌహిత్రునికిఁ దన రాజ్య మిచ్చెను. పిమ్మట నతఁడు హిమగిరియందు యోగనిష్ఠఁ

బూనెను. ధుంధుమారుఁడు మృతుఁడాయెను, అజమేరమున కృష్ణ కుమారుఁడును రాజయ్యెను. వారిద్దరికి చంద వంశజులయిన ప్రద్యోతుఁడు, విద్యోతుఁడును మంత్రులుండిరి. ప్రద్యోత మంత్రితనయుఁడు పరిమలుఁడు. అతఁడు లక్షసేనకు నాయకుఁడై రాజుకొలువులో నుండెను. విద్యోతుని కుమారుఁడు భీష్మసింహుఁడు గజసేన కధిపతి యయ్యెను. అనంగపాలుఁడు (తాత) స్వర్గస్థుఁడు కాఁగా పృథ్వీరాజు తనకు శత్రువులని గమ నించి ప్రద్యోతాదులను ఇల్లురను తన రాజ్యమునుండి వెడలఁ గొట్టెను. వారు రెండునందలముంది పూరులతో గాన్యకుబ్జమున కేగి 'జయచంద్రుని' నాశ్రయించిరి. జయచంద్రా! నీ పినతల్లి కొడుకు పృథివీరాజు మాతామహుని రాజ్యము వడసి గర్వించి యున్నాఁడు. మేము న్యాయముగా నడిగితిమి. అర్ధరాజ్య మిమ్మంటిమి. కాని యతఁడు కాదనెను. అనిన జయచంద్రుఁడు ధుంధుమారునికుమారుని దనయశ్వసైన్యమున కధిపతిం గావించి, వాని మంత్రియగు ప్రద్యోతుని కుమారుఁడగు పరిమలుని దన మంత్రిం గావించుకొనెను. కృష్ణకుమారుని కుమారుని గజ సైన్య నాయకునిగను, విద్యోతనుని కుమారుఁడు భీష్మసింహుని తనకు మఱియొక మంత్రిగను నిలుపుకొనెను. వారి జీవన మునకై 'మహావతి' యను పుర మొసంగెను. అది జయచం ద్రునకు మిక్కిలి ప్రియమైన పురము. అతఁడు మఱియొక పట్టణము గట్టుకొనెను. జయచంద్రునికి అగమ, మలన యను నిద్దరు చెల్లెండ్రుండిరి. అగమను పృథివీరాజున కిచ్చెను. మల నను పరిమలునకిచ్చి వివాహము గావించెను. వివాహమయిన

తనువారి పృథ్వీరాజు [illegible] [illegible] దుర్గమును సుముహూర్తమున నిర్మింపఁజేసెను. దానికి దేహాలి (గుమ్మము) నెత్తించెను. ఆ దేహాలి భూమిభాగ్య సూచకమయినదిగా రాజు గమనించి యాపురమునకు 'దేహాలి' యను పేరు పెట్టెను. దానినే దేహాలీ గ్రామమని నాఁడు పిలువఁ జొచ్చిరి. (అదే నేఁడు 'ఢిల్లీ' యని పిలువఁబడుచున్నది.) అవ్వల మహేంద్రునకు జయచంద్రుఁడు పదునారులక్షల సైన్యము కూర్చుకొనినవాఁడట పృథ్వీరాజునకు 'మనమాతామహుని రాజ్యములో నాకును భాగమున్నది. ఇత్తువా? సగము నాకివ్వవలయును' అని యుత్తరము వ్రాసెను. అది చూచి పృథ్వీరాజు తా నిరువది లక్షల సైన్యమువాఁడ నని గర్వించి, జయచంద్రుని కిట్లు దూత నంపెను. 'జయచంద్ర! చంద్రవంశరాజులను నేను వెడలగొట్టునప్పటికి నా సేన పదునారు లక్ష లుండెను. ఇప్పటి కిరువదిలక్షలుగా నది పెంచితిని. నీ సేన యింత లేదు. భారత దేశమునందలి రాజు లందరిని నేను దండింపఁగలను. కాని నిన్ను దండించుట నాకు నీతి కాదు. నాకు నీవు పన్ను గట్టుము. లేనిచో నా బాణముల నిన్ను జీల్చి చెండాడెద' నని వార్త నంపెను. వారిర్వురకు నిట్లు వైరము పుట్టెను. జయచంద్రుఁ డార్య దేశము సగము జయించెను. పృథ్వీరాజు సగము కబళించెను. ఇట్లీ యిద్దరు దుద్ధతులవలన నగ్నివంశరాజుల రాజ్య నాశనమున కంకురార్పణమయ్యెను.

## —: 6 అ. పృథ్వీరాజ జయచంద్రుల యుద్ధము :—

ఒకప్పుడు కత్నఖానుడు (జయచంద్రుని తమ్ముడు) పృథ్వీ
రాజు పాలించు దక్షిణదేశకేగి జయించి ధనరాసులను గొల్ల
గొట్టుకొని వచ్చెను. పృథ్వీరాజు విని చాల చింతపడెను.
కత్నఖానునికి పండ్రెండుగురు భార్యలుండిరి. వారిలో రూపవతి
యందరిలోఁ దిలకమయి యుండెను. ఆమె [illegible].
జయచంద్రునికి పదునారుగురు భార్యలుండిరి. కాని వారికి
సంతతి లేదయ్యెను. గౌడదేశరాజు కూతురు దివ్యవిభావరి
యనునామె జయచంద్రుని భార్యలలో నొకర్తె. ఆమె దాసి
'సురభానవి' యనుదాని యందమునకు మోహపడి జయ
చంద్రుఁడామెంగూడి 'సంయుక్త' యను కుమార్తెం బడసెను.
ఆ సంయుక్త స్వయంవరము చాటించెను. పృథ్వీరాజా వార్త
విని 'చంద్రభట్టు' అను మంత్రిచేతఁ దన బంగారు విగ్రహమును
కాన్యకుబ్జమునకుఁ బంపి స్వయంవర మండపమున నిల్పించెను.
సంయుక్త యా విగ్రహము మెడలో స్వయంవర పుష్పహారము
నుంచెను. జయచంద్రుఁ డదిచూచి 'మీ రాజు స్వసైన్య
ముతో వచ్చి యీ బాలికను గెలుచుకొని పోయినచో నా
కెంతేని ప్రియమగును' అని చంద్రభట్టునిచే వార్త నంపెను.
పృథ్వీరాజు తన యిద్దరు బంధువులతో జయచంద్రునిపై దం
డెత్తెను. జయచంద్రుఁడును సన్నద్ధుండయ్యెను. ఈశనది కవ్వలి
యొడ్డున యుద్ధమారంభమయ్యెను. (ఈశనదియనగా సింధునది.
దేవనదియని దీనికిఁ బ్రసిద్ధి. మనుస్మృతిలోనున్నది – సింధునది
దాని యుపనది దృషద్వతియను దేవనదుల మధ్యభాగము

బ[illegible]ము అని [illegible] [illegible]) రత్నభానువుఁ [illegible] మొ[illegible]ను [illegible]. అయిదుగోజులు [illegible]యుద్ధ[illegible] [illegible]బలము చాల నశించెను. పృథ్వీరా[illegible] [illegible] శంక[illegible] [illegible]ంచెను. శంకరాను [illegible]ముచే జయచం[illegible] సే[illegible]యెల్ల మూర్ఛపోయెను. పృథ్వీ రాజు సంయుక్త సన్నిధి కేగి యామె సౌందర్యమునకు మోహితుఁడయ్యెను. ఆమెయు నతనిం గాంచి యట్లేయయ్యెను. అతఁ డామెను బల్లకిలో నెక్కించుకొని ఢిల్లీవంకకు పోయెను. అంతట జయిచంద్రునిసేన మూర్ఛనుండి లేచెను. వెంటనే రాజును దరిమిరి. పృథ్వీరాజు తనసేనను సగ మచట నాపి సగము సేనతో సంయుక్తతో ఢిల్లీ చేరెను. అవ్వల నా సైన్యములకు సూకరక్షేత్రమునఁ బెద్దయుద్ధమయ్యెను. రాత్రిపడగనే సేనలు చెదరి ఢిల్లీకిఁ బారిపోయెను. దుంధుకారుఁడు కృష్ణకుమారుడును ప్రిద్యోతునితోఁ దలపడిరి. ఆతడు భూమిపై నొరిగెను. అంత విద్యోతుఁడు వారి నెదిరించి వారిచేఁ గూల్పబడెను. అవ్వల రత్న భానువు. లక్ష్మణుఁడు మొదలగువారు తీవ్రముగాఁ బోరిరి. రత్నభానుడును గూలెను. తుదకు మూర్ఛితులయిన ముగ్గురను గొని సేనలు కాన్యకుబ్జమునకు వెళ్ళిపోయెను. ఉభయ పక్షములవారు బంధువుల కూర్ధ్వలోకక్రియ లాచరించిరి. ఆ పృథ్వీరాజ జయచంద్రుల యుద్ధమును పృథ్వీరాజు జయమును జయచంద్రుని విక్రమకీర్తియు నింటింట నెల్లరు చెప్పికొనసాగిరి. జయచంద్రుడు కాన్యకుబ్జమునను పృథ్వీరాజు 'ఢిల్లీ' యందు నుత్సవములు గావించి పరమానందమందిరి.

## —: 7 అ. జయచంద్రి వైభవము :—

విద్యోతుని కుమారుఁడు పరిమలసింహుఁడు గంగాతీరమున నిందు్రిసి సూర్యాంతర్గతశివలింగా భావనచేసి పూజించి యాతని వలన దివ్యాశ్వమును (బడబను) బడసెను. ఆ సమయమున పరిమలుఁడు తన తండ్రియగు విద్యోతుఁడు పృథ్వీరాజుని యుద్ధమున హతుండగుటకుఁ జింతించి శివుని బార్థివ లింగరూపమున నర్చించెను. శంకరుఁ డతని పరీక్షించుట కతని సర్పరోగ రూపమున గ్రసించెను. అయిదుమాసము లా రోగపీడ నొందియు నతఁడు పూజ మానఁడయ్యెను. తుదకు భార్యతోఁ గాశికేగి చావవలెనని వటమూలమున నుండఁగా నా మొదటనున్న పామొకటి మధురముగా స్వనిఁ జేసెను. అంతట పుదరిసర్ప మొకటి యటకు వచ్చెను. దానింజూచి సర్పము "నీవు సిద్ధ యుండవు. శివభక్తుని బీడించుచుంటివి. ఈ రాజు వట్టిమూర్ఖుఁడు. ఆరనాలమును ద్రావుట యెఱుంగఁడు." అనిన నంతట రుదరిసర్పము "ఓరి! పన్నగాధమ! నేను రాజుదేహమున నిత్యము నుండి యెంతో సంతోషించుచుంటిని. నా కిది నివాసము. దీని నెల్లు విడువమందువు. ఈ రాజు 'తైలోష్ణము' నొసంగఁడయ్యెను. తెలివితక్కువవాఁడు అని పలికి శరీరములోనికిఁ బోయెను. పరిమలుని భార్య 'మలన' యా మాటలు విని సర్పము చెప్పిన చికిత్స చేసెను. వెంటనే పరిమలుఁడు సర్వరోగము వాసి సర్వాంగసుందరుఁ డయ్యెను. తైలోష్ణములచే సర్పబిలము నింపి స్వయముగాఁ ద్రవ్వెను. అందుండి బొటనవ్రేలంత శివలింగ మావిర్భవించెను. అది జ్యోతిరూపము.

చిదానందము. అది గాఢాంధకారము గ్రమ్మిన యా యర్ధ
రాత్రియందు సూర్యునట్లు వెలుగొందెను. రాజు మహిమ్న
స్తవము చేసి గిరిజావల్లభుని బూజించెను. మరియు నాశంకరు
ననుగ్రహముచే దనయింట శ్రీనివాసుఁడు నిత్యనివాసము
చేయునట్లు వరమందెను. గౌరీశుఁ డట్లే యని యంతర్హితుఁ
డయ్యెను. అది మొదలుగ నాతని యింట దినదినము ఒక పుట్టి
బంగారము లభించుచుండెను. అతఁడు మహావతీనగరమున
కేతెంచెను. భీష్మసింహుని గలిసికొని యతఁడు చాల సంతస
మందెను. అవ్వల పరిమలుఁడు జయసింహుని పురమున కేగెను.
అతఁడును సంతసించి నీవు నీ పురమేగి నాకు విఘ్న మేమేని
వచ్చిన సహాయపడుచుండుమని పంపెను. అపుడు లక్షణుఁడు
శివు నర్చించి 'ఐరావతి' యను శక్తిని బడసెను. ఆశక్తి ఐరా
వతమను గజమునుండి జనించినది. ఆ శక్తి నధిష్ఠించి లక్షణుఁ
డింటికి వచ్చెను. పరిమలుఁడు మహావతికి వెళ్ళిపోయెను. ఈ
లోపున తాలనుఁడు మొదలగు వీరులు మహావతి కేతెంచి
పరిమలుని దర్శించి యతనితో నానందముగ వసించిరి. వారొక
మాసముండి తమ పురముల కేగుతరి పరిమలుఁడు నా పుత్రు
లకు రాజ్యాధికార మొసంగి మిమ్ము గలిసికొందు నని వారిని
బంపించెను. దేశరాజు తమ్మునితోఁగూడి ద్విజులకుఁ దనపుర
మిచ్చెను. తాలనుఁడు కాశీపురమును దన కుమారుల కొసం
గెను. మరియు నతఁడు రాక్షసప్రియుఁడు. రాక్షసమయుండగు
దేవుని మ్లేచ్ఛుల విధానమునఁ బూజించెను. అట్లే వసుమంతుని

మమారులు దేశరాజవత్సరాజు లింద్రసూపుఁడని సూర్యునర్చించి కృతకృత్యులయిరి. సింహినియను నొక దివ్యాశ్వము నెక్కియు పంచశబ్దమను మహాగజము నెక్కి దేశరాజు వెడలఁదలచెను. వత్సరాజు పపీహాకమను నూర్యదత్తమయిన గుఱ్ఱము నెక్కి ప్రయాణింపనెంచెను. అట్లు మువ్వురు వీరులు మహావతీ పురమందు సత్కృతులై వినోదించిరి. అరువదివేల సేనలకు నాయకుఁడగు తాలనుఁడు మంత్రిసోదరులు కూడికొలువ నా జయచంద్రుడు కృతార్థుఁడయ్యెను.

## —: 8 అ. కాలియుఁడు :—

జంబుకుఁడను రాజు పృథ్వీరాజునకు భయపడి కాలియుడను పుత్రునితోఁగూడి నర్మదాతీరమున పార్థివ పూజలచే శివు ననుగ్రహము వడసెను. పర్వతి వేఁగొని నల్వా నాకుంఠు పరమందెను. సర్వసేనమూర్ఛ చేయఁగలశక్తిని గాలియుఁడు దేవునివలనఁ బడసెను. తండ్రి యానతి నతఁడు గంగాయాత్ర కేగెను. మఱియు నతడు తన చెల్లెలిం గని యేమికావలెనని యడుగ నామె యొక కంఠహారము గావలెనని కోరెను. కాలియుఁడు గంగాయాత్ర సేసికొని దానములు గావించి జయచంద్రుని పురమున కేతెంచెను. అత్తఱి గాన్యకుబ్జాధీశుండగు జయచంద్రుఁడు నిర్ధనుండై యుండెను. అతనికిఁ గావలసిన హారము లభింపదయ్యెను. అంత పరిమలుఁడేలు మహావతికేగి పట్టణమును ముట్టడించెను. ఆ రాజు శంకరుని శరణొందెను. శివానుగ్రహముచే నరువదివేల సైన్యముతో, దేశరాజు వత్సరాజుల సహాయముతో, తాలనునితో దండు

కొనసాగెను. ఘోరమగు యుద్ధమయ్యెను. కాళీయుని సేనలు పారిపోయెను. కాళీయుఁడు శివుని దలంచి మోహనాస్త్రము ప్రయోగించెను. అంత భీష్మసింహుఁడు సూర్యదత్తమైన సంజ్ఞయను బాణముచే సేనలను లేపెను. భైరవుఁడను బల్లెముచే శత్రువు గొట్టెను. అంత మాహిష్మతీసేన పలాయనమయ్యెను. కాలియుఁడు లేచి యొకబల్లెముచే భీష్మసింహుని శిరము ఖండించెను. అంతటఁ దాలరాజులు కాళీయుని నోడించిరి. పరిమలుఁడు శత్రువునోడించి ముగ్ధను గౌగిలించుకొని స్వగృహమున కేగెను.

జయచంద్రుఁడా విజయవార్తవిని మిక్కిలి సంతసించెను. తాలనుని బిల్చి సైన్యాధిపతిం గావించెను. భీష్మసింహుఁడు చనిపోయిన యైదుమాసములకు, వాని భార్య మదనాలస (ఘూర్జరరాజు కూతురు) యొక కుమారునింగాంచెను. అతఁడు సహదేవాంశమున దైవాజ్ఞచే నవతరించినవాఁడు. రాజా పరిమలుఁడు జనోత్సవము జరిపించెను. ◆ దేశరాజునకు కృష్ణాంశమున నొక కుమారుఁడు పుట్టెను.

◆ ఈ కృష్ణాంశుని పేర సరిగా కృష్ణచరిత్రపోలికలోఁ గథలు మూలమందు వర్ణితములయినవి. కృష్ణచరిత్రకుఁ గేవలమివి యనుకరణములు. కృష్ణుడు చిన్నవయసులో చాణూర ముష్టికులను మల్లురను కంససభలోఁ జంపినకథకు సరిగా నీ కృష్ణాంశుడును మల్లయుద్ధముచేసి జయించెను. ఇట్లే యీతని కథలు చాల యధ్యాయములందు వర్ణింపఁబడినవి. ఇవి యెవరో యిందుఁ చేర్చిరని నా యభిప్రాయము. కావున వీనిని విడచితిని. చూడుడు- మూలము 9వ అధ్యాయమునుండి 41 అ. వరకు,

ఈ ప్రతిసర్గపర్వము తృతీయఖండమున ముప్పదిరెండధ్యాయములలోఁ గృష్ణాంశుఁడను నొకరాజు చరిత్ర వర్ణితమైనది. ఇది సరిగా కృష్ణావతార

# ప్రతిసర్గపర్వము - చతుర్థ ఖండము



## —: 1 అ. ప్రమరవంశము :—

ఇట్లు ద్వాపరసంధిలో సూతుఁడు నైమిశారణ్యవాసులగు మును లెనిమిదివేలమంది సూర్యచంద్ర వంశముల చరిత్ర యంతయుం దెలిపి, కృష్ణావతారముతరువాత విక్రమార్కుని పాలనము ధర్మయుక్తముగా నడచెనని యని తెలిపెను. 'మూఁడు యుగములలో నవతరించిన హరి యీ నాల్గవదియగు కలియుగములో నేరూపమున నవతరించి యేపనులు సేసెనో తెలుపుము, అగ్నివంశ్యులగు నలుగురి వంశముల చరిత్ర వివరముగా వినఁగోరెద' మను మునులప్రశ్నపై సూతుండిట్లనియె. అగ్నివంశులలోఁ బ్రమరుఁడను రాజు దక్షిణదిశకేగి యంబచే నిర్మింపఁబడిన

---

చరిత్రను బోలియున్నది. ఈ కృష్ణాంశునికే 'ఉదయసింహుడు' అను పేరు కనిపించుచున్నది. విక్రమాదిత్యుని తరువాత నితఁడు కృష్ణుని యంశమై యితఁ డవతరించెనని యున్నది. ఇతనియెడఁ గృష్ణుని లీలలన్నియు సమన్వయించుట చిత్రముగానున్నది. చరిత్రదృష్టిలో నీ కథల యాథార్థ్యమును గూర్చి సంశయము గల్గుచున్నది. కావున నేను దీని ననువదింపక విడిచితిని. ఈ తరువాత కుతుబుద్దీను మొదలయిన మహమ్మదీయుల చరిత్రలు క్రైస్తవ చరిత్రలుగూడ యీ పురాణము ప్రక్షిప్తపురాణ మనిపించుట కితరులచేఁ జేర్పబడినట్లు స్పష్టపడుచున్నది. ఇట్లు పరదేశచరిత్రలు మనపురాణములలోఁ జొప్పించు సంప్రదాయము మఱే యితర పురాణములందు నింతగాఁ గనిపింపదు. భారతచక్రవర్తులైన విక్రమాదిత్య శాలివాహనులను సంపూర్ణముగాఁ జెప్పుటయే యీ ప్రతిసర్గ పర్వముయొక్క ముఖ్య తాత్పర్యముగాఁ గనిపించుచున్నది. అనవసరములయిన యితరదేశ చరిత్రలు వీనిలో ముడిపెట్టి భారతదేశ చరిత్ర కలుషితమొనర్చి నిజము బయల్పడకుండునట్లెవరో యిట్లు చేసిరి.

‘అంబావతి’ పురము రాజధానిగ నారేండ్లు పాలించెను. అతఁడు సామవేది. గొప్ప శూరుఁడని ప్రఖ్యాతినందెను. వాని కుమారుఁడు మహామదుఁడు. వానిపుత్త్రుఁడు దేవాపి, వాని సుతుఁడు దేవదూతయు రాజ్యముసేసిరి. బౌద్ధమతానుయాయి యగు నశోకుఁడు యుద్ధమునఁ జంపఁబడినతరువాత కలి సూర్యోపాసనచేసి రవి యనుగ్రహమున నైదేండ్లకు శకుఁడను నొక పురుషుని బడసి వానికి “త్రై త్రిరము” అను నగరము నిచ్చెను. వాఁ డందు గొప్పలు దస్యులు ననువారిని లోఁబఱచుకొని యార్యదేశవినాశమునకుఁ బలుమారులు యత్నించి యగ్నివంశ రాజులను సంహరించెను. అల్పాయుష్కులయి పెక్కుమంది నశించిరి. దేవదూతుని కొడుకు గంధర్వసేనుఁ డేబదియేండ్లు పాలించి * తపస్సునకు బోయెను.

తపస్సుచేసి శివుని యాజ్ఞచే మఱలవచ్చి రాజ్యమేలెను. అప్పుడు విక్రమాదిత్యుఁడు కలిగెను. అతఁడు నూరేండ్లు పాలించెను. పిమ్మట దేవభక్తుఁడు పదేండ్లుపాలించి శకులవలన మరణించెను. అతని కుమారుఁడు శాలివాహనుఁడు శకులను జయించి యఱువదియేండ్లు పాలించి స్వర్గమందెను. శాలివాహనుని కుమారుఁడు శాలిహోత్రుఁడు. వాని తరువాత శాలివర్ధ

---

* ఈ తపస్సునకు వెళ్లుముందుఁ బెద్దకుమారుఁడగు శంఖునికి రాజ్యము పట్టముగట్టెను. ఆ శంఖుఁడు ముప్పది యేండ్లేలి గతించెను. రాజ్య మరాజకమయ్యెనని విని గంధర్వసేనుఁడు తపము చాలించివచ్చి మఱల రాజ్యభారము వహించెను. ఆ సమయమున గంధర్వసేనునికి వీరవతియను భార్యయందు కలి 3001 కి సరియైన 101 B. C. లో నొక కుమారుఁడు గల్గెను. అతఁడే విక్రమాదిత్యుఁడు. వివరము చూడుడు పుట. 105.

నుఁడు, శరపాంత, సుహోత్రుఁడు. హరిశ్చంద్రుఁడు, ఇంద్ర
పాలుఁడు వరుసగా బాలకులైరి. ఇంద్రపాలుఁ డింద్రావతియను
పురము నిర్మించినవాఁడు. వాని కుమారులు ముగ్గురు. వారిలో
మాల్యవంతుఁడు 'మాల్యావతి' యను నగరము నిర్మించెను.
అతని కాలమున నాశ్లేష వానలు లేక పంటలు పండవయ్యెను.
గొప్ప కఱవు వచ్చెను. రాజుగారి యూహాపోహమునకుఁ గష్టపడి
కొక్క పెంట మొఱువ్వగా వేసి పండించిన ధాన్యము నింటనున్న
దేవతార్చనకు నివేదింప కలిపివచ్చెను. అంతట భగవానుఁడు
ప్రసన్నుఁడై నీ [illegible] నిక ముందు కఱవు రాదు. సువృష్టియై
సస్యసమృద్ధియగునని [illegible] దీవించెను. మాల్య
వంతుని కుమారుఁడు [illegible] ముచే
[illegible] చెను. [illegible] ము చేసెను.
వానికుమారుఁడు భానురాజు. పిమ్మట సత్యరాజు, భోజరాజు,
నేబదియేండ్లు పాలించిరి. భోజునికుమారుఁడు శంభుదత్తుఁడు
నలుబది సంవత్సరములు ఏలెను. శంభుదత్తుని కొడుకు బిందు
పాలుఁడు, అతఁడు వేదవేత్త. తండ్రి యింత కాల మేలినవాఁడు
బిందుఖండము ( బుందేల్ఖండ్ ) అను పేరున రాష్ట్రము
నిర్మించెను. బిందుపాలుని కుమారుఁడు రాజపాలుఁడు తండ్రివలె
నలుబదియేఁడ్లేలెను. వానికొడుకు మహీనరుఁడు, తర్వాత
సోమవర్మ, కామవర్మ, భూమిపాలుఁడు, నలుబదియేండ్లేలినారు.
భూమిపాలుఁడు 'భూసరస్సు' అను నొక సరస్సు త్రవ్వించెను.
అచట నొక నగరము కట్టించెను. అతని కుమారుఁడు రంగ
పాలుఁడు, భూమిపాలుఁడు పెక్కుమంది రాజులను గెలిచి

వీరసింహుఁడు అను బిరుదునంది ప్రఖ్యాతికెక్కెను. అతఁడు రంగపాలుని పట్టాభిషేకించి వనమేగి తపమాచరించి స్వర్గము నందెను. వానికి కల్పసింహుఁడు జనించెను. అతఁడు రంగపాలుని వలె నలుబదియేండ్లేలినాఁడు. వానికి సంతతి లేకుండెను. ఒక ప్పుడతఁడు గంగాస్నానమునకేగి పెక్కుదానములాచరించి కల్పక్షేత్రము (కురుక్షేత్రమున కేగి) యీ పుణ్యభూమి యెంతయు సౌఖ్యమయి దిబ్బయయినదని చూచి యక్కడ 'కలాపనగరము' నిర్మించి యచట రాజ్యము సేసెను. వానితరు వాత గంగాసింహుఁడు రాజయ్యెను. అతఁడు తొంబదియేండ్లు పాలించినతరువాత కూడ యుద్ధమునకేగి మహామ్మద్ గోరీకిఁ బృథ్వీ రాజునకు జరిగిన యుద్ధములో (2 వ కురుక్షేత్రమిదియే) ప్రాణములు వాసి స్వర్గమందెను. ఇంతటితోఁ బ్రమరునివంశము సమాప్త మయ్యెను.

—: 2 అ. చయహాని వంశము :—

చయహాని మధ్యదేశమునకు రాజయ్యెను. బ్రహ్మ నిర్మించిన 'అజమేరు' మనుపుర మతని ముఖ్యపట్టణము. అజుఁ డనగా బ్రహ్మ అతని 'మా' యనగా లక్ష్మి (సంపద) అది యందుఁగలదు గాన యది 'అజమేర' మని పేరొందెను. (దీనినే యిపుడు 'అజ్మీర్' అనుచున్నారు) చయహాని రాజ్య కాలము ♦ పదియేండ్లు. వాని కుమారుఁడు తోమరుఁడు అతఁడు పార్థివలింగ పూజసేసి యొక సంవత్సరములో ననుగ్రహము వడసి "ఇంద్రప్రస్థము" అను పుర మా దేవునివలన సంపాదించెను. ఈతోమరుని వంశమువారు తోమరు లనఁబడు క్షత్రియులయిరి.

♦ ఈ రాజ్యకాలముల లెక్కలు సరిగాలేవు.

మగు † యాగముచేసి యున్నాఁడు. జయసింహుని కుమారుఁడు ఆనందదేవుఁడు. అతని కుమారుఁడు సోమేశ్వరుఁడు. మంచివీరుఁడు. ఇతఁడనంగపాలుని కూఁతురగు కీర్తిమాలిని బెండ్లాడి యామెయందు ముగ్గురుకుమారులను బడసెను. అందు బెద్దవాఁడు మంధుకారుఁడు. మధురారాష్ట్రమేలెను. మధ్యముఁడు కుమారుఁ డనువాఁడు (కృష్ణ కుమారుఁడనియు వాడుక.) అజ్మీర్ లోఁ దండ్రి సింహాసనమెక్కెను. మూఁడవ యతఁడు మహీరాజు (పృథ్వీరాజు) ఇతఁడే మాతామహుఁడైన యనంగపాలుని ఢిల్లీ రాజ్యమునకు (ఇంద్రప్రస్థమునకు, ఢిల్లీప్రాంతమే ఇంద్రప్రస్థపురము నున్నచోటని తెలియుచున్నది.) రాజయ్యెను. ♦ అసంగపాలుఁడు దౌహిత్రుఁడైన పృథ్వీరాజును దత్తతచేసికొని తన రాజ్యమునే యతనికిచ్చెను. ఈ పృథ్వీరాజు మహమ్మద్ గోరీ తోడియుద్ధములోఁ జనిపోయెను. (1193 A. D. లో) ఇంతటితో చాపహానివంశము ముగిసెను. ఆ వంశములో శేషించిన రాజులు, వారి భార్యలు పిశాచప్రాయులయిన

---

♦ ఇతఁడు వకార్యచంద్రగుప్తుఁడును గుప్తచంద్రగుప్తుఁడును కాడు. సామలదేవుని వంశమునందలి యగ్ని వంశపురాజు.

† ఈ జయసింహుఁడు చేసినది అశ్వమేధయాగము. జయసింహాశ్వమేధము అనుపేర శ్రీ శ్రీ శ్రీ శృంగగిరి విరూపాక్ష పీఠాధిశ్వరులు (శ్రీరాణీచయనులుగారు అని పూర్వాశ్రమ నామధేయముగల సుప్రసిద్ధ పండితులు) ఈ జయసింహుని యశ్వమేధకథనే సంస్కృత నాటకముగా రచించియున్నారు. వీరి పీఠము లోగడ పీనుగులమహాసనం దుండెడిది. వీరి శిష్యులు శ్రీ శ్రీ శ్రీ కల్యాణానంద భారతీ మాంతాచార్య స్వామివారు పరిశృత నూ పీఠమును గుంటూరునందు స్థాపించి యున్నారు

మ్లేచ్ఛులచే నపవిత్రీకరింపబడి సంకరింపబడి యయినది. వారివల్లం బుట్టిన సంతానము మ్లేచ్ఛులుగా, [illegible] జాట్లు మేహానులు అను సంకరజాతులయిరి. అందు మేహానులు 'ముస్లిమ్' ధర్మానుయాయులుగాను, 'జాట్లు' ఆర్యధర్మానుయాయులుగాను నైరి. చౌహానులు సోమవంశమందలి కొలని నుండి తప్పించుకొన్నవారు యచ్చటచ్చట క్షత్రియులుగానే యుండిపోయిరి.

## —: 3 అ. శుక్లవంశము :—

(చాళుక్య వంశము)

బ్రహ్మావర్తమున వసించు కశ్యపుఁడను బ్రాహ్మణుని కార్యావతియను భార్య యుండెను. ఆ దంపతులకుఁ బదిమంది కుమారులు గల్గిరి. అతఁడు మిశ్ర దేశమేగ (ఈజిప్తు) తన విద్యాసామర్థ్యముచే మిశ్రదేశమందలి తెలివిగల మ్లేచ్ఛులను లోఁబఱచుకొని స్వదేశమునకు వచ్చి వారిని రాజపుటానాలో (మరు దేశములో) నుంచెను. కొందఱు శిష్యులతో సరస్వతీ దృషద్వతుల మధ్యమందున్న బ్రహ్మావర్తమందు వసించెను.

---

* అనంగపాలుఁడు క్షత్రియకులమునకుఁ జెందినవాఁడు ఇంద్రప్రస్థ రాజ్యాధిపతియయిన తోమరుని వంశమునకు జెందినవాఁడు. అనంగపాలుని కిద్దరు కూఁతుళ్లు. కీర్తిమాలిని, చంద్రకాంత యనువారు. కీర్తిమాలిని సోమేశ్వరుఁడు పెండ్లాడెను. మా. పుట 200.

+ ప్రతిసర్గ అధ్యాయము 1 శ్లోకము నుండి 10 శ్లోకముల వరకు [illegible] వృత్తాంతము తెల్పబడినది. ఇది మహా ప్రళయమునకు [illegible] కలియుగాది శతి 2710 (892 B.C.) నుండి [illegible] చరిత్ర చెప్పఁబడుచున్నది.

అతని కుమారులు తొమ్మండ్రుగురు. నతని శిష్యులు నతనిలోనే వసించిరి. నాల్గవ కుమారుడగు శుక్లుని మాత్రము రాజపుటానాలో నున్న యర్బుదపర్వతము (ఆబూపర్వతమని నేటివాడుక) లోనున్న రైవతమను శిఖరముమీద దపముచేయుమని పంపెను. మిగత కుమారులకు శిష్యులకు మనుస్మృతి ధర్మములను బోధించెను. శుక్లుడు సచ్చిదానందవిగ్రహుడు, జగన్నాథుడు నగు వాసుదేవుని బ్రసన్నుని జేసికొనెను. ద్వారకాపతియగు నా దేవుడు * డావిప్రుని చేయిపట్టుకొని తీసికొనివెళ్ళి సముద్రాంత భాగమునకు వచ్చి దివ్యశోభా సమన్వితమగు ద్వారకను జూపించెను. కలిలో సింహుమించు రెండువేల సంవత్సరములయినతరువాత నగ్నిహోత్రు ననుగ్రహమున నర్బుదమునకేగి తనతోడివారగు ప్రమరచేహాని పరిహారులను ముగ్గురితో బౌద్ధులను జయించి హరికృపచే ద్వారకను నిర్మించెను. భారతవర్ష పశ్చిమభాగమున బదేండ్లు పాలించెను. అతని కుమారుడు విష్వక్సేనుడు. అతడు హరికృపచే లభించినవాడు. అతడిరువదియేండ్లు, వానికుమారుడు జయసేనుడు ముప్పది యేండ్లు, వానికొడుకు విసేను డేబదియేండ్లు పాలించిరి. వానికిక మిథునము పుట్టెను. అందాడుదాని పేరు ప్రమోదయనియు, కుమారుని పేరు మోదసింహుడు ననియు, నేర్పడెను. విసేనుడు ప్రమోదను విప్రమునికొసంగెను. రాజ్యమును గుమారుని కిచ్చెను. అతడు తండ్రియంతకాల మేలెను. మోదసింహునికి సింధువర్మ జన్మించి తండ్రియంతకాల మేలెను. సింధువర్మ

* శుక్లుడు (చాళుక్యుడు) అగ్నివంశ్యుడగు బ్రాహ్మణుడేయని యిచట స్పష్టముగా “విప్రమ్” అను పదము తెల్పుచున్నది.

కుమారుఁడు సింధుద్వీపుఁడను తండ్రియంతకాలము పాలించెను.
వానికుమారుఁడు శ్రీపతి. అతఁడు గౌతమవంశమున జన్మించిన
'కాచ్ఛపి' యను నామెను వివాహమాడెను. అల్లు చేసి
కచ్ఛదేశమున కేగెను. అంతట పులిందులను యవనులను
నతఁడు జయించి యచట రాజ్యము స్థాపించెను. ఆ దేశము
సింధుతీరమున నున్నది. వాని కుమారుఁడు భుజవర్మ శబరులను
భిల్లులను గెలిచి రాష్ట్రనిర్మాణము చేసెను. తండ్రియంత కాల
మేలెను. వానికుమారుఁడు భుజదేవుఁడు. అతఁడు మంచి ప్రసిద్ధి
కెక్కెను. తండ్రియంతకాల మేలెను. వాని కుమారుఁడు
రణవర్మ, వానితరువాత చిత్రవర్మ రాజులైరి. చిత్రవర్మపేర
చిత్రనగరము వనమునందు నిర్మితమైనది. వాని కుమారుఁడు
ధర్మవర్మ, వాని కుమారులు కృష్ణవర్మ, ఉదయుఁడు
ననువారు తండ్రియంత కాల మేలిరి. ఉదయుని పేర నుదయ
పురము నిర్మితమయ్యెను. అది వనమధ్యమం దున్నది. అతఁడు
తండ్రియంతకాల మేలెను. వానికుమారుఁడు వాప్యకర్మ.
అతఁడు వాపీకూప తటాకాదులు, చక్కని మేడలు, ధర్మార్థముగ
నిర్మించెను. అతఁడు చాల ధర్మపరుఁడు. అంతట బలదుఁడను
రాజు లక్ష సైన్యముతో వచ్చెను. వాఁడు మహామద మత్తుఁడు.
వాప్యకర్మ వానితోఁ బోరాడి పైశాచకులగు మ్లేచ్ఛులను
జయించి కృష్ణోత్సవము చేయించెను. అతఁడు తండ్రియంత కాల
మేలెను. వాని సుతుఁడు గుహిలుఁడు, తరువాత కాలభోజుఁడు.
రాష్ట్రపాలుఁడు నను వారు పైవారితో సమానముగ నేలిరి.
రాష్ట్రపాలుఁడు పితృపైతామహమయిన రాజ్యము విడిచి,
వైష్ణవియగు శక్తిని దపముచే నారాధించెను. సర్వమంగళయు,

[illegible] వేణువు నూరువా- డగులచే [illegible] దేవదత్త యను కన్యా[illegible] వివాహ మాడెను. ఆమెయం దాతని [illegible] సప్తమాతృకలయొక్క [illegible] కుమార్తెలు జనించిరి. శీతల, పార్వతి, కన్య, పుష్పవతి, గోవర్ధని, సిందూర, శాలియను వారినామములు. వారువరుసగా బ్రాహ్మీ, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండియు నను మాతృకల యంశలు. ఒకనాడు రాజభార్య దారముకట్టి యొక [illegible] నాతిలో నెప్పటియట్లు వదలెను. అంతట నానా [illegible] సుందరుల నందు జూచెను. వారి[illegible] మాత[illegible] నున్నట్లును నాభర[illegible] మనస్సు చిన్న పుచ్చుకొనెను. ఆమె నీరుకోడుచున్న యాకడవ యెంతలాగినను మీదికి రాదయ్యెను. అంతట కన్యావతి కుండ లేకయే యింట కేగి చూచునప్పటి కామె కుమార్తె లేడుగురు శిలలయియుండిరి. వేణువువచ్చి తన భార్యను గారణమేమని తర్జించెను. మఱియు నతఁడు బ్రహ్మచర్య నియమమును విడిచి ఆమెతోఁ గ్రీడించెను. అంతట నామెయం దతనికి యశోవిగ్రహుఁడను కుమారుఁడు జన్మించెను. అతఁడు మంచిబలశాలియు ధర్మశీలియునై యుండెను. అతఁ డార్యావర్తము నిరువదియేండ్లు పాలించెను. వానికుమారుఁడు మహీచంద్రుఁడు వానితరువాత చంద్రదేవుఁడు మందపాలుఁడు ననువారు తలకొక యిరువదియేండ్లు పాలించిన వారు. మందపాలుని కాలములో నెల్లరాజులు నతనిని విడిచి

మాతఃకాలము యుంటు నిరూపించిరట. అతఁడు పదియేండ్లే పాలించెను. వానికి కుంభపాలుఁడు జన్మించెను. ♦ రాజనీయ మను నగరము పైశాచదేశమున నున్నది. దానిలో మహామదుఁడను మ్లేచ్ఛపైశాచధర్మప్రవర్తకుఁడు పెక్కుదేశములను జయించి ధనము కొల్లగొట్టి మ్లేచ్ఛధర్మమును పెంచెను. వాఁడు తనపై శక్తిరాగాఁ కుంభపాలుఁడు కలిచే సృజింపబడినవానిఁగా వాని నెఱింగి తెలివిగలవాఁడు గాన వానికి లోఁబడి పోయెను. మహామదుఁడు సంతోషించి వానికి ధనరాసులన్నియు నిచ్చివేసెను. వాఁడు మార్త్రిఖండకమందలి తన రాజనీయనగరమునకు వెళ్లిపోయెను. కుంభపాలుఁ డిర్వదియేండ్లు పాలించెను. వాని కుమారుఁడు దేవపాలుఁ † డనంగుని కూఁతురును జంద్రకాంతి యను దానిని వివాహమాడెను. మఱియు నతఁడు కన్యాకుబ్జమునంగల గృహమునకువచ్చి రాజుల నందరిని జయించి తండ్రి యంతకాల మేలెను. వానికి జయచంద్రుఁడు రత్నభానుఁడు నను నిద్దఱు కుమారులు గల్గిరి. ఆర్యావర్తమునఁ దూర్పుభాగమును నుత్తరభాగమును జయించి రత్నభానుని కుమారుఁడు లక్షణుఁడను వాఁడు విష్ణుభక్తుఁడై రాజ్యమేలెను. అతఁడు కురుక్షేత్రమున యుద్ధముచేసి ప్రాణములువాసి స్వర్గమందెను. ఇంతటితో శుక్లుని వంశమున జన్మించి వైశ్యులకుఁ బాలకుఁడైన కుంభపాలుని వంశము సమాప్తమయ్యెను. విష్వక్సేనుని వంశము నందు జన్మించినవారు విష్వక్సేనులనియు, (బ్రాహ్మణులై క్షత్రియధర్మము గొన్నవారు) విసేనుని కులమందు పుట్టినవారు

♦ ఇది గోరీ మహమ్మదు వృత్తాంతమే.

విసేనులను క్షత్రియులనియు, గుహిలుని వంశమునందలి వారు గోహిలులను క్షత్రియులనియు, పేరొందిరి. రాష్ట్రపాలుని వంశమువారు రాష్ట్రపాలురను రాజులనియు (వీరు క్షత్రియ ధర్మానుసారులు గాని యగ్నివంశీయులన్నమాట) వైశ్యపాలకుం డైన కుంభపాలుని వంశములోనివారు వైశ్యపాలురనియు పేరొందిరి. శుక్లవంశధురంధరుఁడగు లక్షణుఁడు మరణింపగా నా క్షత్రియులందరు (క్షత్రియధర్మపరులయియున్న యగ్ని వంశరాజులన్నమాట) కురుక్షేత్రమునందు నశించిరి. మిగిలిన కొలదిమంది క్షుద్రరాజులు వర్ణసంకరమునొంది మ్లేచ్ఛులచేఁ జెరుపఁబడి భయానకమైన మ్లేచ్ఛదేశమున జన్మించిరి.

## —: 4 అ. పరిహారుని వంశము :—

ఓ భృగువర ! పరిహారుని వంశము తెల్పెద వినుము. పరిహారుఁడు ధర్మవేదపరాయణుఁడై బౌద్ధులను జయించి సర్వ మయియగు శక్తిని ధ్యానించిన నామె సార్ధయోజనవిశాల మయిన యొక నగరమును జిత్రకూట గిరిపై (బెంగాలులో నున్నది) నిర్మించి యాతనికిచ్చెను. కలియానగరమున బంధింపఁ బడెను గాన దానికిఁ 'గలినిర్జరము' అను పేరు గలిగెను. అదే కలింజరపురమను ప్రఖ్యాతి చెందినది. అందాతఁడు పంద్రెం డేండ్లు పాలించెను. వాని కుమారుఁడు గౌరవర్మ. అతఁడు తండ్రి యంతకాల మేలెను. గౌరవర్మ తన తమ్ముఁడగు ఘోరవర్మ నారాజ్యమున నునిచి తాను గౌడదేశమున కేగి పాలించెను. గౌరవర్మ కుమారుఁడు సుపర్ణుఁడు. వాని తరువాత రూపణుఁడు కారవర్మ పాలించిరి. శకుఁడు మహాలక్ష్మిపూజ గావించిన

మూఁడేండ్లయిన తరువాత నా దేవి కామాక్షి మాసముగ
భక్తుని పాలింప నచట వెలసెను. కామవర్మ యాఁబదియేండ్లు
పాలించెను. వానికి భోగుఁడు భోగవతియను మిథునము
జన్మించెను. అందు భోగవతి నతఁడు విక్రముని కిచ్చెను. తన
రాజ్యము భోగుని కిచ్చెను. భోగవర్మకు కాలివర్మ జనించెను.
అతఁడు మహాకాలి కుత్సవములు సేయించెను. ఆమె ప్రసన్నయై
యనేకవిధములయిన పుష్పములకు నిలయమైన 'కలిక' (ఒక
మొగ్గను) సృజించి యిచ్చెను. ఆ పుష్పములచే నేర్పడిన
నగరమునకు 'కలికాతా' యను పేరు గల్గెను. (కలకత్తా
యున్న చోట) కలివర్మ కుమారుఁడు కౌశికుఁడు. తండ్రియంత
కాల మేలెను. వాని కుమారుఁడు కాత్యాయనుఁడు, తరువాత
హేమవతుఁడు, శివవర్మ, భవవర్మ, రుద్రవర్మ, భోజవర్మ
యనువారు వరుసగా నేబదియేండ్ల వంతునఁ బాలించిరి.
భోజవర్మ వనోద్దేశమున (వనమధ్యభాగమందు) భోజరాష్ట్ర
మను నొక రాష్ట్రమును నిర్మించెను. వానితరువాత గవవర్మ,
వింధ్యవర్మ, యనువా రేబదియేండ్ల వంతునఁ బాలించినవారే.
వింధ్యవర్మ తనరాజ్యమును దమ్మునికిచ్చి వంగదేశమున కేగెను.
వాని కుమారుఁడు సుఖసేనుఁడు, తండ్రియంతకాల మేలెను.
వానికుమారుఁడు బలాకుఁడు పదియేండ్లు వానితరువాత లక్ష్మ
ణుఁడు, మాధవుఁడు, కేశవుఁడు, సురసేనుఁడు, నారాయణుఁడు
శాంతివర్మ యనువారు పదియేండ్ల వంతునఁ బాలించిరి. శాంతి
వర్మ గంగాతీరమునందు శాంతిపురమును నిర్మించెను. వాని
కుమారుడు నదీవర్మ. అతఁడు గంగాదేవిచే వరముపడసి గౌడ

(ఒరిస్సా) రాష్ట్రమునందు 'నకీహా' యను నగరమును నిర్మించెను. ఆపురము వేదధర్మములకు నిలయమై గంగాదేవి పిలుపుచే రక్షింపఁబడిన యొకానొక విద్యాధరునిచే సంరక్షింపఁబడెను. నకీవర్మ యిరువది యేండ్లు పాలించెను. వాని నుండియే గంగావంశ మను ప్రసిద్ధమైన రాజవంశ మేర్పడినది. (గాంగవంశ మని పిలువఁబడుచున్నది) నదీవర్మ కుమారుఁడు, శార్ఙ్గదేవుఁడు అతఁడు బలశాలి, హరిభక్తుఁడు. అతఁడు గౌడదేశము(ఒరిస్సా)నకేగి శ్రీహరిధ్యానపరుండై పదియేండ్లు పాలించెను. వాని కుమారుఁడు గంగాదేవుఁడు ఇరువదేండ్లు పాలించెను. వానికుమారుఁ డనంగుఁడు గౌడదేశపతి యయ్యెను. వాని కుమారుఁడు రాజేశ్వరుఁడు. తరువాత నృసింహుఁడు, కలివర్మ, మహీపతి యను వారు పాలించిరి. (మహీపతి 2 వ పృథ్వీరాజు) జయచంద్రుని యాజ్ఞచే 'ఉర్వీమాయ' యను నగరము నిర్మించి యందు నివసించెను. చంద్రవంశజులయిన రాజులందరు కురుక్షేత్రయుద్ధమునఁ జనిపోయిరి (మహమ్మద్ గోరీ యుద్ధమన్నమాట). అప్పుడు పృథ్వీరాజు మహావతియను నగరమునకు రాజై యుండెను. అతఁ డిరువదియేండ్లేలెను. అవ్వల 'సహోద్దీను' (సహాబుద్దీను) అను మహమ్మదీయునిచేఁ గురుక్షేత్రమున సుయోధనుని యంశమున జన్మించిన రాజు [illegible] నశించిరి. పరిహారుని కుమారుఁడు ఘోరవర్మ కలింజరపుర మేలెను. వాని సుతుఁడు శార్దూలుఁడు. ఆ శార్దూలుని వంశమువారు శార్దూలీయులని ఖ్యాతికెక్కిరి. మహామాయా శక్తి యనుగ్రహముచే శార్దూలీయుల రాజ్యము నలుమూలల

వ్యాపించెను. ఇంతవరకు నగ్నివంశరాజుల చరిత్ర సూర్యచంద్ర వంశరాజుల చరిత్రయును సకల పాపహరమయినది నీకుఁ దెల్పితిని. ఇంక మీఁద హరి స్వయముగా నెట్లవతరించెనో యది తెల్పెద నని సూతుండు భృగుమునితోఁ బల్కెను.

## —: ౬ అ. వైవస్వతమన్వంతర ప్రారంభ చరిత్ర :—

అవ్యక్త జన్ముఁడగు బ్రహ్మకు మధ్యాహ్నము కాఁగా, చాక్షుషమన్వంతరమున మహావాయువు విసరెను. అయ్యెడ హిమగిరికూడ కంపించెను. సప్తద్వీపములు, సముద్రములు కలిసి యొకే జలమయములయ్యెను. భూమి యా జలప్రళయమున మునింగెను. వేయియేండ్లయిన తరువాత విష్ణుమూర్తి శివునితో, బ్రహ్మతోఁగూడి శింశుమార చక్రము నాకాశమున యథానుకూలము సరిచేసెను. అనగా నాయా గ్రహములను నక్షత్రమండలమును నుండవలసినస్థితిలో నుంచెను. అటుమీఁద జ్యోతిశ్చక్రములచే భూమియంతయు నెండి గట్టిపడెను. అవ్వల బ్రహ్మముఖమునుండి సోముని ద్విజులకందరకు రాజుగా సృజించెను. అతఁడు సర్వవేద విశారదుండయ్యెను. భుజములనుండి క్షత్రియరాజగు సూర్యుని రాజనీతివిశారదునిగా సృజించెను. తొడలనుండి వైశ్యరాజుగా రత్నాకరుఁడగు సముద్రుని బుట్టించెను. పాదములనుండి విశ్వకర్మను దక్షుఁ డనుపేర శూద్రరాజుగా జనింపఁజేసెను. సోమునివలన బ్రాహ్మణులు, సూర్యుని వలన రాజవంశజులు, సముద్రమువలన వైశ్యులు, దక్షునివలన శూద్రులును గల్గిరి. సూర్యమండలమందుండి వైవస్వతమను వుదయించెను. అతని రాజ్యకాలము డెబ్బదియొక్క మహా,

యుగముల కాలము. అయ్యెడ భగవంతుఁడగు విష్ణువు విశ్వరూపావతారము ధరించెను. అందు పూర్వార్ధమున [illegible] పరార్ధమున వామనుఁడని, కృతయుగమున బాలుఁడయి యుండెను. కృతయుగమునం దప్పుడు జనుల యాయుర్దాయము నాల్గువందలయేండ్లు. పూర్వార్ధమందు సంభవించిన హరి త్రేతాయుగమున [illegible]మునుండెను. అప్పుడు మానవుల [illegible] మూఁడువందలు. ద్వాపరమున హరి వార్ధక[illegible]ను. అయ్యెడ జనుల [illegible] రెండువందలు. కలియందు విశ్వరూపుఁడు [illegible]. అయ్యెడ నరులయాయువు వందయేండ్లు మాత్రమే. [illegible] నే కొలదిమంది ధర్మవరులకొఱకు [illegible]. మహాయుగ పరార్ధమున [illegible] మహాశ్వా[illegible]ముడునై గరుడునెక్కి విశ్వ[illegible]ముచేయువాఁడై త్రియుగస్వరూపుడై విహరించెను. [illegible]మున వామనుఁడు త్రియుగస్వరూపుడై శ్వేతవర్ణుడై కృతయుగమున హంసనామమున ప్రవర్తించెను. త్రేతాయుగమున రక్తరూపుఁడై యజ్ఞుఁడను పేర నలరెను. ద్వాపరమునఁ బీతరూపుడై స్వర్ణగర్భుఁడై యుండెను. కలికాలము రాబోవుతఱి ద్వాపరయుగ సంధ్యాకాలమున వామనుని కళ యంతయు నేకీభూతమై దేవకీగర్భమున నుదయించెను. అతఁడు వసుదేవుని కుమారుఁడై మధురయందావిర్భవించుతఱి బ్రహ్మాదిదేవత లాదేవుని వినుతించిరి. అయ్యెడ స్వామి ప్రసన్నుఁడై దేవతలతో దేవహితమునకు దైత్యనిధనమునకు నేనవతరింతును, కలియుగమందును బహువిధ

ము..ల వ్యాపింతును, భూమిపై బృందావనము నా దివ్యధామము ...సాక్షాత్స్వరూపము. అందు నేనురహస్యక్రీడ లొనరింతును. వేదములన్నియు గోపికలయి నాతో గ్రీడించును. కలియుగాంతమున నేను రాధాదేవి ప్రార్థనము ననుసరించి బృందావన ... రహఃక్రీడను సమాప్తి సేసి 'కల్కి'గా నవతరింతును. ... యుగాంతప్రళయ మొనరించి రెండుమూర్తులు ధరించి కృతియుగమున సత్యధర్మ ప్రవర్తకుండనయ్యెద అనిన విని ... వారలందరు సంతోషించిరి. అద్భుతచర్య కల హరి యొక్క యీ యాట యుగయుగ మందు నిట్లే జరుగుచుండును. విష్ణుభక్తులే విశ్వాంతర్యామియై వర్తించు నవ్విష్ణువును దెలిసి కొనఁగలరు రాజునకు దాసులయినవారు తమరాజుయొక్క గౌరవమును గుర్తింపనేర్తురుగాని తదితరులు తెలియనేర్తురా? విష్ణువాంఛానుసారము సనాతనియగు విష్ణుమాయ వివిధలోక రచన నొనరించును. ఆమహాకాళియే సర్వమును గాలమయ మొనరించి యూ వెనుక తానే మ్రింగి మహాగౌరియనంబడును. అట్టి విష్ణుమాయాశక్తియగు మహాకాళికి నమస్కారము. అమ్మా! భయభ్రాంతులగు మమ్ము దయచూడుము.

6 అ. అవ్వలిరాజులను దెలుపుమన మహర్షి యిట్లు తెలుపఁ బొడంగెను. పైశాచుఁడగు కుతుకోద్దీను (కుతుబుద్దీను) అను వాడు ఢిల్లీరాజయి యాదవులచేఁ బాలింపఁబడు బలిగఢము స్వాఁదికిదండెత్తెను. (శహాబుద్దీను తరువాతబానిసవంశము వాఁడగు కుతుబుద్దీను రాజయ్యెను) వాఁడు వీరసేనుని పౌత్రుఁడగు ...

...నుచు పయనించి [illegible] నాక్రమించెను. వాని కాలములో నానా దేశరాజులు నేకమయి వానిని జయించిరి. అటుపిని శహాబుద్దీను వెలికివచ్చి శత్రురాజులను జయించి 'మూర్తిఖండము' అను రాజ్యభాగమును స్థాపనజేసెను. వాని తరువాత మ్లేచ్ఛులు ముగ్గురువచ్చి వరుసగా నైదు, ఆఱు, ఏడు సంవత్సరములు పాలించి చనిపోయిరి. నేను మొదలుగ నొక శతాబ్దములో మ్లేచ్ఛరాజులు దేవతీర్థ నాశనమొనర్చి స్వల్పాయుష్కులై [illegible] పోయిరి. కాన ఋషులారా! మీ రందఱు విశాలానగరమునకు నాతోఁ గూడరండు. అని సూతుండు తెలుపగా మును లందరు నతనితో హరిస్మరణము చేయుచు విశాలానగరమునకేగి సమాధినిష్ఠులై హరిధ్యాన పరాయణులైరి. [illegible] శతాబ్దములో బ్రహ్మలోకము కలదు. అని చెప్పి వ్యాసభగవానులు 'ఇంత వరకు రాఁబోవు చరిత్రను యోగాభ్యాస బలముచే సమ్యక్ ముగాఁ దెల్పితిమి. ఇంకేమి వినగోరెద'వన మను విట్లనియె. ఓ వేదతత్త్వజ్ఞ! భగవంతుఁడా! నీవు సర్వలోక శివంకరుఁడవు. నేను మాయాసంభవుఁడను. తాము వేదసంభవులు. నాజ్ఞానము సర్వము నవిద్యచే నావరింపఁబడి యున్నది. అందుచే నే ననేక జన్మములంది లోకమునకు వచ్చితిని. పరబ్రహ్మయే కృపతో నదృష్టవంతుని నన్ను గని స్వయముగా వ్యాసరూపము దాల్చి దయచేసెను. మునీంద్రుఁడగు నా వేదవ్యాసునకు నవిద్యామోహాభావములను దొలగించి రక్షించు స్వామికి నమస్కారము. అవ్వల సూతాదు లేమి యొనరించిరో యది యెల్ల తెలుపుము. అన వ్యాసుం డిట్లనియె. బ్రహ్మాండగోళముస

[illegible]లోకములన్నియు [illegible] యున్నియు నీదేహమునందున్నవి. [illegible] రూపమున నిండియున్నది. ఆత్మ యణువుకంటె సూక్ష్మ[illegible] జ్యోతిస్స్వరూపుడై [illegible] గలడు. ఇంద్రియములైదు, మనస్సు [illegible] విషయములు నైదు, జ్ఞేయుడగు జీవు డీశ్వరగుణబంధి [illegible] గుణాకర[illegible]మున నున్నాడు. జీవులకెల్ల సుఖకరుడగు శంకరు డీశ్వరుడై యుత్పాదకర్తయై యున్నాడు. బుద్ధి, మనస్సు, విషయములు, ఇంద్రియములు, అహంకారము నని [illegible] విధ తత్త్వములై యున్నవి. ఈశ్వరుడే నారాయణుడు. అతడే సనాతనుడగు మహాదేవుడు. కాని శంకరునిచే నతడు మోహితుడై యున్నాడు. అతడొక్కడయ్యు త్రిగుణము లను పాశములచే బంధింపబడి బహురూపకుడైనాడు. అతడు మహాకల్పముల రూపమున కాలరూపుడై యున్నాడు.

—: మహాకల్పములు :—

శివకల్పము, బ్రహ్మకల్పము, విష్ణుకల్పము, ననునవి మూడును నీశ్వరుని త్రినేత్రములు. బంధకల్పము, వాయు కల్పము, వహ్నికల్పము, బ్రహ్మాండకల్పము, లింగకల్పము నను నైదును నయ్యీశ్వరుని పంచముఖములు. భవిష్యకల్పము, గరుడము, భాగవతము, మార్కండేయము, వామనము, నృసింహము, వరాహము, మత్స్యము, కూర్మము, ననునవి జ్ఞానస్వరూపుడగు మహేశ్వరుని భుజములని బుధు లందురు. అవ్యక్తజన్ముడగు బ్రహ్మయొక్క పదునెనిమిది దినములు నీ పదునెనిమిది కల్పములయియున్నవి. ఇవే విలోమముగా (చివరి

నుండి మొదటికన్నమాట) నడచినపుడు మరల పదునెనిమిది
మహాకల్పము లగును. బ్రహ్మ స్థూలముగను సూక్ష్మముగను
రెండు విధములయి యున్నాఁడు. స్థూలమయినపుడు సగుణిగను,
సూక్ష్మమయినపుడు నిర్గుణముగాను నా బ్రహ్మతత్త్వమున్నది.
సగుణుఁడైనపుడు 'విరాట్టు' అనఁబడును. అతఁడే విష్ణునాభి
కమలమందుదయించినవాఁడు. నిర్గుణుఁడయినపుడు 'స్వయం
భువు' అనఁబడును. అతఁడవ్యయుఁడు, అవ్యక్తజన్ముఁడు. సగుణ
బ్రహ్మకే నూఱేండ్లాయుర్దాయము కాలనిర్ణీతమయి యున్నది.
ఒకలక్ష తొంబదివేల మనుష్య సంవత్సరము లావిర్భవించిన కొక
పగలు. నిర్గుణుఁడు కాలమునకుఁ బరుఁడు. అవ్యక్తమనగాఁ బ్రకృతి.
దానికిఁ బండ్రెండంగములు కలవు. అవి ఇంద్రియములు.
ఇంద్రియముల విషయములు, మనస్సు, బుద్ధి యనునవి. అవ్యక్త
ముకంటెఁ బరమైన బ్రహ్మము సూక్ష్మజ్యోతి. అదియవ్యయము.
అది వ్యక్తస్థితినందినపుడు 'అవ్యక్తజన్మ' యని పిలువబడును. ఏ
యోగినూఱేండ్లుసమాధినిష్ఠసాధించునో వానిమనసు సూక్ష్మమైన
గాలివలె బ్రహ్మపదమున కెగిరిపోవును. ఆస్థానము సత్యలోకమని
పిలువఁబడును. అది సనాతనము. అదియోగముచే నందఁదగినది.
సమాధినిష్ఠులగు మునులట కేగుదురు. అచట నొక క్షణమున్న
మునులకు భూలోకము లెక్కలో లక్ష సంవత్సరము లయ్యెను.
అవ్వల మఱల వారు శరీరము నందుదురు. అట్లు పొంది కన్ను
తెఱచునంతలో వారికి బ్రహ్మయొక్క ద్వితీయాహ్నికము
ప్రాప్తించెను. వారు చూచునప్పటికి మనుజులు పశుతుల్యులై
యుండిరి. వారి కపుడవి యోగ్యతకంటె నాయువు లేకుండెను. బాటస

స్త్రీలంత నాడస్ప్రంచిరి. వర్ణములు సంకరములయ్యెను. వేదము చెడుటగా ధర్మలక్షణములు కానిపించెను. అందరు మ్లేచ్ఛులు నాస్తికులయి పోయిరి. సర్వవేదములు సర్వతీర్థములు భూమండలమును విడిచి పోయెను. అవి గోపికారూపముదాల్చి హరితో రాసక్రీడోత్సవము నొనరించెను. పాషండులు బహుజాతీయులు, నానామార్గ దర్శకులయి కలిచే నిర్మితములయిన వర్ణములను వంచించిరి. ఇది చూచి మునులు రోమహర్షణుని సన్నిధికేగి ప్రాంజలులై స్తుతించిరి. అంతట నా సూతుడు యోగనిద్రను బాసి కల్యాఖ్యానమును మునుల కెఱింగించెను. ఆ యంశము తెలుపుచున్నాను వినుము.

—: తిమిరలింగుని చరిత్ర. (తైమూర్ లంగ్) :—

సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా! ద్వాపరము తరువాత లక్షసంవత్సరములలో జరిగిన వృత్తాంతము చెప్పుచున్నాను. వినుడు. ముకులవంశము వాడైన పిశాచకుడను మ్లేచ్ఛరాజు తిమిరలింగుడనువాడు మధ్యదేశమునకు వచ్చెను. వాడార్యులను మ్లేచ్ఛులనుగూడ జయించి కాలరూపుడై దేహలీనగరము నందలి యందఱి రాజులను జంపెను. మఱియు నార్యదేశ వాసులయిన విప్రుల బిల్చి "మీరు మూర్తిపూజకులు మీరు నిర్మించిన మూర్తి మీకు కూతురువంటిది. అట్టి సాలగ్రామ శిలామయ మగున యీ మూర్తిని మీరు పూజించుటయే మిన్యాయము? మీరు పఠించు వేదములు సకలశాస్త్రములు లోకమును వంచించుటకు మునులు పనిలేక కల్పించినవి. మీరు తెలుపు విష్ణువు భగవంతుడు కాడు." అని చెప్పి వారిని

బలాత్కారముగ నగ్నిలోనికిఁ ద్రోసెను. వా రారాధించు సాలగ్రామము లన్నిటిని మూటలుగట్టి యొంటెలమీఁదఁ దో లించుకొనిపోయి తైత్తిరము అను దేశమున నొకకోట గట్టికొని. యందా సాలగ్రామములచేఁ దన సింహాసనమునకు మెట్లు గట్టించుకొనెను. అంతట దేవతలందఱు దుఃఖితులై ప్రభువగు నింద్రునికడ మొఱపెట్టుకొనిరి. అతఁడిదంతయు విని బలిచక్రవర్తి చేసినపనిగా నెఱింగి వజ్రాయుధముగొని తైత్తిర దేశముపై నై చెను. ఆ వజ్రాఘాతమున తిమిరలింగుఁడు వాని సభలోని వారును జచ్చిరి. అటుపై విద్వాంసులా సాలగ్రామములనన్నిటిని గొని గండకీనదిలోనికి విసరివైచి స్వర్గము నందిరి. ఇంద్రుఁడవ్వల దేవతలతోఁ గలిసి దేవపూజ్యుఁడును గురునితో వేదధర్మ నాశనముచేఁ గలిలోఁ గలుగఁబోవు కష్టములను జెప్పికొనెను. అంతట బృహస్పతి గౌడదేశమున గంగాతీరమందు శాంతిమయి యను పురమున బ్రాహ్మణుఁడనై యవతరింతును, నీవును బ్రాహ్మణాకృతిదాల్చి యచటికి వచ్చి దేవకార్యము నిర్వహింపుమని తెల్పెను. అంతట నింద్రుఁడు గురువాక్యానుసారమేకాదశరుద్రులతో నష్టవసువులతో నశ్వినీదేవత లిద్దఱితోఁ బ్రయాగ యను తీర్థమునకు వచ్చి మాఘమాసమున మకర రాశిలో నుండగా సూర్యభగవాను నర్చించెను. అయ్యెడ బృహస్పతి యింద్రాదులకు సూర్యమహిమ పండ్రెండధ్యాయముల కథగాఁ దెల్పెను.

## —: 7 అ. సూర్యమహిమ–ఈశ్వరపురియను భక్తుని జన్మవృత్తాంతము (బృహస్పతి యిందునికుఁ జెల్పుట) :—

బర్హిష్మతీపురమున ధాతృశర్మయను విప్రుఁడు సంతానార్థియై ప్రజాపతింగూర్చి తపమొనరించి మెప్పించెను. అయి దేండ్లకుఁ బ్రసన్నుఁడై బ్రహ్మ కుమారుని కన్యను మరల నొక కుమారుని నొసంగెను. వారికి వివాహములగుటకు గంధర్వరాజగు తుంబురుని దపంబుచేసి మెప్పించి యిష్టసిద్ధి వడసెను. అవ్వల నల్లుడు కూతురు విహరింపగాఁ జూచి సంతసించి వారికి నూతనాంబరాభరణాదులు సమృద్ధిగా లభింపఁజేయ నెంచి యక్షమయియగు నొక విద్య నుపాసించెను. అందువలన స్వర్ణలాభము గల్గెను. ఇంతలో నతనికి మరణ కాల మాసన్నమై రోగవశుండయ్యెను. రోగశాంతికై శంకరు నర్చించెను. హరు ననుగ్రహ మంది చైత్రమాసమున భానువార వ్రతములచే సూర్యునారాధించి సాక్షాత్కరింపఁ జేసికొని యిట్లు నుతించెను. ఓసూర్యదేవ! ఈశరీరమందున్న మనస్సునకు ప్రియమైన ప్రవృత్తి నివృత్తి రూపములయిన రెండవస్థలు నీవలన నేర్పడును. త్రిగుణశక్తులకు నీ వాధార భూతుఁడవు నాకు మోక్షము దయచేయుము అనిన భానుదేవుఁ డిట్లనియె. మోక్షము నాల్గు విధములు అందు సాలోక్యము, తపస్సాధ్యము. సామీప్యము, భక్తిసాధ్యము. సారూప్యము ధ్యానసాధ్యము. సాయుజ్యము, జ్ఞానైక గమ్యము. వానికి స్వామి పరమాత్మ. సగుణుఁడు, నిర్గుణుఁడు, జ్ఞేయుడు ఆనందరూపుఁడు నని యీ నాల్గువిధము లగు మోక్షములకు నాల్గు విధాల నుపాస్యుఁడై యున్నాఁడు.

దేవతలు కూడ తిరిగి [illegible] వలెనుండ వారే. [illegible] యొక్కడే తిరిగినారు. అతని [illegible] మే విష్ణుపదము. [illegible] మను కాలము మోహము [illegible]. అప్పుడు సూర్యదేవు డంతర్ధాన మందెను. బ్రాహ్మణుడు [illegible] ముక్తి నందెను. ఇప్పుడు తనకథ తెల్పు చున్న బృహస్పతికి చైత్రమాసమున సూర్యుడు సాక్షాత్కరించి వంగదేశమున నాయంశతో దేవకార్యార్థ మవతరింతునని తన ముఖమునుండి తేజస్సును గ్రహించి తన భక్తురాలగు సు[illegible] యను బ్రాహ్మణభార్య కొసంగెను. అంతమున్న ము[illegible] ధాతృశర్మయను కావ్యకా[illegible] నా విప్రపత్నియం దవతరించెను. ఈశ్వర[illegible] యను పేరొందెను. అతడు మంచి వేదపండితుడు. [illegible] కథ వినుము.

—: రామానందుని కథ :—

మాయావతీపురమున మిత్రశర్మయను కావ్యవిద్యాపరుడు రసికు డొకడుండెను. నేను (గురుడు) కుంభరాశి యందుండగా గంగాద్వారమందు గొప్ప యుత్సవమయ్యెను. పెక్కుమంది రాజులు తీర్థయాత్ర కరుదెంచిరి. ఆ యుత్సవమున మిత్రశర్మ దాక్షిణాత్యరాజగు కామసేనుని కుమార్తెను బండ్రెండేండ్ల ప్రాయము దానిని కావ్యకలానిపుణురా లని యెఱింగి యామెను మోహించెను. చిత్రిణి యను పేరుగల యా రాజకుమారికయు మిత్రశర్మను వలచెను. అట్లు వలచి యా బాలిక యింటికేగి సూర్యు నారాధించెను. అతడును గంగాతీరమున వైశాఖమున భాను నారాధించెను. ఆదిత్య

హృదయ పారాయణ మొనరించెను. సూర్యానుగ్రహముచే వారిద్దరికిని వివాహము జరిగెను. వారు నూరేండ్లు ముదిమి యెఱుంగక శ్రమయనునది యేమో తెలియక యారోగ్య వంతులయి విహరించి రవిసామీప్య మందిరి. ఇకకథ విని యింద్రుడు సూర్యు నారాధించిన నతని రక్షింప భాస్కర స్వామి రామానందుఁ డను పేరఁ గాశీపురమునం దవతరించెను. రామానందుఁడు కన్యాకుబ్జవాసియగు దేవలుఁడను బ్రాహ్మణునికి జన్మించెను. అతఁ డా బాల్యజ్ఞాని. రామనామ పరాయణుఁడు. తల్లిదండ్రులను బాసి రాఘవుని శరణొందెను. చతుర్దశ కలాత్మకుఁడగు సీతాపతి యతని హృదయమందిరమున వసించెను.

## జ్యేష్ఠ మా స సూ ర్య ప్ర భా వ ము

—: నింబార్క చరిత్ర :—

ఇంద్రునితో బృహస్పతి యిట్లనియె. కృతయుగమునం దర్యమ యను బ్రాహ్మణుఁడుండెను. అతఁడు వేదవేదాంగ కుశలుఁడు. ధర్మశాస్త్ర పరాయణుఁడు. అతఁడు ధనార్థియై జ్యేష్ఠమాసమున సూర్యు నారాధించెను. ప్రభాతమున శ్వేత కుసుమ చందనాదులచేతను, మధ్యాహ్నమున రక్త కుసుమాదులచేతను సాయంకాలము పీతకుసుమాదులచేతను బూజించెను. ఇట్లొక నెల చేసెను. అంతట రవి యొకమణి నాతని కొసంగెను. ఆ రత్నమురొక్క మహిమచే దినదిన మొక కుంచెడు బంగార మతనియింట నుత్పన్నమయ్యెను. దానిచే నతఁడు వాపీకూప తటాకాది ప్రతిమలు కావించెను. వేయియేండ్లు సుఖముగా

ప్రతికి యతఁడు సూర్యలోకము వడసెను. అచట లక్ష్మియెంస్థుండి సూర్యరూపుఁడయ్యెను. అనిన విని యింద్రాదులు సూర్యు నర్చించిరి. సూర్యభగవానుఁడు ప్రత్యక్షమై సంబార్కుఁడను పేర సుకర్మనుఁడు ద్వాపరాంతమునఁ గృష్ణాజ్ఞచే నవతరించి ధర్మ గ్లానిని వారించును. అని తెల్పెను. నింబార్కుఁడు కృష్ణుని యాజ్ఞానుసారము మేరుదక్షిణ పార్శ్వమున సర్మదాతీరమున తైలంగకమను దేశమున నవతరించి నారదోపదేశము పొంది మధుర నైమిశము, ద్వారకపతి. సుదర్శనాశ్రమము మొదలయిన క్షేత్రముల వసించి సప్తపార్షులను పురాణపుల నుద్ధరించెను. సుదర్శనాశ్రమమున భృగువంశమునఁ బుట్టినవాఁడగు నరుణుఁడను వేద వేదాంగపారగుఁడగు బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు ఋషిరూప ధరుఁడు. అతని భార్య జయంతి. ఆమెయం దాతనిచే విష్ణుచక్ర సంభూతమగు దివ్యతేజము నుంచెను. జయంతి మహాపతివ్రత గావున నా దివ్యతేజమును దన గర్భమున ధరించి చంద్రునిచే రాణించు దిశవలె నెంతేని తేజరిల్లెను. కార్తికశుక్ల పూర్ణిమ యందు చంద్రుఁడు వృషభమందుండగా నైదు గ్రహము లుచ్చస్థములయియుండగా సూర్యాస్తమయ సమయమున మేష లగ్నమందు నింబార్కస్వామి యవతారము సేసిరి. ఈ విశ్వమున వారు వేదధర్మమును బ్రవర్తింపఁజేసిరి. ఒకప్పుడు బ్రహ్మ వారి యాశ్రమమున కేతెంచి "సూర్యాస్తమయము కాకుండ నాకు భోజనము పెట్టుము. మిక్కిలి యాకలితో వచ్చితిని" అనెను. వారట్లే పెట్టుదు మనిరి. అంతలోనే సూర్యాస్తమయము కాఁ జొచ్చెను. అదిచూచి యమ్మునిని నింబవృక్షముపై ( వేపచెట్టు

మీఁద ) దన ప్రభావసంపదచేఁ దేజస్తత్త్వమగు సుదర్శనమును (విష్ణుచక్రమును) స్థాపించిరి. అది సూర్యునట్లు వెలుంగుచు నాకులకాలము కానట్లు చూపిన బ్రహ్మ యాశ్చర్యమంది, విష్ణువేషధారియై యపరసూర్యునట్లు వెలుంగు నమ్మునిబాలునికి సాష్టాంగ దండప్రణామ మాచరించి బాగు బాగు ! నీ పూజకు సంతసించితిని. 'నింబార్కుఁడను' పేరు నీకు ప్రసిద్ధముగునని తెల్పి యనుగ్రహించి యంతర్థాన మందెను.

## —: 8 అ. మధ్వాచార్యులు :—

బృహస్పతి యిట్లనియె. దేవేశ్వరా ! మున్ను త్రేతా యుగమున శక్రశర్మ యను విప్రుఁడుండెను. అయోధ్య యతని నివాసము. అతఁడు దేవపూజాపరుఁడు. రుద్రులను, సూర్యులను, అశ్వినీ దేవతల నతం డర్చించెను. యజుర్వేదమయ మంత్రములచే నతని యారాధన జరిగెను. ముప్పదిముగ్గురు దేవతలు క్షుద్రగణములతోఁగూడి యాతని మనోరథము తీర్చిరి. అతఁడు పదివేలేండ్లు ముదిమి, రోగము నెఱుంగక యీ లోకమున సుఖించి శరీరమువాసి సూర్యుఁడయ్యెను. ఒక లక్ష యేండ్లతఁడు సూర్యమండలమం దధికారము సాగించెను. అవ్వల బ్రహ్మలోక మేగెను. అట నేఁబది వేల యేండ్లు విహరించెను. ఈ యంశము విని యింద్రుడు, భాస్కరు నర్చించి యాషాఢ పూర్ణిమయందు సూర్య సాక్షాత్కార మందెను. మఱియు బృందావనమున కలియుగమున నే నవరింతు ననియె. అట్లే రవి మాధవుఁడను విప్రునికి మధు వను పేర వేదమార్గతత్పరుఁడై

యవతరించెను. అతఁడే మధ్వాచార్యుఁడు. అతఁడు భుక్తి ముక్తి ప్రదమైన వైష్ణవశక్తి నొసంగి సంధురాతరంభాషణవిముఖులగు మానవులను భక్తిపరులను గావించెను.

## —: శ్రీధరస్వామి చరిత్ర :—

ద్వాపరమున మేఘశర్మయను జ్ఞాని యుండెను. ఆ బ్రాహ్మణుఁడు బుద్ధిమంతుఁడు, ధర్మపరుఁడు. వ్యవసాయ జీవనుఁడు. కృషిలబ్ధమైన ధనములో పదియవ భాగమును ప్రతి దినము దేవపూజాదేవ సమర్చనము లొనర్చెను. అతఁడు పదా నైదేండ్లవాఁడయి యుండగా శంతనుఁడు రాజయిన కాలము ననావృష్టి యయ్యెను. అతఁడున్న ప్రదేశమున కొక క్రోసు మేరలో వర్షము కురిసి ధాన్యము పైరుపండెను. మేఘశర్మ మాత్రమా రోజులలో నైశ్వర్యవంతుఁడై యుండెను. తక్కిన ప్రజలు రాజును శరణొందిరి. రాజు మేఘశర్మ నాహ్వానించి గురువుగా వరించెను. అతఁడు తేనితో 'పండ్రెండు లక్షలు సూర్యజపము చేయింపుము. శ్రావణపూర్ణిమయం దీ జపము జరుగవలెను. అనిన నా నృపతి యట్లే కావించి బ్రాహ్మణ సంతర్పణము కావించెను. సూర్యదేవుఁడంతట హర్షించి సువృష్టి గురిసి సస్యశ్యామలముగా నాతని రాజ్యము నొనర్చెను. శంతనుఁడంతట నే వృద్ధునినైనఁ గరంబునఁ దాకిన నతఁడు యువకుఁడగుచుండెను. అతఁడైదువందలయేండ్లు సుఖముగా జీవించి కాయమువాసి రవియై లక్షయేండ్లధికారమూని బ్రహ్మలోకమందెను. ఇట్లు తెలుపు బృహస్పతికి సూర్యదేవుఁడు ప్రయాగలో సాక్షాత్కరించి 'కలియుగమందు మ్లేచ్ఛరాజ్యమున

బృందావనమున నవతరించి దేవకార్యము నిర్వర్తింతును' అని తెలిపి శ్రీధరస్వామియనుపేర వేదశర్మకుఁ గుమారుఁడై జన్మించెను. శ్రీ మద్భాగవతశాస్త్రమున కాతఁడు పండితుల కొఱకై వ్యాఖ్యానము రచించెను.

—: వి ష్ణు స్వా మి క థ :—

గురుఁడిట్లనియె. కలియుగమున బ్రాంశుశర్మయను బ్రాహ్మణుఁడు వేదవేత్తయై దేవతాతిథిపూజ లాచరించుచుండె. అతఁడుఁ సత్యవాది. మహాసాధువు. స్తేయము హింస యెఱుంగనివాఁడు. దారపుత్రాదులఁ బోషించుకొన నతఁడు రాజుకడ భిక్షమడుగఁ బోగాఁ గలి బ్రాహ్మణుఁడై యచటికివచ్చి 'విప్రా! ఇదిగో! ఇది నా ప్రదేశము. చాలసుందరము. ఇందు వసించి సుఖింపుము' అనిన నా బాపఁ డాసపడి యా వాటికయందుఁ బ్రవేశించెను. కలి యా తోటలో రమ్యములయిన పండ్లు కోసి యాతనికి భుజింపుమని యిచ్చెను. ఇవి కలిందమను పండ్లు. నాతో నీ వారగింపుమని ప్రార్థించెను. అంత నా విప్రుఁడు విభీతకఫలమందును కలిందఫలమందును గలి యావేశించి యుండునని పండితులందురు. ఒకవేళ నీవు వీనిని నాకు భక్తి విశ్వాసములతో నిచ్చితివేని మంచిదే! సంతోషము. కాని వీనిని సాలగ్రామమునకు నివేదింపక తినను. సాలగ్రామము స్వయముగా బ్రహ్మరూపము, సచ్చిదానంద విగ్రహము. అద్దాని దర్శనమాత్రముచే నభక్ష్యమైన పదార్థమయినను, భక్ష్యమే కాగలదు. అనిన విని కలి నిరాశచెంది మిగుల

సిగ్గుపడెను. బ్రాహ్మణుఁడుమాత్ర మా పండు గ్రహించి క్షేమముగా మమును తెసరించి, ఆచటి రాజున కా ఫలము నొసంగెను. అంతట గలియే రాజుగనుండి యా బ్రాహ్మణుని గొప్ప లోహమయమయిన చెఱసాలయం దుంచెను. వారింశు శర్మ మఱునా డుదయమున సూర్యోదయము కాగా భాస్కర స్వామిని ఋగ్వేద మంత్రములచే నుతించెను. రవి సాక్షాత్క-రించి యా విప్రుని చెవిలో నాకాశవాణిరూపమున "విప్ర! హరి కాలస్వరూపుఁడు. విశ్వనాశమునకై యాతనిచే చతుర్యుగములు నిర్మింపబడినవి. కలికాలము విశ్వములను గబళింప నిర్మింపబడినది. కాని కలి వచ్చెను గాని విష్ణుమాయానిర్మిత మగు కలింజరపురము క్షేమము." అని యాతనికి రక్షకట్టి పంపెను. నూటయిరువది వర్షంబు లచట నతఁడుండి భార్యా పుత్రాదులతో భాను నర్చించి సూర్యలోక మందెను. అతఁడు భాద్రపదమున సూర్యుఁడై పదివేలయేం డ్లధికారము వహించి బ్రహ్మలోకముం గాంచెను. ఆతఁడే యిరువదియెనిమిదవ కలియుగమున స్వయముగా వచ్చి భాద్రపద పూర్ణిమనాఁడు కలింజరపురమం దవతరించెను. అతఁడు శివదత్తుని సుతుఁడు విష్ణుశర్మ యని ఖ్యాతికెక్కెను. అతఁడు వేదశాస్త్ర కలాభిజ్ఞుఁడు. వైష్ణవుఁడు ( విష్ణు భక్తుఁడు ) దేవభక్తుఁడు. విష్ణ్వాలయమునకుఁ జాతుర్వర్ణ్య ప్రజలను బిలిచి విష్ణువు సర్వప్రభువని తెల్పెను. మఱియు నాతఁడు విశ్వకారణము. చతుర్వింశతి తత్త్వాత్మకుఁడు. సాక్షాత్సచ్చిదానంద విగ్రహుఁడు. అతఁడు లోకరక్షణకు దేవతలను సృష్టించినాఁడు. అందుచే నతఁడే సర్వేశ్వరుఁడు,

ముఖ్య సర్వదేవతల నర్చించి పిమ్మట విష్ణునర్చింపవలయును.” అని ప్రబోధించెను. అది విని వారందఱు నతనిం గొనియాడి ‘విష్ణుస్వామి’ యని యాతని గొనియాడిరి.

—: వాణీభూషణుఁడు :—

వెండియు గురుఁ డిట్లనియె. చైత్రరథమను దేశమున భగశర్మ యను విప్రుఁడుండెను. అతఁడు మేధావి యను మునికి మంజుఘోషయందు జన్మించెను. అతఁడు బాల్యమందే తల్లి దండ్రులచే విడువఁబడి సూర్యు నారాధించెను. నూతేండ్లకు సూర్యమండలాంతర్గతియగు సావిత్రియను దేవత సర్వ సూర్యులకు సూర్యుడయినవాని జననియు, నా సూర్యమండలముయొక్క కుమారియు నయిన యామె యాతనితపమునకు మెచ్చి ప్రత్యక్ష మయ్యెను. ఆశ్వయుజ మాసమున సూర్యమండలమున కధిపతిగా నాబ్రాహ్మణు నొనరించెను. లక్షవేల సంవత్సరము లత డాశ్వయుజమాసములం దన్నింట మండలాంతర్వర్తియై వెలుంగుచు లోకవాసు లందఱి పూజ లందుకొనెను. కాన ‘దేవేంద్రా! నీవు సూర్యు నారాధింపు’ మన నట్లొనరింప సూర్యుఁడు ప్రత్యక్షమై దేవతలతో “కాన్యకుబ్జ దేశమున వాణీభూషణుఁడను పేర సత్యదేవుని కుమారుఁడనై జనింతును.” అని యట్లే యవతరించి మాంసభక్షకులయిన పాషండులను నాస్తికులను జయించి ఛందోగ్రంథ మొకటి రచించెను. లేళ్ళు, మేకలు మొదలగు వానిం జంపి తినువారును మత్స్యభుక్కులు నొకచోఁగూడి యాతనితో శాస్త్రార్థము చేసిరి. వారందరు నధర్మమిత్రుఁడగు కలిరక్షణలోనున్నవారు. వారి నందఱిని విష్ణుభక్తుఁడగు వాణీ

భూషణుండు నైష్ఠికి యగు శిష్యుని తన సుఖమానుండి రక్షించి వారి నోళ్ళు కట్టివేసెను. మరియు వారిని బ్రతికించెను. అంతట వా రాశ్చర్యపడి యాతనికి శిష్యులై ప్రస్తవముల ప్రకారము చేసిరి.

## —: భట్టోజి దీక్షితులు :—

వెండియు బృహస్పతి యిట్లనియె: కాశీనగరమున 'దేవయాజి' యను నుత్తమభక్తుడు, వేదపారాయణుండగు బ్రాహ్మణుండుండెను. వానికొక కొడుకు పుట్టి, పుట్టగానే మృతినొందెను. అంత నా బ్రాహ్మణుండు సూర్యు నారాధించెను. అంతట నా బాలుఁడు బ్రతికి వివస్వంతుడను పేరొందెను. పదునారు సంవత్సరముల యీడువచ్చునప్పటి కాతడు సర్వవిద్యాసంపన్నుడై సంతానము గాంచి సూర్యవ్రత మాచరించెను. శివరాత్రినాడు వాని భార్య భూషణములన్న మక్కువగలది సుశీల యనునది భర్తృసేవ కేతెంచెను. అతఁడు శివవ్రతపరుఁడై కూడ యా సుందరినింగని మోహావశుఁడై యా శివరాత్రియందు బలాత్కరించి యామెతో విహరించెను. ఆదోషమున వాఁడు కుష్ఠురోగి యయ్యెను. ఒకమహానుభావు నుపదేశముచే నతడు సూర్యోపాసనచేసి యారోగమునుండి విముక్తిగాంచెను. ఆదిత్యహృదయ పారాయణ మొనర్చి యాతఁడు మన్మథ సుందరుఁడయ్యెను. ఇంతమున్ను వనితలచే నసహ్యించుకొనఁబడిన యాతఁ డిపుడు వారిచేఁ బ్రార్థింపఁబడుచుండెను. కాని యాతఁడు బ్రహ్మచర్యవ్రతమూని బ్రహ్మధ్యానపరుండయ్యెను. శతాయువై జ్ఞానియై నీరోగియై సుఖించి కొంతకాలమునకు

కాలవశుఁడై సూర్యమండలముఁ జేరెను. కార్తికమాస సూర్యుఁడై లక్షయేండ్లు రాజిల్లెను. ఈ మాటవిని యింద్రుఁడు మాసమాత్రము సూర్యునర్చించి పూర్ణిమనాఁడు సూర్యసాక్షాత్కారము వడసెను. రవి యాతనింగని 'నేను దేవకార్యము నిర్వర్తించెద, విద్వాంసులగు భట్టులు ధూర్తులై సూత్రపాఠము ఖండించిరి. ధాతుపాఠము పఠింపఁ బడుటలేదు. స్వరవర్ణము భ్రష్టమైనది. ఆ భట్టు 'పాషండుల జయించి వేదము నుద్ధరింతును' అని యాతఁడు కాశికేగి వేదశర్మయను విప్రుని గృహమున దీక్షితులవంశమున కార్యగుణుఁడను పేర నవతరించెను. పండ్రెండవయేడు వచ్చునంతకు సర్వశాస్త్ర విశారదుఁడై శివారాధన మొనర్చెను. మూడేండ్లలో విశ్వనాథుఁ డతనికి ప్రత్యక్షమై యుత్తమ జ్ఞాన మొసంగెను. ఆ జ్ఞాన ప్రభావముచే వ్యక్తావ్యక్తమయిన సర్వము హృదయగోచరమయ్యెను. అవ్యక్తవిషయమైనబుద్ధి ద్వాదశాంగ ములుగలవిద్య. అహంకార రూపమై వ్యక్తవిషయకమైన బుద్ధి అజ-అవిద్య యనుపేరునఁ బదునాఱంగములుకల విద్యయై యున్నది. అవ్యక్తము పరబ్రహ్మము. వ్యక్తము శబ్దమయము. అహంకారము లోకకారణము. అది వ్యక్తము. అష్టాదశాంగకము. అది నందివాహనము. వృషరూపధరమని పండితులచే వర్ణితమైనది. దానికి నాల్గు శృంగములు, మూఁడు పాదములు, రెండు శిరస్సులు, సప్తహస్తములు త్రిధాబద్ధము. ఆ నంది వాహనమునకు సుబంతము తిగంతము కృదంతము అవ్యయము నని రెండురెండుగా గూడి మొత్తము నాల్గుకొమ్ములు. భూతభవిష్య

వ్యత్తమానములు మూడుపాదములు. సాక్షి యోగసాక్షియును రెండుకొమ్ములు శిరస్సులు. కర్త, కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, సంబంధము, అధికరణము నను నేడును భుజములు. స్వరాన్వితము వాక్యమనంబడును. విభక్త్యంతము పదమని యెఱుంగ నగును. వాక్యము, పదము నను రెండిటిచే నావృషభము బద్ధమయియున్నది. దానిమీఁద నిత్యము నున్నది యవ్యక్తము లింగరూపి. ఆ వృషభశృంగములు రెండింటినుండి జనించిన యహంకారమే హరి. అతఁడే నారాయణుఁడు. షోడశాత్మకుఁడు, బహుమూర్తి అమూర్తియు. ఇట్టి జ్ఞానమును హృదయమందుఁ గని సిద్ధాంతకౌముది రచించి పాషండులగు భట్టుల జయించి భట్టోజి దీక్షితుఁ డను ఖ్యాతినందెను.

—: వరాహ మిహిరాచార్యులు :—

బృహస్పతి యిట్లనియె. రమ్యమగు కాంచీపురమున మునుపు సత్యదత్తుఁ డను వేదపరుఁడైన రాజునొద్ద నొక గణకుఁడు (జ్యోతిషికుఁడు) బ్రాహ్మణుఁ డుండెను. 'అతఁడు రాజుతో ఇది యభిజిన్ముహూర్తము. పుష్యమి నక్షత్రము. 'రాజా! ఇపుడు బహువృత్తికరముగా బంగారమును సేకరింపుము' అనెను. రా జదివిని డిండిమము వాయించి యిట్లు చాటింపఁజేసెను. వైశ్యులు బంగారమును వెలపెట్టి కొనలేనియెడల 'నేనది కొనెదను, ఎంతబంగారమైనను నేను గ్రహింతును. ఇది నిజము' అంతట శూద్రులు సేకరించిన బంగారమంతయు వైశ్యులు కొని నిలువఁ జేసిరి. ఒకప్పుడు లోహకారుఁడు దరిద్రమును (పేదరికమును)

లోహరూపమున గొనివచ్చి దానికి నూరు బంగారునాణెము లిమ్మని రాజును యాచించెను. రాజట్లే యిచ్చి యా లోహమూర్తియైన దారిద్ర్యము నింటికిఁ దెచ్చెను. అర్ధరాత్రమున జీకటిలో కర్మ ధర్మరూపములు రెండును రాజగృహమునుండి చూచుచుండగనే తొలగిపోయెను. అనంతరము సత్యపురుషుఁడు రాజుతో దరిద్రరూప పురుషుఁ డెచ్చటనుండునో యచట కర్మ పరులుండరు. కర్మము లేనపుడు ధర్మముకూడ భూతలమునందు స్థిరముగానుండదు. ధర్మము లేనియెడల లక్ష్మి యెన్నఁడును శోభింపదు. నేను లక్ష్మి లేనిచోట నెప్పుడు నుండను. ఇట్లు పలికి వెళ్లిపోవనున్న సత్యపురుషుని జేత పట్టుకొని వినమ్రుఁ డయి, రాజు 'దేవా! నన్ను విడిచి పోఁదలచితివి. ఇట్లు చేయ వలదు' అనెను. అతఁడంగీకరించి యతనియింటనే వసించెను. పిమ్మట లక్ష్మియు వెడలిపోనున్న నామెనుగూడ ప్రార్థించి రాజాపెను. అంతట జ్యోతిషికుడగు పురోహితుని బిలిచి యీ జరిగినదెల్ల దెలిపి యాతనికి లక్షబంగారము నొసంగెను. అంతట నతనికిఁ గుమారుఁ డుదయింపగా వాని జన్మోత్సవమున సర్వ ధనము వ్యయించెను. అవ్వల మార్గశీర్షమున పూర్ణిమను సూర్యు నారాజకుమారుఁడు సేవించి మోక్షమందెను. కాన నీవును మార్గశీర్షమున రవి నర్చింపుమన నింద్రుఁ డట్లు సేవించెను. అంతట సూర్యభగవానుఁడు ప్రత్యక్షమై 'యుజ్జయిని యందు రుద్రపశువను వాని యింట మిహిరాచార్యుఁడ నను పేర జ్యోతిశ్శాస్త్రప్రవర్తకుఁడనై యవతరింతు' నని తెల్పెను. తెల్పి నట్లే మూలగండాంతమున నభిజిద్యోగమున జన్మించిన నాశిశు

వును తల్లిపెట్టెలోనుంచి తండ్రి నదీమధ్యమున వదలెను. ఆపెట్టె సముద్రమునకుఁ బోయెను. అచట రాక్షసస్త్రీలు దాసంగా పాడిరి. అతఁడు లంకకుఁ జేరి యచట జ్యోతిశ్శాస్త్రము నధ్యయనముచేసెను. జాతక ఫలితము మూకప్రశ్నములు మొదలయిన భాగము లాతఁ డామూలాగ్రముగ నేర్చి లంకాధిపుడగు విభీషణుని దర్శించెను. 'భక్తాగ్రణీ! హరిప్రియ! నమస్కారము. రాక్షసస్త్రీలచే సంరక్షితుండనై నేను మిమ్ము శరణొందితిని.' అనిన విని విభీషణుఁడు విష్ణుభక్తునిగా నాతనిం గ్రహించి యతని నాతని జన్మభూమి కంపెంచెను. మ్లేచ్ఛులు నాశనము చేసిన వేదాంగజ్యోతిషమును మూఁడువిధములయి యున్న దానిని బునరుద్ధరించెను.

—: ౯ అ. ధన్వంతరి :—

ఇట్లు బృహస్పతి దేవతలకు నింద్రునకుఁ దెలిపి ప్రయాగ క్షేత్రమున వెండియు నిట్లనియె. సూర్యుఁడు హరునాజ్ఞచేఁ బ్రతిష్ఠానపురమునఁ ద్రేతాయుగము చివర జన్మించెను. ఆ కథ తెల్పెద వినుండు. సింహలద్వీపమునఁ బరీక్షితుండను రాజు వేద ధర్మపరుఁడు, దేవతాతిథి పూజకుఁడు నగువాఁ డుండెను. వానికి భానుమతియను కన్యక యుండెను. ఆమె సూర్యవ్రతపరాయణ. దినదినము మధ్యాహ్న సమయమున సూర్యదేవుఁ డామె నివేదించు భక్ష్యము నారగించువాఁడు. ఆమె యొక భానువారమున సాగరస్నానమున కేగెను. నారద మహర్షి యామెందరి నొంటరిగా సముద్రమున స్నానము చేయుచుండగాఁ జూచి యామె చీత

పట్టుకొని సప్రేమముగా 'సుందరి! నన్ను చేఁబట్టుము. నీ చూపు లకే వశీకృతుఁడనైతిని' అనెను. కుమారి యదివిని నమ్రముఖయై 'దేవర్షీ! నేను గన్యను. నీవు సుతునొసంగ గలవాఁడవు. స్వర్గ మండలమున దేవసుందరులు నిన్ను వలతురు. మేనక రంభ మొదలయిన వారెక్కడ! మనుష్యాంగన నేనెక్కడ? నవద్వారములుగల యీ దేహము దుర్గంధ భూయిష్ఠము. దేవసుందరుల శరీరము లిట్టితుచ్ఛములు కావు. అందుచే నీకు పెక్కునమస్కారములు' అనెను. విని సురముని సిగ్గుపడి శంకరునికడ కేగి సర్వము విన్నవించెను. లోకశంకరుఁడైన శంకరుఁడు తుష్టుఁడయియున్న వానింగా నమ్మనసి నెఱింగి తాను భాస్కరుని స్తుతించి ప్రత్యక్షము చేసికొనెను. ప్రభాకరుఁడు నారదుని శరీరమును నారోగ్యవంతము నొనర్చి శంభుని గని 'ప్రభూ! మఱి యేమియాజ్ఞ యిత్తువన శివుఁడు నీవు భూమిపై ద్విజుండవై జనించి యారాజు కూతురును జేపట్టుమనెను. సూర్యుఁ డట్లే కావించెను. సవిత భానుమతితోఁ గూడ తపముసేసి తిరిగి సూర్యలోకమున కేగెను. అతని నీవర్చింపుమన నింద్రుఁడు పౌషమాసమున సూర్యారాధన చేసి యనుగ్రహము వడసెను. అయ్యెడ భానుఁడు 'నేను కాశీ పురమున ధన్వంతరినై యవతరించి కలిచే రోగపీడితులగు మానవులను సంరక్షింతును. ఆవిధముగా దేవకార్యమును నిర్వహింతు'నని కల్పదత్తుఁడను విప్రునికిఁ గుమారుఁడై యవతరించెను. మఱియు నాతఁడు బ్రాహ్మణ వృద్ధులతోఁ గూడిన సుశ్రుతుఁడను రాజకుమారుని శిష్యుని గావించికొని కల్పవేదము రచించెను. రోగములు లేని శరీరము కల్పమనఁబడును. ఆ కాయ

కల్పజ్ఞాన మిందుఁ దెల్పఁబడినది నాకు ప్రీతికి కల్పవేదమను పేరు గల్గెను. ధన్వంతరి ప్రసిద్ధిగాంచెను. అతని దర్శన మాత్రము వనే కలియుగమున రోగశాంతి యగుచున్నది. ధన్వంతరి విరచిత మగు నా కల్పవేదమును సుశ్రుతాచార్యుడు పఠించి దానిపై నూరధ్యాయముల సుశ్రుత తంత్రమును రచించెను.

—: జయదేవుఁడు :—

మఱియు బృహస్పతి యిట్లనియె. మున్ను పంపాపురమున హేలియను బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు సూర్యోపాసకుఁడు అఱువదినాల్గు కళలయందు నిపుణుఁడు. దానను పత్యాలపూని వశ్రింగమును వృత్తిచే నతఁడు జీవించెను. మఱియు వస్త్రకళ, లోహకళ, చిత్రకళ, ధాతుమూర్తి నిర్మాణకళ, కాసుకళ (వశ్రింగము) నేర్చి యాచరణలో బెట్టి యైదువేల బంగారు నాణెముల సంపాదించెను. ఒక్కొక్కమాస మొక్కొక్క కళచే నిల్లు కూడఁబెట్టిన ద్రవ్యముచే సూర్యోపాసన చేయుచుండెను. ఆ యుత్సవము మాఘమాసమున జరుపుచుండెను. మాఘ మాసమున నధిష్ఠానమగు రవి విశ్వకర్మ యనుపేరఁ బరగు వాఁడు జ్యోతీరూపుఁడై వచ్చి పంపాపురముననున్న రమ్యమైన మొక్క స్తంభమునఁ బింబించెను. మధ్యాహ్న వేళ హేలి నివేదించు భోజనము నారగించి సర్వదేవమయుఁడగు నా భగవంతుడు త్రైలోక్యమునను గ్రహమున భావించెను. ఆ హేలి యను విప్రుడు ప్రాణములువాసి సూర్యుఁడై మాఘమున బ్రకాశము గల్పించుచుండెను. అతనిని నీవు భజింపు మన

నిందు్ౖరడు దేవతలలో విశ్వకర్మయను నా సూర్యదేవు
నర్చించెను. భానుమూర్తి వంగదేశమున బిల్వగ్రామమున
జయదేవుఁడనై కవి శిరోమణినై యవతరింతునని చెప్పి శందుకి
యను బ్రాహ్మణునియింట నవతరింతునని యట్లుసేసెను. ఐదేండ్ల
యీడుననే యితడు పితృమాతృ భక్తుఁడైయుండి పండ్రెండేండ్లు
వారికి సేవచేసెను. వారు చనిపోయి కుమారుఁడగు జయ
దేవుని చేఁ దృప్తులై గయాశ్రాద్ధము సేసిన ఫలమున స్వర్గ
మందిరి. జయదేవుఁడు విరాగియై యటఁ జరించుచు ముప్పది
యేండ్ల ప్రాయము నొందెను. అయ్యెడనే ఒక బ్రాహ్మణుఁడు
తనకుమార్తెను జగన్నాథస్వామి కంకితము సేసెను. పూజా
నంతర మనిరుద్ధుఁడు దారుబ్రహ్మమయుఁడునగు జగన్నాథుఁడు
స్వయముగ 'ఓ సత్యవ్రత ! జయదేవుఁడు నామూర్తి. నీ యీ
కుమారికను పద్మావతి నాతనికి నివేదింపుము' అనెను.
అతఁడును విరాగియైయున్న యా జయదేవునికిఁ దన కన్య
నర్పించి తనయింటి కేగెను. ఆ పద్మావతి యతనిం దన సుంద
రునిగా భావించి బెక్కేండ్లతని సన్నిధినే పరిచరించెను. అతఁడు
వేదాంగమగు నిరుక్తమును దృఢసమాధిలో రచించెను.
గవేంద్రాది శబ్దములయందు వర్ణాగమము, సింహశబ్దమందు వర్ణ
విధిపర్యయము (హింసయను పదము తారుమారుచేసిన సింహ
శబ్దమగునన్నమాట) షోడశాది శబ్దములందు వికారము.
పృషోదరాది గణమందు వర్ణనాశనము, మయూర భ్రమరాది
శబ్దములందు ధాతువుయొక్క వర్ణవికార వర్ణనాశనములచే
నగు యోగమునను నీ యైదువిధములయిన రుక్త ప్రక్రియలను

నిందు్రిడు దేవతలలో విశ్వకర్మయను నా సూర్యదేవు నర్చించెను. భానుమూర్తి వంగదేశమున బిల్వగ్రామమున జయదేవుడనై కవి శిరోమణినై యవతరింతునని చెప్పి శందుకి యను బ్రాహ్మణునియింట నవతరించునని యట్లుసేసెను. ఐదేండ్ల యీడుననే యితడు పితృమాతృ భక్తుడైయుండి పండ్రెండేండ్లు వారికి సేవచేసెను. వారు చనిపోయి కుమారుడగు జయ దేవునిచే దృప్తులై గయాశ్రాద్ధము సేసిన ఫలమున స్వర్గ మందిరి. జయదేవుడు విరాగియై యటు జరించుచు ముప్పది యేండ్ల ప్రాయము నొందెను. అయ్యెడనే ఒక బ్రాహ్మణుడు తనకుమార్తెను జగన్నాథస్వామి కంకితము సేసెను. పూజా నంతర మనిరుద్ధుడు దారుబ్రహ్మమయుడునగు జగన్నాథుడు స్వయముగ 'ఓ సత్యవ్రత ! జయదేవుడు నామూర్తి. నీ యీ కుమారికను పద్మావతి నాతనకి నివేదింపుము ' అనెను. అతడును విరాగియైయున్న యా జయదేవునికి దన కన్య నర్పించి తనయింటి కేగెను. ఆ పద్మావతి యతనిం దన సుంద రునిగా భావించి రెక్కేండ్లతని సన్నిధినే పరిచరించెను. అతడు వేదాంగమగు నిరుక్తమును దృఢసమాధిలో రచించెను. గవేంద్రాది శబ్దములయందు వర్ణాగమము, సింహశబ్దమందు వర్ణ విధిపర్యయము ( హింసయను పదము తారుమారు చేసిన సింహ శబ్దమగునన్నమాట) షోడశాది శబ్దములందు వికారము, పృషోదరాది గణమందు వర్ణనాశనము, మయూర భ్రమరాది శబ్దములందు ధాతువుయొక్క వర్ణవికార వర్ణనాశనములచే నగు యోగమునను నీ యైదువిధములయిన రుక్త ప్రక్రియలను

వలెఁడు నిర్వాచించెను. నాగవంశీయులగు శూద్రులు సంస్కృత
మర్యాదను భ్రష్టముగా జేసిరి. పునరుద్ధరించెను. ప్రాకృత
భాషాశాస్త్రజ్ఞులు కవిప్రియులుగు మహాత్ములు. వారిని జయించి
వారికి పరిశుద్ధమగు వ్యాకరణశాస్త్రమును రచించి యున్నాడు
ఒకనాఁడు దొంగలహృదయమున నివసించు ధూర్తుఁడగు
కలిపురుషుఁడు రాజొసంగిన యా శాస్త్రిమ్రాణిక్యమును కొల్ల
గొట్టి పద్మావతి పతివ్రతయగుట వలంచి యింటికిఁ బోయెను.
కలి యా వారిని హస్తములను పాదములను ఖండించెను.
పద్మావతి యొక్క నూతిలోఁ బడియున్న భర్తను గని దుఃఖించి
వెలువరించి పెక్కునెలల వాపోయెను. ఒకనాఁడు రాజు
వేటకై యటకు వచ్చి కాలుసేతులు లేని మునియగు నా
జయదేవుంగని కారణమడిగిన జయదేవుఁడు ‘నా యీ యవస్థకు
గర్మమే కారణము. మఱియెవ్వరునుగాదు.’ అనెను. ధర్మపాలుఁ
డను నా రాజువిని, యాతని భార్యతోఁగూడఁ బల్లకి నెక్కించు
కొని యింటికిఁ గొంపోయెను. అతని నొక ధర్మశాలయందు
నిలిపెను. ఒకప్పుడు కలిప్రేరితులగు దొంగలు వైష్ణవరూపులై
రాజును దర్శించి ‘మేము శాస్త్రపారంగతులము, మేము
నివేదించిన భక్ష్యమును స్వయముగా హరి యారగించును.
చూడుము.’ అని కలిభక్తులగు నా వైష్ణవులు చతుర్భుజుఁ
డగు విష్ణుని రాజునకు మాయచేఁ జూపించిరి. ధర్మపాలుఁ
డాశ్చర్యపడి జయదేవుని దరికేగి ‘గురూత్తమ! నాయింటికి
విచిత్రమహిమలగు విష్ణుభక్తులు విచ్చేసి విష్ణు సాక్షాత్కా
రము నాకుఁ జేయించిరి. దానిని ద్వారగారందు’ అన జయ

దేవుఁడు వింతపడెను. అవ్వల నాచోరులు నవ్వి ఈ బ్రాహ్మణుఁడు గౌడదేశమున నుండు నొక వంటబ్రాహ్మణుఁడు. ధనలోభముచే బాషండరూపుఁడగు వీఁడు వంటలో విషము పెట్టెను. రాజది గ్రహించి వాని శూలమున గొఱ్ఱత వేయించెను. అంతలో మేమచటికిఁ బోయితిమి. నేరముచేసిన వానింగా నెఱింగి వానికి బుద్ధిచెప్పి రాజుచే శూలమునుండి వీనిం దప్పించితిమి. రాజు వీని కాలుసేతులు ఖండించెను. మాకు వీఁడు శిష్యుఁడు.' ఇట్లు వారు చెప్పుచుండగనే దారిత దుఃఖించెను. వెంటనే యా దొంగలను పాతాళమునకు దించి వేసెను. జయదేవుఁడట్లు దురవస్థంబడిన దొంగలం గని దయచే విలపించెను. అట్లతఁడు విలపించుచుండగా నాతని కాలుసేతులెప్పటియట్ల వచ్చెను. అవ్వల జయదేవుఁడు నిజవృత్తాంతము నాతని కెఱింగించెను. రాజు సంతసించి జయదేవముఖోద్గతమగు గీతగోవిందమును గానముచేసి మోక్షమందెను.

## —: 10 అ. కృష్ణచైతన్యులు :—

బృహస్పతి యిట్లనియె. విష్ణుశర్మయను నొక బ్రాహ్మణుఁడు వేదపారంగతుఁడు. సర్వదేవమయుఁడగు విష్ణు నారాధించి సర్వదేవతలకుఁ బూజ్యుండయ్యెను. అతఁడు భిక్షావృత్తిచే జీవించుచు భార్యతో వసించెను. వానికి సంతానము లేదయ్యెను. అతనియింటి కొక వ్రతనిష్ఠుండగు యోగివచ్చి 'స్పర్శవేది' యను మణినిచ్చెను. మూఁడురోజులకు సరయూ స్నానముచేసి మఱల నీకడకు వత్తునని యేగెను. విష్ణుశర్మ తన భార్య మేనిధిండ

బంగారు నగలుండుటఁజూచి 'ఓరీ! మదవతీ! పొమ్ము! నీకసిఁ జెప్పుచున్నాఁడో యటకుఁ బొమ్ము. నేను విష్ణుభక్తుఁడను. దీనుఁడను చోరభీతుఁడను. మదమెక్కియున్న నిన్ను నేనెట్లు గ్రహింప నేర్తును? అనినవిని యా పతివ్రత బెదరి తనకు లభించిన స్పర్శవేదితో బంగారు మంతయు నాతని కొసంగెను. బ్రాహ్మణుఁడు బలముకొలది యా ధనమును స్పర్శవేదిని తీసుక ఘర్ఘరానదిలోఁ బారవేసెను. మూఁడు రోజులకు వచ్చి యతి తానిచ్చిన స్పర్శవేది యేమయ్యెనని యా యుత్తమ బ్రాహ్మణి నడిగి తెలిసికొని మిక్కిలి కోపించి యామె భర్త కడకేగి 'ఓయీ! నా స్పర్శకము నాకిమ్ము. ఈయవేని ప్రాణముల విడుతు' ననియె. అంత విష్ణుశర్మ "నీవు ఘర్ఘరానదిలో నున్న నీ స్పర్శకము దెచ్చుకొమ్ము" అని పలికి యా యతితో నదీతీరమున కేగి కొన్ని ముండ్లనుజూపి యివిగో స్పర్శవేదులని చూపెను. అవి నిజముగా స్పర్శవేదులగుట చూచి యా యతి యా విప్రోత్తమునికి నమస్కరించి నేను బండ్రెండేడులు శివారాధన చేసితిని. శివానుగ్రహముచే నీ యమూల్య స్పర్శమణి లభించినది. అది నీ దర్శన భాగ్యముచే బహురూపమయినది. ఇది నీ మహిమయేయని పలికి శుద్ధజ్ఞానము వడసి మోక్షమందెను. విష్ణుశర్మ వేయేండ్లిలపై వసించి సూర్యు నారాధించి విష్ణు ననుగ్రహముచే మోక్షమందెను. ఆ బ్రాహ్మణుఁడే విష్ణు తేజముఁదాల్చి ఫాల్గున మాసమున దేవకార్యపరుండై ముల్లోకముల వెలిగించెను. ఇట్లే నీవును నారాధింపు మన గురు వాక్యము ననుసరించి యింద్రుఁడు సూర్యమయుఁడైన హరి

దేవుఁడు వింతపడెను. అవ్వల నాచోరులు నవ్వి ఈ బ్రాహ్మ ణుఁడు గౌడదేశమున నుండు నొక వంటబ్రాహ్మణుఁడు. ధన లోభముచే బాషండరూపుఁడగు వీఁడు వంటలో విషము పెట్టెను. రా జది గ్రహించి వాని శూలమున గొఱత వేయిం చెను. అంతలో మే మచటికిఁ బోయితిమి. నేరముచేసిన వాని ంగా నెఱింగి వానికి బుద్ధిచెప్పి రాజుచే శూలమునుండి వీనిం దప్పించితిమి. రాజు వీని కాలుసేతులు ఖండించెను. మాకు వీఁడు శిష్యుఁడు.' ఇట్లు వారు చెప్పు చుండగనే దారిత దుఃఖించెను. వెంటనే యా దొంగలను పాతాళమునకు దించి వేసెను. జయదేవుఁ డట్లు దురవస్థంబడిన దొంగలంగని దయచే విలపించెను. అట్లతఁడు విలపించుచుండగా నాతని కాలుసేతు లెప్పటియట్ల వచ్చెను. అవ్వల జయదేవుఁడు నిజవృత్తాంతము నాతని కెఱింగించెను. రాజు సంతసించి జయదేవముఖోద్గతమగు గీతగోవిందమును గానముచేసి మోక్షమందెను.

—: 10 అ. కృష్ణచైతన్యులు :—

బృహస్పతి యిట్లనిరెను. విష్ణుశర్మయను నొక బ్రాహ్మ ణుఁడు వేదపారంగతుఁడు. సర్వదేవమయుఁడగు విష్ణు నారాధించి సర్వదేవతలకుఁ బూజ్యుండయ్యెను. అతఁడు భిక్షావృత్తిచే జీవించుచు భార్యతో వసించెను. వానికి సంతానము లేదయ్యెను. అతనియింటి కొక వ్రతనిష్ఠుండగు యోగివచ్చి 'స్పర్శవేది' యను మణినిచ్చెను. మూఁడుహోజులకు సరయూ స్నానముసేసి మఱల నీకడకు వత్తునని యేగెను. విష్ణుశర్మ తన భార్య మేనినిండ

బంగారు నగలుండుటచూచి 'ఓసీ! మదవతీ! పొమ్ము! నీరసికుఁ
డెచ్చటనున్నాఁడో యటకుఁ బొమ్ము. నేను విష్ణుభక్తుఁడను.
దీనుఁడను చోరభీతుఁడను. మదమెక్కి-యున్న నిన్ను నేనెట్లు
గ్రహింప నేర్తును? అనినవిని యా పతివ్రత బెదరి తనకు
లభించిన స్పర్శవేదితో బంగారమంతయు నాతని కొసంగెను.
బ్రాహ్మణుఁడు బలముకొలది యా ధనమును స్పర్శవేదిని
తీఱుగ ఘర్ఘరానదిలోఁ బారవేసెను. మూఁడురోజులకు వచ్చి
యతి తానిచ్చిన స్పర్శవేది యేమయ్యెనని యా యుత్తమ
బ్రాహ్మణి నడిగి తెలిసికొని మిక్కిలి కోపించి యామెభర్త
కడకేగి 'ఓయీ! నా స్పర్శకము నా కిమ్ము. ఈయవేని ప్రాణ
ముల విడతు' ననియె. అంత విష్ణుశర్మ "నీవు ఘర్ఘరానదిలో
నున్న నీ స్పర్శకము దెచ్చికొమ్ము" అని పలికి యా యతితో
నదీతీరమున కేగి కొన్ని ముండ్లనుజూపి యివిగో స్పర్శవేదులని
చూపెను. అవి నిజముగా స్పర్శవేదులగుట చూచి యా యతి
యా విప్రోత్తమునికి నమస్కరించి నేను బండ్రెండేడులు శివా
రాధన సేసితిని. శివానుగ్రహముచే నీ యమూల్య స్పర్శమణి
లభించినది. అది నీ దర్శన భాగ్యముచే బహురూపమయినది.
ఇది నీ మహిమయేయని పలికి శుభజ్ఞానము వడసి మోక్షు
మందెను. విష్ణుశర్మ వేయేండ్లిలపై వసించి సూర్యునారాధించి
విష్ణు ననుగ్రహముచే మోక్షమందెను. ఆ బ్రాహ్మణుఁడే విష్ణు
తేజముఁదాల్చి ఫాల్గున మాసమున దేవకార్యపరుండై ముల్లో
కముల వెలిగించెను. ఇట్లే నీవును నారాధింపు మన గురు
వాక్యము ననుసరించి యింద్రుఁడు సూర్యమయుఁడైన హరి

ప్రార్థించిన సూర్యమండలము నుండి సూర్యభగవానుఁడు ప్రసన్నుఁడై నాల్గుభుజములు గల్గి యెఱ్ఱని మేనితో యత్మునివలె వచ్చి యింద్రసేనుఁ బ్రవేశించెను. ఆ తేజస్సుచే నింద్రుఁడు తన మేనిఁ తనలో లీన మొనరించుకొని తానును శచీదేవియు నయోనిసంభవులై మిథునరూపులై వైష్ణవాగ్ని ప్రపీడితులై యొక సంవత్సర పర్యంతము గంగాతీర మహావనమునఁ క్రీడించిరి. బ్రాహ్మణి రూపమున నున్న శచీదేవి గర్భవతి యయ్యెను. భాద్రపద శుద్ధద్వాదశీ గురువారమున హరియొక్క-సర్వకళలు ధరించి చతుర్భుజుఁడు రక్తాంగుఁడునై ప్రాదుర్భావమందెను. రుద్రులు. వసువులు, విశ్వేదేవులు, మరుత్తులు సాధ్యులు ద్వాదశసూర్యులు, సిద్ధులు నాతని స్తుతించిరి. 'నాథా ! వజ్రాయుధము, ధ్వజము, పద్మము గద, యంకుశము నను శుభలక్షణములు గల్గి మహాభరణాలై విధి శంకరాదులచే మునులచే నానందమున సేవింపఁబడుచు సంసార భయహారణంబగు నీచరణమునకు మ్రొక్కుచున్నాను. శంఖ చక్ర గదా వనమాలాధరుండవై సురవైరివై కఠోరశరీరుఁడవై చరాచరలోకభర్తవై ఖలనాశకుఁడవై సురకార్యనిర్వాహకుఁడవైన నీకు నమస్కారము. శచీనందనానందకారివై మహా పాప సంతాపహారివై లోకధారివై స్వభక్తాఘకోటిపరిహారి వైన నీకు మా వందనము. హంసరూపుఁడగు నీచే సత్యమును (సత్య యుగమనియు భావము) యజ్ఞరూపుఁడవగు నీచే వేదము రక్షితములు. నీవే యజ్ఞరూపివై లోకమును ధరింతువు. శచీనందనా! శక్రునికి క్షేమము సేయఁదలచి కరుణావిగ్రహుఁడవై

కలిలో నున్నతోజ్జ్వలమగు భక్తిసంపద ననుగ్రహింప నవత
రించితివి. సుందరద్యుతికదంబ సందీపితుఁడగు శచీనందనుఁడు
మా హృదయములం దెల్లవేళల స్ఫురించుఁగాక! కరుణచే నరులం
బాలించి పుడమిపై నిలిపి నీ పరాత్పరమైన పదమును వారికి
నివేదింప నెంచి నీయంతట నీవై యవతరింతువు. కలిలో
దైత్యులవలన వ్యథాబ్ధిమగ్నులగు సురల నుద్ధరింపుము.
మహాప్రభూ! నీవు కృష్ణచైతన్యనామమున శచీనందనుండవై
యవతరించితివిగదే! మాధుర్యమధువుచే సుగంధవదనుఁడవై
కారుణ్యామృతనిర్ఝరముల జాల్వార్చి స్వర్ణాంబుజవనములకు
వికాసము గల్పించుచు నుత్తమప్రేమకు హేమాచలమై భక్త్యాం
బోధరధారివై విజయివై మా యిలవేల్పువై చైతన్యకృష్ణుఁడైన
హరివై సర్వోన్నతుండవై యున్నావు. దేవద్వేషుల యధర్మ
వర్తనముచేఁ బీడితయై యీ భూదేవి తన శరీరమును సంకోచ
పఱచుకొని చిక్కి నక్కి-నక్కి తిఱుగుచున్నది. నీ నామ
మాత్రముచే నసురకోటి విదళితమైరి. మ్లేచ్ఛులు పాతాలమునకు
దిగిపోయిరి. ధర్మపరులు సురేశనమనులయినారు. అట్టి నీకు
సర్వవ్యాపికి నమస్కారము. ఇట్లు యజ్ఞేశుని వినుతించి దేవతలు
బృహస్పతి సన్నిధికేతెంచి మేము రుద్రులము. ఇరుగో వసువులు
వీ రశ్వినీ దేవతలు. ఏయేయంశముల నెచట మే మవతరింప
వలయునో యానతిమ్మని యడిగిరి. అంత గురుఁడు వారికిట్లు
తెలిపెను.

## —: వా ల్మీ కి :—

పూర్వజన్మమున నొక ద్విజుఁడు బోయవాఁడై ధనుర్బాణములఁ దాల్చి బ్రాహ్మణహింస యెల్లపుడు సేయుచు వారి జంధ్యములఁ ద్రెంచుచు హేళనచేయుచు నల్లరి పెట్టుచుండెను. వానికి బ్రాహ్మణ ద్రవ్యమన్న నమృత ప్రాయమై యుండెను. క్షత్రియద్రవ్యము మధురము. వైశ్యునన్న మన్నమే యయ్యెను. శూద్రుని ధనము రక్తము. ఇట్లు వాఁడు త్రివర్ణ ప్రజలను వేఁచికొని తినుచుండెను. అంతట దేవతలు భయభ్రాంతులైరి. బ్రహ్మకు మొఱపెట్టుకొనిరి. బ్రహ్మ సప్తర్షులతో నీ యంశ మెఱిగించెను. మరీచి మహర్షి వినీ వశిష్ఠాత్రిదులతో నేగి యావేటకానివనమునఁ జరించెను. వాఁడు వారినందఱిని జంపుదునని యెత్తివచ్చెను. వారు వానిం గని "ఓరీ! కిరాతుఁడ! పోరా! బ్రహ్మహత్యాపాప మెవఁ డనుభవించును? ఆలోచించుకోరా! యనిరి. వాఁడు వారి దృష్టిప్రసార మాత్రముచే పరిశుద్ధుఁడై తన వంశీయుల దగ్గరకుఁబోయి 'నేను జాలపాతకములను జేసితిని. నా పాపమును నా సొత్తును బంచికొన్నట్లు మీరు పంచికొనక తప్పదు.' అనిన వాండ్రు 'మాకేమిపట్టినది? నీ పాపము మేమనుభవింపఁ బని లేదు. ఈభూమి సాక్షి, ఈ రవిసాక్షి' అనిరి. వా డామాటలు విని మునులదరిని వినతుఁడై మ్రొక్కుచు నా పాపము తఱుగునుపాయము సెలవిం దని వేడికొనెను. వారును రామనామమును మించినది లేదు. అది సర్వాఘౌఘ వినాశకము. మేము తిఱిగి నీ యొద్దకువచ్చునందాక జపింపుము. అని యానతిచ్చి తీర్థమునుండి తీర్థమునకు

వెడలిరి. వాఁడు 'మరామరామరా' యని వేయేండ్లు జపించెను. వాని జపమహిమచే నవ్వన ముత్పలసంకులమై యుత్పలారణ్య మను ప్రసిద్ధి నందెను. వల్మీకమునుండి (పుట్టనుండి) వెలువరింపఁబడి పరిశుద్ధతేజమున వెలుఁగు చున్నట్టి నవ్విప్రుని జూడ వచ్చి సప్తర్షులు విస్మయభరితులై 'వల్మీకమునుండి వెలువడిన కతన వాల్మీకి యనఁబరగెదవు, నీవు త్రికాలజ్ఞుఁడ వయ్యెద' వని తెలిపి స్వలోకములకు నేగిరి. అమ్ముని రామాయణము నష్టాదశకల్పయుక్తముగను శతకోటిప్రవిస్తరముగను సర్వాఘౌఘ నికృంతనంబుగ రచించెను. అవ్వల నతఁడు శివుఁడై యటనే నివసించెను. అమ్ముని మృగవ్యాధస్వామియను పేర శివలింగ మయి యిప్పటికి నట నధిష్ఠించియున్నాఁడు.

—: శ్రీ జగద్గురు శంకరాచార్యులు :—

ఆద్యమగు సత్యయుగమున వైవస్వతాంతరమున బ్రహ్మ యుత్పలారణ్యమున నొక యజ్ఞము చేసెను. అయ్యెడ సరస్వతి నదియై యటకు వచ్చెను. ఆ నదీసందర్శనముచే బ్రహ్మముఖము నుండి బ్రాహ్మణుని, బాహువులనుండి క్షత్రియుని, ఊరువులనుండి వైశ్యుని పాదములనుండి శూద్రుని జనింపఁజేసెను. ద్విజులకెల్ల రాజగు సోముఁడు చంద్రుఁడను పేర ద్విజుఁడై యొప్పె. సర్వాతపుండగు సూర్యుఁడు కశ్యమును (సీర్యమును) = పాతి రక్షించువాఁడుగాన కశ్యపుఁడను పేర మరీచియను క్షత్రియుఁడయ్యెను. రత్నముల కాకరముగాన రత్నాకరుఁడు, లోకముల ద్రవ్యములచే ధరించు వాఁడు

గాన ధర్ముఁడు, గంభీరమై (లోతైన కోశముగలవాఁడు) లోక ములను పనకృత్యములచే రక్షించువాఁడు (రక్షించువాఁడని భావము) గాన దక్షప్రజాపతి. బ్రహ్మమేనినుండి పుట్టినవారుగాన వారు బ్రాహ్మణులనఁబడిరి. వర్ణధర్మముచే వారెల్ల క్రమముగ వర్ణాత్మకులునై యొప్పిరి. దక్షుని మనమున జనించిన కన్య నైనుమందలమంది పుడమినై విష్ణుమాయామహిమచే కాల భూతులై యున్నారు. అయ్యెడ బ్రహ్మ సోమునికి అశ్వినీమండ లము నిరువదియేడు నక్షత్రముల గణమును లోకవృద్ధికై యొసంగెను. కశ్యపుని కదితిగణమును నక్షత్రరూపమైన దానిని బవమూడింటి సమూహము నొసంగెను. ధర్మునికి కీర్తి ప్రభృ తుల నొసంగెను. వైవస్వతాంతరమున నానావిధములు సృష్టము లయ్యెను. బ్రహ్మయానతిచే వారికిఁ బతి దక్షుఁడయ్యెను. భూమిపై నాదక్షుఁడు యజ్ఞతత్పరుఁడై స్వాయమగా నివాస మేర్పఱచుకొనెను. సర్వదేవతలు దక్షునికి నమస్కరించుచుఁ జరింతురుగదా! భూతనాథుఁడగు మహాదేవుఁడు మాత్ర మెన్నఁడు మొక్కఁడయ్యెను. దానికిఁ గోపించి దక్షుడు యజ్ఞ మున శివునకు హవిర్భాగ మీయఁడయ్యె. మృగవ్యాధుఁడగు శివుఁడు కోపించి వీరభద్రావతారమెత్తి త్రిశిరస్కుఁడు త్రినే త్రుఁడు త్రిపదుఁడునై యటకు వచ్చెను. అతనిచే దేవముని పితృ కోటి పీడితులైరి. యజ్ఞపురుషుడు భయభ్రాంతుఁడై లేడియై చరచరఁ బారిపోవుచుండగా గిరాతుఁడై శివుఁడు వానింగొట్టెను. అంతట బ్రహ్మ మధురస్వరంబుల నప్పరమశివుని నుతించెను. శంభుఁడు మిగుల నుబ్బి యాతని యజ్ఞము సంపూర్ణ మొనరిం చెను. తులారాశియందు సూర్యుఁడుండగా నా చంద్రుని

చంద్రమండలమందు స్థాపించెను. అంతట రుద్రుఁడు చంద్రరూపుఁడై సప్తలోకములందుఁ జరించెను. ఈమాటవిని రుద్రరూపుఁడైన వీరభద్రుఁడు సంతసించి తనయంశమును నేనినుండి వేర్పఱచి ద్విజునియింట నిలిపెను. భైరవవిప్రుని యింట నాయంశమేగి యాతని కుమారుఁడై కలియందు 'శంకరు లను నామమున విశ్రుతమయ్యెను. ఆబాలుఁడు గుణశాలి, వేత్త బ్రహ్మచారి యయ్యెను. శైవమార్గ ప్రదర్శకమగు శంకర భాష్యము నొనరించెను. త్రిపుండ్రము, అక్షమాల పంచాక్షర మంత్రమును శైవులకు మంగళకరముగా శంకరాచార్యుల వారిచే నేర్పఱుపఁబడినవి.

—: 11 అ. గిరిశర్మ (రుద్రావతారము) :—

—: ఆ నం ద గి రి :—

నైమిశారణ్యమున నజగరుఁ డను బ్రాహ్మణుఁడు వేదాంత శాస్త్రపండితుఁడు, శంభుపూజకుఁడు నగు జ్ఞాని యొకఁ డుండెను. అతఁడు చేసిన పార్థివలింగ పూజకు సంతసించి జీవన్ముక్తి జ్ఞానమును శంకరుఁడు దయచేసెను. ఆజ్ఞానముచే నతఁడు సంకర్షణు నర్చించి యిట్లు పుష్కలములయిన స్తుతులు గావించెను.

సదద్వైతము ప్రధానము. పరంజ్యోతిరూపము నిరాకారము. అవ్యక్తము ఆనందనిత్యము. త్రిలింగైక్యాభిన్నమయిన యా వస్తువు త్రిధారూపమయినది. అందు సత్త్వము పుంరూపము. రజస్సు స్త్రీరూపము. తక్కినది తమోరూపము. అట్టి

శేషనాగుశయ్యాస మూర్తికి నమస్కారము. ఆదిభూతమైన రజస్సే మూఁడు. మధ్యభూతుఁడైన సహుఁడు సత్త్వరూపము. అన్యభూతము తమోమయము, నపుంసకము. అట్టి నాగేశ్వర! నీకు వందనములు. పుంరూపధారివై నీవు కాలకర్తవు, నరుల నాకర్షించు నీవు సంకర్షణుఁడవు, బ్రహ్మధామమగు నీయందు మునీంద్రులు రమింతురు. నమస్కారము, నీకు మఱలమఱల నమస్కారము, నరుల శరీరములం దాధారభూతయగు శివాశబ్దవాచ్యయగుశక్తి యోగనిద్ర నీశక్తియే. ఇట్లు నుతించు నజగరునికి మృత్యుంజయుఁడు తన దివ్యమంగళశరీరమున సాయుజ్యము ననుగ్రహించెను. అం దాతఁడు సర్పమయ్యెను. వేయిపడగలు గలిగి గౌరాంగుఁడై గౌరవిగ్రహుఁడై క్షీరాబ్ధియందు నివాసము నొందెను. ఆ సర్పాఖ్యమగు మహారుద్రుని సన్నిధికి స్వాయంభువు వచ్చి సూర్యుఁడు కర్కటకరాశిలో నుండగా చంద్రుఁడు నక్షత్రమండల గతుఁడైన తఱి నారుద్రుని స్థాపించెను. అతఁడు చంద్రుఁడుకూడ యయ్యెను. ఈ యంశమును శేషుఁడు బృహస్పతి ముఖమున విని ప్రసన్నుఁడై తన మోమునుండి తన యొకానొక తేజమును సృజించి వింధ్యగిరిపై దేవదత్తుఁడను విప్రునింట నావిర్భవింపఁ జేసెను. గిరిశర్మయను పేర నా జన్మించిన బాలుఁడు విద్వాంసులను గెలిచి కాశీపురమున కేతెంచి శంకరుని శిష్యుఁడయ్యెను. బృహస్పతి వెండియు నిట్లనియె.

## —: పు రీ శ ర్మ :—

ప్రయాగయందు హరిసేవకుఁ డను విప్రుఁడుండెను. అతఁడు దరిద్రుఁడు, హరిభక్తుఁడు. వాని పేరు నైరృతుఁడని;

సాయంకాలమున కతికష్టముమీఁద నాతనికి భిక్ష లభించు చుండెను. ఒకనాఁడు నారదయోగి దయచేసి యాతని పూజలంది విష్ణులోకమున కేగి నారాయణ సందర్శనముచేసి భగవంతునితో "స్వామీ! నీ పూజయందు నిష్ఠగల దేవతలకు భక్తులయిన వారు భూమియందు ధనధాన్య సమృద్ధులయి యున్నారు. నీకు భక్తులయినవారు దరిద్రులుగానే యున్నట్లు నేను జూచితిని. జనార్దనా! ఇందులకుఁ గారణము తెలుపవే" యనెను. భక్త వత్సలుండగు నారాయణమూర్తి యిట్లనియె. నా భక్తుఁడు బ్రహ్మ నా ప్రియులగు భక్తులను వశపఱచుకొని లోకతంత్రము నడుపును. అతనిచే ధర్మము, అధర్మము జేయఁబడినది. ధర్మము వేదమయము. సప్తలోకములు ధర్మమూలకముగా నా బుద్ధి మంతుఁడు నిర్మించినాఁడు. భూర్లోకము భువర్లోకము స్వర్లో కము మహర్లోకము జనోలోకము తపోలోకము సత్యలోకము నను నీలోకములం దొకదానికంటె నొకదానియందు రెట్టింపు సుఖముండును. అధర్మము వేదభిన్నము. అది శబ్దాన్యకర్తృకము. అనఁగా వేదబోధిత కర్మముగాక వేదేతర బోధితమైనది. మహా వాణిచే దూషితములయిన (వేదదూరములయిన వన్నమాట. మహావాణి = వేదము) శబ్దములు లౌకికములు. అవి పాపమయ ములు. అవి దైత్యులను బెంచునవి. అదే యధర్మము. దానికి సంబంధించినవే సప్తలోకములు. భూమియొక్క క్రింది గర్తము లందు విధినిర్మితములయిన అతలము వితలము సుతలము తలా తలము మహాతలము రసాతలము పాతాళము. నను నవి యన్య ధర్మముచే నేర్పడినవి. అవికూడ సుఖభూములే. అన్యధర్మమే

యధర్మము. దేవతలకంటె భిన్నులయిన యసురులా యన్య ధర్మమున కధిదేవతలు. ధర్మపక్షమువారు దేవతలు. అధర్మ పక్షమువా రసురులు. దేవతలకు దైత్యులకుఁ గూడ చెందని ధర్మము విధర్మము అనఁబడును. ఆవిధర్మము నాధారపడి యున్న లోకములు దుఃఖప్రాయములు. అవి తామిస్రము అంధతామిస్రము కుంభీపాకము రౌరవము మహారౌరవము మూత్రరయము ఇక్షుయంత్రము శాల్మలము అసిపత్రవనము సని యివి యిరువది యొక్కటి. ఈ బ్రహ్మాండము లోకమయము. దానిమీఁద నా స్థానమున్నది. నా భక్తులు నాపదమందుదురు. దేవభక్తులు సప్తలోకము లందుదురు. దైత్యభక్తులు తామస లోకము లందుదురు. వారు అతలాది లోకములందుదురు. పాతాలముకంటె లక్షయోజనములు క్రిందిది యధోలోకము. విధర్మపరు లాయధోలోక మందుదురు. విధిభ్రష్టులు నా భక్తులెవరు మున్మున్ను దేవతలను బూజించి మీఁద నన్ను భజింతురో వారు లక్ష్మీసంపన్నులయి భుక్తిముక్తులను రెండింటిని సాధింతురు. నైరృతుఁడు ప్రయాగయందు నా ప్రియులగు దేవతలను విడిచి నన్ననన్య భావమునఁ బూజించువాఁడు గాన దరిద్రుఁడయ్యెను. దేవత లనుగ్రహించిన ద్రవ్యమును జను లనుభవింపవలయును. నే ననుగ్రహించు వస్తువు బ్రహ్మాండమున లేదు. (అది బ్రహ్మాండాతీతమైన తత్త్వమన్నమాట). కావున నా యాజ్ఞచే నా విప్రునికి వరమిమ్ము. అనిన నారదయోగి యరుదెంచి యా బ్రాహ్మణునిభార్య యింటనుండఁగా వర మేదేని కోరు మనిన నామె సుదర్శిని గని ''నేను రాణిని గావలయునని

యున్నది'' అని యముని దయచే దివ్యరూపిణి యప్పుడే యయ్యెను. సాయంకాలమునకు ద్విజుఁ డింటి కేతెంచెను. నారదుఁడు 'హరిప్రియా ! నీభార్య వరలాభమున రాణియైనది, నీ వేమి కోరెద' వన నాతఁడు దైవవశుఁడై రోషముచే నా భార్య యాఁడునక్క కావలెన నెను. ఆమె యట్లే యయ్యెను. అంతలో వారికుమారుఁడు గురుభక్తుఁడు వచ్చి 'స్వామీ ! దేవమాయా విమోహితులగు వీరి కీయవస్థవచ్చినది. వీరి కీ గతి యెట్లు తప్పునో యట్లనుగ్రహింపుము' అనెను. నారదు డాస్థితికిఁ జింతిలి నైరృతునితో ''ఈ బ్రహ్మాండము దేవమయము. దాని కధీశ్వరుఁడు శంకరుఁడు. కాన నీవతని శరణొందుము'' అనెను. అంతట నా విప్రుఁడు పార్థివపూజచేసి పరమభక్తితో నొక్క సంవత్సరము సేవించెను. భక్తవత్సలుఁడు శంభుండు కుబేరునంత యైశ్వర్యము దయచేసెను. దానితో నా ద్విజుఁడు ధర్మాచరణము సేసెను. పుణ్యజనుఁ డను ప్రసిద్ధి నందెను. శివభక్తిప్రభావముచే వేయియేండ్లు సుఖములంది మేనువాసి స్వర్గమందెను. సూర్యుఁడు వృషభరాశిలో నున్నతరి సోమమునకు రాజగు చంద్రునివలె నైరృతుఁడను పేర రుద్రుఁడై యొప్పెను. గురుఁడు తెల్పిన యీ మాటవిని నైరృతుఁడు తన యంశముతో నవని కేతెంచి గిరినాలగిరియందు సిద్ధసాంఖ్యుఁడను యోగికిఁ గుమారుఁడై వసుశర్మయను పేర వేదశాస్త్రపారంగతుఁడను విఖ్యాతినొందెను. పండ్రెండవయేటనే యతఁడు పండితులను బెక్కుమందిని జయించి కాశీనగర మేతెంచి తత్త్వార్థియై శంకరాచార్యులవారి నర్చించి శిష్యుఁడై యిరువది

నాల్గు సంవత్సరము లా గురుసేవ చేసెను కాని శివానుగ్రహము లభింపదయ్యెను. అయ్యెడఁ జింతించి యాబ్రాహ్మణుఁడు తన మేని మాంసఖండములను హోమము చేసెను. కాని రుద్రుఁడు సాక్షాత్కరింపఁడయ్యెను. శుచియై మేకను దెచ్చి సంస్కారము చేసెను. అంతట రుద్రభగవానుఁ డామేషముతో నరుదెంచి స్వరూపము దర్శింపఁ జేసెను. శుద్ధస్ఫటికసుందరమగు నారూపము జూచి వసుశర్మ 'శరణాగతవత్సల! పార్వతీ వల్లభ! నాకుఁ గుమారుని నిమ్ము' అని యడిగిన శంకరుఁడు నవ్వి పుత్రదాత బ్రహ్మ. భాగ్యకర్త పరాత్పరుఁడు. శతజన్మాంతముల కాతఁడు పుత్రు ననుగ్రహింపలేదు. అందుచే నా యంశముచే నేను నీకు పుత్రు నొసంగెదను.' అని తన ముఖమునుండి తేజము నాకర్షించి యాతని భార్యయందు సంయోజించెను. పదియవ మాసమున నామెకు సుతుం డుదయించెను. వాని యొక కాలు మేక కాలును బోలియుండెను. కాన అజైకపాదుఁ డను ఖ్యాతి నందెను. నాల్గేండ్ల యీడున నతనిని మృత్యువు మ్రింగఁబోగా నతఁడు మృత్యువుతో యుద్ధము చేసి యొక్క సంవత్సరములో సర్వరోగములను మట్టుపెట్టి మృత్యువును గెల్చి మృత్యుంజయుఁ డను బిరుదొందెను. మృత్యువు తన యధికారభంగమునకు దుఃఖించి బ్రహ్మకడ మొఱపెట్టుకొనెను. అయ్యెడ బ్రహ్మ సర్వదేవగణములతో రవి కుంభరాశిలో నున్నతఱి చంద్ర మండల మధ్యస్థుఁడైన యతని రుద్రునిగా నొనరించెను. ఈ వాక్యము విని యజైకపాదుఁడు మహిష్మతీపురమునకు వచ్చి కలిదోషహారుఁడై పురీశర్మ యను పేర యతిదత్తుఁ డనువాని

కుమారుఁడై పదునాలేండ్ల ప్రాయమువాఁడై వేదపరాయణు లను జయించి శంకరాచార్యులవారి శిష్యుఁడయ్యెను.

—: 12 అ. భారతీశుఁడు :—

బృహస్పతి ప్రయాగలోఁ దెల్పు కథ వినుము. హర్ష్య వను నొక రాక్షసుఁడు నికుంభుని వంశమువాఁ డుండెను. వాఁడు వేయేండ్లు తపముసేసి దేవతలను బాధించెను. అయ్యెడ బ్రహ్మ లోకరక్షణాపరుండై వరము కోరుకొమ్మన వాఁడు తనకు మృత్యువు లేనట్లు వర మిమ్మనెను. అట్లువరమంది పాతాళవాసు లగు రాక్షసులను స్వర్గమున కెక్కించి స్వర్గవాసులగు దేవత లను భూమిమీఁదికిఁ దోలెను. అప్పుడొక లక్షసంవత్సరములు నానాబాధలు గుడిచిరి. ఒకనాడు నారదయోగి దేవతలను బిల్చి 'మీరు బ్రహ్మాండాధిపతియగు శంకరుని సేవింపుఁడన, వేల్పు లాశ్చర్య చకితులై యుమాపతిని నూటపదకొండు సంవ త్సరము లర్చించిరి. అయ్యెడ శివుఁడు జ్యోతిర్లింగ వటుఁడై మూఁడు లోకములను దహించెను. దేవభక్తులగు వారు కొందఱే దేవతలు శేషించిరి. మిగతవారు కూడ రక్కసులతో నశించిరి. ఇంతలో బ్రహ్మ విష్ణువుతోఁ గూడ సామవేద మంత్రములచే నుతించెను. దిననాథుఁడు మిథునరాశియం దుండగా చంద్ర మండలాధిపుఁడగు హర్ష్యఘ్నుని మహారుద్రుని గావించెను. ఈ మాట హర్ష్యఘ్నుఁడు విని దేవకార్యార్థము హిమాలయ మున సాధ్యకర్మయనువాని కుమారుఁడై మంచి కలాభిజ్ఞుఁడై

భారతీశుఁడను పేరొంది పండితులను జయించి కాశీపురమేగి శంకరాచార్యుల వారిచే వాదమున జయింపఁబడి వారికి శిష్యుఁడయ్యెను.

—: నా థ శ ర్మ :—

మయునికొడుకు మాయి యనువాఁడు సూర్యుని గూర్చి వేవేండ్లు తపముచేసెను. వాని తపస్సుచే లోకములన్నియుఁ దపించెను. అంతట బ్రహ్మ వానికిఁ బ్రసన్నుఁడై మూడు పురముల నిర్మించి యిచ్చెను. ఒకటి సువర్ణమయము- స్వర్గతుల్యము. పదునాఱు యోజనములు వైశాల్యము గలది. దానికొక యోజనము క్రిందుగా భువర్మయ మయిన యొక రజతమయమైనపురము. దానిక్రింద నొక యోజనములో భూర్లోకము-అయోమయము (ఇనుముతోఁగట్టినది) నూఱుకోట్లమంది దైత్యులు ధర్మాచరణపరులయి యందు సుందరస్త్రీలతో విహరించుచు యజ్ఞములయందు హవిర్భాగముల గ్రహించుచు దేవతలట్లు ప్రకాశించిరి. అయ్యెడ దేవతలు దుర్బలులై యాకలిచేఁ బీడితులై మహావిష్ణువును నుతించిరి. మేము పదునారు మహాయుగము లధికారము గోల్పడియుంటిమి. తామస మన్వంతరమునం దీ పదునాఱు మహాయుగములు మాయకు లగు రాక్షసులు సుఖ మనుభవించిరి. అనిన విని దైత్యులు సంస్కృతవార్తయందు (వేదవిహిత సంస్కారాచరణమందు) ధర్మపరులయి యుండుట గని తాను బౌద్ధరూపుఁడై భయంకర మయిన కలిరాగా నజినుఁడను బ్రాహ్మణుని కుమారుఁడై యవతరించెను. వేదధర్మపరులయిన విప్రులను మోసపుచ్చెను.

అంతట త్రివర్ణులగు నా విప్రులు వేదబాహ్యులై కర్మదూరులై
తామసమన్వంతరమునఁ బదునాఱవ కలియుగము వచ్చినపుడు
యజ్ఞవర్జితులయి పోయిరి. అంతట త్రిపురవాసులగు దైత్యులు
రోషముగొని వేదయజ్ఞ శూన్యులయిన మానవులను బీడింపఁ
జొచ్చిరి. ఆ కల్పముచివర నందరు దైత్యులచే భక్షింపఁబడి
నశించిరి. తిరిగి సత్యయుగము రాగా గుహ్యకాలయమగు
కైలాసమందు దేవతలచే నారాధితుఁడై శంభుఁడు సర్వలోక
శివంకరుఁడు గావున జ్యోతిర్లింగ స్వరూపము ధరించి యచట
నావిర్భవించెను. ఈ లోపునఁ దామసమన్వంతరమున దేవతలు
ప్రసన్నులై భూమిసారమంతయుంగొని యథావిధిగా రథము
నొనరించి చంద్రసూర్యుల సారముచేఁ జక్రము లొనరించి
సుమేరువుయొక్క సారమును జండాగా నెత్తి స్యందనరూపమైన
యా వాహనమును శివునకిచ్చిరి. అందు బ్రహ్మ సారథి
యయ్యెను. దేవతలు గుఱ్ఱములయిరి. లోకాలోక పర్వతము
యొక్క సారము శివధను వయ్యెను. అజగవమను పేరు దానికిఁ
బ్రసిద్ధమైనది. ఆ కఠినమైన విల్లును భగవంతుఁ డెక్కు వెట్టెను.
దేవదేవుని రోషమాత్రముచే నా విల్లు భగ్నమైపోయెను.
విష్ణువు వింతపడి స్వర్గలోకసారమును సమకూర్చి పినాకమను
మఱియొక ధనువు నొనరించి శివున కందించెను. ఆ వింటికి
శేషుఁడు నారియయ్యెను. అగ్నివాయువులు ఱెక్కలైరి. ములికి
సనాతనుఁడగు విష్ణువయ్యెను. ఆ బాణముచే కోట్లకొలది రక్క
సులు హతులైరి. అంతట నుగ్రుఁడు మాయిపాలించు త్రిపుర
మును గాల్చివైచెను. అది యట్లు భస్మము కాగా లోకపతి

డుకు బ్రహ్మ సూర్యుడు మీనరాశియందుండగాఁ దనముఖము నుండి తన యంశము నాకర్షించి హాయని ద్వారమున హిమవ త్పర్వతము చరియయం దుంచెను. అంతట మచ్ఛిందుఁడను శివయోగి గోరఖుఁడను యోగికి గురువునైన మహానుభావుని ముఖమున నా తేజముఁ బ్రవేశించెను. రంభయను స్వర్గ వేశ్య కామరూపిణి మచ్ఛిందుని వశీకరించుకొని యాతనితోఁ గ్రీడించెను. ఆమెయందు సుందరుఁడగు కుమారుఁడుదయించెను. నాథశర్మయను మహాపండితుఁడయి పండితులజయించి కాశీపుర మేగి శంకరజగద్గురువుల శిష్యుఁడయ్యెను.

## —: క్షే త్ర శ ర్మ :—

చాక్షుష మన్వంతరమునఁ బండ్రెండవ ద్వాపరమున తాల జంఘీయులగు క్షత్రియులచే భృగువంశ భవులు నశింపఁ జేయఁ బడి వారిధనమును హరించిరి. ఒక మునిభార్య గర్భిణియై హిమ తుంగమున నూరేండ్లు తపము చేసెను. ఆ తల్లి తొడలను భేదించుకొని యొక పుత్త్రుఁ డుదయించెను. వాని తేజముచే లోకమంతయు భస్మమయ్యెను. అంతట దేవతలు బ్రహ్మదగ్గర కేగి మొఱపెట్టిరి. అతని యాజ్ఞచే వా రా తేజమును సముద్ర మునఁ బారవేసిరి. అందలి జలదేవత బడబయై యా తేజమును ద్రావి యారాద్రి తేజము భరింపలేక కక్కివేసెను. అంతట బ్రహ్మ స్వయముగాఁ ద్రికోటగిరికివచ్చి యాపర్వతము క్రింది భాగమున సాగరమం దా తేజము నుంచెను సూర్యుఁడు మేష మందుండగా చంద్రమండలగతుఁడైన రుద్రునిగా నాతని బ్రహ్మ

హ్మునరించెను. ఊరువులనుండి (తొడలనుండి) పుట్టుటచే నాతఁ 'ఔర్వుఁడు' అను నగ్ని యయ్యెను. బడబాముఖమునఁ బుట్టిన వాఁడగుటచే బాడబుఁ డనంబఱగెను. ఈమాట విని బడబాగ్ని తనముఖమునుండి తేజము నుత్పాదించి కురుక్షేత్రముం గావించెను. మఱియు సారస్వత బ్రాహ్మణునియింట నా రుద్రుఁడు క్షేత్రశర్మయను పండితుఁడై జనించెను. శంకరుని శిష్యుఁడై యాతఁడు బ్రహ్మచర్యవ్రతియై శంభుభక్తుఁడై యతఁడు కాశీనగరమున వసించెను.

## — ఢుంఢిరాజు :—

మున్ను జలప్రళయమైనతఱి స్థావర జంగమాత్మక ప్రపంచము నశింపగా బ్రహ్మకు నూఱవ సంవత్సరము వయస్సు రాగా ప్రకృతి యను మాయాశక్తి సర్వజలమును దాగెను. అత్తఱిఁ బ్రకృతి మహాకాళియను పేర నంధకార స్వరూపిణియై యేకాకినియై యుండెను. మూఁడుకోట్ల యిరువదిలక్షల మహాయుగములు గడచిపోయెను. నిత్యశుద్ధ సనాతని యగు నాదేవి మహాగౌరమగు స్వరూపమును పంచముఖములు పదిభుజములు, మూఁడునేత్రములు గల్గునట్లు ధరించెను. ఆమె ఫాలనేత్రమున నొకానొక సూక్ష్మతేజము గోచరమయ్యెను. అయ్యెడ దిశలయందున్న బ్రహ్మమును బ్రకృతి తన భుజములం బట్ట నెంచియు సమర్థత లేనిదయ్యెను. అంతట నాశ్చర్యపడి యమ్మాత తన పంచముఖములచేతను పరమభక్తితో పరాత్పరు నుతించెను. తూర్పుగానున్న ముఖము

నుండి వెడలు ధాతుశబ్దములచేతను దక్షిణముఖమందుదయించిన స్త్రీత్వయములచేతను, పడమటి దెసగానున్న ముఖమందుఁగల్గిన విభక్తిమయశబ్దములచేతను, ఉత్తరముఖమునం దొదవిన తిఙ్విభక్తి మయములయిన శబ్దములచేతను నభోముఖసంభవములగు సప్తమాత్రలచేతను నా నిరంజను సచ్చిదానంద ఘనమైన పూర్ణబ్రహ్మమును స్తుతించి సంతుష్టిపఱచెను. అంతట నా బ్రహ్మము స్వయంభువు డను పేరఁ బురుషమూర్తి ధరించెను. అవ్యక్తమగు ప్రకృతినుండి పుట్టుటచే నాతఁ డవ్యక్తజన్ముఁ డనంబడెను. వానికి వరదయై లోకరూపిణియగు నా దేవి యాతని పూర్వార్థభాగమునుండి షోడశాత్మకమై మహాలక్ష్మియై యవతరించెను. ఆమె పదునెనిమిది భుజములు లోకరక్షణ పరాయణము లయ్యెను. స్వయంభువుఁ డా రూపముగని యాశ్చర్యపడి యామె యంతు దరి వెదకి గానఁడయ్యెను. బృహత్త్వమువలన బహురూపమగుటవల్ల బ్రహ్మయని పేరొంది, సత్యలోకమం దధిష్ఠించెను. తన నాల్గుముఖములనుండి యుద్భవించిన నాల్గువేదములచే నతఁడు శంకరు వినుతించెను. ఆతని మేనినుండి నదీనదములు జనించి యేకార్ణవమయ్యెను. అందుఁ బ్రభువు స్వయముగా శయనించును. అవ్యక్తజన్ముఁడగు నతఁడు సహస్రయుగపర్యంతముండి సత్యలోకమును జేరి మఱల సృష్టి కావించెను. గుణరూపములయిన సృష్టు లనంతములు. వానిచే సర్వము మహాలక్ష్మిమయమై జగత్తు వ్యక్తమయ్యెను. మహాలక్ష్మి యాతని సృష్టి బాహుళ్యముగాంచి సర్వేశ్వరుఁడగు భగవంతుని జేరి మ్రొక్కి యవ్యక్తమంగళుఁడగు కృష్ణునితో

నిట్లనియె 'స్వామి ! నిత్యశుద్ధాత్మ! నరులు మహాత్తరులయి యున్నారు. వారిలెక్క యెట్లు చేయవలెనో తెల్పుము' అనిన నవ్యయుఁడగు నా భగవంతుఁడు రెండువిధములుగా నై పూర్వార్థముచే రక్తాంగుఁడును, పరార్థముచే గౌరాంగుఁడు నయ్యెను. ఇర్వురు చతుర్భుజులు. సర్వసృష్టిగణములకు నాతఁడీశుఁడు. అతఁడే గణేశుఁడను పేరొందెను. అతఁడు యోగులకు ధ్యేయుఁడు. ఒకప్పుడు విధివలన నుదయించి పార్వతీవల్లభుఁడగు శివుఁడు గణేశు నర్చించెను. వేయేండ్ల కాతనికి గణపతి ప్రసన్నుఁడై వరము కోరుమనియె. అయ్యెడ శివుఁడు శుద్ధచిత్తుఁడై వినమ్రబుద్ధియై యిట్లు స్తుతించెను. విష్ణుస్వరూపుఁడు పరమాత్మ చతుర్భుజుఁడు, రక్తుఁడు, యజ్ఞపూర్ణకరుఁడు; విఘ్నహరుఁడు, జగద్భర్త, సర్వానందప్రదాత, సిద్ధిపతి, నిధీశ్వరుఁడు నగు నీకు నమస్కారము. నాకుఁ గుమారుఁడవు కమ్ము నాయెడ ననుగ్రహము చూపుము' అనిన విని భక్తవత్సలుఁడగు గణపతి సర్వతేజోభూతమయి పార్వతీ శరీరమునుండి జన్మించి కైలాసమున సర్వదేవత లొనరించు మంగళాచారము లంది విరాజిల్లెను. అయ్యెడ మహోత్సవమయ్యెను. అంతలో సూర్యపుత్రుఁడగు దూరదృష్టిగల శని స్వయముగా నచటికి వచ్చెను అతని దర్శనమయినంతనే గణపతి శిశువైయుండి శిరస్సును గోల్పోయెను. అంతట హాహాకారమయ్యెను. రవి తులారాశియందున్న తఱి నిరువదియేడు రాజులు మాత్రమే భూమిపై చంద్రలోకమున నా శిరస్సు ప్రకాశించెను. దేవతలు స్తుతింప సూర్యసంభవుఁడు జనభయంకరుఁడగు శని యేనుఁగు తలయొక్క దంతముగల

దానిని రాగరూపమయిన దానిని ఛేదించి తెచ్చి యీ శిశువు నెత్తునిమెడ కతికించెను. గజజాతిచే నుతింపఁబడి బ్రహ్మ కర్కట శిరమును దాని కతికించెను. అంతటఁ గర్కటము శిరోహీన మయ్యెను. ♦ ఇట్లు గణేశ్వరుఁడు గజాననుండయ్యెను. ఇట్లు తెలుపు బృహస్పతి వాక్యము విని గణేశుండు తన ముఖము నుండి తేజము నాహరించి కాశీక్షేత్రమున దైవజ్ఞుఁడను విప్రుని కుమారుఁడై జన్మించెను. అతఁడే ఢుంఠిరాజను పేరఁ బ్రసిద్ధి కెక్కెను. అతఁడు ఫలాత్మకమయిన జాతకాభరణమను జ్యోతి శ్శాస్త్రమును వేదరక్షణకు రచించి శంకరాచార్య స్వామివారి సన్నిధి కేతెంచి శిష్యుఁడై ప్రసన్నాత్ముఁడై గురుసేవాపరుం డయ్యెను.

—: 13 అ, క పా లి భై ర వుఁ డు :—

బృహస్పతి యిట్లనియె :

అవ్యక్తజన్ముఁడగు బ్రహ్మకు పదునాఱు సంవత్సరములు రాగా నతఁడు కమలమునుండి సృష్టిసంకల్పము చేయగా నాతని మోమునుండి శారద యవతరించెను. ఆ సుందరిని గని బ్రహ్మ కామార్తుఁడై బలాత్కరించి రతి నర్థించెను. ఆమె రోషముగాని " నీ కైదు ముఖములుండుట యశుభముగా

♦ ఈ కథ ఖగోళములోఁ గనిపించు నక్షత్రములలో రాసులు మొదలగు తేజోమండలము లందలి పరిణామములను సంబంధించిన భాగముగాఁ గనిపించుచున్నది. దీని సమన్వయ మార్గము పరిష్కృతము ఖగోళనిపుణులగు శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారికి వదలుచున్నాను.

నున్నది. నాల్గు వేదములుగా నాల్గుముఖము లుండుటయే యోగ్యము.'' అని యంతర్ధాన మయ్యెను. బ్రహ్మ కోప మందెను. వాని కోపాగ్నినుండి రుద్రుఁడు భయంకరుఁడై జనించెను. అతఁడు భైరవుఁ డనుపేర కాలరూపుఁడై సప్త వాహనుఁడయ్యెను. నృసింహుని గోళ్ళంబోలిన గోళ్ళచే బ్రహ్మ యైదవతల గిల్లి వేసెను. ఆతని గర్జనమున కడలి బ్రహ్మ రుద్రుని శరణొందెను. పాపులమగు మా ధీ వృత్తులను (బుద్ధి వృత్తులను) ప్రచోదన చేయువాఁ డెవ్వఁడు? అని భైరవుఁడు స్వామి బ్రహ్మ వైన నిన్ను వరేణ్యుని శరణొందితిని. సవితయొక్క యా వరేణ్య మగు భర్గమును ధ్యానించుచున్నాము, అని గట్టి రోదనము చేసెను. ఆకాశమునుండి యశ్రుబిందువులు రాలెను. అంతట రుద్రాక్షలు జనించెను. శివుఁడు బ్రహ్మవధచే భయపడి కపాలము చేతఁబట్టుకొని 'కపాలి' అని పేరొందెను. విశ్వమునఁ గల సర్వక్షేత్ర తీర్థములకు యాత్ర చేసెను. కాని యా బ్రహ్మ హత్యాపాపము తొలఁగదయ్యెను. కాని రుద్రాక్షవృక్షముల కడనున్న తటి నాతని దోషము దూరముగాఁ దొలగిపోయెను. అది మొదలు శంభుఁడు రుద్రాక్షల ధరించుచు కాశీపురమునకు వచ్చెను. అంత చేతిలో కపాలము విమోచన మందెను. అట కపాలమోచనము అను తీర్థమేర్పడెను. అంతలో బ్రహ్మ సర్వ దేవతలతోఁగూడి మహాదేవుని నుతించెను. సూర్యుఁడు మకర ములోనుండగా చంద్రున కధీశ్వరునిగా బ్రహ్మ కపాలియగు మహారుద్రుని గావించెను. ఈ బృహస్పతిమాట విని భైరవుడు తన ముఖమునుండి తన యంశము నాకర్షించి కాశీయం

దయోనిజుఁడై కపాలమోచనకుండమునుండి యావిర్భవించెను. అతఁడు యతిరూపుఁడై వేదనిధియై భైరవుఁ డను పేరొంది అఘోరమగు కఠినమయిన మార్గమునందు దన శిష్యులను బ్రేరేపించెను. తుద కతఁడు శంకరాచార్య స్వామివారి శిష్యుఁడై డామర మను మంత్రభూతమయిన తంత్రము నొనరించెను. కీలితములయిన మంత్రముల నాతఁ డుత్కీలితము లొనరించెను. (అనగా రహస్యసంకేతములుగా నుండి వినియోగమునకు రాని కొన్ని మంత్రముల నాతఁడు వినియోగమునకు దెచ్చెనని తోఁచెడిని).

## —: బా ల శ ర్మ :—

బృహస్పతి యిట్లనియె. త్రిపురాధిపతి చెల్లెలు మయుని కుమార్తె 'మండోదరి' యను నామె యుండెను. ఆమె గుప్త భావనచేసి త్రిపురాసుర సంహారమయిన తరువాత మహావిష్ణుని భక్తిచే సంతుష్టు నొనర్చెను. ఆ భక్తియోగముచే నామె వింధ్యాద్రికందరమున నంతర్ధానమయ్యెను. ఆమె సమాధి కాలము రెండువందల మహాయుగములు. వైవస్వతమన్వంతరము రాగాఁ బండ్రెండవ కృతయుగమున బ్రహ్మకుమారుఁడు పులస్త్యుఁడు విశ్రవసుఁడను వాఁడు నూరేండ్లు తపముచేసి సుమాలికూతురు కైకసిని బెండ్లాడి గంధమాదన పర్వతము మీద నరటితోటలో నామెతో విహరించెను. అంత రావణ కుంభకర్ణులు పుట్టిరి. రావణుఁడు మాతృభక్తుఁడు. వానితమ్ముఁడు పితృభక్తుఁడు. వేయేండ్లు ఘోరతపము చేసిరి. వారికి బ్రహ్మ

దేవదానవుల కజయ్యత్వము నొసంగెను. వాండ్రు పుష్పక విమానము గొని విహరించుచు లోకముల గడగడ లాడించిరి. పార్థివలింగ పూజచేసి శంకరునివలన వరములందిరి. మానససరోవరమున కుత్తరమున గౌతముని కుమార్తె 'అంజన' కేసరి యను వానరుని భోగిని యయ్యెను. శివుఁడు తన పూర్వార్థాంశముచే నా వానరునియందు బ్రవేశించెను. అతఁడు స్మరాతురుండై యంజనను గూడెను. ఇంతలో వాయుదేవుఁడు స్వాంశముచే కేసరి మేనఁ బ్రవేశించి యంజనదేవి నలరించెను. అట్లాదంపతులు పండ్రెండేండ్లు క్రీడించిరి. అంతట నంజని గర్భవతియై కుమారుంగాంచెను. రుద్రుఁడే వానరముఖుఁడై యవతరించెను. అతని కురూపముగని తల్లి పర్వతముక్రిందఁ బడవైచెను. ఆశిశువు సూర్యునివంకఁజూచి పండని మ్రింగుటకు పట్టుకొనెను. ఇంద్రుఁడు వజ్రాయుధము వైచిన నతనిని విడిచిపెట్టఁడయ్యెను. సూర్యుఁడు మొఱ్ఱోయని యార్చెను. అంతట రావణుఁడు తోకతో నా కపిశిశువును గ్రహించి యతనితో ముష్టియుద్ధము చేసెను. వానితోఁ బోరాడుట కాంజనేయుఁడు సూర్యుని విడిచిపెట్టెను. అంత రావణునితో నొకయేడు పోరెను. చివరకు రావణుఁడు భయభ్రాంతుఁడై పారిపోయెను. అంతట విశ్రవసుడు వేదమయస్తుతులచే రుద్రావతారమగు వానరుని కొనియాడెను. అంతట రావణుని వదలి యాంజనేయుఁడు పంపాతీరమున నివాసమేర్పఱచుకొనెను. అచ్చట స్థాణువై యుండెను; గాన 'స్థాణువు' అనుపేర రుద్రుఁడగు హనుమంతుఁడుండెను; అతఁడు దేవతలను బాధించు రావణుని గ్రుద్దులచే నలయించు

వాఁడై హనుమంతుఁ డలరారెను. అతనితపమునకు మెచ్చి బ్రహ్మ సాక్షాత్కరించెను. వినయమితుండై యున్న యాతనిగని వైవస్వతమన్వంతరమున నిరువదియెనిమిదవ యుగ మున త్రేతాయుగపూర్వపాదమున రాముఁ డవతరింపఁగా నాతని భక్తితో సేవించి కృతార్థుఁడు కాగలఁడు, అని ఛాదప్రద మునఁ బ్రకాశించు చంద్రు నాతనికొసంగి రావణునికి సుందరి యగు మండోదరిని బ్రహ్మ యొసంగెను. నైరృతుఁడను దిక్పాలునికి రావణుఁడు గల్గెను. అల్పాయువై రామునిచే మరణ మందెను. ఈమాట యయోనియగు హనుమంతుఁడు కదలీవనమున విని దేహము ధరించి భూమిపై 'బాలశర్మ' యను పేర జనించెను. కాశీపురి కేగి మణికర్ణికాఘట్టమున రామపక్ష మున బాలశర్మయు శివపక్షమున శంకర జగద్గురువులునుగా నిర్ణయము శాస్త్రార్థముచేసిరి. శంకరాచార్యస్వామివారిచే బాల శర్మ యోడింపబడెను. శిష్యుఁడై యటనే గురుసేవచేసి సర్వ జాతి వధామయమైన మంత్రతంత్రముల నొనరించెను.

—: 14 అ. రా మా ను జు లు ♦ :—

బృహస్పతి యిట్లనియె: ఈ దృశ్యము (ప్రపంచము) లేని యప్పుడు సదసదాత్మకము, నశ్వరమయము, పరము, నిత్యము,

♦ ఈ కథ కొంతదాక శివకల్యాణ వృత్తాంతమయి యుండి మీఁదట రామానుజాచార్య చరిత్రగా మారినది. రామానుజాచార్యుల వారి వాదమునకు శంకరాచార్యుల వారోడిరని యిందు వర్ణితమయినది. శంకర రామానుజు లేక కాలికులనుట దురూహము. అదిగాక రామానుజులవారితో శంకరులు సాక్షా త్తుగా వాదముచేసి రొడినట్లు నెక్కడను ఏ చరిత్రలు చెప్పుటలేదు. ఇది వైష్ణవపక్షపాతు లెవరో యిందు జేర్చిరని తోచుచున్నది.

శూన్యభూతము పరాత్పరము ననునది యొక్కటియే యోగి
దృశ్యమై యుండును. అది వ్యాప్తరూపము, అచింత్యము. అది
స్థూలముకాదు, సూక్ష్మముగాదు. శీతముగా దుష్ణముకాదు.
అది యాదిమధ్యాంత రహితము. ఆకారవర్జితము. దానికిఁ
గ్రిందుగానున్న రేఖ ప్రకృతి. అదేమాయ. మహత్త్వత్వమయి
దానికిఁ గ్రిందుగా రజస్సత్త్వతమో భూతలములగు రేఖ లూర్ధ్వ
ములయి యున్నవి. 'ఓం' అను సులక్షణమైన యా బ్రహ్మ
పరమని యెఱుంగనగునది. అందు కొంతకాలమున నొక యిచ్ఛ
జనించెను. అందుండి యహంకారము, దానినుండి తన్మాత్రలు
నందుండి పంచభూతములు జ్ఞానవిజ్ఞానములు జనించెను. ఇరువది
రెండు జడభూత తత్త్వములనుజూచి స్వేచ్ఛామయుండగు ప్రభువు
ద్వంద్వభూతుఁడై బుద్ధియను పేర జీవుఁడై యొప్పెను.
పూర్వార్థమునుండి సగుణుఁడు పరార్థమునుండి నిర్గుణుఁడు
నయ్యెను. ఆ రెండింటిచే సర్వము గృహీతమైనది. అందువల్ల
చైతన్య మేర్పడెను. ఆ చైతన్యమే విరాట్టు అను పేరొందెను.
విరాట్టు నాభినుండి పద్మము నూరుయోజనములు విశాలమైనది
జనించెను. ఆ పద్మమునుండి కుసుమము యోజనాయామమైనది
జన్మించెను. ఆపద్మమునుండి విరిఞ్చి ప్రాదుర్భవించెను. అతఁడు
రెండుభుజములు నాల్గుమోములు రెండు పాదములుగలవాఁడు.
అతఁ డేడుజానల శరీరముగలవాఁడు. అట్లు జనించి యతఁడు
దీర్ఘచింతలోఁ బడెను. నే నెవ్వఁడను? ఎక్కడినుండి ఎందులకు
వచ్చితిని? నా తల్లి యెవ్వతె? నా తండ్రి యెవ్వఁడు? అని
హృదయమున నాలోచించుచుండగా నతనికొక శబ్దము

వినిపించెను. 'నీ యీ సందేహనివారణకుఁ దపము చేయుము' అను నా శబ్దమువిని యతఁడు మహాత్తరమైన తపముసేసెను. వేయేండ్లు విష్ణుధ్యానము సేసెను. యోగగమ్యుఁడు, నిర్గుణుఁడు గుణవిస్తరుఁడు, చతుర్భుజుఁడు, శ్యామాంగుఁడు, బలవంతుఁడు అస్త్రధారి, దివ్యభూషణ భూషితుఁడు నగు హరి బాలుఁడై బ్రహ్మతొడపై తండ్రితొడమీఁదఁ గుమారుఁడట్లు కూరుచుండెను. అంతట విధి మేల్కని యతనింజూచి మోహపడి వత్సా! వత్సా! యనిపిలిచెను. విష్ణుఁడు నవ్వి 'నేను నీతండ్రిని' అనెను. నేను తండ్రిని నేను తండ్రినని వారిర్వురు వివాదపడుచుండగా రుద్రుఁడు జనించెను. ఆ రుద్రుఁడు కేవల తమోమయుండు, జ్యోతిర్లింగరూపుఁడు, భయంకరుఁడు, ననంతయోజనవిస్తరుఁడునై యుండెను. బ్రహ్మ హంసరూపుఁడై హరి వరాహరూపుఁడై యిర్వురు నూతేండ్లు క్రిందును మీఁదును సంచరించిరి. కాని యంతు దరి గానకవచ్చి సిగ్గుపడి యిద్దరు నా లింగమూర్తిని స్తుతించిరి. వారిచే వినుతుఁడై సాక్షాత్తు హరుఁడు ప్రత్యక్షమయ్యెను. అతఁడు కైలాసనిలయుఁడై సమాధిగతుం డయ్యెను. ఆరుద్రయోగి కైదు దివ్యయుగము లట్లు గడచెను. ఈలోపున ఘోరుఁడగు తారకాసురుఁడు వేయేండ్లు తపముచేసి బ్రహ్మ వలన వరముపొందెను. శివవీర్యముచే గలిగిన కుమారుఁడు నీకు మారకుఁ డగునని బ్రహ్మ తెల్పెను. అంత వాఁడు దేవతలను దండించెను. ఇంద్రుడు కైలాసవాసియగు రుద్రు నాశ్రయించెను. అతఁడు ప్రత్యక్షమై వరము కోరుమనఁగా నీ వీర్యమునఁ గలిగినబాలుఁడు తారకుని సంహరింపవలయునఁట. కావున

వివాహము చేసికొనుము. దక్షునికుమార్తె సతీదేవి వాని యజ్ఞ
మున దేహము వాసెను ఆమె తేజమే హిమగిరియం దవత
రించెను. హిమవంతుఁ డర్యముని కుమార్తె మేనయను దానిని
బరిణయమాడెను. హిమవంతుఁడు మనుష్యరూపుడై యామెతో
గ్రీడించెను. అంతట మేన తొమ్మిదిసంవత్సరములు గర్భము
మోసి గౌరియను కన్యం గనెను. ఆమె పుట్టినప్పుడే తొమ్మిది
యేండ్ల బాలయయ్యెను. ఆమె శంకరునిగూర్చి తపము చేసెను.
దేవత లామెను శంకరునికిఁ జూపి వివాహము చేసికొమ్మనిరి.
అంతట మహాదేవుఁడు దేవతలతో 'సురలారా! మీ పలు
కనుచితము. నాకంటెఁ బెద్దలగు రుద్రులు మృగవ్యాధాదులు
కుమారవ్రతధారులయి పదిమంది యున్నారు. వారు జ్యోతి
సముద్భవులు. వారిలో నేనుజిన్నవాఁడను. నా పేరు భవుఁడందురు.
యోగరాజును. నేను మాయారూపయగు నంగనను లోక
ధాత్రి నెట్లు వివాహమాడుదును? ఆమె సాక్షాద్భగవతి.
ఆమెచే విశ్వమెల్ల నిండియున్నది. ఆమె లోకమండలి యందఱు
యోగులకుఁ దల్లి. నేను యోగిని. నే నామె నెట్లు వరింతును?
అందువలన నేను మీకొఱకు నా వీర్యమును ధరింతును.
దాని నగ్ని పొంది మీ కార్యము నిర్వహించును. అని
దేవుఁడు తన వీర్యమును వహ్నికొసంగెను. హరుఁడు
తాను మాత్రము సమాధినిష్ఠుఁ డయ్యెను. అంతట నింద్రా
దులు వహ్నితో సత్యలోకమేగి ప్రజాపతికి సర్వము నివేదించిరి.
అతఁడు పరబ్రహ్మమునకు నమస్కరించి కృష్ణధ్యానము సేసెను.
ధ్యానమార్గమున బ్రహ్మ పరమస్థానమున కేగి శంకరునిభాషితము

సవేదించెను. అంత విష్ణువు తన మోహమునుండి తేజము నుత్పా దింపఁజేసెను. అందుండి సుందరముఖుఁడు బ్రహ్మాండ వర్ణుఁడు నగు ప్రద్యుమ్నుఁ డుదయించెను. వానితోఁగూడ బ్రహ్మవచ్చి యా దేవత లాతనిని సమర్పించెను. ఆతని తేజస్సుచే స్త్రీ పురుషులు ముల్లోకములందు నైక్యమయిరి. స్థావరములు కూడ సౌమ్యము లయి కామాగ్ని పీడితములయి నదులతో లతలతోఁ గలిసికొనినవి. బ్రహ్మాండాధిపతి శివుఁడు సాక్షాదుద్రుఁడు కాలాగ్నితుల్యుఁడై తన మూడవ నేత్రమునుండి తేజము నొందించి యా వ్యథను శమింపజేసెను. అంతట కంపితుఁడై కృష్ణాంగుఁడు (ప్రద్యుమ్నుఁడు) కుసుమచాపముగొని పంచ దివ్యశరములను మహాదేవుఁడు బంధువుఁడు నగు వానిపై వదలెను. ఉచ్చాటనమను బాణముచే లోకశంకరుఁడు గమన శీలుఁడయ్యెను. వశీకరణ బాణముచే శివుఁడు నారీవశుండయ్యెను. స్తంభనమను బాణముచే హరుఁడు పార్వతిపజ్జ స్థిరుఁడయ్యెను. ఆకర్షణముచే శివాకర్షణతత్పరుఁడై గొబ్బెను. మారణమను బాణముచే మూర్ఛితుండయ్యెను. ఇంతలో నా దేవి మహాత్త్వ మున నున్నదై మూర్ఛితుఁడైన శివునింగని యటనే యంతర్ధాన మందెను. అంతట శంభుఁడు లేచి మిక్కిలి విలపించెను. అంతట యోగినియగు గిరిజ యటకువచ్చి శంకరునకు మ్రొక్కి 'నేను కన్యను, తల్లిదండ్రుల చాటుదానను. వారియొద్దనుండి నీవు నన్ను జేకొనుము' శివుఁడట్లేయని సప్తర్షులను హిమవంతునికడ కంపిన వారు సంబంధము సంఘటింపఁ జేసిరి. బ్రహ్మాండమునందున్న దేవతలకు స్వామి మహేశ్వరుఁడు. ఆతని వివాహమునకు

వారనంతగణములుగా వచ్చిన హిమవంతుఁడు గని గిరిజను శర
ణొందెను. అప్పుడు పార్వతి యెల్లెడల నిధులను సిద్ధులను గోట్లకొల
దిగనందు వెలయుంచెను. బ్రహ్మాది దేవత లందుకు హర్షించి పార్వ
తిని స్తుతించిరి. 'ఉ' అనగా వితర్కము. మా యనగా లక్ష్మి. ఆమె
బహురూప. అందుచే ఉమయను పద మాతల్లి కేర్పడినది.
అట్టి శక్తికి నమస్కారము. గౌరవర్ణముచే గౌరి, శ్యామవర్ణ
ముచేఁ గాళిక, రక్తవర్ణముచే హైమవతియు నైన యాదేవికి
వందనము. చండికవగు నీయంతు దెలియలేను. నీవంబవు (తల్లివి).
అని యిట్లు నుతింప విని వరద, సర్వమంగళయగు నా దేవి మీకు
రాక్షసభీతి యెల్ల హరింతును. నేను భూమిపై నవతరింతునని
శంభునితో కైలాసమున గుహలో మనుష భావమున వేయేండ్లు
విహరించెను. ఇంతలో దేవతలు పిరికివారై శంకరుని వినుతిం
చిరి. అంతట నా పార్వతీపరమేశ్వరులు వారి కంటఁబడితిమని
సిగ్గుపడి పిమ్మటఁ బశ్చాత్తాపపడిరి. వారికోపముచే సురలు
పారిపోయిరి. ప్రద్యుమ్నుడు మాత్రము చెదరి పారిపోక వృష
భమువలె నిలువబడి రుద్రకోపాగ్నిచే దగ్ధుఁడయ్యెను. మఱియు
నాతఁడు భస్మరూపమును బాసి పిమ్మట సూక్ష్మదేహియై
యనంగుఁడను పేరొందెను. స్థూలరూపయగు రతి నూరేండ్లు
శంకరుని ధ్యానవశయై యారాధించెను. అంతట నతఁ డామెకు
'రతీదేవి ! నీవు లోకులకు యౌవనారంభమున లోకుల హృదయ
ములందుండి నాకొఱకు నీభర్తయగు ప్రద్యుమ్నుని గూడి
సుఖింతువు. ఇపుడు స్వారోచిషమన్వంతరము జరుగుచున్నది.
వైవస్వతమన్వంతరము రాగా, ద్వాపరాంతమున కృష్ణుఁ డవత

రించును. అప్పు డాతనికుమారుఁడగు ప్రద్యుమ్నుని మేరుశిఖర మున రమ్యమయిన నందనవనమున భజింతురు. ఇతర ద్వాప రాంతములం దా మన్మథుఁడు స్వర్ణగర్భుఁడై కృష్ణుని వలెనే యతఁడును భూమియందు వర్తించును. బ్రహ్మయొక్క మధ్యాహ్నమగునప్పుడు ప్రతికల్పమున హరి జనులకు లోక కల్యాణ మొనరించును. అని శంకరుఁ డంతర్ధానమందెను. రుద్రాణి గిరిజ యయ్యెను. గిరిజావల్లభుఁడు భవుండయ్యెను. ఈ మాట బృహస్పతి పలుకగా విని భవుఁడు తనముఖమునఁ దనయంశము నుత్పాదింపఁజేసి భూమియందు గోదావరీ నదీతీర మున ఆచార్యశర్మ యింట శంకరాంశుఁడై యవతరించెను. అతఁడే రామానుజుఁడు. రామశర్మ కతఁడు తమ్ముఁడు. ఒకప్పుడు రామశర్మ పతంజలి యోగమతము ననుసరించినవాఁడై తీర్థాట నము చేయుచు శివప్రియులగు కాశీపుర మేగి శంకరాచార్యుల నర్చించి శిష్యుఁడయ్యెను. అతఁడు కృష్ణపక్షముపూని వైష్ణవుఁడై శంకరులతో వాదించి యోడిపోయి సిగ్గుపడి రాత్రి యెవరికిఁ దెలియకుండ యింటికి వచ్చివేసెను. రామానుజుఁ డా మాటవిని సర్వశాస్త్రార్థవిశారదుండు కాన భ్రాతృశిష్యులతోఁ గాశీపురి కేగి శంకరులతో వాదించెను. ఒకనెల వాదాడినతరువాత నతఁడు వేదాంతమునందుఁ బ్రతిపాదితమైనవాఁడు హరి యని తెల్పెను. అతఁడే వాసుదేవుఁడు. వసుదేవుఁడను నాతడు వసువులయం దంశచేఁ బ్రకాశించుచున్నాఁడు. ఆ వసుదేవుఁడే బ్రహ్మ. వాని సారము వాసుదేవుఁడు. అతఁడే హరి. అతఁడు శివపూజకుఁడు. అదివిని శంకరాచార్యులవారు సిగ్గుపడి యొక పక్షము భాష్య

శాస్త్రమునందు శివుఁడు ప్రతిపాద్యుఁడని వర్ణించెను. రామానుజుఁ డాభాష్యమందును హరినే చూపించెను. గోవిందుఁడను దేవత వైయ్యాకరణి దీపతి పరా = పర యనెడు గాం = వాక్కును (పరా వాక్కు అన్నమాట. అది యోగిజనైకప్రత్యక్షము) దానిని బొందువాఁడు గోవిందుఁడు 'గిరిశుఁడు' గోవిందుఁడు కాఁడు. అతఁడు గిరుల కీశుఁడు, గోపాలుఁడు, రుద్రుఁడు కాఁడు. అతఁడు గవారూఢుఁడు. శంభువు పశుపతిగాని గోపతి కాఁడు. ఇదివిని శంకరులు సిగ్గుపడి మీమాంసాశాస్త్రవాదము నకు వచ్చిరి. పదమూఁడురోజులు వాదమయ్యెను. రామానుజ మతప్రియుఁడైన యజ్ఞపురుషుఁడు మృగభూతుఁడై నవాఁడు శంకరులచే విచ్ఛిన్నుఁడయ్యెను. ఆచార ప్రభవమైన ధర్మము యజ్ఞదేవునిచే నిర్మితము. యజ్ఞమున ప్రజాపతి వక్షము భ్రష్టాచారమయ్యెను. అన విని రామానుజుఁడు యజ్ఞము కర్మము కొఱకేర్పడినది. అది విశ్వపరిపాలన చేయఁగలది. కర్మము బ్రహ్మోద్భవము (వేదమువల్ల నేర్పడునది యన్నమాట బ్రహ్మము (వేదము) అక్షరసముద్భవము. ఆయక్షరము సాక్షాచ్ఛివుఁడే. అతఁడు శబ్దబ్రహ్మ మధిష్ఠించియున్నాఁడు. పురాణపురుషుఁడు, యజ్ఞరూపుఁడు, అతఁడే యక్షరుఁడు, అక్షరముకంటె పరమాత్మ యుత్తముఁడు. అక్షరతృప్తివల్ల యజ్ఞములో తృప్తుఁడు కాఁడు. అతఁడే యజ్ఞపురుషుఁడు. అతని పేరు వేదమందు లోకమందుఁ బ్రసిద్ధమై యున్నది. శివుఁడు ప్రపంచమ్యుని కభివృద్ధిగని మృగరూపియై దివ్యబాణములచే నతని తృప్తిపఱచెను. సమర్థుఁడగు యజ్ఞపురుషుఁడు గురుమయునిగా

శివునెఱింగి పారిపోయెను. అతనిచే ధర్మవ్యవస్థ గొప్పదిగాఁ జేయబడెను. శంకరుఁడు సిగ్గుపడి న్యాయశాస్త్రవాదమునకు వచ్చెను. భవుఁడనగా నగువాఁడు (భవతి) మృడుఁడనగా (మృడతి) సుఖపెట్టువాఁడు. లోకములను భరించువాఁడు కాన నతఁడు 'భర్గుఁడు.' హరించువాఁడు హరుఁడు. పాపమును రోదింపఁ జేయువాడు కాన రుద్రుఁడు స్వయముగా శివుఁడు. కర్త భర్త హర్తయును. శివునుండి విష్ణుఁడు, విష్ణునుండి బ్రహ్మ భూమికి వచ్చిరి. అని రామానుజుఁడు శంభునిమహిమ యుద్ఘాటము. ఇతఁడు నిజముగా ధన్యుఁడు నిజము నిజము నాయాజ్ఞయిదే. కర్త కారయితయు శంభుడే. రామనామము పరము. దానిని శంభుఁడేల జపించును? ఎవని తేజముచే ననంతసృష్టి జనించెనో యతఁ డనంతుఁడు. శేషించువాఁడు కాన శేషుఁడు అతనియందు లోకములు రమించు గాన రాముఁడు. అదే నా ప్రభువుయొక్క ధామము (తేజము). ఈ మాట విని శంకరుడు సిగ్గుపడెను. అంతట నతడు యోగశాస్త్రమెత్తుకొనెను. కాలరూపుఁడు యోగేశ్వరుఁడు కృష్ణుడే యని సాంఖ్యశాస్త్రమునఁ గపిలుఁడు హరియేయనియె. కల = వీర్యమును పాతి = రక్షించువాఁడు కపి. వాని రుద్రుని 'లాతి, యాకర్షించువాఁడు కపిలుఁడు. అతఁడు సర్వజ్ఞుఁడు సర్వరూపుఁడు. దానికి శంకరుఁడు లజ్జితుడై శుక్లాంబరములు దాల్చి గోవిందనామము జపించి శుద్ధుఁడై రామానుజునకు శిష్యుఁడయ్యెను. రుద్రమహిమ చెప్ప ప్రసంగములో నీకథ తెల్పితిని. ఇది విన్నవారు ధనధాన్య పుత్ర పౌత్రాది సమృద్ధి గలవా రయ్యెదరు.

## నవమహము

### —: 1౬ అ. త్రిలోచన వైశ్యుడు :—

బృహస్పతి యిట్లనియె. వైవస్వతాంతరమున కృతయుగ
మందు విశ్రవసుముని భార్య యిల్వల శివు నారాధించెను.
ఆలోన దీక్షితుల వంశమున యజ్ఞశర్మయను ధూర్తుఁడు
యక్షిణీపూజ చేయువాఁడు జనించెను. వా డొక స్నేహితుని
కోడలినిగూడి యా దోషముచే గుష్ఠరోగి యయ్యెను. మంత్రి
వత్సలయను యక్షిణి యా రోగిని విడిచి కైలాసమున కేగెను.
యజ్ఞశర్మ యాకలిగొని యొక శివరాత్రిపర్వమున స్త్రీ లొన
రించిన శివపూజ చూచి వారి యుపదేశముచే నుదయము
పారణ యొనరించెను. ఆ శివాలయములో నా యుదయమే
వాఁడు మరణించెను. ఆ పుణ్యముచే కర్ణాటకమునకు రాజై
పుట్టెను. రాజరాజను పేరొందెను. అతఁడు తన రాజ్యమున
నింటింట దినదినము శివార్చనము సేయించెను. అట్లు నూరేండ్లు
పాలించి కుమారునికిఁ బట్టాభిషేకము చేసి కాశీపురమేగి
విశ్వేశ్వరు నారాధించెను. మూఁడేండ్లయిన తరువాత పరమ
శివుఁడు జ్యోతిర్లింగ రూపుఁడై రాజరాజేశ్వరుఁ డను పేర
సాక్షాత్కరించెను. ఆ శివుని యనుగ్రహ మంది యా రాజు
ప్రాణములు వాసి యిల్వలా గర్భమున జన్మించెను. అతడు
పుట్టిన వేళ మంచిది గాదయ్యెను. అందుచే కుబేరుఁడను పేరొం
దెను. అతఁడు తపముచే బ్రహ్మను సంతృప్తి పఱచెను. బ్రహ్మ
వచ్చి 'అలక' యను వరమిచ్చెను. యక్షులు మూఁడు కోట్ల
మంది యని లెక్క కనిపించును. వారి కాతఁడు రాజయ్యెను.

అతని యాజ్ఞావశులయి కిన్నరులు బహురూపులయి యాతని బలులచే నర్చించిరి. అందుచే గిన్నరేశుఁడని పేరొందెను. గుహ్యకులు నరస్వరూపులయి దివ్యమాల్యములచే వ్యాపారము సేసిరి. వారికి నతఁడు ప్రభువయ్యెను. పర్వతములనుండి యాతఁడు రత్నములను సేకరించి లోకములకు రాక్షసుల ద్వారమున నింటింట జనము జనమునకందించెను. వేదపరాయణులు ధర్మకార్యపరులయిన వారి ధనాగారము లాతనిచేతనే నింపఁబడుచుండెను. లోభపరులు, ధూర్తులు నూరక పోగుచేయు వారికి కుబేరుని సోదరుఁడు (రావణుఁడు) రాక్షసపతి ద్రవ్యము సమకూర్చుచుండెను. శైవులయిన నరులు వహ్నిదగ్ధులయినపుడు వారి మాంసము నగ్నిమూలమున రాక్షసు లనుభవింతురు. అ ట్టైశ్వర్యసంపన్నుఁడైన కుబేరుని రావణుఁడు జయించి వెడల గొట్టి లంకాపతి యయ్యెను. అంతటఁ గుబేరుఁడు శంకరు నర్చించి యాతనికి హితుఁడయ్యెను. వానికి 'అలకాపతి' యను పురము నిర్మించి విశ్వకర్మ యిచ్చెను. అవ్వల రావణుఁడు కైలాసగిరి కేగి నలకూబరభోగిని యైన రంభను జూచి మోహించిన నామె 'ఓరీ! నీకు నేను గోడలిని (కుబేరుని కుమారుఁడు నలకూబరుడుగాన) దాకితివిగాన కుష్ఠురోగి వగుదు'వని శపించెను. అదిగాక నీవు నీ యన్న పుష్పకము లాగికొంటివి కాని యది నీకు నిష్ఫలమగుగాక! యనియు ననిన రావణుఁడుదుఃఖించి శివునిపార్థివ లింగపూజలచే నర్చించి పండ్రెండేండ్లు భక్తి సేసినను శంకరు ననుగ్రహము కలుగదయ్యెను. అంతట వాఁడు తన శిరస్సుల నగ్నిహోమము సేసెను. స్థూలదేహమ్మంతయు నగ్నికాహుతిం చెను.

భస్మమయ్యెను వాఁడు బ్రహ్మవరముచే నశింపఁడయ్యెను. అవ్వల నగ్నిసంభవమయిన దివ్యదేహమును బొందెను. వాయురూపుఁడగు రుద్రున కాదేహమును గూడ సమర్పించెను. వాయురూపులగు పిశాచులా మేనిం దిని వైచిరి. కాని వాఁడు వరలాభముచేఁ జావక వాయుదేవునిచే లభించిన కళేబరమును గొని యది యాకాశరూపుఁడగు రుద్రున కర్పించెను. అప్పుడు ఘోరములగు మాతృగణములచే భక్షింపఁబడియు చావక నభమునుండి పుటిల జన్మించిన శూన్యభూతమైన శరీరమును సోఽహం భూతుఁడగు శివునకే సమర్పణము చేసెను. అంతట నహంకార దేవతయగు రుద్రుఁడు ప్రసన్నుండై కుబేరునికివల రావణునికి మిత్రుండయ్యెను. ఒక్కొక్క తలకు గోటికోటి శిరస్సు లుత్పన్నములయ్యెను. వాని శరీరము వజ్రకఠిన మయ్యెను. వాఁడు బ్రహ్మాండమం దెల్ల విహరించి దేవదైత్య మనుష్య పన్నగుల భార్యలను బెండ్లికూతుండ్రనే హరించి క్రీడించెను. పతివ్రతా మతమయిన రమ్యమగు వేదధర్మము వానిచే భగ్నమయ్యెను. ఆకలిదప్పులు లేక వాఁడు శంకరునిచేఁ దర్పితుఁడై యజ్ఞములం దితరదేవతల విడిచిపెట్టెను. వారు క్షుధార్తులైరి. వారందరు నేకమయి క్షీరాబ్ధికేగి విష్ణు నర్చించిరి. అంతట నా విష్ణుదేవుఁ డిట్లనియె. శ్వేతవరాహకల్పమున నింతటిదానవుఁ డింతమున్ను పుట్టలేదు. మార్కండ కల్పమున శుంభనిశుంభులు, కుంభకర్ణుఁడు జనించిరి. రావణులును బెక్కురు జన్మించిరి. కాని యట్టి రావణుఁ డెన్నఁడు జనింపలేదు. నేను బ్రహ్మ రుద్రుఁడు జనించుటకుఁ గారణమైన ప్రకృతి మాయాశక్తి కోటివిశ్వ

విధాయిని. దేవతలకు సంకటము వచ్చినప్పు డది తీర్పఁగలవాఁడు భగవంతుఁడు హరుఁడు. రుద్రులకు సంకటము వచ్చినపుడు నేను దీర్ప సమర్థుఁడను. నాకు సంకటమయినపుడు హరుఁడు తీర్పనర్హుఁడు. బ్రహ్మకు దుఃఖమయినపుడు పరాప్రకృతి యది సవరింప నర్హురాలు. మున్ను మధుకైటభులను దానవులు జన్మించిరి. వారివలన దుఃఖమంది బ్రహ్మ జగదంబికను స్తుతించెను. అంతట నామె బలముచేతనే నే నా మధుకైటభుల సంహారించితిని. కావున నా యాజ్ఞచే మీరు సనాతనియగు విష్ణుమాయను శరణందుఁడు. ఈ మాటవిని దేవత లాదేవి నర్చించిరి. అంతట బ్రహ్మ జ్యోతిర్మయి యగు శివ రెండై సీతారామరూపముల నవని నవతరించెను. త్రిలిఙ్గజనని సీత. ఆమెచే రెండుగా విభజింపఁబడిన బ్రహ్మాంశము శబ్దారూపము లయి రామలక్ష్మణు లైనది. శబ్దమాత్రసమూహములకు రాముఁడు స్వామి. అర్థమాత్రసమూహములకు స్వామి క్లీబుఁడైన లక్ష్మణుఁడు. ఎవని వీర్యము వజ్రమయమై బ్రహ్మచర్యము దృఢమైనదో యతఁడు క్లీబుఁడు. అతని తరువాత వానరులు గూడ క్లీబులే యైరి. వారిద్దరికి మంగళదాయిని యగు పరాప్రకృతి సీత. ఆమె యయోనిజయై భూమినుండి యుద యించినది. ఆమె సర్వమునకు యోనికారిణి. సీతారామ సీతారామ యని వేయిమారులు జపించిన బుద్ధిమంతుఁడు నను వమ ఫల మందును. ఆ యిర్వురు కారణభూతులయిన దేవతలు రాఘేయుని యింట వెలసిరి. ఈ దృశ్యప్రపంచము గోచరించని వేళ ప్రకృతి యక్షరరూపమై శేషించి స్వేచ్ఛచే మూఁడు

తెఱగున్నైనది. అందు శేషుని పూర్వాంశము రాముఁడు. మధ్యాం
శము లక్ష్మణుఁడు. మూఁడవయంశముచే పుంనపుంసకరూపులగు
పరేశ్వరు లుదయించిరి. అంమ పంభాగము యోగనిద్ర. ఇతర
కల్పములందు క్షీరసాగరశయనుఁడగు హరియే రాముఁడు.
శేషుఁడు రుద్రరూపుఁడగు లక్ష్మణుఁడు. భగవతియగు లక్ష్మి
సీతయై జనకు నింట నావిర్భవించినది. సుదర్శనాయుధము
(చక్రము) భరతుఁడు హంసశంఖము శత్రుఘ్నుఁడు. శ్వేత
వారాహకల్పమున రాముఁడు పరాత్పరుఁడు. ప్రద్యుమ్నుఁడు
భరతుఁడు. అనిరుద్ధుఁడు శత్రుఘ్నుఁడు. వారిచే రాక్షసులు
విదళితులైరి. రాముఁడు తనకీర్తిని లోకమున వెలయించి
పుష్పకము కుబేరున కొసంగెను. రుద్రసంఖ్యలో వేయేండ్లు
రాజ్యముచేసి రామచంద్రప్రభువు పరమస్థాన మందెను. ఈ
వాక్యములు విని కుబేరుఁడు మొదటి వసుదేవత గావున తన
మోహమునుండి యంశము గ్రహించి వైశ్యుఁడై ధనదత్తుఁడను
వారి కుమారుఁడై త్రిలోచనుఁడను పేర మధురయం దవత
రించెను. అతఁడు సర్వద్రవ్యమును తీర్థములందు దాన మొసంగి
కాశి కేగి రామానందుఁడను వైష్ణవునికి మ్రొక్కి వశుఁడై
శిష్యుఁడయ్యెను. గురునాజ్ఞచే నవ్వాల యింటికే తెంచి రామభక్తి
పరుఁడై సాధుసేవియై యుండెను. రాముఁ డాతనియింట
దాసుఁడై పదుమూఁడవమాసమున సర్వవాంఛల నతని కొసంగె.
మణిరత్నాదుల సమృద్ధిగూర్చి స్వయముగా వైష్ణవయతులకు
బ్రాహ్మణుల కొసంగెను. మఱియు నా రామప్రభువు ‘ నేను
రాముఁడను, నీభక్తికి దాసుఁడనైతిని. నీయింట నున్నాను.

ఇంతటినుండి నీ హృదయమందు వసింతును, అని యంతర్హి
తుండయ్యెను. ఆ వైశ్యుండు భార్యను బుత్రుని బాసి వైరాగ్య
మంది సరయూతీరమున రామధ్యానపరుండై వసించెను.

### — 16 అ. నామదేవుఁడు :—

బృహస్పతి యిట్లనియె. ధ్రువునివంశమువాఁ డగు
ప్రాచీనబర్హి యను రాజు స్వాయంభువమన్వంతరమున ననేక
యజ్ఞములాచరించెను. నారదోపదేశముచేఁ దుద కాతఁడు
హింసామయమయిన యజ్ఞము మాని జ్ఞానియై వైష్ణవుఁడై
పదిమంది కుమారులం గనెను. ప్రచేతసు లను పేర వారందరు
నొక్కటై తండ్రి యాజ్ఞచే సముద్రమధ్యమునఁ దపము చేసిరి.
వారి తపమునకు మెచ్చి బ్రహ్మ యేడు సముద్రతీరములందు
నేడుగురను స్థాపించి యెనిమిదవవాని రత్నాకరమందును, నవ
ముని మానసోత్తరమందుఁ, బదియవవానిని మేరుశాఖయందు,
నుంచి సంతసించెను. మొదటివాఁడు ఆపస్సును వహించును
గాన ఆపవుఁడు అనంబడెను. రెండవవాఁడు వరుణుఁడు. యాదస
ములకుఁబతి. అతనికి బ్రహ్మ దైత్యుల బంధించు పాశమిచ్చెను.
అందుచే నతఁడు పాశియనంబడెను. అతఁడు మునుపటిజన్మమున
బ్రాహ్మణుఁడై శక్తిపూజకుఁడై యుండెను. ఆపవుఁడు వారుణి
త్రావువాఁడై భద్రకాళికి భక్తుఁడయ్యెను. నానారత్నములచేఁ
గ్రుచ్చఁబడిన రక్తమాలికలను రక్తచందనమును గొని మంత్ర
సంయుతుఁడై భద్రకాళికి సమర్పించి నవాక్షరమంత్రజపపరుం
డయ్యెను. విఘ్ననిర్ఘాతమగు దేవీచరిత్రము నిత్యము పారాయణ

చేయుచుండెను. ఇట్లు మహేంద్రునకు దేవి ప్రసన్నయై దర్శనమొసంగెను. ఆసమయమున [illegible]నుఁడై యిట్లనియె. విష్ణుకల్పమున మహిషాసురుఁ డుండెను. వాఁడు ముల్లోకముల జయించి ఇంద్రుఁడయ్యెను. స్వారోచిషమన్వంతరమున విష్ణువు తనముఖమునుండి తేజము నుత్పాదించి జ్వాలామాలియగు జ్యోతిర్లింగమూర్తియై వానిని సంహరించెను. రుద్రకల్పమున రోదనముచేయు శంభుముఖము నుండి రావణుఁడు వేయి శిరస్సులు కలవాఁడు బ్రహ్మాండరావణుఁడన జనించెను. వాఁడు లోకాలోకగిరికిఁ గ్రిందుగా వసించెను. వాఁడాఱవ మన్వంతరమున బ్రహ్మాండాధిపతి యయ్యెను. అవ్వల వైవస్వతమన్వంతర త్రేతాయుగమున రాముఁడు రఘువంశమున జనించెను. అతఁడు సంకర్షణుఁడే. పదునాఱేండ్ల యీడువాఁడై యతఁ డీశ్వరధనువగు నాజగవ మను ధనుస్సును విఱిచెను. అంత బ్రహ్మాదులు సహస్రముఖుఁడను రావణునికథ వినిపించిరి. అది విని సీతతో రాముఁడు హంసయాన మెక్కి లోకాలోకగిరి కేగి వానితో ఘోరముగఁ బోరాడెను. ఆతని హంసరథముమీఁది పతాకమున హనుమంతుఁ డుండెను. దానికి వేదములు గుఱ్ఱములు. సారథి బ్రహ్మ. రావణుఁడు రెండు కాలచేతులతోఁ బోరి రామలక్ష్మణులను మూర్ఛగొల్పెను. అంతట బ్రహ్మ స్తుతింప బ్రహ్మరూపిణియగు సీత శాంతయయి యా బ్రహ్మాండరావణుని సంహరించెను. బ్రహ్మకల్పమున తాలజంఘుని వంశమున మురాసురుఁడు రుద్రుని జయించి రుద్రాసనాధిపత్యము వహించెను. ఈ విషయము మహాదేవుఁడు క్షీరసముద్రశాయియగు

విష్ణునికిఁ దెలిపెను. అంతట హరి గరుడారూఢుఁడై యేగి యుద్ధము
చేసెను. వేయేం డ్లట్లు సంగరమయినం గని బ్రహ్మ వెలిచి పరా
ప్రకృతిని స్తుతించెను. ఆ దేవి కుమారియై సప్తవాహినియై
నాల్గు భుజములు గొనివచ్చి వానితో 'ఓరీ! నీ వీ దేవుని బరా
జయ మందించితివి. నేను విజయ యను శక్తిని. ఉన్మీలిని, వంజులి,
త్రిస్పృశ, పక్షవర్ధిని, జయ, జయంతి, విజయ యను పేర నేను
ప్రతివర్షమందు ఏకాదశీ రూపిణినైయుందును. నా కుమారుఁడు
వైష్ణవుఁడనువాఁడు. ఏకాదశి యను పేర నేను వేదమధ్యమం దుం
దును. నన్ను నీవు జయించి నా పాణిగ్రహణము చేయుము.
అంతట నీవు సర్వపూజ్యుఁడ వయ్యెదవు.' అనిన మురాసురుఁ డామె
రూపమునకు మోహపడి యామెతోఁ బోరి యొక్క యక్షణ
ములో నశించెను. వానితమ్ముఁడు నరకాసురుఁడు యుద్ధము
చేసెను. ఏకాదశీ దేవి హుంకారమాత్రముచేఁ బోరెను.
వారి ద్వార తేజము నన్నమధ్యమందుఁ బ్రవేశించెను. అంతట
నన్నము దుష్టమై మానవులకు రోగభయము కూర్చెను. అది
చూచి యేకాదశి రవిశుక్రుల నా యన్నము పరిశుద్ధిచేయుఁ
డనెను. వారట్లు చేసి దేవపూజ్యులయిరి. ఇదంతయు నీ లీల యని
దేవిని నుతించెను. భద్రకాళి యిది విని యావవునింగని 'ప్రళ
య వేళ నీవు నా యనుగ్రహముచే నెట్టి యాపద పొందవు, సుఖి
వగుము' అనియె. అంతట నా విప్రుఁడు వరుణుఁడయ్యెను. ఇట్లు
తెలుపు బృహస్పతిపలుకు విని రెండవవసువు వరుణుఁడు తన
యంశముచే దేహాలియందు (ఢిల్లీ) ధర్మభక్తునియింట జనించెను.
విధవయై గర్భిణియై ధర్మభక్తుని కుమార్తెయందు నామదేవుఁ

డను సాంఖ్యయోగపరాయణుఁడై జన్మించెను. అతఁడు బ్రహ్మ స్తంబపర్యంతమైన జగమెల్ల విష్ణుమయ మని గుర్తించి కాశికేగి రామానందుఁ డను విష్ణుభక్తుని సేవించి శిష్యుఁడయ్యెను. 'సికందర్' అను మ్లేచ్ఛరాజు దేహలీరాజయి నామదేవుని బిలిచి యరకోటి ధనమొసంగెను. వాఁడు కలిప్రియుఁడు. నామదేవుఁ డాధనముతో గంగకు మెట్లు కట్టించెను. ఆయోగి పదిమంది విప్రులను నైదుగురు రాజులను, ఐదుగురు వైశ్యులను, నూరుగోవులను, చనిపోయినవారిని బ్రతికించెను.

—: రంకణుఁడు :—

బృహస్పతి యిట్లనియె. విశ్వానరుఁడను బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు వేదపండితుఁడు. అతఁడు సంతానములేక బ్రహ్మను బూజించి ప్రకృతికంటెఁ బరుఁడగు కుమారునిమ్మని ప్రార్థించెను. విని యాశ్చర్యపడి బ్రహ్మ యిట్లనియె. ప్రకృతికంటెఁ బరుఁడొక్క పరమాత్మ. అతఁ డబుద్ధియై బోధించును. అశ్రోత్రియై శ్రవణము చేయును. అదేహియై స్పృశించును. అచక్షువై చూచును. అజిహ్వుడై రుచిచూచును. అఘ్రాణియై యాఘ్రాణించును. అముఖుడై వేదము చెప్పును. అకర్ముఁడై కర్మముచేయును. అపదుడై నడచును. అలింగియై భోగించును. అగుహ్యుఁడై గుహ్యభూమియైన యీ తత్త్వమును చేయును. శబ్దబ్రహ్మమై స్పర్శమయమై రూపబ్రహ్మమై రసాత్మకమై గంధబ్రహ్మమై పరమై

జ్ఞేయమైన యాతత్త్వమునకు నమస్కారము. ప్రకృతి పురుషుడు విధి అనాదియు వికారములు గుణములు ప్రకృతి సంభవములు. ప్రకృతి పురుషు లిద్దరు నేకార్థులు, ఏకశబ్దులు. ఏకరూపులు, నిత్యవిగ్రహులు, ఆదిమధ్యాంతరహితులు, నిత్య శుద్ధులు. పుంస్త్రీనపుంసకజనని ప్రకృతి. మాయ. పురుషుడు కవి, సూక్ష్ముడు, కూటస్థుడు, జ్ఞానతత్త్వరుడు అజన్ముడై జన్మించును. అట్టివాడు నీకు కుమారుడెట్లగును ? అందువలన మాయాభూతుడగు హరి నీ కుమారుడగును. ఇట్లని బ్రహ్మ యంతర్ధాన మందెను. అగ్ని యంతట వసువులకెల్ల పతియగుచున వాడు విశ్వానరునికి కుమారుడై వైశ్వానరుడను పేర జన్మించెను. అతడే పూర్వకల్పమున 'అనలుడు' అనబడెను. నైషధుడను బ్రాహ్మణుడు నలునిపోలిక నుండెను. నలవియోగ మంది పతివ్రతయగు దమయంతి తన తండ్రియింటికే తెంచి భర్తను వెదకించుటలో నలునిబోలికలో నున్న బ్రాహ్మణుని గని మోహపడెను. అంతట నశరీరవాణి 'ఇతడు నలుడు గాడు, బ్రహ్మవరముచే జనించిన అనలుడు. ఇతడు మహాసరస్వతి నారాధించినవాడు. ఆమహిమచే విశ్వానరునికొడుకైనాడు' అనెను. ఈ మాటవిని పావకుడు తన యంశముచే రంకణుడను పేర లక్ష్మీదత్తుని కుమారుడై కాంచనపురమున నవతరించెను. వానిభార్య 'యంకణ' యనునామె. వారిద్దరు ధర్మకార్యములకు ధనము వ్యయించి కట్టెలమ్ముకొని జీవించిరి. అతని గురువు రామానందుడు.

## —: కబీరు :—

దితికుమారులు విష్ణునిచే సంహరింపఁబడఁగా దితి కశ్యపుని పూజించెను. పన్నెండేండ్లు సేవయైనతరువాతఁ గశ్యపుఁడు భార్యను వరము కోరుమనెను. నా సవతికిఁ బండ్రెండుగురు కుమారులు. నా కిద్దఱే. వారైనను విష్ణునిచే నిహతులైరి. కాన నాకు ద్వాదశాదిత్యనాశకుఁడగు కుమారు నిమ్మ. అనిన విని కశ్యపుఁడు బ్రహ్మలోకమున, ధర్మము – అధర్మము అను రెంటిని నిర్మించెను. ధర్మపక్షమువా రతనికిఁ బ్రియులు. అధర్మపరులు శత్రువులు. అధర్మపక్షమువారు కాన నీ కుమారు లిద్దఱు నశించిరి. కావున నీవు శుద్ధభావము నూనుము. నీకుఁ జిరంజీవియగు కుమారుఁడు గల్గును. అనిన విని దితి శుభవ్రత మూనెను. అంత నామె గర్భమున నుత్తముఁ డుండెను. ఇంద్రుఁడు భయపడి దితియింట సేవకుఁడై వసించుచు, నేడవనెల రాగా దితి యశుచియై నిదురించినవేళ నంగుష్ఠమాత్రుఁడై వజ్రాయుధము గొని యామెగర్భమునఁ బ్రవేశించి గర్భము నేడుగా నొనరించెను. ఆ సప్తఖండములు జీవముగల్గి మిక్కిలి బలవంతములయి యుండఁగా నొక్కొక్కఖండమును మఱల నేడేడుగా నొనరించెను. అవ్వల వారితో వెలికి వచ్చి దితికి నమస్కారము చేసెను. దితి యతనియెడ ననుగ్రహమంది యా సంతానము ఇంద్రునికి సేవకులయిన మరుద్గణములుగా నొసంగెను. ఇంద్రుఁడు పూర్వజన్మమున 'ఇలుఁడను' వేదపండితుండై జనించెను. ఇలుఁడను పేర రాజునై విష్ణుభక్తుఁడై మఱి మనుకుమారుఁడై జన్మించెను. అతఁ డొంటరిగా గుఱ్ఱమెక్కి మేరువుమీఁది వనమున కేగెను.

చేసెవృక్షాంశభాగమున స్వర్ణగర్భమను ఖండమున రాజ్య
నిర్మాణము చేసికొని యందు నివసించెను. ఇలునిచే నావరింపఁ
బడినది గావున నాఖండమున కిలావృతమను పేరు గల్గెను.
భారతమున నేలోకము లున్నవో యివి యన్నియు నిలావృత
మున నున్నవి. వృక్షములలో నుండి మేరు వా యిలావృతమందు
బ్రహ్మచే నిర్మితమైనది. అందు బంగారు మెట్లు నిర్మించినవారు
మానవులు. ఆ సోపానములనెక్కి క్రమముగా లోకము స్వర్గ
లోకమును జేరును. అట్లు సదేహులయి వచ్చు మానవులను
స్వర్గమండలమునం గని సురలెల్లరు విస్మితులై మహేశ్వరుని
శరణొందిరి. భవానీసహితుఁడగు శంకరుఁ డది యెఱింగి యిలా
వృతవనమునఁ గ్రీడించెను. ఇంతలో వైవస్వతకుమారుఁడగు
నిలుఁడను నతఁడు ప్రాజ్ఞుఁడు వేటకై వచ్చి దిగంబరియైన సదా
శివునింగని కనులు మూసికొనెను. వానింగని సిగ్గుపడిన గౌరింగని
శంకరుఁడిట్లు శపించెను. 'ఈ ఖండమున నేను గాక యే మగవాఁ
డైన స్త్రీ రూపమందును' ఈ శాపముచే నిలుఁ డిల యను నంగన
యయ్యెను. ఆమె మేరుశిఖరమున బహుకాలము తపము చేసెను.
అట్లు ఇరువదియేడు మహాయుగములు జరిగెను. ఆమె త్రేతా
యుగమధ్యమున చంద్రకుమారుఁడైన బుధుని వివాహమాడెను.
మున్ను అయోధ్యాపతి యిలావృత మేగెను. అతనిభార్య మద
వతి పార్వతీవ్రతము చేసెను. అత్తఱి నిలుఁడను బ్రాహ్మణుఁ
డామెంగని మోహపడెను. ఆమెను దాకెను. అంతట నశరీర
వాణి యీ యిలుఁడను విప్రుఁడు కేవలము బ్రాహ్మణుఁడు
గాఁడు. ఇతఁ డనిలుఁడు (వాయువు). ఇతఁడగ్ని సేవచేయగా నగ్ని

ప్రసన్నుఁడై 'ఓయీ నీవు నలుబది తొమ్మిది రకముల వాయువులను జనింపఁజేయుదువు. నేను నలుబదితొమ్మిది రూపములు ధరించి నీకు సహాయపడుచుందును. కుబేరుఁ డిటువదియేటు భాగములయి వరుణునికి సహాయపడు స్నేహితుఁ డయినట్లే నేను నీకు మిత్రుఁడ నయ్యెదను. అనునంతట నా విప్రుఁడు దితి గర్భమున వాయువై జనించెను. ఇట్లు బృహస్పతి తెలుపుచుండగా ధాన్యపాలుఁడను వైశ్యుని యింట మూలగండమున నొక బాలుఁడు జన్మించి తలిదండ్రులచే విడువఁబడి కాశీనగరమున వింధ్యవనమునందు 'అలికుఁడను' పేర మ్లేచ్ఛుఁడై యుండెను. అతఁడు సంతతిలేనివాఁడై బట్టలు నేసికొనుచు కబీరుఁడను పేరొందెను. అతఁడు చాలచక్కనివాఁడు. అతఁ డేడవయేట గోక్షీరములు త్రావుచు రామానందుఁడను గురువు నాశ్రయించి రామధ్యానపరుం డయ్యెను. తన చేతులార సంస్కృతమైన యన్నమునే విష్ణునివేదన చేయుచుండెను. హరి సాక్షాత్కార మతని కయ్యెను.

—: న ర శ్రీ :—

ఉత్తానపాదుని కుమారుఁడు ధ్రువుఁడు. భగవదనుగ్రహమంది యుండెనుగదా! అతఁడు ధ్రువస్థాన మంది ప్రకాశించెను. అతఁడే దిక్పతి, అతడే భగణాధిపతి, నభఃపతి, కాలకర్త. శింశుమారచక్రమున కతఁడే ప్రభువు. పంచతత్త్వాత్మికయగు మాయారూపయగు ప్రకృతి కతఁడే స్వామి. వానికి భూదేవి యందుఁ గుజుఁడు (భౌముఁడు) జన్మించెను. ధ్రువునకు జలదేవి యందు శుక్రుఁడును, వహ్నిదేవియందు నేనును (బృహస్పతి యన్నమాట) వాసుదేవియందు కేతువును, నభోదేవియందు

రాహువును జనించిరి. అతనికి పూర్వదిశయం దైరావతము, ఆగ్నేయదిశయందు పుండరీకము, అట్లే తక్కిన దిశలందు వరుసగా వామనము, కుముదము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము నను దిగ్గజములు, నభోదిశలందు జనించినవి. అభ్రముపు, కపిల, పింగల, తామ్రకర్ణి, శుభ్రదంతి, అంగన, అంజనావతి యను, నాడయేనుఁగులు భూమి దిశలయం దుదయించినవి. సోదరి, తల్లి, కూతురు, కోడలు పశుయోనియందు జనించిన వారికి భార్య లగుదురు. దేవయోనియందు జనించిన నగులకు చెల్లెలు భార్యయగును. మనువువంశమున జనించినవారికి (మానవుల కన్న మాట) అన్యులకు జన్మించిన స్త్రీలు భార్యలగుదురు. ఈ ధర్మరహస్యము బ్రహ్మయే చెప్పినారు. నేను మీకుఁ దెల్పితిని. భూమికి మీదను క్రిందుగాను ధ్రువుఁడు రెండు విధములుగా నుండును. అతఁడు దివారూపుఁ డైనపుఁడు సత్త్వమయుడుఁగను రాత్రి రూపుఁడైనపుడు తమోగుణమయుఁడుగను నుండును. అధోధ్రువునం దెల్ల కాలము రాత్రియే కాని పగలనునది లేదు. అక్కడ నరకములున్నవి. ఊర్ధ్వధ్రువమం దెల్లపుడు పగలే కాని రాత్రియుండదు. ♦ భూధ్రువమందు రాత్రియు పగలు సమభాగములయి యుండును (తపోలోకమందన్న మాట) మహము జనము తపము సత్యము నను లోకము లందెల్లపుడు

♦ 'తపోమధ్యే నిశాదివా' అని మూలము. కాని యిది సరిగాదని నేననుకొని యిక్కడ భూధ్రువమని వ్రాసితిని. తపోలోకము నిత్యము పగలేయని తరువాతి పాదములో నున్నది. కనుక యిట్లు భావించితిని.

దినమే (పగలే). రౌరవము, అంధకూపము, తామిస్రమునకు నరకలోకము లంధకార బంధురములు. వానియందు కల్పమానమంతయు రాత్రియే. ధ్రువుఁడు పూర్వజన్మమందు విష్ణుభక్తుఁడగు బ్రాహ్మణుఁడు. అఱువదియేండ్లన్ని తీర్థములందు నతఁడు ప్రాతఃస్నానము సేసెను. ఆ పుణ్యముచే సునీతియందు ధ్రువుఁడై జన్మించెను. అతఁడు ముప్పదియాఱు వేలేండ్లు రాజ్యము సేసి ధ్రువస్థాన మందెను. ఈ బృహస్పతి వచనము విని యెనిమిదవ వసువగు ధ్రువుఁడు గూర్జర దేశమున నొక వైశ్య స్త్రీ యందు జన్మించెను. అతఁడు బృందావనమందు ప్రతిదినము శివానుగ్రహముచే విష్ణుక్రీడలు చూచి సంతసించుచుండెను. అతని కుమారుని వివాహమునందు భక్తవత్సలుఁడగు హరి యాదవులతో వచ్చి వాంఛితము లొసంగెను. అతఁడు కాశీపురమేగి 'నరశ్రీ' యను భక్తుఁడై రామానందుని శిష్యుఁడై విష్ణుధర్మ విశారదుండయ్యెను. బృహస్పతి యిట్లనియె.

### పీపుఁడు - నానకుఁడు - నిత్యానందుఁడు.

ఒకప్పుడు గంగాతీరమున ననసూయతో నత్రి తీవ్రతప మొనరింపగా స్వస్వవాహనారూఢులై త్రిమూర్తులు దయచేసి వరము కోరుమన నతఁడేమియు పలుకక పరమాత్మ తత్పరుఁడై యుండెను. అతని భావము గ్రహించి వారనసూయ దరికేగిరి. రుద్రుఁడు లింగహస్తుఁడై విష్ణువు రసవర్ధనుఁడై బ్రహ్మ కామ బ్రహ్మలోపుఁడై (అర్థముకాలేదు). మాకు భోగసుఖ మిమ్మని యడిగిరి. పతివ్రత వారి మాటవిని యేమియు పలుకదయ్యెను.

వారు మాయావశులై యామెను బలాత్కరించిరి. అంతట నామె కోపించి మీరు నాకుఁ గుమారులగుదురుగాక యనెను. అందుచే మహాదేవుని లింగము, బ్రహ్మ శిరస్సు, వాసుదేవుని చరణములు మానవులకే పూజనీయము లగునని యెను. అంతట వారు విని భక్తినమ్రులై యామెను నుతించిరి. అనసూయ మీరు నా పుత్రులై నా శాపము వాసెద ననెను. అంతట బ్రహ్మ చంద్రుఁ డయ్యెను. హరి దత్తాత్రేయుఁ డయ్యెను. హరుఁడు సాక్షాద్దూర్వాసుఁ డయ్యెను. వారందరు యోగులయిరి. ఇంతలోఁ బ్రకృతి వారి గుణవంతుల నొనరించెను. అంతట మన్వంతర ప్రవృత్తి యయ్యెను. వారి దరికి హృషితులను దేవతలు ముగ్గురువచ్చి చంద్రుఁడు సోముఁడను నాలవ వసు వగును. రుద్రాంశుఁడగు దూర్వాసుఁడు సప్తమ వసువగు ప్రత్యూషుఁడు. దత్తాత్రేయ మహాయోగి ప్రభాసుఁడను నెనిమిదవ వసువు. ఇట్లు తెల్పగా విని ముగ్గురు వసువులు తమ యంశలచేఁ గలి దోషము వారించుటకు భూమిపై నవతరించిరి. దక్షిణాత్య దేశమున రాజు గృహమున వైశ్యజాతియందుఁ 'పీప' అను పేర సోముఁడు సుదేవుని కుమారుఁ డయ్యెను. అతడు రాజ్యమేలి రామానందుని శిష్యుఁడై ద్వారకయందు వసించెను. అతఁడు కృష్ణునివలన బంగారపు విష్ణుముద్ర వడసి వైష్ణవుల కొసంగెను. అతని ప్రేతత్వమును నశింపఁజేయును. ప్రత్యూషుఁడు పాంచాల వైశ్యజాతిలో మార్గపాలుని కుమారుఁడై నానకుఁడను పేర (గురునానక్) రామానందుని శిష్యుఁడై మ్లేచ్ఛులను లోఁబఱచు

కొని సూక్ష్మమార్గము చూపెను. ప్రభానుఁడు శాంతిపురమున బ్రహ్మజాతియందు జనించి శుక్లదత్తుని కుమారుఁడై నిత్యానందుఁడను పేరొందెను.

—: సధనుఁడు, రైదాసుఁడు :—

( అశ్వినీకుమారుల అవతారములు )

ఇట్లు బృహస్పతి పలికి యశ్వినీదేవతలను జూచి వారి కథ యిట్లు తెలుపఁ బ్రారంభించెను. వైవస్వతమన్వంతరమున విశ్వకర్మ చిత్రగుప్తుల చిత్రలేఖన సౌందర్యముగాంచి యసూయ పడి మహామాయను భజించిన నామె 'సంజ్ఞ' యను పేర నవత రించెను. పదునాఱవ సంవత్సరము రాగా నామె తండ్రి మేరువుపై సర్వదేవతల నాహ్వానించెను. ఇఱువదియాఱుగురు యక్షరాజులు కుబేరాదులు వచ్చిరి. పదిమంది యాదఃపతులు (వరుణులు), నలుబది తొమ్మండుగురు పావకులు (అగ్నులు), అందరే వాయువులు, ఇద్దరు ధ్రువులు (ఊర్ధ్వధ్రువుఁడు- అధో ధ్రువుఁడు), పదునాఱుగురు సోములు, పదుముగ్గురు ప్రత్యూషులు, విప్రచిత్తి ప్రముఖులగు దానవు లెనుబదినాల్గురు, ప్రహ్లాదాదిదైత్యులు, వాసుక్యాదులగు పన్నగులు, శేషుఁడు మొదలయిన నాగులు, తార్క్ష్యాదులగు గరుడులు సంజ్ఞా స్వయంవరమున కరుదెంచిరి. గొప్ప కోలాహలముగా నుండెను. అంతట దేవకన్యలతో సంజ్ఞ యాకాశమునఁ బ్రత్యక్షమయ్యెను. ఆమెం గని బలవంతుఁడగు బలి యందరు విలుకాండ్రు చూచుచుండగనే చేయిపట్టుకొని దీసికొనిపోయెను. అంతట దేవదానవ

యుద్ధ మయ్యెను. ఉభయ సైన్యములందు హతులైనవారిచే నిలావర్తము దుర్గమ మయ్యెను. పదునేనురోజు లాసంగరము జరిగెను. పాంచజన్యుఁడు ధాతయు, హయగ్రీవుఁడు, మిత్రకుఁడును, అఘాసురుఁడు, అర్యముఁడును, బలుఁడు, ఇంద్రుఁడును, బకాసురుఁడు, వరుణుఁడును, శకటుఁడు, ప్రాంశువును, వత్సాసురుఁడు, భగుఁడును, వివస్వంతుఁడు, బలి, ప్రలంబుఁడు, పూష, గర్దభుఁడు, సవిత, విశ్వకర్మ, మయుఁడును, కాలనేమి, హరియును విజయకాంక్షులై యొండొరులుపోరాడిరి. దైత్యు లోడి పారిపోయిరి. వివస్వంతుఁడు సంజ్ఞాదేవిని గొని రథమం దెక్కించుకొని విశ్వకర్మ కొసంగెను. సంజ్ఞ వివస్వంతునే వరించెను. నీవు పరాక్రమముచే నన్ను గెల్చికొంటివి. సోదరుని కుమార్తెను బరిగ్రహించిన దోషము నీకు రాదు. స్త్రీ వీరభోగ్య యని మునులు తెల్పియున్నారు. ప్రకృతి గుణభిన్నయని గుణైకిక యని రెండు విధములయి యున్నది. గుణసామ్య యయిన ప్రకృతి మాత యనిపించుకొనును. సత్త్వభూతయైన యీ ప్రకృతి భగిని. రజోభూత గేహిని, తమోభూత కన్య. అట్టి ప్రకృతికి నమస్కారము. అట్లే పురుషులును నిర్గుణులు. సగుణులు నని యిఱు తెఱంగులు. నిర్గుణు లేకరూపులు, జ్ఞానులు. సగుణులు బహురూపులు, అజ్ఞానులు. వీరు దేవబ్రాహ్మణ రూపులు. జ్ఞానమయి యైన స్త్రీ పుత్రుఁడైన తండ్రియైన సోదరుఁడైన నగుఁ గాక యెవ్వనినేని వరించును. అతఁ డామెకు భర్తయే యగును. బ్రహ్మ స్వకీయమగు కుమార్తెను విష్ణువు తనతల్లిని శంభుఁడు తన భగినిని పరిగ్రహించి శ్రేష్ఠులైరి. ఇట్లు వేదోక్త

మయిన యామె వాక్యము విని యదితి కుమారుఁడగు వివ
స్వంతుఁడు భాత్రు కుమార్తె యగు సంజ్ఞను గ్రహించి శ్రేష్ఠుఁ
డయ్యెను. వారికి యముఁడు యమునయు జనించిరి. సంజ్ఞ
భర్తను కేవలము తేజోమయునిగా నెన్ని ఛాయను సృజించి
తాను తపమున కేగెను. ఆ ఛాయయందు సావర్ణిమనువు, శని,
తపతియనువారు సూర్యుని క్రూరదృష్టిచే జన్మించిరి. ఛాయ వారి
యెడ పక్షపాతము చేయుట చూచి రోషించి యామెను వివ
స్వంతుఁడు భస్మముచేసెను. అంతట శని సావర్ణియు తండ్రితో
యుద్ధముచేసి యోడిపోయిరి. వారు హిమగిరిపై తీవ్రతపము
చేసిరి. మహాకాలి వరము నిచ్చిన వారు వచ్చి మరల రవితోఁ
బోరాడిరి. సూర్యుఁడు జడిసి పారిపోయెను. సంజ్ఞ బడబాకృతి
దాల్చి కురుఖండమున తపస్వినియై యుండెను. ఆమెను జూచి
తాను హయమై యామెతోఁ గ్రీడించెను. అంత నామె
కిద్దరు కుమారులు గల్గిరి. వారు సూర్యమండలము దరి కేగఁగా
శత్రులని యెంచి వారిని లోహదండములచేఁ గొట్టెను. వారి
కాళ్లు విరిగి పోయెను. కాని ఆశ్వినేయులగు వారిని సూర్యుఁడు
గని జీవుఁడు ఈశ్వరుఁడు నెట్లో నరుఁడు నారాయణుఁడు నెట్లో
యట్లు మీరొకే నామమున 'నాసత్యు' లనఁబఱగుదురు. సోమ
శక్తి యగు ఇడాదేవి మీకు పెద్దభార్యయు సూర్యశక్తి పింగల
మీకు చిన్న భార్యయు నగుంగాక! మీలో మొదటివాఁ డిడాపతి
రెండవవాఁడు పింగలాపతియు నగుదురుగాక! పండ్రెండవ రాశికి
క్రూరదృష్టియగు శని రాజై మానవులు చేయు శాంతికి శుభం
డగుగాక! సావర్ణి మానవుల రాశిచక్రమునకు భ్రమ కారకుఁడై

శాంతికరుండగును. తపంతి జన్మలగ్నమందుండును. ఆ పాప కీర్తికి ఇడయుఁ పింగలయు శాంతి కూర్తురు. ఈ మాట విని యాశ్వినులు దేవవైద్యు లయిరి. సావర్ణి శనియు రాహువు కేతువునైరి. వారికి శాంతికరులై యశ్వినీ దేవతలు వర్తించిరి. అనిన విని యశ్వినీదేవతలు తమ యంశలచే శూద్రస్త్రీయందు జన్మించిరి. మేకలఁజంపు చండాలునియింట నిడాపతి సధనుఁడను పేర పితృభక్తుఁడై జనించెను. అతఁడు కబీరుశిష్యుఁడై వెలుగొందెను. వాఁడు క్రిందటి జన్మమున సత్యనిధియను బ్రాహ్మణుఁడై భయముచేఁ బారిన గోవును చండాలునికిఁ జూపించెను. దాన నతని పుణ్యము నశించెను. రెండవ వాఁడగు పింగలాపతి మానదానుఁ డను చర్మకారుని కుమారుఁడు రైదాసుఁడను పేర జన్మించెను. కాశీపురమున కబీరుతో మతవాదముసేసి శంకరాచార్యుల వారిదగ్గర కేగి వాదించి వారిచే నోడింపఁబడి వారికి మ్రొక్కి రామానందుల సన్నిధిని శిష్యుడయ్యెను. ఈ చరిత్రలు రెండును కలిపాపహారములు.

## —: 19 అ. రోషణుఁడు :—

ఇట్లు బృహస్పతి తెలిపి తన యంశముచే ఇష్టిక యను పురమున గురుదత్తుఁడను విప్రుని కుమారుఁడు రోషణుఁడను పేర జన్మించెను. బ్రహ్మమార్గప్రదర్శకుఁడై యొప్పెను. నూత్రగ్రంథమయి యగు మాలను జలనిర్మితమగు తిలకమును వాసుదేవమంత్రమును గలియుగమునఁ బ్రతి మానవునికి నందించి కృష్ణచైతన్యుని సన్నిధి కేగి యతని యాజ్ఞచేఁ గంబళమునుగొని తన యింటికేగెను. ఇకమీాద కృష్ణచైతన్యుని చరిత్రవినుము.

—: కృష్ణచైతన్యులు :—

కలిలో నెవ్వని చరిత్ర విన్నవారికి భయము కల్గదో యట్టి కృష్ణచైతన్యుల దివ్యచరిత్ర వినుమని యిట్లు సూతుండు శౌనకాదులకుఁ దెలుపఁదొడంగెను. యజ్ఞకర్తయు యజ్ఞాంశమును నగు కృష్ణచైతన్యుఁ డైదవయేడు వయసుగల్గియుండగా వంగదేశమున శారదాదేవి భక్తుఁడగు నీశ్వరుఁడను విప్రుఁడుండెను. అతఁడు సరస్వతీ వరమంది శాంతిపురమున వసించుచు సకలపండితులను శాస్త్రవాదములం దోడించి విలసిల్లుచుండెను. అతఁడు గంగాతీరమున దివ్యస్తవముచేసి పేరొందెను. అంతట యజ్ఞాంశుఁ డచట కేతెంచి స్తవముచేయుచున్న యీశ్వరుని దగ్గరకువచ్చి "నీవు చేయు స్తుతియందు సుకృతము ఇష్టాపూర్తములు (వాపీకూపతటాకాది నిర్మాణము) అర్ణము వేదసారములు వర్ణించితివి. ఇది దూషణమా లేక భూషణమా యని యడుగ నాతఁడు దూషణ మించుకయు నిందు లేదు. అంతయు భూషణమే యనెను. కాదు కాదు నీ చెప్పినదంతయు నిందయే (దూషణమే) యని చైతన్యుఁడు వాదించెను. మఱియు సుకృత మనునదే ధర్మము. పూర్త మనగాఁ జైతన్యము (జ్ఞానకళయున్న మాట) అర్ణమనగా వీర్యము. ఈ మూఁడు వేదముల సారభూతములు గంగాజలమునం దిది దూషణము. శరీరమునం దిది భూషణము అనెను. ఆమాటవిని సరస్వతీ భక్తుఁడు భిక్షుకుడు నగు నీశ్వరుఁ డాశ్చర్యపడెను. శారద తన వాఁడగు నీశ్వరుఁడు వాదమున నోడిపోయి సిగ్గుపడుటకని నీ వీకృష్ణ చైతన్యుని శిష్యుడవు కమ్మనెను. అతఁ డాల్లే చైతన్యుని శిష్యుఁడయ్యెను.

వెండియు నూతుండిట్లనియె. శ్రీధరుడను 'శివభక్తు డొకం డుండెను. ఆ బ్రాహ్మణుం డొకరాజు ప్రార్థనచే భాగవత సప్తాహము కావించెను. అందు లభించిన ధనముంగొని శ్రీధరుం డత్త వారింటికేగెను. అట కొంతకాలముండి భార్యతో స్వగ్రామము వెళ్ళుచుండగా దారిలో దొంగలుకొట్టి యాతని సొమ్ము హరించిరి. అతనిజంపి యాతని గోరథమును (ఎడ్లబండి యన్న మాట) భార్యను ధనమునుగూడ యా చోరులు తీసికొని పోయిరి. ఇంతలో సచ్చిదానంద విగ్రహుండైన రాముండా దొంగల నేడ్గురను సంహరించి బ్రాహ్మణుని బ్రతికించెను. శ్రీధరుం డదిమొదలుగ బృందావనమున నివసించి వైష్ణవాగ్రేసరుండయ్యెను. కృష్ణ చైతన్యుం డేడవసంవత్సరములో నుండగా శ్రీధరుండాతని సన్నిధికేగి బ్రహ్మజ్ఞానము వడసెను. అవ్వల నాతండు భాగవతమునకు టీక రచించెను.

—: బ ల భ ద్రుం డు :—

శంకరార్చనపరుండగు రామశర్మయను బ్రాహ్మణుండు కాశీనివాసియై యుండెను. అవిముక్తేశ్వరమున శివరాత్రి నా డతండొంటరిగాం బంచాక్షర జపతత్పరుండయ్యెను. లోకశంకరుండగు శంకరుండాతనికి సాక్షాత్కరించి వరము కోరుమనియె. అంతట నాతండు సమాధిగతులయిన మునుల కేదేవుండు పరముండై ధ్యానగోచరుండగునో యా దేవుండే నా హృదయమున వసించున ట్లనుగ్రహింపవేయని యడిగెను. అవ్యయుండగు పురుషుని యర్థతేజమై యొక్కటెయయ్యు మూండువిధముల గోచ

రించునదై శూన్యభూతయయ్యు బ్రహ్మస్వరూపిణియై యలరు ప్రకృతి మాయ యను నొక శక్తియున్నది. ఆమె పురుష తేజము గ్రహించి పుంనపుంసకరూపులగు నిర్వురు కుమారులను గన్నది. అందు పురుషుఁడు నారాయణుఁడు. అతఁడు గౌరవర్ణుఁడు (తెలుపు). ఎనిమిది బాహువులుగలవాఁడు. విశ్వరక్షకుఁడగు నా భగవంతుఁడు స్వేచ్ఛగా మూఁడు తెఱుఁగులయ్యెను. అందు సగము తేజము వాఁడు వనమాలి చతుర్భుజుఁడునగు విష్ణువు. అతఁడు క్షీరశయనుఁడు. అతఁడే ఆదిత్యుఁడు. అతఁడే సద్గుణదేవత. ఆశక్తియొక్క మిగిలిన సగభాగము నరనారా యణులను ఋషులు. జిష్ణుఁడు విష్ణుఁడుఁ నని. వారిర్వురు గంధ మాదనపర్వతమునం దున్నవారు. క్లీబుఁడు (నపుంసకుఁడు). కేవలము బ్రహ్మరూపము. అదే సంకర్షణమూర్తి. అందు పూర్వార్థము గౌరశేషుఁడు ( తెల్లని శేషమూర్తియన్నమాట. పరార్థము రామలక్ష్మణులు. గౌరశేషమూర్తియే ద్వాపరాంత మందు బలభద్రుండై యవతరించెను. రామలక్ష్మణధ్యానము బలభద్రపూజనము నేను జేయుదును. నీవు నది పొంది సుఖం పుము. అని యంతర్థానమై రామానందునికిఁ గుమారుఁ డయ్యెను. అతఁడు పండ్రెండేండ్లు వయసువాఁడగు కృష్ణ చైతన్యుని జేరి శిష్యుఁడయ్యెను. అతఁ డధ్యాత్మరామాయణము రచించెను.

—: జీవానందుఁడు - రూపానందుఁడు :—

జీవానందుఁడు రూపానందుఁడనువానితోఁ గృష్ణచైతన్య చరిత్ర విని శాంతిపురమేగి చైతన్యుఁడు పదునాఱేండ్లు యీాడులో

నున్నతటి ఆర్యా! తమ మతమేమని ప్రశ్నించెను. అంతట
నవ్వి చైతన్యుఁడు నేను శాక్తుఁడను. శక్తిపూజకుఁడను. శైవుఁ
డను. లోకక్షేమమునకై శివదీక్షఁగొని శైవుఁడ నగుదును. విష్ణు
ధ్యానపరుండనై వేదోక్తపుడు వైష్ణవుఁడు నయ్యెద. నేను
పాపపురుషునికి బలియైన భక్తియను మత్తును ద్రావి యది శక్తికి
సమర్పించి జ్ఞానాగ్నియందు హోమముచేయుదును.' అనిన
నతనికడ వారు శిష్యులైరి. అవ్వల సర్వులకుఁ బూజనీయులైరి.
రూపానందుఁడు కృష్ణఖండమను పురాణాంగమును రచించెను.
జీవానందుఁడు షట్సందర్భము అను నొక గ్రంథము రచించెను.

## —: విష్ణుస్వామి :—

విష్ణుస్వామియను విప్రుఁడు శాంతిపురమేగి పందొమ్మిది
యేండ్ల ప్రాయముగల చైతన్యుని దరికేగి ఏ దేవుఁడు సర్వదేవ
తలకుఁ బూజ్యుఁడు? అని యడిగిన నాతఁడిట్లనియె. సర్వదేవత
లలో శంకరుఁ డుత్తమోత్తముఁడు. అనుగ్రహకారకుఁడు. భగ
వంతుఁడు. హరుఁడు. విష్ణువునకు, రుద్రునకు, బ్రహ్మకుఁగూడ
ప్రభువు. అట్టి హరుని పూజసేయక యేమిసేసినను వ్యర్థమే.
వైష్ణవులయ్యు నెవ్వరు శివు నర్చింతురో వారికి విష్ణుభక్తి
సుస్థిరమగును. అనిన విని విష్ణుస్వామి చైతన్యునకు శిష్యుఁడై
కృష్ణమంత్రోపాసన చేయుచు శివారాధన తత్పరుండయ్యె.
గురుని యాజ్ఞచే వైష్ణవసంహితను నిర్మించెను.

## —: మధ్వాచార్యులు :—

కృష్ణభక్తుఁడగు మధ్వాచార్యులు యజ్ఞాంశుని (కృష్ణచైతన్యుని) మహానుభావుండని గుర్తించి శాంతిపురమునకేగి మ్రొక్కి కృష్ణుఁడు సాక్షాద్భగవంతుఁడు. తక్కిన బ్రహ్మాది దేవతలు సృష్టికారకులు కాన వారిని బూజించిన నేమి? శాక్తేయులు వృథాగా హింసామయములైన యశ్వమేధాదులచే దేవతల నర్చింతురు. అనినవిని శచీకుమారుఁడైన యజ్ఞాంశుఁడు కృష్ణుఁడు భగవంతుఁడు గాఁడు. ఇతఁడు తామసుఁడు. దొంగ, భోగి, హింసకుఁడు, మాంసభక్షకుఁడు. ప్రకృతికంటెఁ బరుఁడైన యుత్తమలక్షణసంపన్నుఁడే భగవంతుఁడు. బుద్ధిగలవాఁడు బ్రహ్మ. అహంకారము గలవాఁడు శివుఁడు. శబ్దమాత్రుఁడు గణపతి. స్పర్శమాత్రుఁడు యముఁడు. రూపమాత్రుఁడు కుమారుఁడు. రసమాత్రుఁడు కుబేరుఁడు. గంధమాత్రుఁడు విశ్వకర్మ. శ్రవణమాత్రుఁడు శని. త్వఙ్మాత్రుఁడు బుధుఁడు. చక్షుష్మాత్రుఁడు సూర్యుఁడు. ఘ్రాణ మశ్వినులు. బృహస్పతి ముఖము. హస్త మింద్రుఁడు. కృష్ణుఁడు పాదములు. లింగము దక్షప్రజాపతి. గుదము మృత్యువు. హింసాయజ్ఞములచే నతఁడు తృప్తినందును. యజ్ఞములం దుపయుక్తమైన పశువు బ్రహ్మత్వ మందును. దానికి మోక్షము గలిగించిన మహిమచే యజమాని పుణ్యమందును. ఎవఁడు శాస్త్రవిధిచేఁ గాక వృథాగా హింసా యజ్ఞము చేయునో వాఁడంధతామిస్రలోకము లందును. హింసా యజ్ఞములందు మహాపాపముగలదు మహాపుణ్యమును గలదు. ఇందులకే కృష్ణుఁడు కలియుగమునందు హింసాయజ్ఞము నాపి

కార్తికశుద్ధ పాడ్యమినాఁడు అన్నకూటమయమైన యజ్ఞమును స్థాపించెను. అంతట నిందుఁ డు పేంద్రునియెడ గోపించి వ్రజ వాటమును దారావృష్టిచే ముంచెత్తెను. అయ్యెడఁ గృష్ణుఁడు లోకరక్షణకు సనాతనియగు ప్రకృతిని సంతుష్టి పఱచెను. ఆ ప్రకృతి తన పూర్వార్ధతేజముచే రాధారూపము దాల్చి కృష్ణుని హృదయమునందు వసించెను. ఆమెశక్తిచే భగవంతుఁడు గోవర్ధనపర్వతము గొడుగుగాఁ బట్టి రాళ్ళవానను వారించెను. అయ్యెడ గిరిధరుఁడను పేరు కృష్ణునికిఁ గల్గెను. ఆ రాధాకృష్ణుఁడు పూర్ణబ్రహ్మము. ఇందుచే కేవలకృష్ణుఁడు భగవంతుఁడు గాఁడు. రాధాకృష్ణుఁడే భగవంతుఁడు. అతఁడే పరమాత్మ. ఈ మాటవిని మాధవాచార్యులు కృష్ణచైతన్యుల శిష్యుఁడై వారి సన్నిధానమున వసించెను.

—: కృష్ణచైతన్యుల చరిత్ర :—

## —: 20 అ. భట్టోజి దీక్షితులు :—

ఒకప్పుడు భట్టోజి దీక్షితులు కృష్ణచైతన్యుల వారికి నమస్కరించి మహాదేవుఁ డొక్కఁడే శరీరులకాత్మస్వరూపుఁడు అతఁడే గురువు. సర్వసమర్థుఁడు. విష్ణువు బ్రహ్మయు నతని దాసులు. కాన వారిని బూజింపనేల? అనినవిని కృష్ణచైతన్యుఁ డిఱువదియేండ్లవాఁడు చిఱునవ్వునవ్వి భట్టోజితో "ఓయీ! ఈ శంభుఁడు మహేశ్వరుఁడు గాఁడు. అతఁడు కర్తయుగాఁడు. విష్ణువుకంటె మఱియెవ్వఁరును భర్తలులేరు. శివుఁడు సంహార కుఁడు మాత్రమే. ఒక్కటే మూర్తి మూఁడుతీరు లయినది.

శాక్తతంత్రముల మూలమునఁ జేయు పూజచే బ్రహ్మ మోక్ష ప్రదాయకుఁడు. వైష్ణవ మార్గముచేఁ జేయు పూజలకు విష్ణువు మోక్షదాయకుఁడు. శైవమార్గమునఁ బూజించువారికి శంభుఁడు మోక్షప్రదుఁడు. శాక్తుఁడు గృహస్థాశ్రమి యజ్ఞభోక్త పితృదేవతాప్రసాదభాజనుఁడు. వానప్రస్థు వైష్ణవుఁడు. అతఁడు కందమూలాశనుఁడు. రౌద్రుఁడు (రుద్రభక్తుఁడు)శుద్ధరూపుఁడు. నిర్గుణుఁడు. బ్రహ్మచర్యాశ్రమము నుండియే తురీయాశ్రమ స్వీకారముసేయును. ఈ వాక్యములు విని చైతన్యులకు శిష్యుఁడై భట్టోజి వ్యాకరణముమీఁద వ్యాఖ్యానము రచించెను. అదే సిద్ధాంత కౌముది యని పేరందియున్నది.

—: వ రా హ మి హి రుఁ డు :—

సూర్యభక్తుడు వరాహమిహిరుఁడను పండితుఁడు కృష్ణ చైతన్యులను వారియిరువదిరెండవయేట దర్శించి ఈ సూర్య భగవానుఁడే ప్రాంతఃకాలమున బ్రహ్మయు, మధ్యాహ్నమున విష్ణువు, సాయంసమయమున సదాశివుఁడు నై యున్నాఁడు. కాన సూర్యోపాసన త్రిమూర్తుల యుపాసనయేకాని వేఱు కాదు. అనిన విని కృష్ణచైతన్యులు ప్రకృతి పర-అపరయని రెండువిధములు. పరాకృతి నామమాత్ర పుష్పమాత్ర తన్మాత్ర శబ్దమాత్ర స్పర్శమాత్ర రూపమాత్ర రసమాత్ర గంధమాత్ర యని యెనిమిది మూర్తు లయియున్నది. అపరా ప్రకృతి కేవలము జీవభూత, నిత్యశుద్ధ, జగన్మయి. భూమ్యాదులు, మనోబుద్ధ్యహంకారములు నపరాప్రకృతి కెనిమిది మూర్తులు

గలవు. విష్ణువు బ్రహ్మ మహాదేవుఁడు గణపతి యముఁడు గుహుఁడు కుబేరుఁడు విశ్వకర్మ యనువారుఁ బరాప్రకృతికి దేవతలు. సుమేరువు వరుణుఁడు వహ్ని వాయువు ధ్రువుఁడు సోముఁడు రవి శేషుఁడు అపరాప్రకృతి దేవతలు. కాన సోమపతి రుద్రుఁడు; సూర్యపతి సాక్షాద్బ్రహ్మ. శేషపతి హరి. అట్టి వానికి నమస్కారము. ఈ వాక్యములు విని శిష్యుఁడై వరాహమిహిరుఁడు నాల్గంగములుగల జ్యోతిశ్శాస్త్రము రచించెను. వరాహసంహిత, బృహజ్జాతకము, మరి యితర క్షుద్రతంత్రములను వరాహమిహిరాచార్యులు రచించుచు నా శాంతిపురమందే వసించిరి.

## —: వా ణీ భూ ష ణుఁ డు —

శివభక్తుఁడైన వాణీభూషణుఁడు కృష్ణచైతన్యుల వారితో "విష్ణుమాయ ప్రకృతి ఆమెవలన విశ్వము, విశ్వమువలన విశ్వదేవుఁడు జనించెను. త్రిమూర్తులకు మూలమైన శక్తి యొక్క తెరయే పూజ్యురాలు" అనిన విని చైతన్యుఁడు జడరూపయు త్రిగుణమయియు నగు ప్రకృతి యొక్కటే తనంతటఁదా నీ విశ్వమును సృజింపఁజాలదు. పురుషసహాయము లేనిది యది సాధ్యముకాదు. దేవీభాగవతమున నొక కథ ప్రసిద్ధమయియున్నది. వినుము. ఈ జగత్తు పుట్టియు జడమై కదలిక మెదలిక లేకున్నంజూచి ప్రకృతి శూన్యాత్మకుఁడైన పురుషుని మెచ్చజేసిన నాతఁడు మాయాజనితమైన విశ్వగోలకమున భగవంతుఁ డనుప్రవేశము సేసెను. పుంలింగ ప్రకృతి యందుఁ

జొచ్చి యతఁడు పుంలింగుఁడును స్త్రీలింగ ప్రకృతియందు స్త్రీలింగుఁడును నపుంసకప్రకృతియందు నపుంసకుఁడునై యాత్మ యున్నాఁడు. అవ్యక్తప్రకృతియం దున్నప్పు డితఁడే నిర్గుణుఁడు. అధోక్షజుఁడనను పేరొందినాఁడు. అట్టి శూన్యరూపుఁడు సాక్షియు నగు పరమునికి నమస్కారము. అనిన విని కృష్ణ చైతన్యులు ముప్పదియేండ్ల యీడున నున్నతఱి వారికి శిష్యుఁ డయ్యెను.

—: ధన్వంతరి :—

ధన్వంతరియను బ్రాహ్మణుఁడు బ్రహ్మభక్తుఁడు. కృష్ణ చైతన్యులవారి యొద్దకేగి నీవు పురుషశ్రేష్ఠుఁడవు, నిత్యశుద్ధుఁడవు, మాయ జడము. నిత్యుఁడు అవ్యక్తుఁడునగు నాత్మ వలనఁ బ్రకృతి జనించినది. కాన పరుఁ డొక్కఁడే పూజ్యుఁడు అనిన విని చైతన్యస్వామి పురుషుఁడు శ్రేష్ఠుఁడు కాన ప్రకృతి లేక యత డేమియు చేయనేరఁడు. వరాహపురాణమునఁ గథ యిట్లున్నది. నిత్యుఁడగు పురాణపురుషుఁడు స్వేచ్ఛచే బహురూపి యయ్యెను. కాని జగద్రచన యతనిచేతఁ గాదయ్యెను. చిరకాల మతఁడు ప్రకృతిని స్తుతించెను. ఆమెవచ్చి మహత్తత్త్వమును రచించెను. అందుండి క్రమముగా నహంకారము పంచతన్మాత్రలు మహాభూతములు వానినుండి యీ జగత్తు క్రమముగా జనించెను. కాన పురుషునికంటెఁ బ్రకృతి పరురాలు. ప్రకృతికంటెఁ బురుషుఁడు పరుఁడు. అట్లన్యోన్యపరమగు నాద్వంద్వమునకు వందనము. ఈమాట ధన్వంతరి విని శిష్యుఁడై గురుసన్నిధిని వసించి వేదాంగమగు కల్పవేదమును (ఆయుర్వేదము) రచించెను. శుశ్రుతాదు లాతని శిష్యులయిరి.

## —: జయదేవుఁడు :—

జయదేవుఁడు బౌద్ధధర్మపరుఁడై యుండి కృష్ణచైతన్యుల వారి యిరువదియైదవయేట వచ్చి నమస్కరించి ఎవ్వని నాభి నుండి బ్రహ్మకుఁగూడ కమల ముదయించెనో యా దేవుఁడు బ్రహ్మనూః (బ్రహ్మసువు) అని సామవేదములందుఁ గీర్తింపఁ బడెను. అతని జెండాయందు విశ్వుఁడగు నారాయణుఁడు వసించెను. కాన విశ్వకేతువని యతనికిఁ బేరుగలదు. నిరోధము లేనివాఁడుగాన 'అనిరుద్ధుఁడు' అనంబఱగును. ఆతని భార్య (బ్రాహ్మముహూర్తము. ఆమె నిత్య. ఉషయనియు నామెకుఁ బేరు గలదు. ఆ దేవుఁడు స్వయముగా లోకహితమునకై యర్చావతారుండయ్యెను. అన విని చైతన్యులు వేదమే నారాయణుఁడు. దానినుండి కాలము, దానినుండి కర్మము, దానినుండి ధర్మము, క్రమముగాఁ బ్రవర్తిల్లుచున్నవి. ధర్మమునుండి కామము, కామమునుండి రతి యను భార్యయు నేర్పడెను. రతియందుఁ గామమునకు జనించినవాఁ డనిరుద్ధుఁడు. వాని చెల్లెలు ఉష. ఇద్దరు నొకేమా రుదయించిరి. కాలమే కృష్ణుఁడు. ఆతని సహోదరి రాధ. బ్రహ్మ కర్మరూపి. వాని సోదరి నియతి. ధర్మరూపుఁడు మహాదేవుఁడు. శ్రద్ధ వాని సోదరి. అనిరుద్ధుఁడు సర్వేశుఁడెట్లంటేని, బ్రహ్మాండమందలి సృష్టి స్థూలము, సూక్ష్మము, కారణము నని మూడు విధములు. స్థూలసృష్టికి నారాయణుఁడు నారాయణియను శక్తి జనించిరి. వారినుండి నీరు పుట్టెను. అందుండి శేషుఁడు జనించెను. నారాయణుఁడు సుప్తుఁడైన తటి నాతని నాభినుండి పద్మ మనంతయోజన విశాలమయి జనించెను.

అందుండి బ్రహ్మ, వానినుండి స్థూలసృష్టి సంభవించెను. ఇఁక సూక్ష్మసృష్టి కనిరుద్ధుఁడు (ఉషాపతి) యతనినుండి బ్రహ్మాండ మస్తకమున వీర్యమయమైన నీరు, అందు శేషుఁడు నుండిరి. వారి నాభినుండి బ్రహ్మ జనించెను. సూక్ష్మసృష్టి స్వప్నమందు వలె జనించెను. ఇఁక కారణసృష్టికై వేదరూపుఁడై నారా యణుఁ డవతరించెను. వేదమునుండి కాలము, దానినుండి కర్మము, దానినుండి ధర్మాదులు నేర్పడినవి. నీ గురువును ఓఢ్రదేశవాసియగు జగన్నాథుఁ డవతరించెను. నేను శిష్యు లతో నట కేగవలయును. అనిన విని కృష్ణచైతన్యస్వామిశిష్యులు తమతమ శిష్యుల నాహ్వానించి యెల్లరు నట కేగిరి. శంకర శిష్యులు పండ్రెండుసంఘములవారు రామానుజుని దరి కేగిరి. నామదేవాదులు యేడుగురు శిష్యకూటములవారు రామానం దులవారికి మ్రొక్కి యటనుండిరి. రోపణుఁడు తన శిష్యులతో వచ్చి కృష్ణచైతన్యప్రభువును సేవించెను. భక్తిపరులగు వారెల్ల జగన్నాథపురమున కేగిరి. నిధులు సిద్ధులును నట వారిని సేవింప వచ్చి యుండెను. శైవశాక్త మతములవారు వైష్ణవులు కలిసి పదివేలమంది కృష్ణచైతన్యప్రభుని సేవించుచు జగన్నాథమున వసించిరి. ఉషాపతియగు ననిరుద్ధస్వామియం దర్చావతారుఁడై యున్నాఁడు. అతఁడు భక్తవరుల రాక గని విప్రుని వేషము దాల్చి కృష్ణచైతన్యులవా రున్నచోటి కేగెను. చైతన్యస్వామి యాతనింగని మ్రొక్కి, 'ప్రభూ! భయంకరమగు యీకలిలో మీ రేమి మత ముత్తమమని భావింతురు? కృపతోఁ దెల్పుఁడు.' అనిన జగన్నాథస్వామి స్వయముగా నిట్లనియె. మిశ్రదేశమంద

జనించిన మ్లేచ్ఛులు కాశ్యపునిచే శాసింపఁబడి శూద్రవర్ణము నుండి సంస్కరింపఁబడినవారై బ్రాహ్మణవర్ణమును జేరి (బ్రాహ్మణధర్మ మనుసరించి సాత్త్వికులయియన్నమాట) శిఖా యజ్ఞోపవీతముల ధరించి వేదము పఠించుచు యజ్ఞములు చేసి యింద్రుని బూజించిరి. అందుల కింద్రుఁడు దుఃఖించి శ్వేతద్వీపమున కేతెంచి నన్ను స్తుతించి దేవమంగళార్థము మేల్కొల్పి 'దయానిధీ! శూద్రసంస్కృతమయిన యన్నమును ద్విజుఁడు భక్షింప నర్హముగాదు. శూద్రులు చేయించు యజ్ఞములచే భగవంతుఁడు తృప్తినొందఁడు. కాశ్యపుఁడు స్వర్గస్థుఁడు కాగా మాగధుఁడు రాజై యుండగా నా శత్రువు బలి కలిపక్షమునఁజేరి నన్ను నిస్తేజస్కుని గావించెను. మిశ్ర దేశమందు జనించిన మ్లేచ్ఛునిచే సంస్కృతభాష సంస్కరింప బడినది. ఆ పని కేవలము దేవతల వినాశనమునకు దైత్యుల వర్ధనమునకుఁ దలపెట్టఁబడినది. ఆర్యులకు దూష్యమైన ప్రాకృత మునువాఁడు దెచ్చిపెట్టినాఁడు. కాన నిన్ను శరణొందెదు నన్ను రక్షింపుము. అనిన విని నేనపు డింద్రునితో నంటిని. ద్వాదశా దిత్యులు భూమిపై నవతరింపుఁడు. నేను లోకక్షేమ మాసించి కలిలో నవతరింతును. ప్రవీణుఁడు నిపుణుఁడు అభిజ్ఞుఁడు కుశలుఁడు కృతి ముఖ నిష్ణాతుఁడు శిక్షితుఁడు సర్వజ్ఞుఁడు సుగతుఁడు ప్రబుద్ధుఁడు బుద్ధుఁడు నను పేర ధాత మిత్రుఁడు అర్యమ శక్రుఁడు మేఘుఁడు ప్రాంశువు భగుఁడు వివస్వంతుఁడు పూష సవిత త్వష్ట విష్ణువు అను నాదిత్యులు కీకటదేశమున జననమందిరి. వేదనిందను గావించుచు బౌద్ధశాస్త్రవ్యాప్తి

గావించిరి. వారివద్దనుండి వేదములను గొని సురలు మునివరుల కిచ్చిరి. వేదనిందాప్రభావముచే దేవతలు కష్టముల పాలైరి. బౌద్ధరూపియైన విష్ణువును సుతించిరి. హరి యోగబలము చేతనే వారి శ్రమ హరించెను. ఆ దోషముచే బౌద్ధుఁడు నగ్నుఁడు (దిగంబరి) యయ్యెను. అందుఁ బూర్వార్థముచే నేమినాథుఁ డనియు పరార్థముచే బౌద్ధుఁడనియు నాతఁడు రెండు విధము లయ్యెను. బౌద్ధరాజ్య వినాశమునకే దారుపాషాణ రూపుఁడై సింధుతీరమున లోకరక్షార్థము జగన్నాథమూర్తియై యవత రించెను. స్వర్గలోకమునుండివచ్చిన యింద్రద్యుమ్నుడను రాజా స్వామికాలయము కట్టించెను. ఇట కృష్ణచైతన్యులవారి మహిమ కేంద్రీకృతమైయున్నది. అది సర్వాభీష్టదము. మోక్షదమును. ఇచట వర్ణధర్మముగాని వేదధర్మముగాని పాటింపఁబడదు. ఈ కృష్ణచైతన్య మండల మందొక యోజనము మేర ప్రతినియమ పరిపాటియుండదు. యవనభాష మాటలాడువారిని బౌద్ధులను జూచినవారిని బవిత్రము చేయుటకే నేనిట్లు జగన్నాథమూర్తి నయ్యెదనని భగవంతుడు తెల్పెను. కలికాలమున నా దర్శనముఁ చేయువారు శుద్ధులగుదురు.

--: 21 అ. బౌద్ధమతవిధ్వంసనము – ఆర్యమతప్రవర్తనము :—

జగన్నాథుల వాక్యము విని కృష్ణచైతన్యులు 'ప్రభో! మీ మతము ననుసరించి యుత్తమ శ్రేయస్సేదియో తెలుపుఁ డన జగన్నాథుం డిట్లనియె. కలిలో వేయేండ్లు గడచిన తరువాత కణ్వుఁడనుముని కశ్యపుని కుమారుఁడై యుదయించును. వాని

ఐ ర్యా 'త ్యవ' యను దేవకన్యక. వారు సరస్వతీతీరమున నిద్రాజ్ఞచే దంపతులయి వర్తించిరి. కణ్వుఁడు వేదసూక్తము లచే సరస్వతీనదిని నుతించెను. ఒక సంవత్సరములో దేవి ప్రసన్నయై యార్యసంతతి వృద్ధి నందునట్లువరమిచ్చెను. వారికిఁ బదియుంది కుమారులు కలిగిరి. వారి పేరులు ఉపాధ్యాయుఁడు దీక్షితుఁడు పాఠకుఁడు శుక్లుఁడు మిశ్రిశుఁడు అగ్నిహోత్రి ద్వివేది త్రివేది పాండుఁడు చతుర్వేదియుని. వారు సరస్వతీదేవి నారాధించిరి. ఆమె ప్రసన్నయై వారికిఁ యీడువారైన తటి వారికిఁ గ్రమముగా నుపాధ్యాయి దీక్షిత పాఠకి శుక్లిక మిశ్రిణి అగ్నిహోత్రిణి ద్వివేదిని త్రివేదిని పాండాయని తుర్యవేదిని యను కన్యలను భార్యలనుగా నొసంగెను. ఆ దంపతులకుఁ బదునాఱు గురవంతున గోత్రికర్తలగు కుమారులు గల్గిరి. వారి పేరులు కశ్యపుఁడు భరద్వాజుఁడు విశ్వామిత్రుఁడు గౌతముఁడు జమదగ్ని వశిష్ఠుఁడు వత్సుఁడు గౌతముఁడు పరాశరుఁడు గర్గుఁడు అత్రి భృగువు అంగిరస్సు శృంగి కాత్యాయనుడు యాజ్ఞవల్క్యుఁడు నని యేర్పడినవి. కణ్వుఁడు సరస్వతీశాసనముచే మిశ్రదేశమున కేగి మ్లేచ్ఛులచే సంస్కృతము భాషింపజేసి పదివేలమంది దాక వారిని స్వాధీనపఱచుకొని బ్రహ్మావర్తనమున కేతెంచెను. వారందరు తపస్సుచేసి సరస్వతిని బ్రసన్నం జేసికొనిరి. అయిదేండ్లకు దేవి ప్రాదుర్భవించి యా మ్లేచ్ఛులను శూద్రవర్ణాంతరులను గావించెను. వారందరు కారువృత్తి (వడ్రంగము) నాశ్రయించిరి. వారిలో రెండువేలమంది వైశ్యులయిరి. వారిలో నాచార్యపృథువు అనునాతఁడు కశ్యపసేవకుఁడు పం

డ్రెండేండ్లు తపముచేసి కణ్వుని యనుగ్రహ మందెను. వానికిఁ గణ్వుఁడు తూర్పుదిశ నొక గ్రామమిచ్చెను. అది మాగధ మను పేరొందెను. కణ్వుఁడు స్వర్గస్థుఁడైన తరువాత శూద్రవర్ణులయిన మ్లేచ్ఛులు యజ్ఞము లొనరించి యింద్రుని సేవించిరి. ఇంద్రుఁ డందులకు దుఃఖించి దేవతలతో వేదములను హరింప బ్రాహ్మణుఁడై యవని నవతరించెను. అతఁడే జినుఁడను పేరొందెను. వానిభార్య 'జయని' యను నామె. వా రదితికశ్యపుల యంశములచే కీకటస్థలమందుఁ బుట్టిరి. వారివలన నాదిత్యులు లోకక్షేమకారణులయి జనించిరి. కర్మనాశ యను నదీతీరమున బోధగయ యను పురము గలదు. వారచట నివసించి బౌద్ధశాస్త్రార్థములు గావించిరి. వేదములను శూద్రులపరముచేసి విశాల కేగిరి. సమాధినున్న మునులందఱకు నా ధర్మముల నేర్పి వెడలిపోయిరి. అదిమొదలు భూమిపై దేవతలు లేకుండ వెడలిపోయిరి. మ్లేచ్ఛులు బౌద్ధులయిరి. మఱి యితరులు వేదతత్పరు లయిరి. సరస్వతీప్రభావముచే వా రార్యు లనబడిరి. వారు దేవపితరులకు హవ్యకవ్యములు సమర్పించిరి. కలిలో నిరువదియేడువేల యేండ్లయిన తరువాత బలి పంపగా మయాసురుఁ డవనికేతెంచెను. శాక్యసింహగురువై ప్రసిద్ధికెక్కెను. అతఁడు బహుమాయావి. గౌతముఁ డను పేర నతఁడు బౌద్ధధర్మమును వ్యాపింపఁజేసెను. వానిచే నన్నితీర్థములందు యంత్రములు స్థాపింపఁబడెను. శిఖాయజ్ఞోపవీతములు వీడి వర్ణసంకరులయి పదికోట్లమంది యార్యులయ్యెడ బౌద్ధులయిరి. అయిదు లక్షల

మంది మిగిలినవారు పర్వతములకు బోయిరి. చతుర్వేదప్రభావ
ముచే వహ్నివంశీయులగు రాజు లిరువదినాల్గు కుటుంబముల
వారు యోధులయి బౌద్ధులను జయించిరి. వారిని సంస్కరించి
వింధ్యదక్షిణమున స్థాపించిరి. అచట మతాల వర్ణవ్యవస్థ
యేర్పడెను. అయిదు లక్షలమంది యార్యులు చరించిన నేల
యార్యావర్త మనంబడెను. ఈ మాటవిని కృష్ణచైతన్యుఁడు
జగన్నాథుని శిష్యుడయ్యెను. శుక్లదత్తుని కుమారుఁడు నిత్యా
నందుఁడను విప్రుఁడు జగన్నాథునకు శిష్యుఁడయ్యెను. అంతట
నయ్యుమాపతి యనిరుద్ధుఁడు వారిద్దరియెడఁ బ్రసన్నుఁడయ్యెను.
మార్కండేయవటమున జగన్నాథుని దర్శించి సముద్రమందును
నింద్రద్యుమ్నసరస్సున స్నానము చేసినఁ బునర్జన్మము కలుగదు.
ఈ కథయు ననంతఫలదము. ఇట్లు నడచిన కథ విని కలిచేఁ
బ్రార్థితుఁడై బలి దుఃఖితుఁడై మయునితో సుకందుఁడను మ్లేచ్ఛ
రాజు నా యభివృద్ధి కోరువాఁడు. వానికి నీవు సహాయము
చేయుము. అనిన మయుఁడు నూరుగురు దైత్యులతోఁ గూడి
కర్మభూమి కేతెంచి యేడు మోక్షపురములందును యంత్రము
లను నిర్మించెను. వానికిఁ గ్రిందుగానున్న లోకములన్నియు
మ్లేచ్ఛమయము లయిపోయెను. అంతట నార్యులకు శోక
కారణమై పెద్ద కోలాహలము బయలుదేరెను. కృష్ణచైతన్య
భక్తులగు వైష్ణవు లది విని గురూపదిష్ట దివ్యమంత్రము జపించి
ధన్యులయిరి. రామానందుని శిష్యుఁ డా మంత్రమునూదల
క్రిందుగా నుపదేశించి యామ్లేచ్ఛు లందరిని వైష్ణవులను
గావించెను. ఫాలమునఁ ద్రిశూలచిహ్నముగ (నామములు)

కంఠమునఁ దులసిమాల నాలుకపై రామనామము వారికిఁ బ్రధానము లయ్యెను. రామానందుల మహిమచే మ్లేచ్ఛు లందరు వైష్ణవు లయిపోయిరి. రామానందమతమున వారు 'సంయోగులు' అను పేరందిరి. ముఖ్య వైష్ణవులగు వార్యు లయోధ్యయందు వసించిరి. నింబాదిత్యుఁడుఁ (నింబార్కుఁడన్న మాట) శిష్యులతోఁ గంచి కేగెను. అచట రాజమార్గమున నున్న మ్లేచ్ఛ యంత్రమును జూచి తన గురుమంత్రమును విలోమముగా (తలక్రిందుగా) జేసి యుపదేశించి యచటనే యుండెను. అంతట నచటివారందరు వైష్ణవులయిరి. విష్ణుస్వామి హరిద్వారమునఁ దన వర్గముతో నేగి యచటి బౌద్ధయంత్రము మును దలక్రిందులు చేసెను. ఊర్ధ్వపుండ్రము (రెండు రేఖలతో) దానినడుమ బిందువునుంచి తులసిమాల దాల్చి మోమున మాధవ మంత్రము జపించుట వారి లక్షణమయ్యెను. మధురకు మాధవాచార్యులు వచ్చి రాజమార్గమునందలి బౌద్ధ యంత్రము మును దలక్రిందుచేసి లలాటమున ముక్కు సగభాగము, చివరి దాక శరపీరపత్రతుల్యమయిన బొట్టు, తులసివేరు, రాధాకృష్ణ మంత్రము తన ముఖ్యలక్షణములుఁగా బ్రచారము చేసెను. శంకరాచార్యులవారు శైవమార్గపరాయణులయి రామానుజుల యాజ్ఞచేఁ గాశీపురమున కేగి యచట బౌద్ధయంత్రమును దారు మారు చేసి మోమున త్రిపుండ్రము, రుద్రాక్షమాల, గోవింద మంత్రము నుపదేశించెను. రామానుజులు తోతాదరి యను పురమున కేగి లలాటమునఁ గంఠమందు నూర్ధ్వరేఖలనడుమ పసుపువచ్చని యూర్ధ్వరేఖయొకటియు తులసిమాలయు నుపదే

సించెను. ఉజ్జయినియందు వరాహమిహిరులు యంత్రము నిష్ఫలముచేసి యందరిని శైవులను గావించెను. ఫాలమున చితాభస్మము, కంఠమున రుద్రాక్షమాల, శివనామజపము నాతని మతచిహ్నము లయ్యెను. కాన్యకుబ్జమున వాణీభూష ణుఁడు అర్ధచంద్రాకృతియైన నామము, రక్తచందనమాల, దేవీ నామము నాతని లక్షణములయ్యెను. ధన్వంతరి ప్రయాగలో యంత్రము నశింపఁజేసి అర్ధభాగ మెట్టని పుండ్రము, నొక బిం దువును రక్తచందనమాలయు తన చిహ్నములుగా నుంచెను. భట్టోజి యుత్పలారణ్యామేగి త్రిపుండ్రము, కంఠమున రుద్రాక్షమాల విశ్వనాథనామజపము లక్షణము నొనరించెను. రోషణుఁ డీక్ష్టికయను పురమేగి యచటి యంత్రమును దల క్రిందుచేసి జనమునకు బ్రహ్మమార్గ మువదేశించెను. జయ దేవుఁడు ద్వారకలో విష్ణుభక్తి యొక్క మెట్టని నామము ఫాల మున, మెడలోఁ దామరపూసలమాల గోవిందమంత్రము ముఖ్య చిహ్నములు గావించెను. ఇట్లు శైవులు వైష్ణవులు శాక్తులుగాఁ బలురీతులయిరి. శాక్తులు నిర్గుణులు, వైష్ణవులు సగుణులు శైవులు సగుణనిర్గుణులు నై యొప్పిరి. నిత్యానందుఁడు శాంతి పురమందును నదీహానగరమున హరియు, కబీరు మాగధమందు, రైదాసు కలింజరమున, సధనుఁడు నైమిశమున సమాధి నందిరి. ఇప్పటికిని వైష్ణవసంఘము లటనున్నవి. యజ్ఞవృద్ధియయ్యెను. ఇంతవరకుఁ గృష్ణచైతన్యులవారి దివ్యచరిత్రి మీకుఁ దెల్పితిని. మయాసురాదులు నిష్ఫలులై బలిదగ్గరకుఁ బోయిరి.

—: 22 అ. అక్బరు - అతని యాస్థానపండితులు :—

బలి యీ కథ విని రోమణుఁడను మఱియొక రక్కసుని బిల్చి 'తిమిరలింగుని కొడుకు సరుషుఁడనువాఁడు కలఁడు. నీవు వానికడకేగి రాక్షసకార్యము చక్కఁబెట్టుము' అనిన వాఁడు వేదమార్గగాములయిన దేహలీపురవాసులను బాధచేసెను. సరుషుఁ డైదేండ్లు పాలించినతరువాత వాని కుమారుడు ♦ 'బాబరు' ఇరువదేండ్లు పాలించెను. అవ్వల హోమాయువు † (హుమాయూన్) మదాంధుఁడై దేవశత్రువై పాలించెను. దేవతలప్పుడు నదీహోవనవాసియగు కృష్ణచైతన్యుల శరణుఁ బొందిరి. అంతట నాస్వామి కోపముగొని వాని రాజ్యమునకు భంగముచేసెను. అంతట మహారాష్ట్రులు శేషశాకునికిఁ (ఇతఁడుఁ సూర్ వంశమువాఁడు) బట్టముగట్టిరి. వాఁడు మ్లేచ్ఛుఁడయ్యు ఢిల్లీని న్యాయముగానే (15 సంవత్సరములు) యేలెను. (వీనిని హుమాయూన్ మరలజయించి యొక్క సంవత్సరము పాలించి నట్లు చరిత్ర కన్పించుచున్నది.) శంకరాచార్యులవారి శిష్యుఁడు బ్రహ్మచారియు నగు ముకుందుఁడు ప్రయాగలోఁ దపముచేసి యిరువదిమంది శిష్యులతోఁ గూడియుండి బాబరుచే దేవతలు భ్రష్టులగుట విని తన దేహము నగ్నిలో హోమము గావించెను. వాని శిష్యులు నగ్నియందు దురికిరి. ఆవుపాలతో రోమములతోఁ

♦ బాబరు కాలము క్రీ శ 1526-30 మధ్య. † బాబరు కుమారుఁడు హుమాయూన్ క్రీ శ 1530 నుంచి 1556 దాకా. హుమాయూన్ కొడుకు అక్బరు క్రీ. 1556-1606 వరకు పాలించినాడు. అక్బరు కొడుకు సలీమ్. వీనికి 'జహాంగీర్' అను బిరుదున్నది. ఇతఁడు ఏబది యేళ్లు పరిపాలించిన ట్లిం

గూడ తాకిన దోషముచే ముకుందుఁడు మ్లేచ్ఛుఁడై! జనించెను. హుమాయూను కుమారుఁడై కాశ్మీరమందు జనించెను. అతని జన్మసమయమున నశరీరవాణి 'వీఁడు సకస్మాత్తుగా నుదయించినాఁడు, మంచి భాగ్యశాలి. పైశాచమార్గమున నింతవాఁడు మఱియొకఁడుండఁడు. వీఁడు 'అకబరు' (అక్బరు) అని పిలువఁబడును. శ్రీధనుఁడు, శ్రీపతి, శంభువు, వరేణ్యుఁడు, మధువ్రతి, విమలుఁడు, దేవవంతుఁడు సోముఁడు, వర్ధనుఁడు,

---

దున్నదికాని ఇరువదిరెండేండ్లకంటెఁ బాలించినట్లు ప్రమాణాంతరాలు కనిపించుటలేదు. జహాంగీర్ కుమారుఁడు 'ఖుర్దకుఁడు' అని యీ పురాణములోఁ గనిపించుచున్నది. వీనికే 'షాజహాన్' అను బిరుదున్నట్లును, ఆపేరే ప్రసిద్ధిగా వ్యాపించినట్లున్నది. వీని రాజ్యకాలము పదియేండ్లు. 'షాజహాన్' కుమారులలో నొకడు నవరంగుఁడు. వీనినే ఔరంగజేబు అని వాడుచున్నారు. వీని రాజ్యకాలము క్రీ. శ. 1658–1707 ఔరంగజేబు కొడుకు అలోముఁడు (ఆలిమ్) 'బహదూర్ షా' యని వీని నందురు. శివాజి ఔరంగజేబును జంపి పిమ్మట నా రాజ్యమున వీనిని దన పక్షమునఁ బ్రతినిధిగా నుంచెను. ఈ బహదూర్ షా క్రీ. శ. 1713 దాకా (అయిదేండ్లు) పాలించెను. ఫలరుషుఁడు (ఫరుల్ సియర్ యని చరిత్రలో వాడుక) 6 సంవత్సరములు పాలించెను. వీఁడు బహదూర్ షా కొడుకగు జహాందర్ షా యనే వాణ్ణి చంపి రాజ్యానికి వచ్చినాడు. (ముకులుడను పేరు పురాణమున గన్పించుచున్నది. వాఁడే 'జహాందర్ షా' అయి యుండును.) జహాందర్ షా కొడుకు మహాముదుఁడు (మహమ్మద్ షాహ యని చరిత్రలో వాడుక) వీఁడు క్రీ. శ. 1777–1806 వరకుఁ బాలించెను. వీనికాలములోనే పారశీకరాజు నాదర్ షా దండెత్తి వచ్చి ఢిల్లీ నాక్రమించుకొన్నాఁడు. మహమ్మద్ షాను ఖైదు చేసినాఁడు. వీఁడు ఢిల్లీ రాజ్యమందు చాలా దుండగములుచేసి ధనము కొల్లగొట్టి మయూరాసనమును దీసికొని పారసీకమున ఖురాసాన్ కు వెళ్లిపోయినాఁడు. ఈ 'ఖురాసాన్' పదమే యీ పురాణములో 'ఖురజము' అని వాఁడబడినది. ఈ మహమ్మదుషా కొడుకు 'మహామత్స్యుఁడు' అని యీ పురాణమునందున్నది. ఈ పేరు చరిత్రలో దొరకలేదు.

వర్తకుడు,రుచి, మాంధాత,మానకారి, కేశవుఁడు, మాధవుఁడు, మధువు, దేవాపి, సోమపుఁడు, శూరుఁడు, మదనుఁడు, నను వారికి గురువైన ముకుందుఁడు నీ యింట జనించినాఁడు" అని యువశరీరవాణి 'హుమాయూనుకుఁ' జెప్పెను. అది విని వాఁడు దానములు చేసెను. అక్బరునకుఁ బదియేండ్ల యీడున వాని తండ్రి దేహాలికి వచ్చి (ఢిల్లీకి) శేషశాకుని జయించి రాజయ్యెను. అవ్వాల నతఁ డొకయేడు పాలించెను. పిమ్మట 'అక్బరు' రాజయ్యెను. అక్బరునకుఁ బూర్వజన్మమందు శిష్యు లయినవా రాతని రాజరికమున మంత్రులుగా నైరి. కేశవుఁడు గానసేనుఁడు (తాన్ సేన్ అను సంగీత పండితుఁడు) వైజవాక్కు-మాధవుఁడు హరిదాసు మధ్వాచార్య వంశీయుఁడగు మధువు (సర్వరాగజ్ఞాపి) నతని యాస్థానమం దుండిరి. గతజన్మమున దేవాపి యను వాఁడు బీరబలుఁ డను పేర నుండెను. అతనికి పాశ్చిమాత్యుఁడు, సోమపుఁడు, మానసిం హుఁడను గౌతమవంశీయుఁడు సేనాపతు లయిరి. సూరుఁడు, దక్షిణుఁడు ననువా రాతని యాస్థాన పండితు లయిరి. బిల్వ మంగలుఁ డను నభినయ శాస్త్రవేత్త యక్బరునకు మిత్రుఁ డయ్యెను. మదనుఁడను బ్రాహ్మణుఁడు పూర్వదేశీయుఁడు నర్తకుఁ డయ్యెను. చందలుఁడు రహస్యక్రీడా పండితుఁ డయ్యెను (కామశాస్త్ర పండితుఁ డన్నమాట). తులసీశర్మ పౌరాణికుఁ డయ్యెను. రాఘవానందుఁ డను నతఁడు స్త్రీలకుఁ శిక్షణ గఱపువాఁ డయ్యెను. అతఁడు రామానందమతము

వాఁడు. శ్రీపతి గుర్జిడ్డివాఁడు. మధ్యమతమువాఁడు. సూర దాసు కృష్ణలీల యను గ్రంథము రచించిన కవి. చంద్రభట్టుని కులమున శంఖుఁడు జనించెను. అతఁడు రామానంద మతస్థుఁడు. వరేణ్యుఁడు నంతియే. కలికుఁ డనువాడు భాషా ఛందశ్శాస్త్ర జ్ఞుఁడు. మధ్వమతమువాఁడు. అతఁడు రామలీల యను గ్రంథ మును రచించెను. కేశవుఁడు విష్ణుస్వామి మతస్థుఁడై జనించెను. కవిప్రియము మొదలయిన గ్రంథముల నాతఁడు రచించెను. రామజ్యోత్స్న యను గ్రంథమునుగూడ యాతఁడు రచిం చెను. సోముఁడు నింబార్కమతమువాఁడై జనించి రహస్య క్రీడాశాస్త్రము రచించెను. వర్ధనుఁడు చరణదాసకుఁడై జనించి జ్ఞానమాల యను గ్రంథము చేసెను. అతఁడు రైదాస మతము వాఁడు. వర్తకుఁడు, రోపణ మతస్థుఁడు. రత్న భానుఁడు జైమిని సూత్రములపై భాషాటీక (హిందీటీక) రచించెను. రుచి మధ్వాచార్య మతమున జనించెను. అతఁడు నానాగానమయ మైన 'లీల' యను గ్రంథము రచించెను. మాంధాత కాయస్థ బ్రాహ్మణుఁడు. మధ్వాచార్యుఁడు. భాషాభాగవతము రచిం చెను (హిందీ భాగవత మన్నమాట). మానకరుఁడు స్త్రీరూప ధారియై 'మీరా' యనుపేర రాజకుమారికయై కృష్ణభక్తి నొందెను. 'మా' యనగా శోభ. 'ఈ' అనగా గమనము (నడక) యేనుఁగు బోలినది. కాన 'మీరా' యను పేరేర్పడె నఁట. ఆమె మధ్వాచార్య మతస్థురాలు. ఇదంతయు భాషా గ్రంథముల చరిత్రగా నీకుఁ దెల్పితిని. ఇది కలిపాపహరము.

—: ఔరంగజీబు - శివాజీ :—

అక్బరు యేబదియేండ్లు పాలించి స్వర్గ మందెను. వాని కుమారుఁడు సలోముఁడు (సలీము) ఏబదియేండ్లు పాలించెను. వానికొడుకు ఖుర్దకుఁడు పదియేండ్లు పాలించెను. వానికి నల్గురు కొడుకులు. అందు నవరంగుఁడు మధ్యముఁడు (ఔరంగజీబు అన్నమాట) వాఁడు తండ్రిని యన్నదమ్ములను జయించి రాజయ్యెను. పూర్వజన్మమున వాఁడు అంధకుఁడను వాఁడు వాని యంశముచేఁ గర్మభూమియందుఁ బుట్టెను. వేదములను దేవతలను భ్రష్ట మొనర్చి రాక్షసపక్షము వృద్ధి చేసినాఁడు. ఆమాటవిని కృష్ణచైతన్యులు వంశక్షయ మగునని వానికి శాప మిచ్చిరి. వాఁడు నలుబది తొమ్మిది యేండ్లు పాలించెను. సేవాజయుఁ డను రాజు (శివాజీ యన్నమాట) దేవ పక్షము వాఁడు. మహారాష్ట్ర బ్రాహ్మణుఁడై వానిని జంపి వాని కొడుకును ఢిల్లీకి రాజు గావించి తాను దక్షిణదేశమునకు వెడలిపోయెను. ఔరంగజీబు కొడుకు అలోముఁడు (అలీము) ఐదేండ్లు పాలించెను. పిమ్మట వాఁడు విదర్ధమ రోగముచేఁ జనిపోయెను. విక్రమార్క శకము పదునేడువందల డెబ్బదిలో (క్రీ. శ. 1713 లో) అలోముఁడు చనిపోయెను. తాలనుని కులమున మ్లేచ్ఛుఁడగు ఫలరుషుఁడు జనించి ముకలుడను వాని కులము నంతమొందించి రాజ్యమేలెను. అతఁడు పదియేం డ్లేలి శత్రువులచే మరణించి దైత్యలోకమున కేగెను. వాని కొడుకు మహామదుఁ డిరువదియేండ్లు పాలించెను. వానిరాష్ట్రమున 'నాదర్ షా' అను దైత్యుఁడువచ్చి యార్యులను

సంహారించి ఖురజమను దేశమునకు వచ్చెను. మహామదుని కొడుకు మహామత్స్యుడు తండ్రి రాజ్యముగొని యైదేండ్లేలెను. వాఁడు తాలనుఁడను మ్లేచ్ఛుని వంశములోనివాఁడు. మహారాష్ట్రులచే సంహరింపబడెను. * ఢిల్లీలో నపుడు పదియేండ్లు మాధవుండను మహారాష్ట్రుఁడు పాలించెను. అపుడు అలోముఁడు (వీడు మరియొక ఆలీము) రాజ్యమును బడసెను. వాని రాష్ట్రమున స్వదేశ రాజులు గ్రామముల కధిపతులయిరి. (చిన్న చిన్న జమీందారు లైరన్నమాట) మాండలికు లపు డెక్కువయైరి.

—: వానరులు - గురుండులు :—

ఇట్లు ముప్పదియేండ్లు చిల్లరరాజ్యములు వ్యాపించెను. అయ్యెడ దేవతలందరును కృష్ణచైతన్యునికడ కేగుదెంచిరి. కృష్ణాంశభూతుఁడగు నతఁ డందరిదుఃఖము గమనించి ముహూర్తమాత్రము ధ్యానించి దేవతల నిట్లనియె. మున్ను రామచంద్ర ప్రభువు రావణుని సంహరించి కోతుల నమృతవర్షముచేఁ బునర్జీవింపఁజేసెను. వికటుఁడు, వృజిలుఁడు, జాలుఁడు, వరలీనుఁడు, సింహలుఁడు, జవుఁడు, సుమాత్రుఁడు నను తక్కువ రకపు వానరుల ప్రార్థనచే వారికి దేవాంగనలకు రావణుని వలనఁ

* మాధవుఁడను నీ మహారాష్ట్రుఁడు ఢిల్లీకి పీఁజంటుగానున్నట్లు చరిత్ర కన్పించుచున్నది.

గలిగిన కన్యల నొసంగి వెండియు వారితో నిట్లనియె. †"మీమీ పేరులతో జాలంధరునిచే నిర్మితములయిన ద్వీపముల యందు మీరు మీరు రాజు లయ్యెదరుగాక! నందినీ ధేనువునకు (గోవునకు) ♦ రుండము (తల) నుండి జన్మించిన

---

† నాడు 'జాలంధరములు' అను పేరు కొన్ని దీవుల కపుడున్నట్లు తోచు చున్నవి. రామభక్తులగు వానరు లా జాలంధర ద్వీపప్రాంతములకు రామాజ్ఞచే వెళ్లి పరిపాలన చేసినపు డా యా వానరుల పేరు లా యా ద్వీపములకుఁ దరువాత వచ్చియుండును. వికటద్వీపము, వృజిలద్వీపము, జాలద్వీపము, వరలీనద్వీపము, సింహాలద్వీపము, జావాద్వీపము, సుమత్రి (సుమత్రా) ద్వీపము.

♦ త్రేతాయుగము నాటి కథ యిక్కడ సంబంధింపఁబడినది. మున్ను విశ్వామిత్రుఁడు వశిష్ఠునితో యుద్ధము చేసినపుడు నందినీధేనువుయొక్క శరీరమునుండి పెక్కుమంది మ్లేచ్ఛులు జనించినట్లు పురాణములలో నున్నది. నందినీధేనువుయొక్క 'రుండము' నుండి జనించినవారు మ్లేచ్ఛులలో నొకరకమగు 'గురుండులు' అన్నమాట. శ్రీ మహాభారతము ఆదిపర్వము 175 అధ్యాయములో నిట్లున్నది.

శ్లో॥ అస్పృజ త్పప్లవాన్ పుచ్ఛాత్ ప్రస్రవాన్ ద్రావిడాన్ శకాన్
యోనిదేశాచ్చ యవనాన్ శకృత శ్శబరాన్ బహూన్
మూత్రత శ్చాసృజత్కాంశ్చి చ్ఛరభాం శ్చైవ పార్శ్వతః
పౌండ్రాన్ కిరాతాన్ కాంభోజాన్ సింహాలాన్ బర్బరాన్ ఖశాన్
చిబుకాంశ్చ పులిందాంశ్చ చీనాన్ హూణాన్ సకేరళాన్
ససర్జ ఫేనత స్సా గా మ్లేచ్ఛాన్ బహువిధా వపి. 36, 37, 38.

వికటుఁడు అనే వానరుఁడు రామాజ్ఞచే జాలంధర ద్వీపములకు వెళ్లి యంతకు పూర్వమే యక్కడున్న గురుండు లనెడి మ్లేచ్ఛులను జయించెను. ఆ వికట వానరుని పరంపర యక్కడనే యుండి గురుండులతోఁ గలిసిపోయి సంతానమును గని యుందురు, వారే కోతిముఖములు గలవారుగా పుట్టి యీదేశమునకు వర్తకమునకై వచ్చి 'కలకత్తా' లో స్థావర మేర్పఱచుకొని యుందురు. మొదట గురుండులు బౌద్ధమతస్థులయి యుండి ఏసుక్రీస్తు తరువాత క్రైస్తవమత మవలంబించిరని యీ పురాణమునుబట్టి తెలియుచున్నది.

"వికటమను పడమటి ద్వీపమున వానిభార్య వికటావతి అష్టకౌశల మార్గమున (ఎనమండుగురు కుశలురు గల ఒక నిపుణసంఘము పార్లమెంటు అన్నమాట) ద్వారా పరిపాలించినది. ఆమె భర్త పులోమార్చి 'కలికాతా (కలకత్తా) యందుండెను. అతఁడు విక్రమార్క శకము 1824 లో అనగా క్రీ. శ. 1766 లో (విక్రమార్క శకంలో 58 తీసివేస్తే క్రీస్తుశకము వచ్చును) రాజుగానుండెను" అని మూలములో నున్నది. ఇది విక్టోరియాకథగా ముడి పెట్టుటకుఁ గుదురుటలేదు. విక్టోరియా కాలము 1766 క్రీ.శ. అనుట పొసగదు. ఈకాలానికి సరిపడుటలేదు. ఇక్కడనుండి యున్న కథకు పాఠ భేదము లుండి తీరవలెను. ప్రస్తుతము ముద్రితమైన యీ భవిష్యపురాణ ప్రతినిబట్టి యీకథ చరిత్రతో సరిపడుటలేదు. విక్టోరియా కాలము క్రీ. శ. 1858 అయి యున్నది. అదిగాక యామె భర్త 'పులోమార్చి' అని తరువాతి శ్లోకములోనున్నది. అది 'ఆల్బర్ట్ విక్టర్' అనేవాని అసలుపేరుతో నెట్లును సరిపడుటలేదు. విక్టోరియా రాజ్యకాలమును భవిష్యపురాణములో నెవరో చేర్చియుందురు. లేదా అంతకు పూర్వమున్న శ్లోకములు తీసివేసి యుందురు. ఆ తరువాత గురుండులు ఏడుగురు పరిపాలింతురన్నమాట.

మ్లేచ్ఛులు గురుండు లనంబడుదురు. ఆ జాతివారు మీాఁదఁ జెప్పిన ద్వీపములం దుందురు. మీారా గురుండులను గెలిచి యచట రాజ్యము సేయుఁడు'' అనిన హరివాక్యము విని యా వానరులు సంతోషపడి యేగిరి. వికటుని వంశమువారగు వానరులకు నచట జనించిన గురుండులు వానర ముఖము గలవారయి వాణిజ్యమునకై యిక్కడికి (భారతదేశమునకు) వచ్చిరి. ఆ వచ్చిన గురుండులు బౌద్ధ మతస్థులు. ఈశపుత్రిమతమున నున్నవారు (ఏసుక్రీస్తుమతము స్వీకరించిరన్న మాట). వారి హృదయ ముత్తమ మయినది. సత్యవ్రతము, కామజయము, కోపము లేకపోవుట, సూర్యభక్తి వారిలక్షణములు. ఆగురుండులలో ఆర్చికుఁడనువానిని(హేస్టింగ్సు ఏమో) కలికాతాయందు స్థాపించిరి. వికటుఁ డనువానిభార్య వికటావతి పశ్చిమ ద్వీపమునకు రాణియయ్యెను. ఆమె అష్టకౌశలమార్గమున రాజ్యమునేలెను. ఆమె భర్త పులోమార్చి కలకత్తాయందుండెను. విక్రముని తరువాత కలిలో 1824 సంవత్సరము తరువాత పులోమార్చి రాజయ్యెను. వారి వంశమున నేడుగురు గురుండు

---

కూడా కుదురలేదు. ఆమె తర్వాత సప్తమ ఎడ్వర్డు, పంచమజార్జి, అష్టమ ఎడ్వర్డు, ప్రస్తుతము ఆరవజార్జి పరిపాలన మాత్రమే జరిగినది. ప్రస్తుతము జార్జి పరిపాలనకాలములో భరతదేశమునకు వచ్చిన స్వాతంత్ర్యము మాట లేనేలేదు. కాన యిక్కడి శ్లోకములన్నియు ప్రక్షిప్తములేయని నా యభిప్రాయము.

ప్రస్తుతము క్రీ. శ. 1958 దీనికి 58 కలుపగా విక్రమ శకము 2011 నడచుచున్నది. ఈ పురాణమునుబట్టి యిప్పటి పరిపాలకుల క్రమమిట్లున్నది.

విక్రమ శకం 1824 సం॥లో మార్చి విక్టోవతి.

'విక్టోరియాభర్త విక్టర్'

64 సం॥రములు ఏడుగురు గురుండులు

---

విక్రమ శకం. 1888

8 వ వాడు బార్ధిలుడు ఎంతకాలమో లేదు.

12 భేకలుఁడు 9 వ గురుండుడు

32 లార్డ్డలుడు 10 వ గురుండుడు.

---

విక్రమ శకం. 1932

ఇట మీఁద మౌనులు. వారిలో 1 ఆర్జ్జికుఁడు ఇతని రాజ్యకాలమెంతో యీపురాణములో లేదు.

2 దేవకర్ణుఁడు. 60

---

1992

దేవకర్ణుని తరువాత మౌన వంశమువారు (8గురు) పరిపాలించిన కాలము 200 — 200

పన్నగారి(11వ మౌనుఁడు. ఇతఁడు పన్నగులచే మరణించునట) — 24

---

2216

ఇక్కడినుండి నాగులు పరిపాలింతురు.

లసువదినాల్గేండు రాజ్యముసేసి నశించిరి. గురుండులలో నెనిమిదవ రాజు న్యాయముగా నేలుచుండగాఁ గలివత్సము పూనిబలిదానవుడు మురాసురుని దేవదేశమునకుఁ బంపెను. (భారత దేశమున కన్నమాట) ఆ మురాసురుఁడు బార్డిలుఁడను రాజును వశము చేసికొని యార్యధర్మ నాశనమునకై వాని కభివృద్ధి చేకూర్చెను. మూర్తిని ధరించిన దేవతలందరు నయ్యెడ యజ్ఞాంశుఁడయిన యోగికడ కేగి నమస్కరించి మురాసురుఁడు వచ్చిన సంగతి తెల్పిరి. అంతట కృష్ణాంశుఁడు బౌద్ధులగు గురుండులు నాశన మగుదురుగాక యని శపించెను. అంతట గురుండులు కాల పేరితులై యొక్క సంవత్సరములోనే క్షయముపొందిరి. అట్లు నశించినవారిసంఖ్య ముప్పదివేలదాక యుండెను. బార్డిలుఁడను నామ్లేచ్ఛరాజు శాపదండనముచే నశించెను. తొమ్మిదవగురుండుడు 'భేకలుఁడు' అను పేరుఁడు న్యాయముగాఁ బండ్రెండేండ్లు పాలించెను. వాని పరిపాలన మార్య దేశమునందును నడచెను. పదియవ గురుండుడు లార్డలుఁడు ముప్పది రెండేండ్లు ధర్మ యుక్తముగాఁ బాలించెను.

—: ♦ హూనులు :—

లార్డలుఁడు చనిపోయిన తరువాత మకరందకులమున జనించిన యార్యజాతీయులు హిమతుంగవాసులునగు హూనులు రాజ్యము

♦ ఈ పురాణములో రాబోవు రాజులచరిత్ర చెప్పునపుడు కూడా భవిష్యత్క్రియా ప్రయోగము చేయబడలేదు. భూతకాల క్రియలే కనిపించు చున్నవి. చదువరులు వానిని భవిష్యత్క్రియలుగానే అన్వయ పఱచుకొన వలెను. మూలానుసరణముగా నాంధ్రీకరించుటలో మూలములో నున్నట్లే భూతకాల క్రియలనే వాడితిని.

నకు వచ్చిరి. వారు బభ్రువర్ణులు (బూడిదరంగువారు) చిన్న ముక్కులు గలవారు. గుండ్రనివారు. పొడవైన తలలుగలవారు. ఇట్టివారు ఢిల్లీయందు రాజులైరి. వీరు బౌద్ధధర్మపరులు. వారలకు ఆర్జికుఁడనువాడు రాజయ్యెను. వానికొడుకు దేవకర్ణుఁడు గంగోత్రిగిరి శిఖరమునఁ బండ్రెండేడులు రాజ్యాభివృద్ధికై ఘోరతప మొనరించెను. వాని తపమ్మునకు భగవతి యగు గంగాదేవి స్వరూపమును స్వేచ్ఛగాఁబడసి స్వర్గలోకమున కేగెను. అపుడు కుబేరుఁడు వచ్చి వానికి మహాపదము నొసంగి ఆర్యమండల పరిపాలనము నొసఁగి యంతర్ధానమందెను. అంతట దేవకర్ణుఁ డిరువది యేండ్లు మాండలికుఁడై యొప్పెను. వానివంశమునం దెనమండుగురు రాజులు దేవపూజాపరులై రెండువందల యేండ్లు పాలించి స్వర్గమందిరి. పదునొకొండవ మానుఁడు పన్నగారియను పేరుగలవాఁ డిరువదినాల్గు వర్షములు పాలించి పన్నగులచే మరణమంది స్వర్గమొందెను. ఇంతదనుక మానుల పరిపాలనము నడచినది.

## —: 23 అ. నాగుల పరిపాలనము :—

విక్రమశకము 2264 సంవత్సరముల తరువాత భూతనంది రాజయ్యెను. ధనధాన్య సమృద్ధులగు లక్షన్నర కుబేర యక్షులగు మానులను కిల్కిలానగరమందు జయించి నాగవంశీయులు రాజ్యము చేసిరి. ఆగ్నేయ దిశయందు పుండరీకునిచే నిర్మితమై కిల్కిలయను పురముండెను. పుండరీకాదులగు నాగు లట పరిపాలన చేసినపుడు వారింటింటఁ బూజింపఁబడిరి. స్వాహాస్వధా వషట్కారములు దేవపూజయు, దేవతలను విడిచి మేరు శిఖ

రమునం దుండిపోయినవి. కుబేరుఁ డింద్రియాజ్ఞచే శాక
ధాన్యమం దాఱవ భాగమును గ్రహించి దేవతల కొసంగెను.
మణి స్వర్ణాదివస్తువులు హూనరాజ్యమునం దేవేవి హరింపఁ
బడినవో యవన్నియు భూతనంది మఱల రప్పించి కోశములం
దుంచి మాండలికుఁడై పాలించెను. వానితరువాత శిశునంది
యేబదియేండ్లు రాజయ్యెను. అతఁడు నాగపూజ చేయుచు దేవ
తలను దిరస్కరించి యిరువదియేండ్లు పాలించెను. వానితరువాత
యశోనంది సోదరుని సింహాసన మాక్రమించెను. అతఁడును
నాగభక్తుఁడే. అతఁ డిఱువది యైదేండ్లు పాలించెను. అవ్వల
వానికుమారుఁడు ప్రవీరకుఁడు రాజయ్యెను. అతని రాజ్య
కాలము పదకొండేండ్లు. ఒకపుడు బాహ్లీకుఁడు సేనతోవచ్చిపడిన
నాపిశాచమ్లేచ్ఛులతో నొక నెల పోరాడి ప్రవీరకుఁడు మ్లేచ్ఛ
లను లక్షమందిని సంహరించెను. అయ్యెడ నఱువదివేలమంది
నాగభక్తులును నశించిరి. రోమజదేశవాసియు మహాబలుఁడు
నగు బాహలుఁడనురాజు యశోనందిని బిలిచి జాలావతియను
తన కుమార్తె నిచ్చెను. అతఁ డామెం గ్రహించి యింటికి
వచ్చెను. ఆమె కొక కుమారుఁడు బాహ్లీకుఁడను బలశాలి
కలిగెను. వాని వంశమున జనించిన రాజులు బాహ్లీకులు
పదముగ్గురు నాల్గువందల యేండ్లేలి మృతులయిరి. అమో
ముఖుఁడను బాహ్లీకుఁడు పాలించుతఱి పితృగణములందరు కృష్ణ
చైతన్యుని దర్శించి మ్రొక్కి మేము పితృగణములము. నాగ
వంశ్యులగు రాజులు మమ్ము నిర్లక్ష్యము చేసిరి. శ్రాద్ధతర్పణాదులు
మాకు జరుగుట లేదు. పితృవృద్ధివల్ల సోమవృద్ధియు, సందువల్ల

దేవవృద్ధియు, దేవవృద్ధివల్ల లోకవృద్ధియు, లోకవృద్ధివల్ల ప్రజాపతియగు బ్రహ్మవృద్ధియు బ్రహ్మవృద్ధివలన నింటింట ప్రతిమానవునియందు నానందము కల్గుట నిక్కము. కావున మమ్ము రక్షింపుము. మే మనాది ప్రజలము'' అనిన విని యజ్ఞాంశుఁడు ఆర్యవంశ వర్ధనుఁడగు పుష్యమిత్రుని పుట్టి పుట్ట గనే పదునాలేండ్ల ప్రాయము వానింగా నవతరింపఁ జేసెను. అతఁ డయోనిజుఁడు. అయోముఖాదులను దేశమునుండి వెడలగొట్టి రాజయ్యెను. శివాంశమున జనించినవిక్రమార్కుఁడు శకులను గంధర్వపక్షము వారిని జయించి పూజ్యుఁడైనట్లు నాగపక్షీయులగు రాజులను గోలకాస్యులను జయించి పుష్య మిత్రుడును బూజ్యుండయ్యెను.

—: పు ష్య మి త్రుఁ డు :—

పుష్యమిత్రుడు రాజ్యము చేయునాటికి విక్రమశకము 2772 సంవత్సరములయ్యెను. పుష్యమిత్రుడు నూరేండ్లు పాలించెను. అయోధ్య, మధుర, మాయ ,కాశి, కాంచి, అవంతిక, ద్వారావతి యను మోక్షపురముల నతఁడు పునరుద్ధారణ చేసెను. కురు సూకరపద్మక్షేత్రములు నైమిశోత్పల బృందాది వనక్షేత్రములు నానాతీర్థములును నాతని పాలనమున మఱల యుద్ధరింపఁబడినవి. అయ్యెడ 'కలి' గంధర్వుఁడై దేవ పితృద్వేషుఁడై బ్రాహ్మణ వేషమున పుష్యమిత్రుని దగ్గరకు వచ్చి మ్రొక్కి రాజా! నీవు దయాశాలివి. 'ఆర్యదేశమున పితృ గణములు (శ్రాద్ధతర్పణాదులచేఁ బూజింపబడవలసినవారు'అనుట వట్టి యజ్ఞానము. పూర్వకర్మము ననుసరించి భూమిపైఁ జచ్చిన

నరు లెనుబదినాల్గులక్షల జీవరాసులతో నేదో రూపమున జనింతురు. మయుఁడేదో మిష పెట్టి యీ పితృపూజకల్పించెను. ఇదంతయు వృథాశ్రమము వృథాకర్మము' అనిన విని రాజు నవ్వి 'నీవు మూర్ఖుఁడవు. మూఢుఁడవు. పరమెఱుంగవు. భువర్లోకమునఁ గంటికిఁ గనిపింపక శూన్యలట్లుండి భాస్వరులై (తేజోరూపులై వెలుఁగువారు అన్న మాట) పిండరూపమయిన విమానములమీఁద సంచరించువారు పితృగణములు. ఉత్తము లగు కుమారులు పిండదానము చేసినపుడా పిండమే నభో మార్గమున పితృదేవతలు విహరించుట కనువైన విమానమై సర్వానంద ప్రదాయకమగును. ఒక్క సంవత్సరము పిండపాయస రూపమున వారి కునికి కల్పించుచున్నది. భగవద్గీత యందలి పదునెనిమిది యధ్యాయములు, సప్తశతి మొదలయినవాని పారాయణచేఁ బిండము పవిత్రముచేయబడిన దేని యదిమూఁడు నందలయేండ్ల దాక యుండును. శ్రాద్ధతర్పణాదులు చేయక భూమిపైఁ జరించు నరులు నారకులు. వారి నూటయొక్కతరముల వారు నరకమందురు. శ్రాద్ధకర్మము గొప్పధర్మము. శ్రాద్ధము సర్వకారణము. అనినవిని గంధర్వుఁడైన కలి రాజునకు మ్రొక్కి రాజా ! నీవు నాకు మిత్రుఁడవుకమ్ము. నీకు నేను కింకరుఁడ నయ్యెదను. అని యతఁడు పుష్యమిత్రుని జేకొని తన వీపుపై నె క్కించుకొని సప్తద్వీపములను నభోమార్గములను సప్తఖండ ములను నతనికిఁజూపెను. పుష్యమిత్రుఁ డంతట నార్యధర్మ వ్యవస్థ పునరుద్ధరించి ప్రాణములువాసి యజ్ఞాంశునియందు లీనమయ్యెను.

## —: ఆ ం ధ్రు లు :—

ఆంధ్ర దేశమందుఁ బుట్టిన సుగదుఁడను బలవంతుఁడు పుష్యమిత్రుఁడు లేకపోయెనని చూచి తాను రాజ్యము పాలించెను. కర్మభూమి యం దాతఁ డిరువది యేం డ్లేలెను. వాని వంశజుం డిఱువదిమంది బహుమూర్గులయి పుష్యమిత్రుని తరువాత మూడువందల పదియేండ్లు పాలించిరి. అవ్వల నాంధ్ర రాజులు నశించిరి. అవ్వల నేబదియేండ్లు భూమి యరాజక మయ్యెను. అయ్యెడ క్షుద్రులయిన నరులు లుబ్ధులయి దొంగ తనములు మొదలయిన దారుణమైన పనులచే ద్రవ్యముల గొల్ల గొట్టి దరిద్రులయిరి. భూమియందుబంగారమనునది నశించెను. అవ్వల భగవంతుఁడు ప్రార్థింపఁబడి వారితో ''కౌశలకము అను దేశమున సూర్యాంశచే 'రాక్షసారి' యను రాజుగ జనించును. అ తఁ డు దే వ మా ర్గ ప రా య ణుఁ డు. నా యాజ్ఞచే నతఁడు మహీతలమం దవతరించును.'' అని

## —♦ రా క్ష సా రి ♦—

తెల్పి విష్ణుఁ డంతర్ధాన మందెను. అంతటఁ బ్రజలు 'రాక్ష సారిని' అయోధ్యయందుఁ బట్టాభిషేకించిరి. ఆంధ్రరాష్ట్రము నుండి రాక్షసులు కొల్లగొనిన ధనమంతయు నాతఁడు మరల రప్పించెను. రాక్షసులను జయించి యా ధనమును గ్రామ గ్రామమందు నిలిపెను. అతఁడు ఒక బంగారుకాసున కేనిమిది వెండినాణెముల విలువను నిర్ణయించెను. ఒక వెండినాణెము నకు నూరు ఆర (ఇత్తడి) నాణెములు. అయిదురాగినాణెములొక

ఆరనాణెము, నాగము (సీసము) లైదింటి కొక రాగినాణెము
నని యిట్లు నాణెముల చెలామణి యతని రాజ్యకాలమున
నేర్పడెను. ఈ రాగి, నాగము (సీసము) వంగము (తగరము)
నని యిట్లొకదానిమీద నొకటి యుత్తమములుగా నాతడు
నిర్ణయించెను.నూరు లోహనాణెము లొక వంగనాణెముగానతఁ
డేర్పరచెను. ఏబదియేండ్లతఁడు పాలించి సూర్యలోకమందెను.
వానివంశమం దరువదిమందిరాజులు వేదపరాయణులులగు వారు
పుష్యమిత్రుని తరువాత 700 సంవత్సరములయిన తరువాత
రాజులయిరి. వారందరు కౌశలాన్వయసంభవులే. అవ్వల నేబది
యేండ్లు మండలీకుఁడైన రాజు లేక చిన్న చిన్న జమీందారులు
పాలించిరి. అవ్వల బైదన్ దేశీయుఁడు విశారదుఁ డను రాజు
ఆర్య దేశమున కేతెంచి లక్షసైన్యముతో క్షుద్రరాజుల నందఱిని
గెల్చి మండలీకుఁడయ్యెను. అయ్యోడనరులు నానాకళలయందుఁ
జిత్రవిచిత్రములయిన పను లూరూరచేసి, వర్ణసంకరులయిరి.
బ్రహ్మక్షత్రియ వర్ణములు నామమాత్రములయి కన్పించెను.
ఆర్యులు వైశ్యప్రాయులు శూద్రప్రాయులు నయి నామమాత్ర
ముగా దేవతల నర్చించువారై యుండిరి. శారదుఁ డరువది
యేండ్లేలెను. వాని వంశమువా రారుగురు తరువాతి రాజు
లయిరి. పుష్యమిత్రుని తరువాత నూటపదునాఱేండ్లు వైదూరులు
పాలించి నశించిరి. అవ్వల నాల్గువందలయేండ్లు క్షుద్రులగు
రాజు లేలిరి. అవ్వల నైషధ రాష్ట్రమున కాలామాలి యను
వాఁడు రాజయ్యెను. అతఁడు చిల్లరి రాజులను జయించెను.
యమునాతీరమున "యమాభూయము" అను నగరము

యోజనమై శాల్యముగలది కాలకాలము అను పేర నిర్మితమ య్యెను. అం దా 'కాలామాలి' యార్యరాజులకుఁ బూజనీయుఁ డైన రాజయ్యెను. అపుడు దేవతలను బితరులను పూజించుట మాని జనమెల్ల ప్రేతపూజ సేయఁజొచ్చిరి. నైషధదేశీయు లొక నూరేండ్లు దాక పాలించిరి. అవ్వల వేయేండ్లు నీచులగు రాజు లేలిరి. దేవతార్చనము వేదమార్గము శ్రుతమాత్రముగా నుండెను. (అనగా వినిపించునే కాని యెందును కనిపింపదని యర్థము). కలిలో పుష్యమిత్రుని తరువాత 3132 తరువాత దేవతలు దుఃఖితులై కృష్ణచైతన్యుని దరికేగి మొక్కి 'భగవంతుఁడా! ఇది కలికాలము. నాల్గువర్ణములు భ్రష్టాచార ములయి ప్రేతమయములయి యేబదియేండ్లే పరమాయుర్దా యము గలిగి దేవపితృతిరస్కారము సేయుచు పిశాచములను బూజించుచున్నారు. ప్రతి గ్రామమందును 'కుఘ్నములు' (ప్రేతములు) పూజింపఁబడుచున్నవి. నరులెల్లరు దుఃఖప్రాయులు గా కనిపించుచున్నారు. భూతప్రేతపిశాచములుడాకినీశాకినీ గణ ములు నరులు తమను బూజించుచుండుటచే మదాంధులయి దేవపితృగణములను నిందించుచున్నారు. కాన మేము దుర్బలు లమై భూతనాయకులు బలవంతులయి యున్నారు. శరణాగత వత్సలుఁడవు కాన మమ్ము దయతో రక్షింపుము. అనిన విని యజ్ఞాంశుఁడు నదీహోపవనమందు నివసించువాఁడు దేవతలం గని యిట్లనియె. మాగధుఁడగు రాజు పురంజనుఁడు బ్రహ్మ పరుండై యుండును. వాని భార్య పురంజని. వారికి నాయాజ్ఞచే విశ్వస్ఫూర్జి యను బలశాలి కుమారుఁడు గల్గును. అతఁడు

బ్రహ్మమార్గపరుఁడు.” అని యిట్లు తెల్పిన పదిమాసముల కా కుమారుఁడు గల్గెను. అతఁడు జనించినవేళ ‘నశరీరవాణి’ పుష్యమిత్రుఁ డెట్లు వర్ణాశ్రమప్రవర్తనముఁ జేసెనో యట్లే యీ బాలుడు బ్రహ్మమార్గగామియై కలింద యదు మద్రకములను దేశములను జాతుర్వర్ణ్యవ్యవస్థ కలవానినిగా నొనరించును. ప్రజలు బ్రహ్మభూయిష్ఠు లగుదురు. దుర్మార్గులగు రాజుల శిక్షించును. పద్మవతీపురమును బ్రధాన నగర మొనరించును. అనిన పురంజయుఁడు క్షుధార్తులకు దానములు గావించెను. అయ్యెడ కలిలో 8,800 గడచెను. అపుడు విశ్వస్ఫూర్జి రాజయ్యెను. అతఁడు క్షుద్రరాజుల వశపరచుకొని బ్రాహ్మణవర్ణ వ్యవస్థచేసెను. అయ్యెడ క్షత్రియ వైశ్య శూద్రులు, పిశాచులు, గుగుండులు మొదలయిన వర్ణసంకరు లందరు బ్రాహ్మణులయి పోయిరి. సంధ్యాతర్పణ దేవపూజాదులు ప్రవర్తిల్లెను, వేద విధు లాచరణకు వచ్చెను. అందరు నొకే భోజనము చేయువారు, నొకే స్వభావము కలవారు నయిరి. అతఁ డట్లరువది యేండ్లు రాజ్యమేలెను. వాని వంశమువారు వేయిమంది రాజులయిరి. వారి పరిపాలనకాలము పదివేలయేండ్లు. వారందరు యజ్ఞములందు దేవతలకు రాక్షసులకు సమముగానే యజ్ఞ భాగము లిచ్చిరి. దేవత లాశ్చర్యపడి యజ్ఞాంశుని శరణందిరి. అది విని కృష్ణచైతన్యుఁడు “ వేదము సాక్షాన్నారాయణుఁడు. జ్ఞానరూపము, హంసరూపము, ఆ వేదము యుగభేదము ననుసరించి వర్ణభేద మేర్పరచినది. సత్వగుణుఁడు బ్రాహ్మణుఁడు. రాజసుఁడు క్షత్రియుఁడు, తామసుఁడు వైశ్యుఁడు, ఈ

మూఁడు గుణములు సమానాంశములుగాఁ గలవాఁడు శూద్రుఁడు. బ్రాహ్మణులచేఁ బితృదేవతలు క్షత్రియులచే సురలు, వైశ్యులచే యక్షరక్షస్సులు శూద్రులచే దైత్యదానవులు దృప్తినొందుదురు. కాయస్థుఁడను వర్ణమువానియందు నాల్గువర్ణములును గలవు. కాన కాయస్థులచే భూతప్రేత పిశాచాదులు తృప్తిచెందును. ఇప్పుడు బ్రహ్మవర్ణమందే నాల్గు వర్ణములు నిమిడియున్నవి. బ్రహ్మసంకరమను నీవర్ణమందు దానవులు సగమును స్వర్గవాసులు సగమును దృప్తినందుదురు. కాన నేను సౌరాష్ట్రరాజునింట నవతరించెదను. అని తెల్పి యొక కళచే సోమనాథుఁడను పేర నట నుదయించెను. రాజులగెల్చి సముద్రతీరమున స్వయముగా రాజ్యముచేసెను. అయ్యెడ భూమి క్షత్రవర్ణమయమయ్యెను. సోమనాథుఁడు యజ్ఞముచే సురతృప్తి చేసి యేబదియేండ్లు రాజ్యమేలెను. వానివంశము నూటయేబది మంది రాజులు దేవతాప్రియులై రాజ్యమేలిరి. వారి రాజ్యకాలము కొంచెమెక్కువగా ముప్పదివేలయేండ్లయ్యెను. అంతట దైత్యులు దుఃఖించి కలితో 'మేము నూఱేండ్లు శివునర్చించిన నిన్ను మా కనుగ్రహించెను. నీలో సగము వజ్రమయము, సగభాగము కోమలము, నీశరీరము సుందరము. కాన మమ్ము రక్షింపుము' అనిన నా కలి గూర్జరమున నవతరించి సింహికయను మాంసాశనియగు నొక ఆభీరి (గొల్లది) గర్భమున రాహువను పేరజనించెను. ఆరాహువు చంద్రవైరియైనట్లే యీరాహువు సురవైరియయ్యెను. వాఁడుపుట్టినతరిభూమి కంపించెను. గ్రహములన్నియు విపరీతములయ్యెను. అంతట వేల్పులు మూర్తులను

విడిచి పారిపోయిరి. సుమేరుగిరియం దింద్రుని శరణొందిరి. ఇంద్రుఁడు జగదంబికను గొనియాడెను. కన్యామూర్తియై దేవి 'నాదర్శనముచే దేవతలగు మీ రాకలిదప్పులు లేనివారై తపస్సులచే నన్నే యెల్లప్పుడు దర్శింతురుగాక, అనియె. అంతట దేవతలు హర్షించిరి. ఆ ఆభీరికుమారుఁడు రాహువు నూరేండ్లు పాలించి ప్రాణములువాసి కలిలో లీనమయ్యెను. వాని వంశమున నూటయేబదిమంది పదివేలయేండ్లు పాలించిరి. మహామదుని మతము చిరకాలము క్రిందట నశించినది. మఱల వారుద్ధరించిరి. అంతట నెల్లరు మ్లేచ్ఛు లయిపోయిరి. వేదములు లేవు. దేవతలులేరు. వర్ణములు లేవు. 'హద్దు' అనునదిలేదు. ద్విజులన్నవారు లేరు. వారుపోగా మిగిలిన జనము లర్బుద పర్వతమందు పండ్రెండేండ్లు దేవతల నర్చించిన నాగిరినుండి యొక మహాభూతముదయించి క్షత్రియు పలకయుగొని మ్లేచ్ఛులను గూల్చెను. ఆతనిపేరు 'అర్యబలి' యని. అతఁడైదు యోజనములమేర అర్యారీయను పురము నిర్మించెను. అక్కడ మఱల మెల్లమెల్లగా నార్యవంశము వృద్ధిపొందెను. అతఁడేబది యేండ్లు పాలించెను. వానివంశమున నూటయేబదిమంది పది వేలేండ్లు పాలించిరి. వారందరు సంకరులు మ్లేచ్ఛస్నేహితులునైరి. మ్లేచ్ఛకన్యలఁ బెండ్లాడి నామమాత్రముచే నార్యులుగా నుండిరి. అంతట మాలవ దేశీయులగు మ్లేచ్ఛులకును నర్బుద పర్వతప్రాంతము వారగు నార్యులకును ఘోరమైన యుద్ధము జరిగెను. మ్లేచ్ఛుల నొక్క సంవత్సరములో నార్యులు జయించిరి. ఇరువదిలాల్గు వేలమంది మ్లేచ్ఛులు నైదు వందలమంది

యాచార్యులును నశించిరి. కలిలో తొంబదివేల సంవత్సరములగు సరికి భూమి మ్లేచ్ఛమయ మయ్యెను. ఎల్లరయందును అలక్ష్మి (దరిద్రదేవత) గోచరించెను.

24 అ. దైత్యులు కలితోఁ గూడి జలయానములు సేసి కొని హరిఖండమున కేగిరి. హరిఖండము (చైనాప్రాంతము) ఆ ఖండమునం దానకు ముందున్న మానవులు దేవతుల్యులు. వారు పదివేల సంవత్సరము లాయుర్దాయము గలవారు. వారం దరు దైత్యులతోఁ బోరాడిరి. పదియేండ్లలో వారెల్ల రాక్షసులచేనోడింపఁబడి యింద్రునిశరణొందిరి. ఇంద్రుఁడు విశ్వకర్మ కడ "కేగి సప్త సింధువులందుం గల భ్రమి యను యంత్రము నీవు స్థాపించితివి. దాని మహిమచే మానవు లితరఖండములకుఁ బోలేకుండిరి. ఆ యంత్రమును మాయావి యగు మయుఁడు చెఱచినాఁడు. అప్పటినుండి మానవులు సర్వ ద్వీపములందును దిఱుఁగ నేర్చిరి. కావున మాకు శత్రువులగు వారినందరిని సంహరించి యొక హద్దున నిలిపి మమ్ముఁ గాపాడుము" అనిన విని విశ్వకర్మ దివ్యయంత్ర మొకటి నిర్మించెను. దానివలన నా దైత్యులు చెల్లచెద రైపోయిరి. ఆ యంత్రమునుండి గొప్ప వాయువు జనించి మ్లేచ్ఛులను నశింపఁజేసెను. ఆ వాయువునకు 'వాత్యుఁడను' పెద్ద సుడిగాలి జనించెను. ఆవాత్యుఁడు మ్లేచ్ఛులను, యక్షులను, పిశాచులను జయించెను. అతఁడు మంచి జ్ఞాని, బలవంతుఁడు. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యు లను మూఁడు వర్ణములవారి నాతఁడు గౌర వించెను. మ్లేచ్ఛులను బలాత్కారముగ వర్ణమయుల నొనరిం

చెను. అతఁ డేబదియేండ్లు భూమిపై మండలీకుండయి యేలెను. వాని వంశమున వాయుపక్షమువారు త్రివర్ణములకుఁ జెందినవా రొక వేయిమంది పదునాలు వేలేండ్లు మాండలికు లయిరి. వాయువునుండి బ్రహ్మయు, హరియు, శివుఁడును జనించిరి. సర్వజగత్తును వాయుమయము. వాయువులేనిచో నందరు మృతులగుదురు.' అని భావించి వారందరు వాయువును బూజించిరి. కలి బలికి నమస్కరించి తన దుఃఖమును నివేదించిన బలి వామనమూర్తికి మ్రొక్కి, 'స్వామి! నీవు కలిని సృష్టించితివి. అతఁడు కర్మభూమియందలి వాత్స్యులగు ద్విజులచే నిరాకరింపఁబడెను. ఇప్పటికిఁ గొంచెము తక్కువగా కలిలో నొక్కపాదము ముగిసినది. ఇంద్రమాయచే నేను భూమిని విడిచితిని. కలిలో నొక వేయియేండ్లు నే నీ భూమి ననుభవింపగా నొక వేయియేండ్లు దేవత లనుభవింపఁజొచ్చిరి. అవ్వల వేయేండ్లు నేను, తరువాత నలుబదియైదు వేల సంవత్సరములు దేవతలు నీ భూమిసార మనుభవించితిమి. ఇట్లు పర్యాయముగా దైత్యదానవు లీ కలియుగమున భూమియును భరింపబడుచున్నది. నీవు నాకుఁ గలి నొసంగితివి. కాని యాతని యధికార మేకాగ్రముగా సాగుటలేదు.' అనిన విని వామనమూర్తి తన యంశముచే దైత్యపక్షమును బెంపొందింప నవనిపై నవతరించెను. ఆసమయమున యమునాతీరమందుఁ గామశర్మయను విప్రుఁడు పండ్రెండేండ్లు హరిని బూజించెను. నాకుఁ గుమారుఁడవు కమ్మని వినుతించెను. హరి మున్ను సగభాగముచే దేవహూతియం దవతరించి యుండెనుగాన మిగిలిన సగభాగమున

భోగసింహుఁడు కేలిసింహుఁడు నను పేర దేవరక్షకుఁడుగా దైత్యరక్షకుఁడుగా రెండుతీరుల నవతరించెను. అతఁడు వాత్స్య సంభవులగు రాజులను జయించి కల్పక్షేత్ర (కురుక్షేత్ర) మునకు వచ్చెను. మయుఁడు నిర్మించిన క్రీడావతి యను నగరము రహస్యముగానుండెను. అందు వారిద్దరు నివసించుచు కలిభారము వహించిరి. సర్వధర్మములకు సారమైనది భార్య. సనాతన ధర్మ సిద్ధి కామె మూలము. పతివ్రతయగునట్టి స్త్రీయందు జన్మించిన వా రార్యులు. వారు దేవతలకుఁ బ్రియులు లేక దేవతలయెడ ప్రీతిగలవారు. దూషితయగు స్త్రీ యందు (చెడినస్త్రీ) జన్మించినవారు వర్ణసంకరులు. అని యాలోచించి భగవంతుఁడు కామమయమైన శరీరము ధరించి దినదినము వేలకొలది స్త్రీల ననుభవించెను. వారందరు గర్భవతులై కవలపిల్లలను గనఁ జొచ్చిరి. అన్నదమ్ము లప్పసెల్లెండ్రతోఁ గ్రీడింప నారంభించిరి. ఈ రీతిగాఁ గలియం దనంతమైన సృష్టి పెరిగిపోయెను. ఆ పుట్టిన సంతానము త్రివర్ణ ప్రజలను దినదినము భక్షించుచు కర్మ భూమియందు సంకరసంతానము పక్షులగుంపులట్లు పెరుగఁ జొచ్చిరి. అట్లు రెండువేల సంవత్సరములలోఁ బూర్వ మానవు లందఱిని వారు తినివేసిరి. అంతట కలి రెండవపాదము వచ్చెను. ఈ రెండవ పాదము వచ్చినంతట కిన్నరులు భూమిపైకి దిగిరి. వారు రెండున్నర (కిష్కులు) కిష్కు = 24 అంగుళములు పొడవుగల వారయి దైత్యమయులై యుండిరి. పక్షులట్లు కర్మహీనులయి యిరువది నాల్గేండ్లు పూర్ణాయుర్దాయము కల వారై యా కిన్నరుల భూమిపై చరింపఁ దొడఁగిరి. వారిలో

వారికెట్టి భేదము గనిపింపదు. అట్టివారివ్రుడును మీ కక్కడక్కడ భూమిపైఁ గనిపించుచున్నారు. కలి రెండవ పాదము చివరదాక యిట్లే పీ గుందురు. వివాహము రాజు, ఒక యుద్యమము, ఒక కర్మము ననున వేవియు నుండవు. నేడు మొదలు లక్షపాతికవేల సంవత్సరములలో భోగకేలియను వానివంశమునఁ బుట్టినవారు భూమిపై చరింతురు. కావున నోమునులారా! మీరు నేనును గృష్ణచైతన్యులవారి యాజ్ఞ ననుసరించి యెటకేని పోవుదము. అనిన విని విశాలాపురమం దున్న మునులందరు సూతునికి మ్రొక్కి యజ్ఞాంశు డగు కృష్ణచైతన్యుని కడకేగి నమస్కరించి బ్రహ్మరూపుఁడగు నతని యాజ్ఞ నర్థించిరి. నాక మధ్యమందున్న యింద్రలోకమున కేగెదమని విన్నవించిరి. వానిమాట విని కృష్ణచైతన్యులవారును శిష్యులతో స్వర్లోకమున కేగును. అప్పుడు కలి దైత్యులతోఁగూడ భూమియందు సంచరించును. మరియేమి వినఁగోరుదువని వ్యాసు లడుగ మను వమ్మహర్షి వల్లభుం గని 'భోగకేలి' చరిత్ర సవిస్తరముగాఁ దెలుపుము. కలియుగమున మనుజు లెట్లుందురో తెలుపు మనెను. అంతట వ్యాసభగవాను లిట్లు తెలుపఁ దొడఁగిరి.

## —: భోగసింహుఁడు – కేలిసింహుఁడు :—

వామనమూర్తి కలిలో భోగసింహుఁడు కేలిసింహుఁడు నను పేరులతో రెండు మూర్తులుగా నవతరించి దైత్యులను వాత్యాసంభవులగు మానవులను జయించి సంతసించిరి. అంతట దేవతలు దుఃఖితులయి తమతమ మూర్తులను విడిచిపెట్టి కృష్ణ

చైతన్యులకు నమస్కరించి వినయవినమితులై "ప్రభూ ! నీ ప్రసాదముచే కలి ప్రథమపాదమున దైత్యప్రాయులగువారిని జయించి భూమి ననుభవించితిమి. ఇప్పు డిక మేమేమి చేయ వలయును ? దయాకర ! ఆనతీయవే" అనిన హరి యిట్లనియె. నేను మీతో స్వర్గమున కేగెదను. కాన మీరు దేవవంశ్యులగు మానవుల నందరిని వేపి నాతో స్వర్గమునకు రండు. అని యిట్లు కృష్ణచైతన్యులు చెప్పిరని సూతుఁడు తెలుపగానే దేవతలు విమానములం గొనివచ్చి సూతాదులను కృష్ణచైతన్యులను నందెక్కించుకొని పోగుదురు. ఆహ్లాదుఁడు గోరఖుఁడను యోగి శంకరాదులగు రుద్రాంశ సంభవులు భర్తృహరి యనురాజు మఱి యితర యోగిపుంగవులు నను వారితోఁ గృష్ణచైతన్యుల వారు స్వర్గమున కేగుదురు. వామనాంశమున నవతరించిన యా యిద్దరును యోగనిష్ఠఁబూని కల్పక్షేత్రమున వసింతురు. అప్పుడే దైత్యులందరు నానాటిమానవులచే మిక్కిలి సంత సించుచున్నవారై పాతాలాదిభూవివరములను వృద్ధిచేయుదురు. కలి మూఁడవపాదము రాగానే కిన్నరులుగూడ మెల్లమెల్లగా క్షయింతురు. మూఁడవపాదమున నిఱువదియాఱు వేలగునప్ప టికి రుద్రాజ్ఞచే భృంగఋషి భూతపక్షియుఁడై వచ్చును. వాని భార్య సౌరభియను నామె బలవంతులు, కౌలకల్పులు, ఘోరులు నగు నరులను గనును. వారందరు కిన్నరులను భక్షిం తురు. ఆ కలిసమయమందు వారి యాయుర్దాయ మిరువది యాఱు సంవత్సరములు మాత్రమే యుండును. కిన్నరులు వామ నాంశుని శరణొందుదురు. భోగసింహుఁడు కేలిసింహుఁడు వారితో

గొప్పయుద్ధము గావింతురు. ఆయుద్ధము పది యేండ్లు జరుగును. వారీ యిద్దరిని జయింతురు. అంతట వారిద్దరు దైత్యులతోఁగూడి శాతాళమునకుఁ బోవుదురు. అయ్యెడ భృంగసృష్టి మహా ఘోరమగును. నరులు పశురూపులై తల్లులతో నప్పచెల్లెం డ్రతోఁ గ్రీడింతురు. తెగదిని తాగి కామాంధులయి పెక్కు మంది కొడుకులను గాంతురు. కలి మూఁడవపాదము ముగియు నప్పటి కాసృష్టి పశుపక్ష్యాదియోనిధరులై ఘోరులై నశింతురు. కలి నాల్గవపాదము రాగా నిరువది యేండ్లు పరమాయుర్దాయము గల్గి నరులెల్లరు నరకలోకమందువారగుదురు. జలమనుష్యులు (సముద్రములలో మనుష్యులుందురని తెలియుచున్నది) నడవి మనుష్యులునైన నరులవలె కలిలోని మానవులు కందమూల ఫలము లాహారముగాఁ గొని జీవింతురు. భయంకరములైన యలోకాది తమోలోకములన్నియు కర్మభూమియందుఁ బుట్టిన యీ పాపాత్ములచే నిండిపోవును. కృతయుగ ప్రథమపాదమున సత్యలోకము, రెండవపాదమున తపోలోకము, మూఁడవపాదమున జనోలోకము, నాల్గవ పాదమున స్వర్గలోకము, కర్మభూమి నవత రించిన పుణ్యాత్ములచే నిండును. త్రేతాయుగ ప్రథమపాద మున భూర్లోకము, రెండవపాదమున ఋషిలోకము, మూఁడవ పాదమున గ్రహలోకము, నాల్గవదానియందు భువర్లోకము నిండును. ద్వాపర ప్రథమపాదమునఁ బుష్కరద్వీపము, రెండవ పాదమున శాల్మలము, మూఁడవదాన క్రౌంచము, నాల్గవదాన జంబూద్వీపము కర్మభూమి గతులగు మానవులచే నిండును. కలి మొదటిపాదమున నూర్ధ్వాధోలోకములు నిండును. రెండవ దాన

సప్తపాతాళములు, మూడవదాన భూలోకము నిండును. అక్కడి నుండి (నాల్గవ పాదమున) నరకములన్నియు నిండిపోవును. నీ వడిగినయంత నేను చెప్పితినని మనువునకు వ్యాసుండు పల్కెను.

—: 25 అ. కలి చతుర్థపాదము :—

వ్యాసులు వెండియు మనువున కిట్లనిరి. కలి నాల్గవ పాదమున జనించిన నరులచే నిరువదియొక్క నరకములు నజీర్ణము గాని యుండును. అది యముని కడ కేగి తనకుఁ గల్గిన యజీర్ణ వ్యాధి వృత్తాంతము విన్నవించుకొని చికిత్స నర్థించును. కలి సంధ్యలో ధర్మరాజు చిత్రగుప్తుడితో బ్రహ్మదగ్గర కేగును. అత్తరి బ్రహ్మ నల్గురు యములనుగాంచి (నాల్గు పాదములకు నల్గురు ప్రభువులు కాబోలును) వారు తెల్పినదంతయు విని క్షీరసముద్రమున కేగి జగన్నాథుని వృషాకపిని సాంఖ్యశాస్త్రమయములయిన స్తోత్రములచే సంతుష్టు నొనరించును. అంతట హరి లోకమంగళార్థముగా రమ్యమైన వచనము పల్కెను. ఓ దేవతలారా! సంభల గ్రామమున గాశ్యపుఁడను బ్రాహ్మణుడు విష్ణుకీర్తియను ప్రియురాలియందు విష్ణుయశుఁడను కుమారునిం గాంచును. అతఁడు కృష్ణలీలామయమైన గ్రంథమును మానవులకు వినిపించును. అంతట నా నరులందరు చెలరేగి యొకటిగాఁ గూడి విష్ణుయశుని భార్యతో సంకెలలచే బంధించి కారాగారమున నుంతురు. విష్ణుకీర్తియందు పూర్ణరూపుఁడగు నా భగవంతుఁడు సాక్షాన్నారాయణుఁడు హరి యవతరించును.

అతఁడు సర్వలోక శివంకరుఁ డగును. మార్గశిర బహుళాష్టమి యం దర్ధరాత్రిమున గాఢాంధకారమున బ్రహ్మాండమున దేవతలను మంగళము నొనరించుచుఁ బ్రాదుర్భవించును. త్రిమూర్తులు గణపతి దిక్పాలురు విభీషణుఁడు చిత్రివాయువు ధ్రువుఁడు విశ్వేదేవులు నవగ్రిహములు నాతని సన్నిధానవర్తులయి స్తుతింతురు. అంతట నాస్వామి వరము కోరుమన దేవతలు బాలరూపుఁడైన హరి నమస్కరించి కల్పకల్పమందు మన్వంతరము నందు లోకముల నడక తెల్పుమన కల్కి యిట్లనియె. మహాకల్పములు పదునెనిమిది. అవి ప్రికృతియొక్క శరీరమందున్నవి. బ్రాహ్మము అందలి కథ బ్రిహ్మపురాణము వర్ణించుచున్నది. అది శతకోటి ప్రివిస్తరము. అవ్వల కూర్మము, మాత్స్యము, శ్వేతవారాహము, నృసింహము, వామనము, స్కాందము, రామము, భాగవతము, మార్కండేయము, భవిష్యము, లింగము, బ్రిహ్మాండము, ఆగ్నేయము, వాయవ్యము, పాద్మము, శైవము, వైష్ణవము, బ్రహ్మకల్పము. ఈ కల్పములు రెండువేలు తిరిగివచ్చిన మహాకల్పమగును. సహస్రియుగపర్యంతము బ్రిహ్మాండమున కాయమని కీర్తితమైనది. ఆయా కల్పమందలి విరాట్టును బట్టి యా యా కల్పముల పేరు లేర్పడినవి. ఒకకల్పములోఁ బదునాల్గురు మనువులు వత్తురు. స్వాయంభువాది మన్వంతరములం దాయాయుగములం దాయాజీవుల యాయుర్దాయములు వర్ణింపఁబడినవి.

—: కల్పములు - మన్వంతరములు :—

స్వాయంభువ మన్వంతరమునఁ గృతయుగమందు మానవుల యాయువు లక్ష సంవత్సరములు. త్రేతాయుగమునఁ బదివేలు, ద్వాపరమున వేయి. కలియందు నాల్గువందలు. స్వారోచిషమునఁ గృతయుగమున నెనుబదివేలు, త్రేతయందందు లోసగము, ద్వాపరమం దందులో సగము. కలియందుఁ బదునేనువందలు, తామసమున కృతయుగమున ముప్పదియారువేలు. త్రేతయం దందులో సగము. ద్వాపరమం దందులో సగము. కలియందు వేయి సంవత్సరములు. రైవత మన్వంతరమున ముప్పదివేలు, పదునేను వేలు, ఏడున్నర వేలు, ఎనిమిదివందలును వరుసగా నెఱుంగునది. చాక్షుషమున నాల్గు వేలు, మూడువందలు, రెండు వందలు, ఒకవంద. సావర్ణికమున నిరువది వేలు, పదివేలు, అయిదు వేలు, ఇరువదియైదు వందలును. బ్రహ్మసావర్ణికమునఁ బది వేలు, ఐదు వేలు, ఇరువదియైదువందలు, పండ్రెండు వందలన్నరయు, దక్షసావర్ణికమునఁ బదివేలు, అయిదు వేలు, ఇదువదియైదు వందలు, నందులోసగము. రుద్రసావర్ణికమున నెనిమిదివేలు, నాల్గు వేలు, రెండు వేలు, ఒక వేయియు. ధర్మసావర్ణికమున నంతే. భౌమమున నాల్గు వేలు, మూడు వేలు, పదిహేనువందలు దానిలో సగమును నుండును. యుగాంతమున కర్మభూమియొక్క లయము కల్పమనుబడును. మన్వంతరమున సర్వభూమిలయము ప్రలయమనం బడును. పురాణపురుషుని సాయంకాలము ప్రలయ మనంబడును. సర్వలోకలయము ముఖ్యకల్ప మనంబడును. ఇరువదియారు వేల కల్పము లొక మహాకల్పము. పురాణపురుషుఁడు మేషరాశి యందున్నపుడు బ్రహ్మ దేవతలతో స్వాయంభువునిదగ్గర కేగెను.

పురాణపురుషుఁడు మకరమందున్నపుడు స్వాయంభువమన్వంతరమున వరాహమయ్యెను. పురాణపురుషుఁడు సింహమునందున్న తఱిస్వారోచిషమన్వంతరమున నృసింహుఁ డయ్యెను. అతఁడు వృషభమందున్న వేళనుత్తమ మన్వంతరమున గణములతో రుద్రుఁ డయ్యెను. మీనరాశినున్న వేళఁ దామస మన్వంతరమున మత్స్యమయ్యెను. మిధునమందున్నతఱి వైవస్వతమన్వంతరమునఁ గృష్ణుఁడయ్యెను. కర్కాటమున నున్నతఱి రైవత మన్వంతరమునఁ గూర్మ మయ్యెను. కన్యారాశియందున్నతఱి చాక్షుష మన్వంతరమునజామదగ్న్యుఁడయ్యెను. వృశ్చికమందున్న సమయమున వైవస్వత మన్వంతరమున వామనుఁ డయ్యెను. తులారాశియందున్న వేళ వైవస్వత మన్వంతరమున కల్కి యయ్యెను. కుంభరాశియం దున్నతఱి సావర్ణిక మన్వంతరమున బుద్ధుఁ డగును. పురాణపురుషుఁడు ధనస్సున నున్నతఱి వైవస్వత మన్వంతరమున దశరథరాముఁ డయ్యెను. కలి ముప్పది రెండు వేల/సంవత్సరములు మిగిలియుండగా నే నవతరింతును. (కల్కి) ఈ చతుర్యుగ ఖండము పఠించినను విన్నను పాపములు నశించును. విష్ణుకల్పమున విష్ణుపురాణము పఠింపబడినది. ఆకల్పము నందే పూర్వార్థము విష్ణునాభికమలమున బ్రహ్మయుదయించెను. పరార్థమున విష్ణు వవతరించెను. మూడవ కల్పము శివకల్పము. అందు శివునిపూర్వార్థమునవిష్ణువు పరార్థమున విధి(బ్రహ్మయు) జనించిరి. శివపురాణము కల్పమునకు సంబంధించినది. నాల్గవది పాద్మకల్పము. దానికధిపతి గణపతి. గణేశునుండి రుద్రుఁడు, రుద్రునినుండి విష్ణువు నుదయించిరి. విష్ణునాభినుండి పరమేష్ఠి

యవతరించెను. అయిదవ మహాకల్పము వాయవ్యము. అందు బురాణపురుషుఁడు మహేంద్రుఁడు. మహేంద్రుని నుండి యింద్రియములు. ఇంద్రియములనుండి యింద్రియాధిష్ఠాన దేవతలు గల్గిరి. వారినామములు శని బుధుఁడు రవి శుక్రుఁడు విశ్వకర్మ బృహస్పతి ఇంద్రుఁడు విష్ణువు బ్రహ్మ రుద్రుఁడు సోముఁడు ననువారు క్రమముగా నింద్రియాధిష్ఠాన దేవతలు. లింగేంద్రియమునుండి పుట్టిన బ్రహ్మసృష్టికర్త. రక్షకుఁడు విష్ణువు. అతఁడిరువదినాల్గు తత్త్వములందు నతఁడు ప్రతికల్పము నందుండును. సనత్కుమారుఁడు హంసవారాహుఁడు నారదుఁడు నారాయణుఁడు. కపిలుఁడు, అత్రేయుఁడు, యజ్ఞాశ్వుఁడు, కంటకుఁడు, వృషభుఁడు, పృథువు మత్స్యుఁడు, కూర్ముఁడు, ధన్వంతరి, మోహిని, నృసింహుఁడు, వామనుఁడు, భార్గవుఁడు, రాముఁడు, వ్యాసుఁడు, బలుఁడు, కృష్ణుఁడు. బుద్ధుఁడు, కల్కి, స్వతత్త్వగుఁడు, గుహ్యజన్మ, మహాదేవుఁడు, సృష్టిదైత్య వినాశకుఁడు నని మూర్తులు నైదవ కల్పమున జనించిరి. ఆఱవకల్పము వహ్నికల్పము అందుఁ బురాణపురుషుఁడు స్కందుఁడు. పురుషావయవమునుండి స్కన్నుఁడుగాన స్కందుఁడనబడెను. అతనియందుఁగల సూర్యరూపమయిన అర్చిస్సుఁ (జ్వాల) యందు హరి యుదయించెను. వహ్నిరూపమయిన యర్చియందుఁ బితామహుఁడు జనించెను. చంద్రరూపార్చి యందు హరుఁ డుదయించెను. పితామహునివలన ఋషులు మునులు వర్ణములు లోకములు జనించెను. ఆదిత్యులు విశ్వులు వసువులు తుషితులు భాస్వరానిలులు

విష్ణువువలన జనించిరి. యక్షరాక్షస గంధర్వ పిశాచ కిన్న
రాదులు దైత్యదానవులు భూతములు రుద్రునివలన జనించెను.
సప్తమకల్పము బ్రహ్మాండము. అందుఁ బావకుఁడు పురాణ
పురుషుఁడు. వానినుండి వహ్ని యుదయించెను. వానినుండి అబ్ధి
పుట్టెను. అందుండి విరాణ్మయమైన బ్రహ్మాండము రోమకోమ
ములజనించెను. బ్రహ్మాండమునుండిబ్రహ్మ, వానినుండి విష్ణువు,
వానినుండి హరుఁడు కల్గిరి. బ్రహ్మాండపురాణ మాకల్పము
నాటిది. అష్టమము లింగకల్పము. అందు ధర్ముఁడు పురాణ
పురుషుఁడు. ధర్మునినుండి కాము డుదయించెను. వానినుండి
మూఁడు లింగము లేర్పడెను. పుంలింగమునుండి విష్ణువు, స్త్రీ
లింగమునుండి యిందిర, నపుంసకలింగమునుండి శేషుఁడు
నుదయించిరి. ఆ ముగ్గురు తమోమయులనుండి జగ మేకార్ణవ
మయ్యెను. నారాయణుఁడు నిదురించినతఱి నతని నాభినుండి
కమల ముదయించెను. అందుండి బ్రహ్మ వానినుండి విరాట్టు
నుదయించెను. లింగపురాణ మాకల్పచరిత్రము. తొమ్మిదవ
మహాకల్పము మాత్స్యము. కుబేరుఁ డందుఁ బురాణపురుషుఁడు.
అవ్యయునినుండి ధూళిబృందము పుట్టెను. అందుండి కుబేరుఁడు
జనించెను. వానినుండి వేదమూర్తియగు మత్స్యము కల్గెను.
ఆ మత్స్యము కడుపులోనుండి నారాయణుఁడు, నతనినాభినుండి
బ్రహ్మ యుదయించిరి. బ్రహ్మనుండి దేతవలు, వారినుండి
యిరువదినాల్గు తత్త్వములు జనించెను. కూర్మకల్పమున మహా
మత్స్యమునుండి కూర్మము జనించెను. అందుండి త్రిమూర్తులు
గల్గిరి. శ్వేతవారాహకల్పమున వరాహమునుండి విష్ణు వుద్భ

యవతరించెను. అయిదవ మహాకల్పము వాయవ్యము. అందుఁ
బురాణపురుషుఁడు మహేంద్రుఁడు. మహేంద్రుని నుండి
యింద్రియములు, ఇంద్రియములనుండి యింద్రియాధిష్ఠాన
దేవతలు గల్గిరి. వారినామములు శని బుధుఁడు రవి శుక్రుఁడు
విశ్వకర్మ బృహస్పతి ఇంద్రుఁడు విష్ణువు బ్రహ్మ రుద్రుఁడు
సోముఁడు ననువారు క్రమముగా నింద్రియాధిష్ఠాన దేవతలు.
లింగేంద్రియమునుండి పుట్టిన బ్రహ్మసృష్టికర్త. రక్షకుఁడు
విష్ణువు. అతఁడిరువదినాల్గు తత్త్వములందు నతఁడు ప్రతికల్పము
నందుండును. సనత్కుమారుఁడు హంసవారాహుఁడు నారదుఁడు
నారాయణుఁడు, కపిలుఁడు, ఆత్రేయుఁడు, యజ్ఞాశ్వుఁడు,
కంటకుఁడు, వృషభుఁడు, పృథువు మత్స్యుఁడు, కూర్ముఁడు,
ధన్వంతరి, మోహిని, నృసింహుఁడు, వామనుఁడు, భార్గవుఁడు,
రాముఁడు, వ్యాసుఁడు, బలుఁడు, కృష్ణుఁడు. బుద్ధుఁడు, కల్కి,
స్వాత్త్వగుఁడు, గుహ్యజన్మ, మహాదేవుఁడు, సృష్టిదైత్య వినాశ
కుఁడు నని మూఁగ్గురు మూర్తులు నైదవ కల్పమున జనించిరి.
ఆఱవకల్పము వహ్ని కల్పము అందుఁ బురాణపురుషుఁడు
స్కందుఁడు. పురుషావయవమునుండి స్కన్నుఁడుగాన స్కందుఁ
డనబడెను. అతనియందుఁగల సూర్యరూపమయిన అర్చిస్సుఁ
(జ్వాల) యందు హరి యుదయించెను. వహ్నిరూపమయిన
యర్చియందుఁ బితామహుఁడు జనించెను. చంద్రరూపార్చి
యందు హరుఁ డుదయించెను. పితామహునివలన ఋషులు
మునులు వర్ణములు లోకములు జనించెను. ఆదిత్యులు విశ్వులు
వసువులు తుషితులు భాస్వరానిలులు మహారాజిక సాధ్యులు

విష్ణువువలన జనించిరి. యక్షరాక్షస గంధర్వ పిశాచ కిన్న రాదులు దైత్యదానవులు భూతములు రుద్రునివలన జనించెను. సప్తమకల్పము బ్రహ్మాండము. అందుఁ బావకుఁడు పురాణ పురుషుఁడు. వానినుండి వహ్ని యుదయించెను. వానినుండి అబ్ధి పుట్టెను. అందుండి విర్యాణ్మయమైన బ్రహ్మాండము రోమరోమ ములజనించెను. బ్రహ్మాండమునుండిబ్రహ్మ, వానినుండి విష్ణువు, వానినుండి హరుఁడు కల్గిరి. బ్రహ్మాండపురాణ మాకల్పము నాటిది. అష్టమము లింగకల్పము. అందు ధర్ముఁడు పురాణ పురుషుఁడు. ధర్మునినుండి కాము డుదయించెను. వానినుండి మూఁడు లింగము లేర్పడెను. పుంలింగమునుండి విష్ణువు, స్త్రీ లింగమునుండి యిందిర, నపుంసకలింగమునుండి శేషుఁడు నుదయించిరి. ఆ మువ్వురు తమోమయులనుండి జగ మేకార్ణవ మయ్యెను. నారాయణుఁడు నిదురించినతఱి నతని నాభినుండి కమల ముదయించెను. అందుండి బ్రహ్మ వానినుండి విరాట్టు నుదయించెను. లింగపురాణ మాకల్పచరిత్రము. తొమ్మిదవ మహాకల్పము మాత్స్యము. కుబేరుఁ డందుఁ బురాణపురుషుఁడు. అవ్యయునినుండి ధూళిబృందము పుట్టెను. అందుండి కుబేరుఁడు జనించెను. వానినుండి వేదమూర్తియగు మత్స్యము కల్గెను. ఆ మత్స్యము కడుపులోనుండి నారాయణుఁడు, నతనినాభినుండి బ్రహ్మ యుదయించిరి. బ్రహ్మనుండి దేవతలు, వారినుండి యిరువదినాల్గు తత్త్వములు జనించెను. కూర్మకల్పమున మహా మత్స్యమునుండి కూర్మము జనించెను. అందుండి త్రిమూర్తులు గల్గిరి. శ్వేతవారాహకల్పమున వరాహమునుండి విష్ణు వుద్భ

వించెను. వానినాభినుండి బ్రహ్మ, వానినుండి విరాట్టు జనించెను. పదియవది కూర్మకల్పము. అందు అచేతనుడు పురాణ పురుషుడు. శూన్యభూతుడగు నవ్యయునినుండి ప్రచేతస్సు జనించెను. వానినుండి మహాబ్ధి పుట్టెను. అందు నారాయణుడు శయనించెను. అతడే జలపతి. 'వాని సగము భాగమునుండి మహాకూర్మము, వానినుండి శేషుడు గల్గిరి. ఆ శేషునికి భూమయని శేషుడని భౌమనియని పేరుల మూడు రూపము లేర్పడెను. 'భూమ' యనగా విరాట్టు. అతడు శేషునిమీద నుండును. 'భౌమని' యనగా మహాలక్ష్మి. ఆమె భూమని హృదయమందుండునది. భూమనివలన బ్రహ్మ యుదయించెను. అతడే మూడు మూర్తుల స్వరూపము. మహాకాళి ఈ మహా కల్పములే శరీరముగా గలది. ఇప్పటికిఁ బది మహాకల్పములు జరిగినవి. ఇప్పుడు భవిష్యకల్పము జరుగుచున్నది. అక్షర రూపమైన పరబ్రహ్మనుండి యనేక సృష్టిరచనలు జరిగినవి. కొందరు ముప్పదిమూడు మహాకల్పములున్న వందురు. పదునెనిమిదింటిని గొందరిట్లు పేరుపేర వర్ణించినారు. పదు నొకొండు మహాకల్పము లని కొందరు మునులనిరి. ఈ మున్ను తెల్పిన యక్షరునుండి రాధాకృష్ణుఁ డవతరించెను. రాధ, కృష్ణుడు నను నిర్వర శరీర మేక రూపమైనది. అతడు వేయియుగములు తపము సేసెను. అంతట నా రూపము రెండు తీరు లయ్యెను. వారిద్దరు మఱి వేయియుగములు తపము చేసిరి. వారి మేనినుండి వెన్నెల యుదయించి చీకటులఁ జెండాడెను. ఆ వెన్నెలలనుండి బృందావనము జనించెను.

అందు ప్రతియోజనము యోజనము నిరువదియొక్క ప్రకృతులున్నవి. దశేంద్రియముల ప్రకృతులు గోకులము, వార్షభము, నాందము, భాండీరము, మాధురము, వ్రజమయము, మాన్యము, శ్రేయస్కము, గోపికము ననునవి యింద్రియతన్మాత్రలు పదింటినుండి జనించినవి. అట్లే పది వనములును నేర్పడినవి. అవి బృందావనము, గోపవనము, బహులావనము, మధుశృంగము, కుంజవనము, దధివనము, రహక్రీడావనము, వేణుపద్మము ననునవి. ప్రకృతి మనస్సునుండి గోవర్ధనపర్వతము పుట్టినది. అదిబృందావనముల గాంచి పరమానంద మందెను. కృష్ణునివలన ముప్పదికోట్ల గుణాత్మకులగు గోపకులు జనించిరి. అందు శ్రీరామాదులు, సాత్త్వికులు, అర్జునాదులు, రాజసులు, కంసాదులు, తామసులు. వీరందరు దివ్యలీలాప్రకారులు. రాధ శరీరమునుండి ముప్పదికోట్లు గోపికలు జనించిరి. అందు లలితాదులు సాత్త్వికులు. కుబ్జాదులు. రాజసులు. పూతనాదులు తామసులు. వీరు నానావిధ విలాస చరిత్రలు వేయియుగములవరకు వారి విలాసములు జరిగినవి. అవ్వల రాధాకృష్ణులు వారినందరిని సమీకరించి తపముచేసిరి. అంతట కృష్ణుఁడు రెండు రూపములను రాధ రెండు రూపములను ధరించిరి. కృష్ణుని పూర్వరూపము సహస్రశీర్షుఁడు, సహస్రాక్షుఁడు, సహస్రపాదుఁడు నగు విరాట్టయ్యెను. పరార్థముచే కృష్ణుఁ డయ్యెను. అట్లే రాధ పూర్వార్థముచే నేకశీర్షయు, త్రినేత్రయు, ద్విపదియు నగు ద్విసహస్రికాశక్తి యుదయించెను. పరార్థముచే రాధాదేవి యయ్యెను. వారే పురుషుఁడు

ప్రకృతి యనఁ బఱఁగి తపము చేసిరి. బృందావనమునఁ జేసిన తపముచే ననంత యనంతుఁడు నను ద్వంద్వమైరి. ఆ మిథునము యొక్క సంయోగమున ననంతకోటి బ్రహ్మాండము లుదయించెను. బ్రహ్మాండమునుండి బ్రహ్మ పుట్టి పద్మమునందు గూరుచుండెను. ఆ పద్మము యోజన విశాలమయి భూమండలమందుండెను. ఆ పద్మ ముదయించిన సరస్సు పద్మసరోవర మనంబడెను. అదే పుష్కర క్షేత్రమని ప్రసిద్ధి నందెను. నరరూపుఁడైన బ్రహ్మ యచ్చెరువడి యాతామర తూడునం జొచ్చెను. నూరు దివ్యసంవత్సరముల కేనిదాని యంతు దెలియఁ డయ్యెను. మాయా మోహితుఁడై రోదనము సేసెను. ఆ రోదనము నుండి రుద్రుఁ డుదయించెను. ఏల రోదించెదవు? నీ హృదయమందే నీ యీశ్వరుఁడున్నాఁడని యతఁడు దెల్పగా విని బ్రహ్మ సమాధిగతుఁ డయ్యెను. అంతట హరి యావిర్భవించెను. ఓ బ్రహ్మ! ఇది కర్మభూమి జీవుల నంతముచేయునది. జీవులను దయారు చేయునదియు నిదియే. ఇది వేయియోజనముల వైశాల్యము కలది. దీని కుత్తరమున హిమగిరి, తూర్పున మహాసముద్రము, రత్నాకరము అనుపేరు గల సముద్రము పడమటను, దక్షిణమున బడబియను సముద్రమును గలవు. దీనికిఁ గ్రిందుగను మీఁదుగను సర్వలోకము లున్నవి. ఈకర్మభూమికి సరిగా నట్టనడుమనీ పుష్కరమున్నది. నా వలన నీవు వేదములం బడసి యజ్ఞము సేయుము. ఆ యజ్ఞమువలన దేవతలు త్రిగుణాత్మకులు జనింతురు. సిద్ధవిద్యాధర చారణులు సాత్త్వికులు. గంధర్వ యక్ష రక్షస్సులు రాజ

సులు. వారు పర్వతములగ నుందురు. పిశాచులు, గుహ్యకులు, భూతములు, తామసులు వారధోగాములు. అశ్లేష్వధామయములైన పితృగణములు మూఁడు జనించును. వారు విమానసదృశులై యాకాశమున నుందురు. అందు ఖేచరులు గౌరవర్ణులు శ్యాములు నగువారు సాత్త్వికులు. గిరిద్వీపమయులు, సరోరూపులు నగు పితరులు రాజసులు భూచరులు మూఁడవవారు. బిలములందు యాతనామయులగు పితరు లుందురు. తామసులు భూమిక్రింద నున్నారు. ఆలోకములు వృద్ధములు, మధ్యమములు క్షయములని పిలువంబడును. ఈ భూమి సర్వదా సనాతని ♦ తారామయములయిన లోకములు విమానములవలె నల రారుచు యజ్ఞములచే సంరక్షితములయి స్వేచ్ఛగా సంచరించును. భూమిమీద నెప్పుడు యజ్ఞము లేకుండునో యప్పుడు భగణములు (నక్షత్రాది జ్యోతిర్మండల మన్నమాట) విఘ్నభూతములై నిత్యము వక్రాతిచారము చేయును. కర్మభూమి శ్రుతిరూపిణి, సనాతని, గోరూపిణి. దానిని పాలించువాఁడే గోపుఁడు. గోపశక్తి, గోపీపూజితుఁడు నగువాఁడు హరి. కోటికోటి సహస్రపరిమితులయిన గోపులందరు హరికళలే. అన్నిగా లెక్కింపఁబడిన బ్రహ్మాండములు గోపనామము నందియున్నవి.

---

♦ ఈ శ్లోకము విక్కడ నున్నవి అర్థము కాలేదు.

మేరుశ్చైవ న మేరుశ్చ ద్వీపాశ్చాసం స్తథా నహి
ఇలావృతాది ఖండాశ్చ సంతి నైవ క్వచిత్ క్వచిత్.

కర్మభూమికి లక్షయోజనములపైన రవి, యామీఁద లక్షలో శశి, వానిమీఁద రెండు లక్షలలో నక్షత్రమండలము, దానిమీఁద రెండు లక్షలలో కుజుఁడు, వానికి రెండు లక్షలలో బుధుఁడు, వాని కంతదూరములో బృహస్పతి, శుక్రుఁడు, శని, రాహువు, కేతువు నున్నారు. కేతువున కేడులక్షలలో సప్తర్షి మండలమున్నది. వారికిఁ బదకొండు లక్షలలో ధ్రువుఁడు, వానికి లక్షలో మహాత్పదము, దానిమీఁద జనోలోకము తపోలోకము నొకదాని కొకటి లక్ష యోజనములలో నున్నవి. కర్మభూమికి కోటిన్నర యోజనములలోఁ దపోలోకమున్నది. కర్మభూమికిఁ గ్రిందుగా నేడు పాతాళములు లక్షలక్ష యోజనముల వంతున దూరములో నున్నవి. భూమికి కోటిన్నరలో నరకములున్నవి. కర్మ భూమి కుత్తరమున నెనిమిది ఖండములు లవణాదిసముద్రములు నంతరంతరములుగా నున్నవి. కర్మభూమికి కోటిన్నర యోజనములలో నాల్గుదెసల లోకాలోకమున్నది. ఇదంతయు కలిసి యొక బ్రహ్మాండమనంబడును. ఇది నీవలన నేర్పడి కల్పపర్యంత ముండును. దానికంతకుఁ గర్త విష్ణువే. రెండు దివ్యయుగములు వాని కొక పగలు రాత్రియు. ప్రకృతము భవిష్యమహాకల్పము జరుగుచున్నది. ఈ మహాకల్పములోఁ బదునెనిమిది కల్పములు జరిగినవి. పరార్థమున దినద్వయము జరిగినది. ఇప్పుడు శ్వేతవరాహకల్పమున మధ్యాహ్నకాలము జరుగుచున్నది. భవిష్యకల్పముపేర నీ పురాణము లోకకల్యాణార్థము చెప్పబడినది. అని యిట్లు కల్కివాక్యములను విని దేవతలతనికి నమస్కరించి తమధామమున కేగిరి.

—: 26 అ. కల్కి చరిత్రి :—

కల్కిమూర్తి దివ్యాశ్వము నధిష్ఠించి ఖడ్గము దాల్చి కవచము దొడిగి చర్మముపూని దైత్యభూతులగు మ్లేచ్ఛులను సంహరించి యోగమూనును. పదునాఱువేల సంవత్సరము లాతని యోగాగ్నిచేఁ దహింపజేయఁబడి కర్మభూమి భస్మ ప్రాయమగును. అవ్వల ప్రళయమేఘములు జలమయము నొన ర్చును. అంతఁ గలియుగము బలిదగ్గరకుఁ బోవును. అంతట హరి కర్మభూమిని మెట్టగా నొనరించి యజ్ఞములచే దేవతలను యజించును. దేవతలు యజ్ఞభాగముల నంది వైవస్వతమనువు కడకేగి యా వృత్తాంతము నెల్లఁ దెలుపుదురు. కల్కి మోము నుండి బ్రాహ్మణులను, బాహువులనుండి క్షత్రిజాతిని, మోకాళ్లనుండి వైశ్యులను, పాదములనుండి శూద్రులను జనింపజేయును. ఆవర్ణములవారి రంగులు (వర్ణములు) వరుసగా గౌరము (తెలుపు) రక్తము (ఎఱుపు), పీతము (పచ్చన), శ్యామము (చామనచాయ), వారు దేవీశక్తిచే ననేకులను గుమారులను జనింపఁ జేయుదురు. వారి ప్రమాణము ఇరుసది యొక్క కిష్కువులుండును.

—: 56 అ. మరల కృతయుగారంభము :—

ఆమనుజులు స్వస్వధర్మపరులయి జాతిధర్మా నుసారము దేవతల యజింతురు. అంతట వైవస్వతమనువు కల్కిని నమస్కరించి యతని యాజ్ఞచే యయోధ్యయందు రాజ్యము చేయును. అతనిశిక్షనొంది ఇక్ష్వాకువు రాజగును. అతఁడు

నూరు దివ్యసంవత్సరములు పాలించును. కల్కి బ్రహ్మ సత్రము చేయుతఱి నాల్గు వేదములు సాంగకములయి పదునెనిమిది పురాణములతో మూర్తీభవించి హర్షముతో వచ్చి కలికిని స్తుతించును. కార్తిక శుద్ధనవమి గురువారమున యజ్ఞకుండమునుండి మహోత్తమ పురుషుఁడు సత్యయుగుఁడను నాతఁడు సత్యమార్గ ప్రదర్శకుఁడై యుదయించును. అతనింగని బ్రహ్మాది దేవతలాతనికి లోబడి యాతిథిని మనువు యొక్క కర్మక్షయము సేయుదానిగాఁ బ్రశంసింతురు. ఈ తిథియందే మనుజుఁ డుసిరిచెట్టుక్రింద దేవతల నర్చించునో వాఁడు దానికి వశుఁడగును. దానికి అక్షయనవమి యుగాదినవమి యని పేరుగలవు. అది లోకకల్యాణదాత్రి. ఉసిరిచెట్టు మొదట మాలతిని తులసిని స్థాపించి వేదవిధిచే సాలగ్రామార్చన చేసినవారు జీవన్ముక్తులగుదురు. అందుచేఁ బితృతృప్తికల్గును. ఉసిరిచెట్టుక్రింద శ్రాద్ధముచేసిన వేయి గయాశ్రాద్ధములు చేసిన ఫలము గల్గును. దానిక్రింద హోమము చేసిన వేయి యజ్ఞముల ఫలము లభించును. కల్కి యీరీతిగా దేవతలకుఫల మనుగ్రహించెను. ఇట్లు తెల్పినమీఁదట నతఁడు దేవతలు చూచుచుండగనే యంతర్ధానమొంది నిదురపోవును. అవ్వల కర్మభూమి దుఃఖప్రాయమై విరహాగ్నిచేఁ దపించి బీజములను నశింపఁజేయును. ఆసమయమున పాతాలవాసులగు దైత్యులు ప్రహ్లాదునితో దేవతల మీఁదికి ఖరాదివాహనముల నెక్కి ప్రాసాది సాధనములతో యుద్ధమునకేగెదరు. అంతట ముప్పదిమూఁడు దేవగణముల వారు తమ యాయుధములఁబూని యుద్ధముసేయుదురు. పెక్కు దివ్యవర్షములా దేవాసుర సంగ్రామము జరుగును. అందుఁ జని

పోయిన రాక్షసులను శుక్రాచార్యులు బ్రతికించును. అంతట దేవతలు యుద్ధశ్రమకు వెఱచి క్షీరాబ్ధికేగి హరిని స్తుతింతురు. హరి వారియెడఁ బ్రసన్నుఁడై తన పూర్వాంశముచే హంసరూపుఁడై నూఱుగురు సూర్యులట్లు ప్రకాశించును. శుక్రుని ప్రహ్లాదాదులను దన తేజముచేఁ దపింపఁజేయును. దైత్యులంతట భూమిని విడిచి దుఃఖితులయి మహాదేవునిచే రక్షితులయి వితలమున కేగెదరు. అవ్వల వేల్పులు నిరుపద్రవులు నిర్భయులు నయి వైవస్వతుని కుమారుఁడగు నిక్ష్వాకువును బట్టాభిషేకింతురు. అతఁడు నూరు దివ్య వర్షము లాయువుగలవాఁడై రాజ్యమేలును.

ఇంతదనుక నీవడిగినదెల్ల తెల్పితిని. ఇఁక నుత్తర ఖండము తెల్పెదను వినుమని వ్యాసభాగవాను లది వచింప నారంభించిరి.

## —: ఉ త్త ర ప ర్వ ము :—

సామ్రాజ్యాభిషిక్తుండైన యుధిష్ఠిరుని జూచుటకు వ్యాస మార్కండేయ మాండవ్య శాండిల్య శాకటాయన గౌతమ గాలవ గార్గ్య శాతాతప పరాశర జామదగ్న్య భరద్వాజ భృగు భాగురి ఉత్తంక శంఖలిఖిత శౌనక శాకటాయని పులస్త్య పులహదాల్భ్య బృహదశ్వ లోమశ నారద పర్వత జహ్ను అపావసు పరావసు ప్రభృతులగు మహర్షులు దయచేసిరి. ధర్మరాజు వారిని యథోచిత సత్కారముల నర్చించి చేతులు జోడించి వ్యాసభగవానులఁ గని యిట్లనియె. ప్రభో! తమ యనుగ్రహముచే నాకు రాజ్యము లభించినది. కాని రోగ

గ్రస్తునకు లభించిన భోగములవలె జ్ఞాతుల నందరను వధించి దుఃఖితుఁడనైన నాకీ రాజ్యలాభము సుఖమొసంగకున్నది. నేను మా పాలిటికి రక్షాకవచనమగు భీష్ముని జంపిన పాపిని. నా మనస్సు పాపపంకిలమైయున్నది. బహుద్రష్టలగు తమ యుపదేశసారముచే నద్దాని గడిగికొని యుంటిని. ఇంకను ధర్మసర్వస్వసారమయిన యంశమును బ్రజ్ఞాదీపము వెలిగించి చూపవే. ధర్మరక్షకులయిన యీ మహామునులు నీ ముఖపంకజమును దమనేత్రభ్రమరములచేఁ గ్రోలుట కిచటికి విచ్చేసియున్నారు. అనిన వ్యాసదేవులు నీ పజ్జ హృషీకేశుండుండగ ధర్మము, తత్త్వము మఱియెవ్వరు తెల్పనేర్తురు? అతఁడు ప్రత్యక్షదర్శనము గలవాఁడు. అతఁడే సృష్టికారణము. కాన యతఁడు నీకు ధర్మస్వరూపనిరూపణము చేయగలఁడు. అని యాదేశించి బాదరాయణుఁడు తపోవనమున కేగెను. అవ్వల ధర్మరాజు ప్రశ్నింప యాజ్ఞవల్క్యుఁ డడిగిన సూర్యభగవానులు తెల్పిన ధర్మములను దాను మున్ను మహర్షులవలన విన్నవానిని కృష్ణభగవానుఁడు తెలుపఁ దొడంగెను. భవిష్యోత్తరపర్వమున మొదటినుండి 206 అధ్యాయముల దనుక సంసార నివారకములగు వ్రత విధానములు, క్షేత్రతీర్థాది ప్రశంసలు దానాది విధులు వర్ణించి యున్నారు. అవన్నియు యథామూలముగఁ జదువరులు గ్రహించి యాచరింతురుగాక!

ఇది భవిష్య మహాపురాణమునఁ బ్రతిసర్గపర్వమున
చతుర్యుగఖండమను పేరుగల చతుర్థఖండము.

శ్రీ శ్రీ శ్రీ